# శ్రీ లలితా
# సహస్ర నామ వివరణము

**(SCIENTIFIC AND SPIRITUAL SPLEDOUR OF SRI LALITHA SAHASRAM)**

**(చతుర్థ భాగము)**



వివరణ కర్త

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు

టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు




జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust - Guntur Branch)

GUNTUR - 522 002.

Phone : 233995

శ్రీ లలితా సహస్రనామ వివరణము

# శ్రీ లలితా సహస్రనామ వివరణము

## (చతుర్థ భాగము)

ప్రథమ ముద్రణ : మార్చి 1998

ద్వితీయ ముద్రణ : ఏప్రిల్ 2002 (అచ్చు తప్పులు సవరించబడినవి)



ప్రాప్తి స్థానములు :

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   H/o డా॥జి.ఎల్.ఎన్. శాస్త్రి
   5-10-4, 2/9 బ్రాడీపేట, గుంటూరు -2
   ఫోన్ : 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
   45-40-36/1
   అక్కయ్యపాలెం
   విశాఖపట్టణం - 530 016.

| వెల : | సాధారణ ప్రతి : రూ. **80-00** |
|---|---|
| | గ్రంథాలయ ప్రతి రూ.**100-00** |

ముఖచిత్రం : లాం వర్ధన్‌రావు, విద్యాఆర్ట్స్, నగరంపాలెం, గుంటూరు

ముద్రణ : విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,
గుంటూరు. ఫోన్ : 242345

# విషయసూచిక

# ముందుమాట

మొత్తం మీద ఈ లలితా సహస్ర నామ వివరణ ప్రచురణా యజ్ఞం – అనుకున్న విధంగా, అనుకున్న కాలంలో అన్ని విధాలా అందరికీ సంతృప్తిని కలుగజేస్తూ ఈశ్వరనామ సంవత్సర కాలపరిమితిలోనే పూర్తి అయింది. అందుకు నాకు చాలా సంతృప్తిగాను, ఆనందంగాను ఉంది.

**వివరణ పుట్టుపూర్వోత్తరాలు**

13.10.1977 నుండి 15.11.1978 మధ్య వరకు దాదాపు సంవత్సర కాలం మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు, విశాఖపట్నంలో – ఈ లలితా సహస్ర నామాలకు ధారావాహిక వివరణాత్మక ప్రసంగాలు చేసారు. వాటిని విని, పరవశించిన నేను 21.3.97 నుండి 28.2.98 వరకు గల దాదాపు సంవత్సర కాలంలో చేసిన నిర్విరామ కృషివలన 'చతుర్భాగ సమన్వితా'గా ఈ 'లలితా సహస్రనామ వివరణ ప్రచురణా యజ్ఞం' శబ్దరహితంగా, స్ఫూర్తిదాయకంగా, చైతన్యవంతంగా ఆనందానుభూతి ప్రదంగా పరిసమాప్తమైంది.

గురుదేవులు వివరించిన విషయాలతో పాటు, నాకు దర్శనమైన విషయాలను గూడా జోడించి ఒక వినూత్న పద్ధతిలో – సంప్రదాయానికి భిన్నంకాకుండా, అటు – విజ్ఞాన శాస్త్రానికి, ఇటు – బ్రహ్మ విద్యకు వారధిలాగా ఉండే విధంగా 'ఆత్మజ్ఞాన – శాస్త్ర జ్ఞాన' సమన్వయాత్మకంగా సాగిన ఈ వివరణ, విశ్లేషణ, అన్ని రకాల వారి మన్ననలను, ప్రశంసలను, ప్రోత్సాహాలను పొందింది. ఇది శ్రీ లలితా సహస్రనామాలకు 'నూతన శక వ్యాఖ్యానము' (New Era Commentary) అని చెప్పడానికి నేను సంకోచపడడం లేదు. ఈ వ్యాఖ్యాన ప్రథమ భాగం 29.6.97న గుంటూరులోని విశ్వమందిరంలో – శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారి చేత ఆవిష్కరింపబడింది. ద్వితీయ భాగం కూడా గుంటూరులో జరిగిన సి.వి.వి. గురుపూజా మహోత్సవ శుభ సమయంలో 19.10.1997న విశ్వంజీగారి చేతనే ఆవిష్కరింపబడింది. తృతీయ భాగం సింహాచలంలో జరిగిన సి.వి.వి. గురుపూజా మహోత్సవాలలో 11.1.98న ఆవిష్కరింప బడింది. ఇక మిగిలిన ఈ చతుర్థ భాగం 1998 సంవత్సరం మార్చి నెలలో ఆవిష్కరింప బడబోతోంది.

**చతుర్భాగ సమన్విత**

భౌతికమైన రూపురేఖా విలాస బల సంకలిత సామర్థ్యాలతో జగన్మాతగా, సింహాసనేశ్వరిగా, అటు – బాహ్యరంగ విశ్వ సామ్రాజ్ఞిగా, ఇటు – అంతరంగ జ్ఞాన సామ్రాజ్యవైభవ ప్రదాయినిగా, సాధక భక్తజనశుద్ధిని బట్టి సర్వ శుభాలను చేకూర్చగల 'సర్వమంగళ' గా – అమ్మవారు ప్రథమభాగంలో దర్శనమిస్తుంది. ఇది 'వైఖరీ' వాక్సమన్వితమైన భాగం.

సద్గతులను ప్రసాదించే జగజ్జననిగా, 'మహా' లక్షణ సమస్వతురాలిగా, పంచకృత్య పరాయణగా, పురుషార్థ ప్రదగా, వర్ణాశ్రమ విధాయినిగా, గాయత్రీ మాతగా, విశ్వవ్యాపినిగా, భక్తజనులకు కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చే 'యశస్విని' గా – అమ్మవారు ద్వితీయభాగంలో దర్శనమిస్తుంది. ఇది 'మధ్యమా' వాక్సమన్వితమైన భాగం.

పవిత్ర నామ పారాయణ ప్రతిఫలసిద్ధిని చేకూర్చే చక్రస్థితరాకిణ్యాది సప్తశక్తి మాతృకలుగా, ప్రజ్ఞాన ఘనరూపిణిగా, సర్వవేదాంత సంవేద్యగా, సత్యానంద స్వరూపిణిగా, శివజ్ఞాన ప్రదాయినిగా, సచ్చిదానంద రూపిణిగా, మృత్యుదారు కుఠారికగా, – అమ్మవారు తృతీయభాగంలో దర్శనమిస్తుంది. ఇది 'పశ్యంతీ' వాక్సమన్వితమైన భాగం.

మహేశ్వరిగా, జపాపుష్పనిభాకృతితో మన ముందు నిలిచే సత్యజ్ఞానానంద రూపిణిగా, పరమంత్ర విభేదినిగా, భవచక్ర ప్రవర్తినిగా, యజ్ఞకర్త్రిగా, ధర్మవర్ధినిగా, వాంఛితార్థ ప్రదాయినిగా, ఆబాలగోపవిదితగా, శ్రీమత్త్రిపురసుందరిగా, శ్రీ శివశక్త్యైక్య రూపిణిగా, లాలించి పాలించే లలితాంబికగా – అమ్మవారు ఈ చతుర్థ భాగంలో దర్శనమిస్తుంది. ఇది 'పరా' వాక్సమన్వితమైన భాగం.

**స్తోత్ర ప్రత్యేకత**

ఈ లలితా సహస్ర నామ స్తోత్రం వెయ్యి నామాలను సూచించే వెయ్యి తపాలా బిళ్లలున్న (స్టాంపులున్న) పెద్ద కాగితం లాంటిది కాదు. అలా అయితే ఏ స్టాంపుకు ఆ స్టాంపే అన్నట్లు – ఏ నామానికి ఆ నామమే ఒక దానితో ఒకటి సంబంధం లేకుండా

ఉంటాయి. అమ్మవారి పెద్ద బొమ్మ ఉన్న కాగితాన్ని వెయ్యి ముక్కలుగా కత్తిరిస్తే వచ్చే కాగితం ముక్కలు లాంటివిగా ఈ వెయ్యి నామాలను సమన్వయించుకోవాలి. ఇలా అయితే అమ్మవారి బొమ్మలోని భాగాలే కాగితం ముక్కలు అయి, అవి ఒక దానితో ఒకటి సంబంధాన్ని కలిగి, వాటన్నిటిలోను అంతస్సూతంగా, పూలమాలలోని దారంలాగా అమ్మవారు ఉంటుంది. ఈ విషయం 'యజ్ఞప్రియా', యజ్ఞకర్త్రీ', 'యజమానస్వరూపిణీ; – 'ధర్మాధారా', 'ధనాధ్యక్షా', 'ధనధాన్యవివర్ధినీ' – మొదలైన నామాల వివరణలో తేలికగా గ్రహించవచ్చును.

**వివరణ కర్తగా నా సలహా**

ఈ చతుర్థ భాగంలోని వివరణ చదువుకునే ముందు ప్రథమ భాగంలోని పీఠిక, వివరణ, అనుబంధం; ద్వితీయ భాగంలోని వివరణ, అనుబంధం; అలాగే – తృతీయ చతుర్థ భాగాలలోని వివరణ, అనుబంధాలను గూడా చదివితే – అన్ని నామాల్లోను అంతస్సూత్రంగా వర్తించే జగన్నాటక సూత్రధారిణి అయిన అమ్మవారి తత్త్వ సమన్వయం చక్కగా అర్థమౌతుంది.

శ్రీ విద్యను అభ్యసించడం కష్టం కావచ్చు. శ్రీ చక్రార్చన కష్టం కావచ్చు. కాని, శ్రీ లలితా సహస్ర నామ పారాయణ చేసి అమ్మవారి అనుగ్రహం పొందడం అందరికీ అందుబాటులో ఉన్నసాధ్యమైన పని కాబట్టి, స్త్రీ పురుష భేదం లేకుండా సర్వులూ – కనీసం ఈ లలితా సహస్ర నామ స్తోత్రాన్ని పారాయణ చేసి, ఈ పుస్తకంలో తెలిపిన శాస్త్ర జ్ఞాన ఆత్మ జ్ఞాన సమన్వయాత్మకమైన అర్థాలు, అంతరార్థాలు, తెలుసుకుని ధన్యులు కావచ్చు. త్యాగరాజకృతికి అర్థం తెలియకపోయినా – విని, ఆనందించవచ్చు. అయితే, అర్థం గూడా తెలిస్తే మరింత ఎక్కువగా ఆనందించవచ్చును. అలాగే – ఈ లలితా సహస్ర నామ స్తోత్రాన్ని అర్థం తెలియకపోయినా పారాయణ చేసి తరించవచ్చును. కాని, అర్థం గూడా తెలుసుకుని పారాయణ చేస్తే తరించి, అమ్మవారితో సాయుజ్యస్థితిని కూడా పొందవచ్చును. గ్రామఫోన్ రికార్డుకు, ఆ రికార్డులోని పాట పాడిన వారికి, ఆ పాటను వ్రాసిన వారికీ – ఆ పాటను వింటున్నపుడు ఏ తేడా అయితే ఉంటుందో –

అర్థంచేసుకుని పారాయణ చేస్తే అనుభూతిపరుగా అదే తేడా ఉంటుంది. ఇలా అర్థం చేసుకుని పారాయణ చెయ్యడానికే ఈ వివరణ ఇవ్వబడింది.

నామాలన్నీ వరుస క్రమంలో ఏ ఏ పుటలలో వివరింపబడ్డాయో వెంటనే చూసి తెలుసుకోడానికి – ప్రతిభాగంలోను ఉండే ఆయా నామాల వరుస క్రమం, పుటసంఖ్యలు – వివరణానంతరం వేరే పట్టికలో తెలుపబడ్డాయి. అట్లాగే – అకారాది అక్షర క్రమంలో నామాల వరుస, అవి వివరింపబడిన పుటల సంఖ్యలను గూడా వేరే పట్టికలో వివరణానంతరం పాఠకుల సౌకర్యార్థం తెలుపబడ్డాయి. ఇలా నాలుగు భాగాల్లోను ఇదే విధంగా తెలుపబడ్డాయి.

నేను చెప్పిన సూచనలను, సలహాలను పాటించి, అమ్మవారి వైభవాన్ని అర్థంచేసుకుని ఆనందించి, కృతార్థులౌతారని ఆశిస్తాను.

గుంటూరు
28.2.98

ఇట్లు
జి. ఎల్. ఎన్. శాస్త్రి

# కృతజ్ఞతలు

జగజ్జననిని తెలుసుకోమని జన్మనిచ్చిన జననీ జనకులకు, ఆ జగజ్జననిని కలుసుకోమని ఆమె వేష విలాస వివరాలను ఇచ్చిన గురుదేవలు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి, అలా కలుసుకున్నప్పటి అనుభూతి వివరాలను అందరికీ వివరించమని ప్రోత్సహించి, ఆశీర్వదించిన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారికి, తదితర పెద్దలకు సభక్తి ప్రణామములు.

ప్రథమ ద్వితీయ తృతీయ భాగాలు చదివి ఉత్తరాల ద్వారా వారి ఆనందాన్ని తెలియపరుస్తూ, ప్రచురణ పూర్వ మూల్యాల ద్వారా ప్రోత్సహిస్తూ – ''చతుర్థ భాగం కోసం ఎదురుచూస్తూ ఉంటాం. త్వరగా ప్రచురించండి'' అని సింహాచలంలో 1998 జనవరి నెలలో జరిగిన గురుపూజలలో కలిసి ప్రత్యక్షంగా అభినందించిన సోదరులకు యోగ సాధకులకు, ఉత్తరాల ద్వారా ప్రశంసించిన తదితర పాఠకులందరికీ కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు. ప్రేరకులుగాను, ఆమోదకులు గాను, ప్రోత్సాహకులుగాను చాలా మంది ఈ గ్రంథ ప్రచురణాయజ్ఞంలో భాగస్వాములయారు. ఈ లలితా సహస్ర నామ వివరణ ప్రచురణకు ప్రప్రథమ ప్రేరకులు మా జగద్గురు పీఠం అంతర్జాతీయ గౌరవాధ్యక్షులు డా. కంభంపాటి పార్వతీకుమార్ గారు, ప్రేరకులుగానే కాకుండా ప్రథమ భాగానికి ఈ చతుర్థ భాగానికి తమ అభిప్రాయాన్ని గూడా వెలుబుచ్చిన డా. కుమార్ గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

శ్రీ విద్యోపాసకులు, పూర్ణదీక్షాపరులు, 'చిత్సుఖానందనాథులు' అయిన శ్రీ ఎస్.వి.ఎస్. సోమయాజిగారు – ఈ పుస్తకంలోని 'భూమిక' శీర్షికను వ్రాసి ఇచ్చారు. దీనిలో చక్కని ఉపోద్ఘాతం, శ్రీ విద్యాప్రాశస్త్యము, పాత వ్యాఖ్యానాల రీతులను, ప్రస్తుత వ్యాఖ్యానపు లోతులను సోదాహరణముగా వివరించారు. ఇది సంక్షిప్తమైన, సమగ్రమైన వివరణ. ఈ భాగంలోని మొత్తం 251 నామాల వివరణను కూలంకషంగా చదివి వ్రాసిన భూమిక ఇది. శ్రీ విద్యయందు గౌరవము, ఆ విద్యాదేవత మీద భక్తి, నా మీద అభిమానవము గల శ్రీ ఎస్.వి.ఎస్. సోమయాజిగారికి నిండు హృదయముతో కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖ వారు నిర్వహించే ప్రధాన కార్యక్రమాలకు తమ విశాలమైన గృహ ప్రాంగణాన్ని సానుకూల పరుస్తూ, శ్రీ లలితాదేవీ పూజలలో

అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొంటూ, పూజా మహోత్సవాల నిర్వహణ నుండి ఈ పుస్తక ముద్రణా యజ్ఞం దాకా కూడా అత్యంత ఆదరభావంతో సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ ఆదుకుంటూ, స్వంతపనిలా బాధ్యత వహిస్తున్న శ్రీదేశిరాజు పార్థసారధి – శ్రీలక్ష్మి దంపతికి, శ్రీ కె.వెంకుబాబు – లక్ష్మీకాంతం దంపతికి, వారి వారి కుటుంబ బంధు మిత్ర సభ్యులకు, లలితా పూజలలో పాల్గొనే ఇతర సోదర సోదరీమణీ బృందానికి, నా మీద నమ్మకంతో ప్రచురణ పూర్వ మూల్యాలను, యథాశక్తి విరాళాలను ఇచ్చిన వారికి, అలా ఇచ్చిన వాటిని స్వీకరించి మాకు అందజేసిన – హైదరాబాదు నగర వాస్తవ్యులు శ్రీ పి.వి. రమణయ్య గారికి, చిరంజీవి పి. మురళీకృష్ణకు, శ్రీ జె.కె. సోమయాజులు గారికి, ఖరగ్‌పూర్ వాస్తవ్యులు శ్రీ జి.ఎస్.ఎన్. మూర్తి గారికి, రాజమండ్రి వాస్తవ్యులు చిరంజీవి జె.రఘునాథశాయికి, గుంటూరు వాస్తవ్యులు, విశ్వ కుటుంబ సభ్యులు 'శ్రీఆకుల కోటేశ్వరరావు – కామేశ్వరీ' దంపతికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములను తెల్పుకుంటున్నాను.

స్వప్నంలో – గురుదేవులు ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి ద్వారా ఈ లలితా సహస్ర నామ వివరణ గ్రంథాల ప్రచురణకై సహకరించమని ఆజ్ఞాపించబడిన – శ్రీ కొండా శివరామకృష్ణమూర్తిగారు – ఆ ఆజ్ఞమేరకు ఈ నాలుగు భాగాల గ్రంథాల 'టైటిల్ పేజీ' ముద్రణకై పూర్తిగా సహకరించారు. అంటే – ఈ నాలుగు గ్రంథాల ఆద్యంతాల మధ్య ఉన్న వివరణ విషయాలకు కవచంలాగా ఉండే అందమైన, ఆకర్షణీయమైన అమ్మవారి చిత్రపటంతో కట్టుదిట్టమైన ఏర్పాటు చేశారన్నమాట ! (అలా అటు గురుదేవుల ఆజ్ఞానువర్తన, ఇటు అమ్మవారిపై గల అమిత భక్తి ప్రపత్తుల కారణంగా ఆ ఇద్దరి అనుగ్రహ సద్యఃఫలితంగా వారి కనిష్ఠ పుత్రిక చి.ల.సౌ. వాణీబాలకు, వారి కుమారుడు చిరంజీవి నాగరాజుకు గూడా వివాహాలు నిశ్చయమైనాయి). ఈ విధంగా సహకరించిన శ్రీ కొండా శివరామకృష్ణమూర్తి – రాజ్యలక్ష్మి దంపతికి, వారి కుటుంబ సభ్యులకు కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

రిటైరయిన సందర్భంలో వచ్చిన సొమ్ములో కొంత ఈ లలిత సహస్ర నామ వివరణకు తాను విరాళంగా ఇవ్వటమే గాక తన జ్యేష్ఠపుత్రుడైన చిరంజీవి సుభాష్‌చంద్ర చేత గూడా విరాళమిప్పించిన బెల్లంపల్లి వాస్తవ్యులు శ్రీ ఎన్ శ్యామసుందర్ గారికి, వారి కుటుంబసభ్యులకు ప్రేమ పూర్వక ధన్యవాదములు.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖ నిర్వహించే వైద్య సేవా కార్యక్రమాలు ఉత్తమ గ్రంథ ప్రచురణా యజ్ఞాలు – నచ్చి, ముచ్చటపడి తమకు తాముగా ఈ గ్రంథాల ముద్రణకు విరాళమిచ్చిన గుంటూరు వాస్తవ్యులు, టి.జె.పి.యస్. కళాశాల ఆంధ్రోప న్యాసకురాలు అయిన డా.(శ్రీమతి) పి. నాగమణిగారికి, చినఓగిరాల వాస్తవ్యురాలు చిరంజీవి ఓగిరాల దుర్గామహాలక్ష్మికి, విజయవాడ వాస్తవ్యురాలు చిరంజీవి బి. సీతకు, రాజమండ్రి వాస్తవ్యులు, ఉత్తమ క్రమశిక్షణాపరమైన ఆచరణాత్మక యోగ సాధకులు అయిన శ్రీ గ్రంథి కోదండ రామారావు గారికి, రావుల పాలెం ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆంగ్లోపన్యాసకురాలు చి.ల.సౌ. జి.ఎ. నాగమణికి, అమెరికా వాస్తవ్యులు డా. సుబ్బాధన్వాడ గారికి, గుంటూరు వాస్తవ్యులు రాఘవేంద్ర మెడికల్స్ అధినేత చి. దుర్గాప్రసాద్‌కు తృతీయభాగ ముద్రణకు సహకరించిన గుంటూరు వాస్తవ్యులు విద్వాన్ గోగినేని కనకయ్య గారికి, ఎమ్. వి. రమణకు గురిజాల లక్ష్మీనరసమ్మ గారికి, వేదాంతం వేంకటేశ్వర్లుగారికి, నోరి ఆంజనేయ శాస్త్రిగారికి, నకిరేకల్ వాస్తవ్యులు చిరంజీవి ఎమ్. ఆంజనేయులుకు నా హృదయ పూర్వక ధన్యవాదములు తెల్పు కుంటున్నాను. పుస్తకాలను అప్పటికప్పుడు పార్శిల్స్ చేసి, అందరికీ పంపిణీ చేయడంలో సహకరించిన చిరంజీవి పి. సూర్యప్రసాద్‌కు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ లలితా సహస్ర నామ వివరణ గ్రంథ ప్రచురణా యజ్ఞంలో నాతో పాటు అహర్నిశలూ అంత్యంత ఉత్సాహంతో పాల్గొంటూ, చేబట్టే అన్ని కార్యక్రమాలలోను నాకు చేదోడు వాదోడుగా సహకరిస్తున్న చిరంజీవి సూరపరాజు హనుమాన్‌ప్రసాద్‌కు, నేను వ్రాసే నామ వివరణకు అత్యంత సుందరమైన అక్షరాలతో శుద్ధప్రతిని ఎప్పటికప్పుడు తయారుచేస్తూ, ప్రూఫులు దిద్దుతూ – సహధర్మచారిణి అన్న పదాన్ని సార్థకం చేస్తున్న నా శ్రీమతి చి.ల.సౌ. విష్ణుప్రియకు (మీనాక్షికి) నా ఆశీఃపూర్వకాభినందనలు.

ఈ చతుర్థ భాగ ముద్రణను తన స్వంత పనిలా బాధ్యతవడి పుస్తకాన్ని డి.టి.పి.లో అతి సుందరంగా ముద్రించి సకాలంలో ఇచ్చిన ఓంకార్ గ్రాఫిక్స్ అధినేత చి. రాముకు, గ్రంథప్రతిని డి.టి.పి. చేసి ఇచ్చిన చి.ల.సౌ. ఇందిరకు, అనవద్యాంగి అయిన అమ్మవారిని అత్యంత సుందరంగా చిత్రించిన చిరంజీవి. ఎల్. వర్ధనరావుకు అశీఃపూర్వకాభినందనలు.

ఈ పుస్తక రచనకు ముందు చూచిన గ్రంథాలు.

1) శ్రీ లలితా రహస్య నామ గూడార్థ దీపిక.

(గ్రంథకర్త – శ్రీ రాచకొండ వెంకట కోటేశ్వరరావు (ప్రకాశకులు – శ్రీరాచకొండ దుర్గాప్రసాద్, 4/13 బ్రాడీపేట – గుంటూరు) (అనుబంధములోని విషయాలు ఎక్కువగా వీరి గ్రంథం నుండే స్వీకరించబడినాయి).

2) శ్రీ లలితా సహస్ర నామావళి (ప్రకాశకులు – 'స్వధర్మస్వారాజ్య సంఘం, బ్రాడ్వే, మద్రాసు)

ఆయా పుస్తకాల గ్రంథకర్తలకు, ప్రకాశకులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు).

ఈ విధంగా ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారందరికీ కృతజ్ఞతా ధన్యావాదములు. వీరందరూ అమ్మవారి అరుణారుణ చరణ కమల వికాస ప్రకాశంలో శుద్ధాంత రంగులై, పవిత్ర జీవన మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, బాధ్యతలను సక్రమంగా సకాలంలో నిర్వర్తిస్తూ, ఆయురారోగ్యైశ్వర్యాలను, అనంతమైన ఆనందాన్ని అనుభవించాలని హృదయ పూర్వకంగా శ్రీ లలితా మాతృమూర్తిని ప్రార్థిస్తున్నాను.

గుంటూరు
28.2.98

ఇట్లు
జి. ఎల్. ఎన్. శాస్త్రి

ఓం శ్రీ సాయిరామ్ గురుదేవదత్త

## దివ్యాశీస్సులు

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ
సద్గురు మహరాజ్
విశ్వమందిరం, కృష్ణనగర్
గుంటూరు – 522 006

'విశ్వం విష్ణుర్వషట్కారో....' అని ప్రారంభింపబడే విష్ణు సహస్ర నామస్తోత్రంలో మొట్టమొదటి నామం 'విశ్వం'. అనంతమైన ఈ విశ్వమే విష్ణు స్వరూపం. ఈ అనంతమైన విశ్వం యావత్తూ సూక్ష్మాతి సూక్ష్మమైన బిందువు నుండి ఆవిర్భవించింది. సూక్ష్మాతి సూక్ష్మమైన బిందువులో అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన విశ్వశక్తిగా వెలుగొందుతూ స్వయం సంకల్పంతో విచ్ఛిన్నమై, ఆకర్షణ వికర్షణలతో ఈ యావత్సృష్టికి మూలమై, సృష్టికి ఆధారమై నడిపిస్తున్న ఆ విశ్వశక్తి 'లలిత'. ఆమెయే ఆదిపరాశక్తి. సృష్టిస్థితి లయకారిణి. ఆమె కన్ను తెరిస్తే – సృష్టి. కనురెప్ప ఒక్క క్షణం మూస్తే లయం. ఆ అమ్మను స్తుతిస్తూ చెప్పిన రహస్యాతిరహస్య మంత్ర గర్భితమైన నామ పరంపరయే 'శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం'. అట్టి నామములను అర్థం చేసుకోవాలంటేనే కష్టం. అర్థం చేసుకున్న దానిని ఇతరులకు అర్థమయ్యేట్లు వ్యక్తపరచడం మరింత కష్టం. వ్యక్తపరచి పాఠకుల హృదయాలను రంజింప జేయడం కష్టాతికష్టం. కాని, అట్టి కష్టాతి కష్టమైన కార్యాన్ని సులభాతి సులభం చేసిన వ్యక్తి చిరంజీవి జి.ఎల్.ఎన్. శాస్త్రి.

డాక్టరైతే గాని డాక్టరును అర్థం చేసుకోలేడు. కవి అయితే గాని కవి హృదయాన్ని అర్థం చేసుకోలేడు. అట్లాగే – ఆ అమ్మ దివ్యకరుణా కటాక్ష ప్రసరణతో శక్తిమంతమైతేగాని అమ్మ అర్థం గాదు. అమ్మ కరుణా కటాక్షాన్ని పరిపూర్ణంగా పొంది, శక్తిమంతమై, అంతర్గత దివ్యశక్తి స్వరూపమై వెలుగొందుచున్న దివ్య జ్యోతి చిరంజీవి శాస్త్రి. అమ్మ అడుగులో అడుగువేస్తూ, అమ్మ భావనలో తన భావనను నిలిపి, తన జీవిత సర్వస్వమును అమ్మకే అర్పణము చేసిన వ్యక్తి. అందుకనే 'లలిత' ను – లలిత లలితంగా, చిత్రవిచిత్రంగా శాస్త్ర సాంకేతికంగా, ఆధ్యాత్మిక వేదాంతపరంగా,

ఆత్మానాత్మ వివేచనాపరంగా, ఇలా ఎన్నో రీతులుగా పరిశీలించాడు, పరిశోధించాడు, పరవశించాడు. ఆ దివ్య పరిమళాన్ని ఆఘ్రాణించి సమస్త లోకానికి అందించాడు. లలితా సహస్ర నామ వ్యాఖ్యానాలతో గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. కాని, హృదయస్పందనతో, మనోభావనతో చిరంజీవి శాస్త్రి కలం నుండి వెలువడిన ఈ గ్రంథం వాటన్నిటి కంటె అత్యుత్తమమై, ఉన్నతోన్నత శిఖరాలను అధిరోహించి, భక్తుల హృదయ సామ్రాజ్యంలో పట్టాభిషిక్తమైనదనడంలో ఏ సంకోచమూ లేదు.

అనుకున్న ప్రకారం ఆశించిన రీతిలో ఈ గ్రంథం నాలుగు సంపుటాలుగా అనతి కాలంలోనే పాఠక లోకానికి అందడమే వీరిపై ఆ అమ్మ కృపాకటాక్షం పరిపూర్ణంగా ఉందనడానికి నిదర్శనం. చిరంజీవి శాస్త్రి జీవిత మనోరథం నెరవేరింది. ఈ తపస్సు. ఇంతటితో ఆగదు. నిర్విఘ్నంగా కొనసాగుతూ, ఇంకా ఇంకా మరికొన్ని అత్యుత్తమ గ్రంథాలు చిరంజీవి శాస్త్రి చేతి నుండి వెలువడాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీస్సులను అందజేస్తున్నాను.

శిష్యులు చేసే పనుల వల్ల గురువునకు గూడా ఖ్యాతి వస్తుంది. జి.ఎల్.ఎన్.శాస్త్రి ఈ విషయమై కృషిచేస్తూ విజయవంతం కావడం – తాను ఆరాధిస్తున్న పూజ్య శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య గురుదేవులకు ఒక విధంగా కృతజ్ఞత తెలుపడమే! చిరంజీవి శాస్త్రిచే విరచితమైన ఈ గ్రంథాలలోని జ్ఞాన మాధుర్యాన్ని ఆంధ్ర పాఠకులు ఆస్వాదించి, ఆధ్యాత్మిక శక్తిమంతులు కాగలరని భావిస్తూ – చిరంజీవి శాస్త్రికి, వారి కుటుంబ సభ్యులకు దివ్య ఆశీస్సుల నంద జేస్తున్నాను.

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

# మనవి

డా. కంభంపాటి పార్వతీకుమార్
అంతర్జాతీయ గౌరవాధ్యక్షులు
జగద్గురుపీఠం, విశాఖపట్నం

''అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా'' – లలితా సహస్ర నామస్తోత్రము నందలి యీ పాదములు భక్తులకు ఒక రహస్యమును సూచించుచున్నవి. బహిర్ముఖ పూజాది కార్యక్రమముల కన్న, అంతర్ముఖంగా అమ్మవారిని ఒక హిరణ్మయమైన వెలుగుగా హృదయమునందు గాని, శ్యామలవర్ణముగా ఆజ్ఞయందు గాని మనోహరముగా దర్శనము చేయుచు స్తోత్రము చేసినచో ''అమ్మవారి సాన్నిధ్యః'' అనగా – విశ్వవ్యాప్తమైన వెలుగునందు నిలబడుటకు అవకాశము ఏర్పడును.

ధ్యానమున ఈ దర్శనములను చేయుటలో గ్రంథిచ్ఛేదనము (బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథుల) జరిగి, జీవుడు తనను తాను వెలుగుగా దర్శింపగలడు. స్థూలమైనటువంటి విగ్రహములను పూజ చేయువారు ఆ విగ్రహములందలి స్వరూపమును, వెలుగును లోగాని, ధ్యానము చేసినచో స్థూలమైన విగ్రహము ఆధారముగా సూక్ష్మమైన వెలుగు స్వరూపము అంతర్ముఖమున నిలచును. అట్లు నిలచుటచే స్థూలమందలి ప్రజ్ఞ సూక్ష్మమునకూడ నిలుచును.

సూక్ష్మమున నిలచిన ప్రజ్ఞ శరీర బంధముల నుండి ముక్తమగును. ఇదియే యోగ ప్రక్రియ. ఈప్రక్రియ ద్వారా జీవుడు అక్షరుడై అమృతత్వస్థితిని పొందును.

ప్రాథమిక దశలో భక్తులు బహిర్ముఖముగా పూజాది కార్యములు నిర్వర్తించు చున్నను, క్రమశః ఆ పూజలను అంతర్ముఖముగ నిర్వర్తించుట ఉద్ధారణమునకు దారితీయును. శ్రద్ధాభక్తులు కలిగిన భక్తజనులు అంతర్ముఖ పూజనమున నిలుతురు గాక!

కంభంపాటి పార్వతీకుమార్

# భూమిక

సరిపల్లె వేంకట సుబ్రహ్మణ్య సోమయాజి
B.Com., FCA.
కార్యదర్శి, హిందూ కళాశాల, గుంటూరు.
కోశాదికారి: శ్రీ శృంగేరి శ్రీ విరూపాక్ష శ్రీ పీఠము,
గుంటూరు.

ఓం సర్వచైతన్య రూపాం తామాద్యాం
విద్యాంచ ధీమహి బుద్ధిం యానః ప్రచోదయాత్.

హే సర్వచైతన్య రూపిణీ ! సర్వవిద్యలకు మూలమయిన నీవు బ్రహ్మ విషయిక జ్ఞానము నెరుంగుటకు మా బుద్ధులను ప్రేరేపింపుము. సృష్టియంతయు నామ రూపాత్మక మగుటచే సాధకులు నామరూపాత్మకముల నాశ్రయించి, సందేహ నివృత్తి గావించుకొని, బంధనములు త్రెంచుకొని, ముక్తిబడయుదురని యోగశాస్త్రవచనము. నేలపై బడిన వారు అదే నేలనాలంబనము చేసికొని పైకి లేచునట్లు, శబ్దము భావమయముల నాధారము చేతనే భగవదైక్యము సాధ్యమగును. భగవత్తత్వ మెట్టిదనిన – ఏది ఇంద్రియ గోచరము గాదో, ఏది వార్ధక్యరూప జరాగుణంబుల కతీతమో, ఇట్టిదని చింతింప నలవి గాదో, దేనికి బుట్టువు లేదో, ఏది ఎన్నడును వ్యయము గాదో, ఇట్టిదని చింతింప నలవి గాదో, దేనికి రూపముగానీ కరచరణాదులు గానీ లేవో, ఏది సర్వశక్తివంతము, సర్వగతము, నిత్యమో, ఏది సర్వాంతర్యామియో... మున్నగు విశేషములు గలదని చెప్పబడినది. ఆ పరమాత్మను స్త్రీ రూపముగను, పురుష రూపముగను లేక కేవల నిరాకారుని గను చింతన చేసి ధ్యానింపదగునని తంత్రములు నిర్దేశించినవి. సంతాన రక్షణమున తాను కష్టముల కోర్చి పరితపించునది తల్లి యగుటచే, మాతృభావన ప్రీతియుక్తము, తదారాధాన శ్రేష్ఠమని భావింపబడినది. "పరోక్ష ప్రియా ఇవహి దేవాః" – దేవతలకు పరోక్ష నామములందమిత ప్రీతి. వారి గుణ గణ విశేషములను ఘనచరితములను తెలియజేయు నామములుచ్చరించుటచే సంతసింతురని శ్రుతి చెప్పుచున్నది. నన్ను పూజించిననూ పూజింపకున్ననూ, జపము చేసిననూ చేయకున్ననూ, కేవల

నామోచ్చారణముచే సంతోషము కలుగునని లలితాపరమేశ్వరి పలికెనని లలితోపాఖ్యానము నందు గలదు. ''సర్వం ఖల్విదమేవాహం నాన్యదస్తి సనాతనమ్'' – ఈ కనబడు విశ్వమంతయు నేనే. పూర్ణఘనానందమున నిండి యుంటిని. నా కన్న మిన్నయగు సనాతన వస్తువు మరేదియును లేదు. ఈ జగములందణువణువున పరాశక్తియే వెలసియున్నది. ప్రణవము నందు గల ''అ, ఉ, మ'' యను మాత్రలు బ్రహ్మ, విష్ణు, రుద్రులుగా సూచించి, విసర్గయను అర్ధమాత్రయే పరాశక్తిగా పరిగణించిరి. ఇందు అర్ధమాత్రమే నిత్యమైన నాదస్వరూపము గావున, సర్వశాస్త్రము లందును పరాశక్తియే సర్వోత్తమురాలయినది. 'నూనం సర్వేషు దేవేషు నానానామ ధరామ్యహమ్'' – ఎల్ల దేవతలయందును నా నామరూపములే అలరారుచుండును. అనగా, పరాశక్తి సర్వదేవతా స్వరూపమని దేవీ భాగవతము నందు చెప్పబడెను. ''నామోచ్చారణ మాత్రేణ వాంఛితార్థ ఫలప్రదా'' – ప్రసంగవశముననైనను దేవీ నామమునుచ్చరించిన వారికి కామితార్థములు దీరునని పురాణవచనము.

బ్రహ్మాండపురాణాంతర్గత శ్రీ లలితా సహస్ర నామమొక దివ్య మాలామంత్రము. 'శ్రీ మాతా', 'శ్రీ మహారాజ్ఞీ', 'శ్రీమత్సింహాసనేశ్వరీ' యను మొదటి మూడు నామములను ''శ్రీ'' బీజాక్షరములతో ప్రారంభించి; శ్రీ చక్ర రాజనిలయా', 'శ్రీ మత్త్రిపురసుందరీ', 'శ్రీ శివా, శివాశక్త్యైక్య రూపిణీ'' యని మరల ''శ్రీ'' బీజములతో సంపూర్ణముగావించబడినది. మంత్ర సంప్రదాయము నందు ఇట్టి ప్రయోగమును 'సంపుటీకరణము' అందురు. అట్టి ప్రయోగముచే మూలమంత్రము ఉద్దీపింపబడి, త్వరితగతిని సిద్ధిచేకూర్చును. అందువలననే శ్రీ లలితా సహస్ర నామము పండిత జనాదరణ పొంది ప్రసిద్ధి గాంచినది. ఏ నామమున కా నామము గాని, శ్లోకాది నుండి చివర వరకు గాని పఠించిన గలుగు ప్రయోజనమొకటియే యని పెద్దలు నిర్ధారించిరి. అర్థము నెరిగి పారాయణాదులు చేయుటచే విశేషఫలము గలదు. ఇందలి నామములకు ఒకటికి మించిన భావార్థము లుండుటచే రహస్య నామములని చెప్పబడుచున్నవి. మంత్ర శబ్దములగు ఈ నామములు నామోచ్చారణ చేయు వారి యందు దైవీ శక్తి నుద్దీపింప జేసి, సర్వాభీష్ట సిద్ధి నిచ్చును. వశిన్యాది యోగినీ వాగ్దేవతలు యీ మంత్రద్రష్టలుగా చెప్పబడిరి. రూఢ్యర్థమున ఆ ఋషులెట్టివారో చూచిన – నామ మంత్రముల వైశిష్ట్య

మవతగత మగును. వశిని – జగద్వశ్యమంత్రదర్శిని; కామేశ్వరి – సర్వేప్సితార్థ మంత్ర దర్శిని; మోదిని – సర్వానందకర మంత్రదర్శిని; అటులనే విమల – శుద్ధ జ్ఞానము; అరుణ – చైతన్య ప్రకాశక; జయిని – సర్వ జయకారక; సర్వేశ్వరి – సర్వాధికార; కౌళిని – బ్రహ్మానంద రసాత్మక; మంత్రములు దర్శించిరి. ఈ మంత్రములనువదేశించిన వాడు – జ్ఞాన స్వరూపము; బ్రహ్మానందమయము; నిర్మలము; శుద్ధసత్వము; సర్వాధారము; సర్వవిద్యా తత్త్వము అగు – హయగ్రీవుడు. అశ్వముఖుడనగా బడబాగ్నివలె పవిత్రమైనవాడు. బ్రహ్మాదులకు వేదోపదేశము గావించిన పరమేశ్వరుడే! ఈ మంత్రములను గ్రహించిన ఉపాసకుడు – సముద్రము నౌపాసన బట్టిన శాంతుడు; వింధ్యగిరి నధిగమించిన ధీరుడు; వాతాపివంటి దుర్మతులను జీర్ణింప చేసుకున్న ఇంద్రియ నిగ్రహుడు; నహుషుని అహంకారము నణగ ద్రొక్కిన తపస్వి; మంత్రకోవిదయగు లోపాముద్రను భరించినవాడు (భర్త) లేక చక్కని దీక్షాపరుడు; ఇట్లు – ఈ నామముల వైశిష్ట్యము దేవతలయందు, ఋషులయందు, ఉపాసకుని యందు, ఉపదేశికుని యందు వ్యక్తమగుచున్నది.

లలితా సహస్ర నామమునకు భావార్థములను రచించిన వారెందరో గలరు. భగవత్తత్వము నిరూపించుటకు – ప్రత్యక్షము, పరోక్షము, అనుమానము, అర్థవాదము, యుక్తివాదము అను పద్ధతులు ఉపయోగింతురు. యుక్తివాదమునందు ఉపమానములచే తత్త్వబోధ గావింతురు. ప్రాచీనులు యుక్తివాదమున కెన్నుకున్న స్వప్న జాగ్రదవస్థ, రజ్జు సర్పభ్రాంతి నేటికిని అత్యాదరమును పొందుచున్నవి. లౌకిక విద్యా ప్రాభవమెక్కువ గల నేటి సమాజమునకు విజ్ఞాన (Science) పరమగు ఉపమానముల చేతనే తత్త్వము బోధించు విధానమును శ్రీ వివేకానంద, శ్రీ శివానంద, శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య వంటి మహానుభావులు ప్రవేశపెట్టిరి. శ్రీ కృష్ణమాచార్యుల వారు శాస్త్రాధ్యయనమునకు, వేదాంత గ్రంథ వ్యాఖ్యానమునకు సరిక్రొత్త ఒరవడి గల్పించి, విద్యావంతుల నెందరినో ఆర్షవాఙ్మయము నందాకర్షితులను చేసి, ఆధ్యాత్మిక సంపన్నులను జేసిరి. వారి శిష్యులలో శ్రీ జి. యల్.ఎన్. శాస్త్రిగారు ముఖ్యులు. శ్రీ శాస్త్రిగారు గురువు జూపిన మార్గమున నడిచి తాత్త్విక విషయములను శోధించి బోధించుటకు అహరహము కృషిచేయుచున్నారు. వీరు బహుగ్రంథకర్త. వీరికి ఉపనిషత్తులు, ఇతిహాసములు, యోగము, జ్యోతిషము,

మంత్రశాస్త్రము మున్నగు మిక్కిలి శాస్త్రములందభి నివేశము గలదు. వీరి రచనల యందు పాఠకులను పట్టి చదివించి, ఆలోచింపజేయు ఆలోచనా సరళి, భాషా పటిమ పుష్కలముగా గానవచ్చును.

ప్రస్తుత గ్రంథము ''శ్రీలలితా సహస్ర నామ వివరణము'' యను నామము నలరించి యున్నది. ఇది నాలుగు భాగములలో ప్రకాశితమై, ముందు మూడు భాగములు చదువరుల నాదరణగొని యున్నది. ఈ నాల్గవ భాగము ''మహేశ్వరీ' 'మహాకాలీ'' యను నామములచే ప్రారంభమయి 'శ్రీశివా', 'శివశక్త్యైక్యరూపిణీ', 'లలితాంబికా' యను నామములతో సంపూర్ణమగుచున్నది. వ్యాఖ్యాన గ్రంథములు పరిశీలించినపుడు వ్యాఖ్యాత యభిప్రాయము నిరాకరించుట లేక ప్రతివాదము చేయుట సర్వసామాన్యము. శాస్త్రిగారి వ్యాఖ్యాన సరళి విమర్శకులను గూడ నవీన మార్గము నాలోచింపచేయును. వీరి వ్యాఖ్య శ్రుతి స్మృతి పురాణ వాక్యములచే, వ్యాకరణ విశేషములచే, సంఖ్యాదర్శనముచే, మంత్ర ప్రభావ సమాదరణముచే, విజ్ఞాన దృక్పథముచే, యోగదీపికలచే, ప్రాక్పశ్చిమ భావనల మేలుకలయికచే, సహజ లాలిత్యము నొలకబోయుచు, గంగా ప్రవాహము వలె సాగిపోయినది. ఇది చదువరులకు స్వానుభవ సిద్ధము కాగలదనుటలో అతిశయోక్తి లేదు. ఈ గ్రంథము ఆసాంతము ప్రతి ఒక్కరు చదివి ప్రశంసాత్మకముగ కనుబొమలెగరేయ దగ్గదని నా యభిప్రాయము. ఇందు కొన్ని నామములకు వ్యాఖ్య జూచినచో గ్రంథార్గతమున దాగిన కథనము మరెంత సుందరమోయను ఆసక్తి గలుగును.

''ఓజోసి'' యనునది ప్రణవాంకుర అష్టమ ధాతువనియు, అద్దానిలోపముచే ధారణా శక్తి సన్నగిల్లుననియు, మీ మాంసా శాస్త్ర పరిచయము విపులముగ జేసిరి. ''మేరునిలయా'' యను నామమునకు పురాణ పరముగ, శ్రీ చక్ర పరముగ, దేహాంతర్గత షట్చక్రపరముగ, భౌగోళిక వ్యవస్థాపరముగ చక్కటి వివరణ నిచ్చిరి. ''విరజా'' యను నామమునకు అణుపరమాణు తత్త్వసిద్ధాంత మన్వర్థము చేయుట సమంజసకరము. ''పరాకాశా'' యను నామమునకు వివరణ నీయు 'స్పేసు'(Space)

లోనికి తీసుకొని పోయిరి. దీనికి భౌతిక శాస్త్ర అర్థము స్వాతిశయము చేకూర్చినది. ''ప్రాణదా'' యను నామమునకు 'Organic' and 'Inorganic' ల మధ్య జరిగే స్పందన, దానిచే యుత్పత్తి చెందు ప్రాణాగ్ని, గర్భస్థ శిశువును ముమ్మందుగ మేల్కొల్పునది ఈ ప్రాణశక్తియే యను విజ్ఞాన వివరణము బాగున్నది. ''అమూర్తా'' యను నామమునకు తైత్తిరీయమున బ్రహ్మవల్లియందు పరస్పర విరుద్ధ తత్త్వమును సమన్వయించి చెప్పుట విశేషముగ నున్నది. ''ఛందస్సారా'' యను నామమునకు భాషా పరమగు ఛందస్సులు వివరించిరి. ఛందస్సు అనగా 'వేదము' అనియు, 'నడక' లేక 'మార్గము' అనియు అర్థములు గలవు. భగవత్తత్త్వము నెరుగుటకు వెలసిన తత్త్వముల యొక్క సారమని గూడ భావింపవచ్చును. ''ఉద్దామవైభవా'' యను నామమును మనందరిలో గల విశిష్టమైన త్రాడు 'బ్రహ్మసూత్రమని' తెలిపి, యోగవివరణ అన్వయించుట కడు శ్లాఘనీయము. ''కాష్ఠా'' యను నామ వివరణలో పరమేశ్వరుని గగనాకారునిగా, పరమేశ్వరిని కొలబద్దగా తెలియజెప్పుట యుక్తి యుక్తముగా ఉన్నది. ''అంతర్ముఖసమారాధ్యా'' యను నామమునకు సుదీర్ఘ వివరణ మిచ్చి, గురుధ్యానము చేయుట యందౌచిత్యము గనబరచిరి. ''విశాలాక్షీ'' యను నామమును విశాలమైన కనులు గలదని సాంప్రదాయ అర్థమునే గాక, విశాల దృక్పథము, అవగాహన గలదని వ్యాఖ్యానించుటలో సహజత్వమున్నది. ''వజ్రిణీ'' యను నామమునకు వజ్రిణీ యంత్ర వివరణము, దాని సమన్వయము బాగుగానున్నది. ఆకాశము, చోటు, కదలిక, కదలించునది – యను నాలుగు లీనమైన స్థితిని ''బాల'' యను నామమునే వ్యవహరించుటలో నిజ నిర్ధారణ గలదు. ''బిందుతర్పణ సంతుష్టా'' యను నామ వివరణములో బ్రహ్మరంధ్రమున అమృతవర్షము కురియు యోగసమాధిస్థితి చక్కగా వర్ణించబడినది. ''లలితాంబికా'' యను నామ వివరణము జేయుచు, తెనుగుభాషపై శ్రీ శాస్త్రిగారి కున్న అవ్యాజ ప్రేమ స్పష్టపరచిరి. ''మతల్లికా'' లోని ''తల్లి'' పదము ఋషులకు శ్రీ లలితాపరాంబికాగా భాసించి యుండవచ్చునియు, జన్మనిచ్చే మాతృస్వరూపిణిని తెలుగులో ''తల్లి'' యను వాడుక చేయుట తెలుగువారి అదృష్టమనియు, శ్రీ లలితాంబిక తెలుగువారి దైవమనియు వ్యాఖ్యానించిరి.

శ్రీ శాస్త్రి గారి లలితా సహస్ర నామ వివరణమున ప్రతి నామమునకు అద్భుతమైన వ్యాఖ్య ఈయబడినది. అర్ధము నందు కొండను చూపిన విధముగా పైన కొన్ని నామములుదహరింప బడినవి. శ్రీదేవీయనుగ్రహపాత్రుడయిన శ్రీ శాస్త్రిగారిచే వ్రాయబడిన వ్యాఖ్య – దైవప్రేరితము, గురుకృపా పరిపూర్ణమని వారి విశ్వాసము. జగముల నేలు తల్లి ఆ సర్వేశ్వరి శ్రీ శాస్త్రిగారిని, వారి కుటుంబమును, యీ గ్రంథమునాదరించు ఆస్తిక జనులను బ్రోచుగాక.

ఇట్లు
పరమేశ్వరీ పాదార విందములను
ఆరాధించుచు
స.వె.సు. సోమయాజి.
(చిత్సుఖానందనాథ)

గుంటూరు
28.2.98

# వివరణ కర్తృ వంశ కాలాదులు

కం. నిండైన విగ్రహమ్మును,
పండిన డెందమ్ము గల్గి, బ్రహ్మకు సముడౌ
కౌండిన్య ఋషికి చెందిన
పండితవంశమ్ము గొర్తి వారిది భువిలో.

కం. పొంగిన ఉత్సాహముతో
మంగళకరమతులు నౌచు మాముత్తాతల్
సింగముగనిలిచి చేసిరి
సంగమ్మునువీడి సప్తసంతానమ్ముల్.

సీ. రంగయ్య ముత్తాత, రామ్మూర్తి మా తాత,
అవ్వబుచ్చెమ్మ, మంగమ్మ బామ్మ.
సహృదయ సౌశీల్య సంస్కారపూర్వక
సద్గుణుండు హనుమచ్ఛాస్త్రి తండ్రి.
సాధు సౌజన్య సంస్కార సద్గుణవతి,
శాంతరూపమ్ము శేషమ్మ తల్లి.
అన్నయ్యలిరువురు ననుజులిద్దరు నాకు
అక్కలిద్దరు, చెల్లెలొక్కతేను.

ఆ.వె. కైకలూరు వద్ద కల్దిండి ఊరుకు
దాపునందు వెంకటాపురమ్ము
నేను పుట్టినట్టి నేలయై యుండగా –
పట్ట విద్య సాగె బందరందు.

గీ. విక్రమాశ్వీజ ద్వాదశి వెన్నెలందు,
భాగ్యశశితోడ, పాతాళ భానుకుజులు
భ్రాతృ, శుక్ర, బుద్ధి, బుధ, లాభ గురుశనులు
నుండి, శతభిషా నక్షత్ర యుక్త మిధున
లగ్న (సాయన కర్కటలగ్న) మందు.

కం. పదిపై తొమ్మిది వందల
పదినాల్గుల వత్సరమున, పదియువ నెలలో,
పదినిశి రెండవ తేదీ
పదకొండుంబావునకును ప్రభవము గంటిన్.

కం. నను 'లక్ష్మీనారాయణ'
యని మాతామహుని లక్ష్మయార్యుని పేరున్
ఘనముగ పెట్టెను తండ్రియు
తన తండ్రిని చూచి మురిసె తల్లియు నాలో

కం. శాస్త్రములు చదవవలెనని
'శాస్త్రి' యనియు కలిసినవారు జననీ జనకుల్
'శాస్త్రి' యనియు జీ ఎల్లెన్
'శాస్త్రి' యనియు పిలుచుటయ్యె సామాన్యముగా

కం. బందరు, కాశీ, వాల్తే
రందు జదివితి పరిశోధనాంతరము వరకున్,
కుందనపు బ్రహ్మ విద్యా
మందారమ్మిచ్చె కృష్ణమాచార్యుండున్.

కం. మిత్రునివలె నాదుకొను క
ళత్రము 'విష్ణుప్రియ' విమలచరిత, మరియున్
పుత్రిక – 'అనంత శశికళ'
పుత్రుడు 'శివసుందరుండు' పుణ్యఫలమ్ముల్.

గీ పరమనైష్ఠిక స్వచ్ఛంద భావజీవి.
బంధరహితుడు, బహుళ సద్గ్రంథ కర్త.
శేషయార్య సర్వాకుల శేఖరుండు,
మహిత గాంభీర్యమౌని మా మామగారు.

– జి. ఎల్. ఎన్. శాస్త్రి



శ్రీ లలితాదేవి

## చిద్రూప చింతన

తే. గీ. '**క**' నులకింపగు రూపమ్ము కలిగి యుండి (మహాలావణ్యశేవధిః)
'**ఏ**' మి వంకలు లేనట్టి లేమ ఆమె (అనవద్యాంగీ)
'**ఈ**' వి చింతామణీ సౌధ గృహిణి యైన (చింతామణి గృహాంతస్థా)
'**ల**' క్షణాహ్లాద వర్తనలబ్ధి యున్న (సాధ్వీ)
'**హ్రీం**' అనంగను గళమెత్తు హృదయ శక్తి (హ్రీంకారీ)
'**హ**' రిణ నయనమ్ములను గల్గు తరుణి ఆమె (మృగాక్షీ)
'**స**' కల శక్తుల మూలమౌ శక్తి ఆమె (సర్వశక్తిమయీ)
'**క**' డిమితోటల వసియించు కన్నతల్లి (కదంబవనవాసినీ)
'**హ**' రివిధీంద్రుల అర్చనలందు తల్లి (హరి బ్రహ్మేంద్ర సేవితా)
'**ల**' యకరియు కూడ అయినట్టి లలన ఆమె (లయకరీ)
'**హ్రీం**' అనంగ వాగింధన మ్మిచ్చుశక్తి (హ్రీంకారీ)
'**స**' చ్చిదానందరూపిణి స్వప్రకాశ (సచ్చిదానంద రూపిణీ, స్వప్రకాశా)
'**క**' ళలు మాలగా నున్నట్టి కల్పవల్లి (కళామాలా)
'**ల**' లిత లలితార్థ భావ సంకలితమూర్తి (లలితాంబికా)
'**హ్రీం**' అనంగను గళశక్తి నిచ్చుతల్లి (హ్రీంకారీ)
'**శ్రీం**' అనంగను సిరులిచ్చు శ్రీల తల్లి (శ్రీమాతా)

శా. '**ఓం**' కారేశ్వర శంకర ప్రణవ నాదోద్యానసంశోభితా !
'**ఐం**' కారేశ్వర దివ్యమూర్తి ! స్ఫుటవాగర్థాను సంస్థాపితా !
'**హ్రీం**' కారేశ్వరి ! 'వాగ్విలాసగళమున్' హృద్యాతి హృద్యమ్ముగా
'**శ్రీం**' కారేశ్వరి ! నాకు నిమ్ము కృపతో చిద్రూపచింతామణీ !

జి. ఎల్. ఎన్. శాస్త్రి



గురుదేవులు

## శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

# అంకితము

సీ. శ్రీ విద్య బోధించు చిచ్ఛక్తి భక్తుండు
సూర్యస్తుతిని జెప్పు ఆర్యమూర్తి
శివసూక్తముల జెప్పు శివభక్త చిత్తుండు
శ్రీ గణేశుని గొల్చు యోగమూర్తి
విష్ణు సాహస్రక వివరణాత్మక కర్త
కృష్ణచరిత, క్రీస్తు గేయ – కర్త
భాగవత జ్యోతిషాగమ సూక్త గీ
తా బాలశిక్ష – సూత్రాల కర్త

గీ పూర్వ పశ్చిమ సంస్కృతి పుష్పములకు
యోగ సంస్కార పరిమళ భోగమిచ్చి
అన్వయించిన ఎక్కిరాలాన్వయులగు
కృష్ణమాచార్య గురున కంకితము నిత్తు

భక్తి నిండిన యెదతోడ ప్రణతి జేసి
పరవశించిన మదితోడ ప్రణుతి జేసి
దివ్యలలితాంబికా నామ దీప్తి కిరణ
భాష్యమైన చతుర్థ విభాగ సుమము.

జి. ఎల్. ఎన్. శాస్త్రి

శ్రీ గణేశాయ నమః

శ్రీమత్త్రిపురసుందర్యై నమః

# 750. మహేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహేశ్వర్యై నమః' అని చెప్పాలి.

మహా + ఈశ్వరీ = మహేశ్వరీ – పరబ్రహ్మ పట్టమహిషి.

గొప్పదనం, సామర్థ్యం, వైభవం, మంచిదనం, ఆధికారిక లక్షణం – వీటన్నిటినీ సూచించే ఒకే ఒక పదం ఏదన్నా ఉందంటే అది – 'మహా'. ఈ 'మహా' లక్షణం ఎవరిలో సగుణాత్మకంగా రూపొంది, దానిపై ఆమెకు ఆధిపత్యం ఉంటుందో ఆవిడ – 'మహేశ్వరీ'.

మహా + ఈ – అనే ఈ రెండు పదాల మధ్య గుణసంధి వలన ఈ నామం – 'మహేశ్వరీ' ఔతుంది. 'మహా' పదం – ఇంతకు ముందు చెప్పిన లక్షణాలను, 'ఈశ్వరీ' పదం – వీటిపై 'ఆధిపత్యాన్ని', ఈ రెంటికీ మధ్య వర్తించే 'గుణసంధి' – ఆ 'లక్షణ', – 'ఈశ్వత్వా' లకు మధ్య సగుణ రూపంగా వర్తించే భౌతికాకార పరిమాణ నామ రూపాదులనూ – సూచిస్తాయి.

'మహా' పదం – నిర్గుణుడు, నిర్వికారుడు, ఈ విశ్వానికే మూలకారణం అయిన పరబ్రహ్మను సూచిస్తే, 'ఈశ్వరీ' పదం – ఆ పరబ్రహ్మను పంచ భూతాత్మక ప్రపంచంగా వ్యక్త స్థితిలో కనుపింపచేసే మాయా స్వరూపిణిని సూచిస్తుంది – అని కూడా అర్థం చేసుకోవచ్చును. (మాయాంతు ప్రకృతిం వింద్యా, మాయినంతు మహేశ్వరమ్) ఇంకా అర్థం అయేట్లు చెప్పుకోవాలంటే – 'ఉనికికి కారణం'((Cause of Existence) మహేశ్వరుడైతే, ఆ కారణం యొక్క స్థిరమైన రూపం (Establishment) మహేశ్వరి. అంటే – ఈయన భౌతికంగా ఉండాలంటే ఆవిడగా ఉండాల్సిందే. తప్ప ఇంకో మార్గం లేదు, అవకాశము లేదు. అందుకే, ఆయన మహేశ్వరుడైతే, ఆవిడ మహేశ్వరి.

పరబ్రహ్మ పట్టమహిషి– అని ఈ నామానికి అర్థం.

## 751. మహాకాళీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాకాళ్యై నమః' అని చెప్పాలి.

మహా = పరబ్రహ్మ సూచక పదము, కాళీ = కాల సూచక పదము.

'మహా' – పరబ్రహ్మను సూచిస్తే, 'కాళీ' – కాలాన్ని సూచిస్తుంది.

ఈ రెంటినీ సమన్వయించే లక్షణం కలదే 'మహాకాళీ'. కాలంలోంచే అన్నీ పుట్టి – కాలంలోనే అన్నీ వర్తిస్తూ, చివరకు అన్నీ కాలవశమైపోతాయి. సమస్త సృష్టికి నేపథ్యంలో (Back Ground) వర్తించే ఈ కాలాన్ని 'మహాకాలం' అని కూడా అంటారు. ఈ మహాకాల స్వరూపిణి 'మహాకాళీ'. ఈ విషయాన్ని మరింత వివరిస్తాను.

బల్లపైన గుడ్డ (cloth) మీద వస్తువులుంటే ఆ గుడ్డను ప్రక్కకు లాగినప్పుడు వస్తువులు కదులుతున్నట్లుంటాయి. గుడ్డను లాగినట్లు తెలియని వారికి – బల్లపై వస్తువులు వాటంతట అవే కదులుతున్నట్లుంటాయి. కాని వస్తువులు కదలడానికి కారణం – బల్లమీద గుడ్డ కదలటమే కదా! (కాలం అంటే బల్లమీద గుడ్డలాంటిదని, జరిగే సన్నివేశాలు ఆ బల్లపై గుడ్డ మీద ఉన్న వస్తువుల్లాంటివనీ సమన్వయించుకోవాలి). మహాకాలం ముందుకు సాగిపోతూ ఉంటే – దాంట్లో వర్తించే సన్నివేశాలు సంఘటనలు ముందు వెనుకలుగా జరుగుతున్నట్లు అనిపిస్తాయి. సృష్టికి నేపథ్యంలో వర్తించే ఈ మహాకాల స్వరూపాన్ని సూచించేదే ఈ 'మహాకాళీ' నామం.

సూర్యుడు ఉన్నా, చంద్రుడు ఉన్నా, లేదా నక్షత్రాలు ఉన్నా లేదా అగ్నిజ్వాల ఉన్నా – చోటులో వెలుగు ద్యోతకమౌతుంది. ఇలాంటి వేమీ లేనపుడు ఉండే చోటు ఎలా ఉంటుందో ఊహిస్తే ఆ చోటును 'చీకటి' అంటాము. మనం మామూలుగా పిలిచే వెలుగు దేనికైతే సాపేక్షకమో (Relative) అటువంటి నిరపేక్షకమైన దాన్ని 'పరమము' (absolute) అనాలి. కాబట్టి వెలుగుకు పరమమైనది ఈ చీకటే అవుతుంది. ఈ చీకటిని ఒక స్వరూపంగా ఊహిస్తే ఆ రూపాన్ని సూచించే అమ్మవారి నామం 'మహాకాళీ' (సంస్కృతంలో 'కాల' అనే పదం గాని, 'కాలీ' అనే పదం గానీ నలుపురంగును సూచిస్తాయి.)

విశ్వ ప్రణాళిక యొక్క వరుస క్రమాన్నే(sequence) 'మహాకాలం' అనాలి. స్థితుల యొక్క, పరిస్థితుల యొక్క మార్పులను, కూర్పులను కాలంతో సమన్వయించుకుని అర్థం చేసుకుంటే గాని 'మహాకాలం' అంటే ఏమిటో సరిగా అవగాహన కాదు. 'స్వస్తిక్' ఈ 'మహాకాలా'నికి గుర్తు. H.P. బ్లావెట్ స్కీ తను వ్రాసిన 'గుప్తవిద్య' (Secret Doctrine) గ్రంథంలో – ఈ స్వస్తిక్‌ను శివుని చేతిలోని డమరుకంగా సమన్వయించి వివరించింది. కాలం యొక్క నేపథ్యంలో ప్రపంచంలోని మూలకాల (Elements) స్వభావ లక్షణాలను అధ్యారోపణ (Super impose) చేసుకుంటే గాని ఈ మహాకాలం, మహా ప్రపంచం అర్థం కావు. ఈ రెంటి సమన్వయ రూపాన్ని తెలిపే అమ్మవారి నామమే – 'మహాకాళీ'.

## 752. మహాగ్రాసా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాగ్రాసాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, గ్రాసా = అన్న కబళము కలది.

'గ్రాసం' అనే పదాన్ని సాధారణంగా పశువులు తినే ఆహారానికి వాడతారు. 'అశన' పదాన్ని మనుష్యులు తినే ఆహారానికి వాడతారు.

ఎక్కువ నమలకుండా మింగేదాన్ని 'గ్రాసమ'నీ, నమిలి తినే దాన్ని 'అశనమ'నే తేడాతో కూడా ఈ రెంటి భేదాన్ని అర్థం చేసుకోవచ్చును. సృష్టి ప్రక్రియలో బ్రహ్మాండాన్ని సృష్టిగా విస్తరింపచేసి, ప్రళయకాలంలో బ్రహ్మాండాన్నే పెద్ద ముద్దని మింగినట్లు మింగి, తనలో దాన్ని చెక్కు చెదరకుండా జాగ్రత్తగా లీనం చేసుకునేది కాబట్టి – అమ్మవారిని 'మహాగ్రాసా' అన్నారు.

గుగ్గిళ్ళు లాంటి వాటిని 'గ్రాస' మనవచ్చు కాని బ్రహ్మాండాలను మింగే అమ్మవారి గ్రాసాన్ని 'మహాగ్రాస' మనే చెప్పుకోవాలి.

(బ్రహ్మాండము వంటి) గొప్పదైన గ్రాసము కలది – అని ఈ నామానికి అర్థం.

## 753. మహాశనా

నాలుగ అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాశనాయైనమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, అశనా = తినుబండారము, లేదా – ఆహారము కలది. ప్రళయంలో ప్రపంచాన్ని తినుబండారముగా కలిగినది – అన్నది సామాన్యార్థం.

ఏ పదార్థాన్నైనా మ్రింగితే రుచి తెలియదు. తింటేనే తెలుస్తుంది. పిల్లి ఎలుకను తింటుంది. మ్రింగదు. అలా తింటున్నపుడు రుచిని పొందుతున్న అనుభూతి దాని ముఖాన్ని చూస్తే తెలుస్తుంది. మనం కూడా మామిడి పండు తింటుంటే మనకూ అలాంటి అనుభూతే కలుగుతుంది.

అమ్మవారు అలాంటి అనుభూతిని కలుగచేసే తినుబండారముగా ఈ ప్రపంచాన్ని సృష్టించింది. ప్రపంచాన్ని అలా అనుభూతి పరంగా అర్థం చేసుకోవాలి.

సమస్త ప్రపంచము – అనే తినుబండారాన్ని సృష్టిగా ఇచ్చి, ఆ సృష్టి స్వరూపంగా ఉన్న అమ్మవారిని 'మహాశనా' అని కూడా చెప్పవచ్చును.

సమస్త ప్రపంచము – అనే తినుబండారాన్ని సృష్టిగా ఇచ్చి, ఆ సృష్టి స్వరూపంగా ఉన్న అమ్మవారిని 'మహాశనా' అని కూడా చెప్పవచ్చును.

1) ప్రళయంలో ప్రపంచాన్ని తినుబండారముగా స్వీకరించునది. 2) అనుభూతి పరంగా అనుభవించే తినుబండారంగా ఉన్న ప్రపంచ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 754. అపర్ణా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అపర్ణాయైనమః' అని చెప్పాలి.

అపర్ణా = పర్ణభక్షణము కూడా చేయకుండా శివునికై తపస్సు చేసినది.

శివుని కోసం ఒక దశలో – పర్ణములు (ఆకులు) గూడా తినకుండా కటిక ఉపవాస దీక్షతో పార్వతి తపస్సు చేసింది. పై నుండి క్రిందకు పడే వారిని పైకి ఎక్కిద్దామనుకున్నట్లు

కూతురిని తపస్సు మానిపిద్దామనుకుంటుంది తల్లి. తపస్సు మానమని చెప్పినా - ఎవరిమాటనూ లక్ష్య పెట్టకుండా - ఎవరి ప్రయత్నాన్నీ కొనసాగనివ్వకుండా - త్రికరణ శుద్ధిగా తపస్సు చేసి తత్ఫలితంగా చివరకు పార్వతి శివునిలో అర్ధశరీరాన్ని పొందుతుంది. ఈ విధంగా ఆకులు కూడా తినకుండా శివునికై తపస్సు చేసిన రూపంలో ఉన్న అమ్మవారిని 'అపర్ణా' అంటారు.

అమ్మవారు ప్రకృతి స్వరూపిణి. కాలానుగుణంగా ఈ ప్రకృతి మారుతూ ఉంటుంది. వసంతకాలంలో చెట్లు చిగిర్చి పూలు పూస్తాయి. కాయలు కాస్తాయి. ఇటువంటి చెట్లతో ప్రకృతి చాలా శోభాయమానంగా ఉంటుంది. వేసవికాలంలో ఎండలు మండుతూ, జలాశయాల్లోని నీటిని ఆవిరిగా మారుస్తూ, సూర్యుడు చక్కగా ఆ ఆవిరిని పీల్చటానికి అనుగుణంగా ఉంటుంది. అలాగే, ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క రీతిగా ఉంటుంది. చిట్ట చివరకు వచ్చే శిశిర ఋతువులో చెట్ల ఆకులు ముదిరి, పండి, ఎండి పోయి - నేలకు రాలి పోతాయి. చెట్లకు ఆకులు లేకుండా ఉన్న ఆ శిశిర ఋతువు లక్షణాన్ని తెలిపే అమ్మవారిని 'అపర్ణ' అనవచ్చును.

ఈ నామాన్ని సంపుటి చేసి జపించిన వారికి అమ్మవారు ఋణభారం లేకుండా ఆదుకుంటుందని కొందరి నమ్మకం. ఇలా అనుకుని అప్పులు చేసి అమ్మవారి బాధ్యతను పెంచేవారు గూడా ఉంటారు. ఇలా అనుకోడానికి - ఈ నామానికి - ఈ అర్థం ఎలా వచ్చిందో తెలుసుకుందాం.

'జయు' - 'జయుము', 'అప + జయు' = 'అపజయుము' - ఇత్యాది జంట మాటలలో మొదటి పదానికి ముందు 'అప' కలిపితే వచ్చే రెండవ పదం - మొదటి పదం యొక్క అర్థానికి వ్యతిరేకార్థాన్ని సూచిస్తుంది. ఇదే పద్ధతిలో 'ఋణము' అన్న పదానికి ముందు 'అప' కలిపితే 'అపఋణము' ఔతుంది. అపఋణమంటే - ఋణము లేక పోవడం అని అర్థం వస్తుంది కదా! ''ఈ అపఋణపదం - అమ్మవారి ఈ 'అపర్ణా' నామంలో ఉన్నట్లుగా భావించి ఋణగ్రస్తులైన వారు ఈ నామాన్ని 'అపర్ణాయైనమః' అని సంపుటి చేసి జపిస్తే - వాళ్ళ అప్పులన్నీ తీరుతాయి'' అని కొందరు చెబుతారు. అప్పులన్నీ తీరుతాయి అంటే - వాళ్ళు వరుసగా అప్పులు చేసుకుంటూ పోతూ,

ప్రతిరోజూ 'అపర్ణాయైనమః' అని జపిస్తూ ఉంటే - అమ్మవారు - వాళ్ల అప్పులన్నీ పైసలతో సహా తీరుస్తూ ఉంటుందని అర్థం చేసుకుంటే - ఇక ప్రతివారు ఉద్యోగాలు, వ్యాపారాలు మాని సులువైన ఈ మార్గాన్ని అనుసరిస్తారు.

ఈ నామాన్ని జపిస్తే - ''అప్పులు చెయ్యడం దేనికి? తాను పడ్డ కష్టానికి ప్రతిఫలంగా వచ్చిన దాన్ని స్వీకరించి - వచ్చిన దానితో సరిపెట్టుకుని - సర్దుబాటు చేసుకోవాలి'' అనే మానసికమైన మార్పు తీసుకువస్తుంది అమ్మవారు. అంటే - అప్పులు చేద్దామనే సంకల్పాన్ని తుదముట్టించి శాశ్వత పరిష్కారాన్ని సూచిస్తుందనే విధంగా ఈ నామార్థాన్ని గ్రహించాలి.

1) పర్ణ భక్షణ కూడా చెయ్యకుండా తపస్సు చేసి శివుని అర్ధాంగి అయినది.

2) శిశిర ఋతు ప్రకృతి స్వరూపిణి.

3) ఋణభారము కలగని రీతిలో భక్తులను తీర్చి దిద్దునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 755. చండికా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చండికాయైనమః' అని చెప్పాలి.

చండికా= భయంకరమైన స్వరూపము గలది.

అన్ని విషయాల్లోను ఆధిపత్యం కలిగి, సృష్టిలోని సర్వదేవ, రాక్షస, యక్ష, కిన్నెర, కింపురుష, మానవాదులందరూ తమ తమ విధ్యుక్త ధర్మాలను, బాధ్యతలను నిర్వహించక పోతే తగిన విధంగా శిక్షిస్తుందేమోననే విధంగా ఉండే పరాక్రమం తోను, ప్రచండ రూపంతోను ఉండే అమ్మవారి ఒక స్వరూప విశేషమే 'చండికా'.

మనలో 'భయం' అనే లక్షణం సమసిపోవడానికి(Neutralize) ఉపాసించవలసిన అమ్మవారి దేవతా రూపం ఇదే! ఇలాగే దుఃఖం, కోపం, కామం, ఆశ, నిరాశ అనే ఇంకో అయిదు లక్షణాలు గూడా ప్రతి వారికీ ఉంటాయి. భయంతో కలిపి ఈ ఆరింటిని

షడూర్మ్ములంటారు. వీటి స్థావరాలు ప్రతి వారి శరీరంలోను ఉంటాయి. ఈ స్థానాల నుండే శక్తి గూడా వెలువడుతుంది. ఈ 'షడూర్మ్ములు' అనే నిర్గమ మార్గాలను స్పృశించి గాని శక్తి బయటకు వెలువడదు. (ఈ చండికా శక్త్యుపాసనలో సాధకుణ్ణి ఈ చండికకు బలి ఇచ్చే తతంగం గూడా ఉంటుంది. బలికి ముందు ఐదు రోజుల నుండీ అన్ని ఏర్పాట్లు చేస్తారు. మూడో రోజుకి బలి ఇచ్చే తతంగం పెరుగుతుంది. ఐదవ రోజు ఇక తప్పకుండా ఈ రోజు బలి ఇవ్వడం ఖాయం అన్నట్లుగా ఉంటుంది హంగామా అంతా ! దేనికైనా సిద్ధమైన ఉపాసకుణ్ణి ఆ చివరి రోజు ఏమీ చెయ్యకుండా వెళ్ళిపొమ్మంటారు. బలి కార్యక్రమం ఉండనే ఉండదు. ఈ రకమైన సాధన ద్వారా ఆ ఉపాసకుడు భయం, దుఃఖం, కోపం, కామం, ఆశ, నిరాశ అనే షడూర్మ్ములకు అతీతంగా జీవిస్తాడు.)

భయంకరమైన స్వరూపం గలది - అని ఈనామానికి అర్థం.

## 756. చండముండాసురనిషూదినీ

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చండముండాసుర నిషూదిన్యైనమః' అని చెప్పాలి.

చండ, ముండ = చండుడు, ముండుడు అను, అసుర = రాక్షసులను నిషూదినీ = సంహరించునది.

చండ = ప్రచండమైన, లేదా భయంకరమైన, ముండ = అంటే - తల (పుఱ్ఱె) గల, అసుర = రాక్షసుని లేదా రాక్షసులను, నిషూదినీ = సంహరించునది - అని కూడా ఈ నామాన్ని విడదీసి అర్థం చెప్పుకోవచ్చును.

క్రిందటి నామంలో షడూర్మ్ముల గురించి చెప్పబడింది. ఈ షడూర్మ్ములు పుఱ్ఱెలో ఉండేవే! ఇవి మనిషిపాలిట ప్రచండమైనవే! ప్రచండమైన పుఱ్ఱెగల చండముండాసురుడనే రాక్షసుని సంహరించడం అంటే - ప్రచండమైన షడూర్మ్ములను మన బుఱ్ఱలోంచి నిర్మూలించడంగా అర్థంచేసుకోవాలి.

ఈ షడూర్మ్ములను నిర్మూలించే అమ్మవారైన చండికను ఉపాసించాలంటే

జపించాల్సిన మంత్రం 'చాముండాయై విచ్చే' (చాముండా + విత్ + చ + ఈ - 'చాముండాయై విచ్చే' ఔతుంది).

ఒక చేతిలో పుఱ్ఱె, ఇంకో చేతిలో కత్తి ఉన్న అమ్మవారు ఈ చండ ముండాసుర సంహారం చేస్తుంది. (విగ్రహానికైతే ఇలా రెండు చేతులు చాలు గాని, - చిత్రపటానికైతే ఎన్ని చేతులైనా పెట్టవచ్చు. ఆ చేతులలో అన్ని రకాల ఆయుధాలను ధరించినట్లు చూపవచ్చు.)

1) చండ, ముండులను సంహరించునది.

2) భయము గొలుపు తల (పుఱ్ఱె) గల రాక్షసుని(లను) చంపినది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 757. క్షరాక్షరాత్మికా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షరాక్షరాత్మికాయై నమః' అని చెప్పాలి.

క్షర = నశించునట్టి స్థూలమునకు, అక్షర = నశించని సూక్ష్మమునకు, ఆత్మికా = ఆత్మ, అనగా - మూలకారణము వంటిది.

జీవి పరంగా అర్థం చెప్పుకుంటే - 'క్షర' పదం పంచభూతాలలో కలసి నశించే స్థూల (భౌతిక) దేహాన్ని, భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగంలో చెప్పిన 'క్షర పురుషుణ్ణి' సూచిస్తుంది. 'అక్షర' పదం - పంచభూతాలలో కలవకుండా నశించని సూక్ష్మశరీరమైన ఆత్మను, గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగంలో చెప్పిన 'అక్షర పురుషుణ్ణి' సూచిస్తుంది. 'ఆత్మికా' పదం - ఇటువంటి - స్థూల, సూక్ష్మ - లేదా, క్షర, అక్షర పురుష- నేపథ్యంలో ఉండే 'కారణ శరీరాన్ని' గీతలో చెప్పిన 'ఉత్తమ పురుష' - లేదా, పురుషోత్తముణ్ణి సూచిస్తుంది.



'గీత'లో చెప్పిన క్షర, అక్షర, ఉత్తమ పురుషలను ప్రక్కపటంలో చూపించిన విధంగా రేఖాగణితాత్మకంగా అర్థం చేసుకోవచ్చును. ఒక

నల్ల బల్లమీద త్రిభుజాలు, చతుర్భుజాలు, వృత్తాలు, దీర్ఘచతురస్రాలు, ట్రెపీజియం లాంటి వివిధ ఆకృతులు గీస్తే – ఈ వివిధ ఆకృతుల గీతలు భౌతికమైనవి. ఇవి చెరిపేస్తే చెరిగిపోయేవి. కాబట్టి, ఇవి ప్రతి జీవి లోని 'క్షర పురుషుణ్ణి' అంటే – 'దేహాన్ని' సూచిస్తాయి.

ఈ వివిధ ఆకృతుల లోపల పరిమితమైన ప్రదేశం వివిధ పరిమాణాల్లో ఉంటుంది. ఇవి చెరిపినా చెరగనివి. ఇవి రకరకాల జీవులలోని 'ఆత్మ' లను సూచిస్తాయి. అయితే ఇవన్నీ ఒక్కొక్కటి పరిమితమైన నల్లబల్ల పరిమాణాన్ని కలిగి ఉంటాయి.

నల్లబల్ల మీద గీసిన అన్ని రకాల ఆకృతులన్నిటికీ వెనుక నేపథ్యంలో ఉండే ఒకే ఒక నల్లబల్ల ఉత్తమపురుష, లేదా – పురుషోత్తముణ్ణి సూచిస్తుంది. పరిమితమైన పరిమాణాల్లో ఉండే అన్ని ఆకృతులలోను ఇమిడి ఉన్న నల్లబల్ల భాగాలు – ఈ నేపథ్య నల్లబల్ల యొక్క వివిధ భాగాలే ! మొత్తం నల్లబల్ల సూచించే ఉత్తమ పురుష అందరిలోని – 'పరమాత్మ' ను సూచిస్తుంది. ఇది జీవులందరిలోని 'కారణ శరీరాన్ని' సూచిస్తుంది.

నాటక రంగంతో పరిచయం ఉన్నవారికి ఈ విషయాన్ని మరో విధంగా వివరించవచ్చును.

ఒక పాత్రధారుడు ఒక నాటకంలో వేసే ఒక 'పాత్ర' – 'క్షర పురుష' ని లాంటిది. ఇది ఆ నాటకం అయిపోయిన తర్వాత నశిస్తుంది. కాని, ఇదే పాత్రధారి ఇంకా ఇంకా ఎన్నో రకాల నాటకాల్లో ఎన్నో రకాల పాత్రలు ముందు ముందు వెయ్యవచ్చును. ఈ పాత్రలన్నీ వేసే పాత్రధారి 'అక్షర పురుషుణ్ణి' –. సూచిస్తాడు. ప్రతి నాటకం అయిపోంగానే ఆ నాటకాలలోని పాత్రలు పోతాయి గాని పాత్రధారుడు పోడు. అందుకే పాత్రధారుడు అక్షర పురుషుని లాంటివాడు.

అన్ని రకాల నాటకాలను ఆ నాటకాలలోని వివిధ పాత్రలను – సంభాషణలను సృష్టించిన 'కవి' (నాటక రచయిత) 'ఉత్తమపురుష' ను లేదా పరమాత్మను సూచిస్తాడు. ఇతని లోంచి అన్ని రకాల పాత్రలు, సంభాషణలు, నాటకాలు వచ్చాయి. జగత్తును ఒక నాటకంతో పోలిస్తే – ఆ జగన్నాటక సూత్రధారినే 'పరమాత్మ' అంటారు.

'క్షరాక్షరాత్మికా' అనే ప్రస్తుత నామం 'క్షర పురుష', 'అక్షరపురుష', 'ఉత్తమ పురుష' లన్నిటినీ సూచించే నామం.

ఉత్తమ పురుషుడంటే 'Best Person' అని అర్థం కాదు. ప్రతి జీవిలోను 'నేను', 'తాను' – అనే పేర్లతో ఉన్నవాడు అని అర్థం. ఈ క్షరపురుష, అక్షర పురుష, ఉత్తమ పురుషుల గురించి –

ద్వావిమౌపురుషౌలోకేక్షరశ్చాక్షర ఏవచ....

క్షర స్సర్వాణి భూతాని కూటస్థో2_క్షర ఉచ్యతే.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ( గీత– 15–16, 17) అని చెప్పబడింది.

లోపలి కేంద్ర బిందువు నుండి క్రమ క్రమంగా బయటకు వచ్చిన అక్షరాలు – వివిధ వ్యాసార్థాలతో వివిధ పరిధులు గల వృత్తాలలో నుంచి వచ్చాయి. ఇవన్నీ కేంద్ర బిందువు నుండి వ్యక్తమయ్యాయి. అన్ని వృత్తాల పరిధులకు కేంద్ర బిందువొక్కటే! కేంద్ర బిందువు ఎప్పుడూ ఉంటూ ఉంటుంది (Eternal). పరిధులు, పరిధిపై బిందువులు ఉంటూ పోతూ ఉంటాయి(Subject to change).

నిరంతరం భ్రమణం చేసే ఈ అక్షర కాలచక్ర గమనాన్ని ఈ క్రింది చిత్ర పటంతో సూచించవచ్చు.




పై చిత్రంలో క్రింద నుండి పైకి పోయే మార్గంలో (AB మార్గంలో) దేవతలు B వద్ద ఉండి పోతారు. పై నుండి క్రిందకు వచ్చే మార్గంలో (BC మార్గంలో) మనుష్యులు

పుడతారు. భౌతికత్వము, అహంకారము ముదిరి పోయిన మనుష్యులు రాక్షసులలాగా ప్రవర్తిస్తూ, చిత్రపటంలో 'D' బిందువు వద్దనే దిగబడి పోతారు. ఆత్మ జ్ఞానంతో ఉద్ధరింపబడిన వారు D బిందువును దాటి ఊర్ధ్వమార్గంలో దేవతలౌతారు. ఇందరిలోను ఆత్మస్వరూపిణిగా చక్రభ్రమణం చేస్తూ తాను చెక్కు చెదరకుండా కేంద్రం'O'లాగా ఉండే – అమ్మవారిని 'క్షరాక్షరాత్మికా' అనే నామం సూచిస్తుంది.

స్థూల సూక్ష్మ కారణ సమన్వయ ఆత్మ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 758. సర్వలోకేశీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటపుడు 'సర్వలోకేశ్యై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని లోకములకు, ఈశీ = పాలన కర్త్రి.

చతుర్దశ భువనాలనే లోకాలని కూడా అంటారు. ఊర్ధ్వలోకాలు ఏడు – (భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము). అధోలోకాలు ఏడు (అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకాలు) మొత్తం ఈ 14 లోకాలకు అమ్మవారే అధినాథురాలు. ఈ సర్వలోకాల్లోను 'ఈశ్వరు' డున్నాడు. ఆ ఈశ్వరుణ్ణి బయటకు నడిపించేది ఈశ్వరి. ఈ కాలచక్రాన్ని త్రిప్పమనేది ఈశ్వరుడైతే, త్రిప్పేది – ఈశ్వరి.

లోకాల విభజన ఇంకోవిధంగా కూడా ఉంటుంది. ఈ సృష్టి మొత్తం మూడు రకాల లోకాలలో ఉంటుంది. 1) ఆదిత్యలోకము (Plane of Radiation) 2) రుద్రలోకము (Plane of Vibration) 3) వసులోకము (Plane of Materialisation). ఆదిత్యలోకం నుండి వసులోకానికి వస్తున్న కొలది సూక్ష్మత్వం నుండి స్థూలత్వం పెరుగుతుంది.

ఆదిత్యలోకము – వికిరణాత్మకము; రుద్రలోకము – స్పందనాత్మకము; వసులోకము – ద్రవ్యాత్మకము. ఈ ద్రవ్యలోకాన్నే 'భౌతిక లోకము' అని గూడా

అంటారు. ఈ లోకం నిండా అన్ని స్థితులలోను ఉండే ద్రవ్యం నిండి ఉంటుంది. ఆదిత్యలోకానికి 12 మంది సూర్యులు, రుద్రలోకానికి 11 మంది రుద్రులు, వసులోకానికి ఎనిమిది మంది వసువులు ఉంటారు. ఈ లోకాలన్నిటికి అధినాథురాలు అమ్మవారే!

(వసులోకానికి చెందిన అష్టవసువులలో చివరి వాని పేరు భాసువు – (చక్కగా భాసించేవాడు) జీవాత్మపరంగా అష్టమ వసువే భీష్ముడుగాను, పరమాత్మపరంగా కృష్ణుడు గాను సమన్వయ పరచుకోవాలి. భీష్ముడు, శ్రీకృష్ణుడు ఇద్దరూ కూడా అష్టమ గర్భ సంజాతులే అన్న విషయం ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి. ద్రవ్యలోకానికి ఎనిమిది రకాల మితులు (Dimensions) ఉంటాయి. మితులంటే కొలతలు(Measurements) కాదు. రసాయన శాస్త్రంలో ప్రకృతిలోని మూలకాల వర్గీకరణ కూడా 8 సమూహాలుగా(Eight groups) చేస్తారు. నేను వ్రాసిన తైత్తిరీయోపనిషత్ గ్రంథాన్ని చదివితే వీటి గురించి పూర్తి వివరాలు తెలుస్తాయి – వివరణ కర్త).

'సర్వలోకాలకు అధినాథురాలు' అని ఈ నామానికి అర్థం.

## 759. విశ్వధారిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వధారిణ్యైనమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వమును, ధారిణీ = ధరించునది.

విశ్వం తిన్నగా ఉండి నడవడానికి, విశ్వంలోని సమస్త జీవులు వాటి వాటికి సంబంధించిన వస్తు, సామాగ్రి, ఆహారాదులను పొందడానికి అనుగుణంగా, ఎక్కడా వేటికీ వెతుక్కోవలసిన పని లేకుండా, సృష్టిలోని వాటితోనే ఏర్పాటు చేసిన విధానంలోని పొదుపరితనం (Economy) ఎక్కడా ఏ సంస్థలోనూ, ఏ వ్యవస్థలోనూ ఉండదు.

జీవసృష్టి వ్యవస్థలో దేవతలు – ఖాళీ ఉద్యోగపు పోస్టుల లాంటి వాళ్ళైతే, ఆ పోస్టులలో పని చేసే ఉద్యోగస్థులే కళ్ళు, చెవులు, ఇత్యాది దేహేంద్రియాలు – అన్న విధంగా సమన్వయ పరచుకొని అర్థం చేసుకుంటే గాని ఆధునికులకు ఈ బ్రహ్మాండ పిండాండాల సమన్వయం, విశ్వ ప్రణాళిక వెనుక ఉన్న వ్యూహము, ఆ వ్యూహంలో పనిచేసే

అంతస్సూత్రాలు, సూత్రధారిణీ అర్థం కావు. ఇలాంటి విశిష్టవిశ్వాన్ని తన యందు ధరించి నిర్వహింపచేసే అమ్మవారి నామాన్ని 'విశ్వధారిణీ' అన్నారు.

ప్రళయ కాలంలో రాబోయే సృష్టికి సంబంధించిన కారణ బీజాలను తనలో ఇముడ్చుకుని ధరిస్తుంది కాబట్టి – అమ్మవారు విశ్వధారిణి 'వేదోక్త దుర్గాస్తుతి' లో కూడా ఇటువంటి అమ్మవారి గురించి 'భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ' అని చెప్పబడింది.

'విశ్వమును ధరించునది' – అని ఈ నామానికి అర్థం.

## 760. త్రివర్గదాత్రీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రివర్గదాత్ర్యై నమః' అని చెప్పాలి.

త్రివర్గ = మూడుగా తెలుపబడువాటిని, దాత్రీ = ఇచ్చునది.

సాధారణంగా ధర్మార్థ కామాలు మూడింటిని 'త్రివర్గము' అంటారు. 'ధర్మం' అంటే 'Duty' అని, అర్థం అంటే 'Utility' అనీ, కామం అంటే 'Accomplishment' లేదా 'Fulfilment' అనీ అనువదించాలి. ఈ మూడింటినీ విశ్వం వెనుక పనిచేసే నేపథ్యమే ఏర్పాటు చేసి ఉండాలి. విశ్వంలో అన్నీ ఎలా ఉండాలో అలానే తప్ప ఇంకో రకంగా ఉండకుండా, జరగకుండా ఉంటున్నాయి కాబట్టి 'ఈ లక్షణం ఆ నేపథ్యం యొక్క తెలివి' అనే చెప్పాలి గాని పొరపాటున అవి అలా ఉంటున్నాయి (Accidental) అని చెప్పకూడదు. ప్రకృతి వెనుక పనిచేసే శక్తే – తెలివిగా ఈ త్రివర్గాలను గూడా ఏర్పాటు చేసింది.

భారతదేశంలో – ఈ ధర్మ అర్థ కామాలతో కూడిన త్రివర్గంలోని అర్థకామాలు ధర్మోత్తరంగా ఈ క్రింది పటంలో చూపిన విధంగా వుండేవి.




అప్పుడే జీవితం ధర్మోత్తర జీవితం అవుతుంది. కాని, రాను రాను భారతీయుల జీవనం అర్థోత్తరంగాను, కామోత్తరం గాను తయారవడంతో మొత్తం భారతీయ సంస్కృతి యొక్క పునాదికే దెబ్బ తగిలింది.

Sourcesను ఉపయోగించడం (use చెయ్యడం), Resourcesను రాబట్టడం (Tap చెయ్యడం) తెలుసుకోవాలి. కేవలం Sources తెలిసినవాడు ఉన్న వాటిని తినేస్తాడు. Resources తెలిసినవాడు కొత్త వాటిని పుట్టిస్తాడు. ఏమీ లేని చోట సృష్టించగలగడమే Resourceful లక్షణం. ఏమీ లేదనిపించే చోటు నుండి ఇంతగా అన్నీ ఉన్నట్లుగా కనపడే సృష్టిని ఇచ్చిన భగవంతుణ్ణి మొట్ట మొదటి Resourceful Personగా తెలుసుకోవాలి. ఆయన ఏర్పాటు చేసినవే ఈ త్రివర్గాలు. అమ్మవారి ద్వారానే అవి పంపిణీ కాబడతాయి. కాబట్టి, అమ్మవారు 'త్రివర్గదాత్రీ' అవుతుంది.

మూడింటి వర్గముగా చెప్పబడువాటిని తిన్నగా ఇచ్చునది – అని ఈ నామానికి అర్థం.

## 761. సుభగా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుభగాయై నమః' అని చెప్పాలి.

సు = మంచితనం, భ = వెలుగు, గ = గమనము లేదా చైతన్యము లేదా నడవడిక (ప్రవర్తన)ల సమన్వయ స్వరూపిణి.

సుగుణ సౌరభం, సాన్నిధ్య ప్రకాశం, చైతన్య వికాసం, ఈ మూడింటిని తాను కలిగి ఉండటమే కాదు, ఈ మూడింటిని తనను ఆరాధించు పుణ్య స్త్రీలకు గూడా ప్రసాదిస్తుంది అమ్మవారు. అందుకని – ఆమె 'సుభగా'.

'సౌభాగ్య' మనే పదం ఈ 'సుభగత్వా'ం నుంచే ఉత్పత్తి అయింది. దీన్నే ఆడవాళ్ళు 'ఐదవతనం'గా, అంటే – 'ముత్తైదువ లక్షణం'గా చెబుతారు. అంటే – ఇవి భర్తల ఆయుర్దాయాన్ని నిర్ణయించే లక్షణాలన్న మాట! అమ్మవారిని పూజించే సువాసినులకు అమ్మవారు ఈ సౌభాగ్యాన్ని ఇస్తుంది.

జ్యోతిశ్శాస్త్రంలో 9వ భావాన్ని (Ninth house) శుభస్థానం అనీ, పూర్వ పుణ్య స్థానం అనీ, సౌభాగ్యస్థానం అనీ కూడా (Prosperity) అంటారు. జాతకంలో ఈ స్థానంలో శుభ గ్రహాలున్నా, ఈ స్థానం శుభగ్రహాల చేత వీక్షింపబడినా – వారికి జీవితం

సౌభాగ్యవంతంగా ఉంటుంది. వర్తమాన జీవితం ఎలా ఉన్నా ఈ సౌభాగ్య స్థానం బావుంటే అన్నీ పరిష్కారమై - సుఖపడతారు, బాగుపడతారు.

1) సౌభాగ్య స్వరూపిణి.

2) సువాసినులకు సౌభాగ్యమును ఇచ్చునది - అని ఈ నామానికి అర్థాలు.

## 762. త్ర్యంబకా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్ర్యంబకాయైనమః' అని చెప్పాలి.

త్రి + అంబకా = త్ర్యంబకా = మూడు కన్నులు కలది.

'త్రినయనా' అనే 453వ నామం, 'త్రిలోచనా' అనే 477వ నామం ఇంతకు పూర్వం వరుసగా ద్వితీయ భాగంలోను, తృతీయ భాగంలోను వచ్చాయి. వాటి వివరణ కూడా ఇక్కడ చదువుకుంటే గాని అమ్మవారి కళ్ల గురించి పూర్తి అవగాహన ఏర్పడదు.

'అంబకము' అంటే 'కన్ను' అని ఒక అర్థం. 'బాణం' అని మరో అర్థం కూడా ఉన్నాయి. 'కన్ను' అనే అర్థం తీసుకుంటే 'మూడు కన్నులు కలది' అని - ఈ నామానికి అర్థం. అమ్మవారి కుడికన్ను - సూర్యాత్మకం. ఎడమ కన్ను - చంద్రాత్మకం. ఫాలనేత్రం - అనలాత్మకం. (అగ్నితత్త్వం). సూర్య, చంద్ర, అగ్నులు సూచించే ఈ మూడు కళ్లూ వరుసగా, 1) పగలు, 2) రాత్రి 3) సంధ్యా కాలాలను గూడా సూచిస్తాయి.

కన్ను - దృష్టికి సంబంధించిన జ్ఞానేంద్రియం. 'దృష్టి' - అంటే 'చూడడం' అని అర్థం. ఈ చూడటం కాలపరంగా చెప్పుకుంటే ఈ నామానికి 'భూత, భవిష్యత్, వర్తమాన కాలజ్ఞానాన్ని సూచించే 'నేత్రత్రయాన్ని కలిగినది' అనే అర్థం కూడా చెప్పుకోవచ్చును.

'అంబకము' అంటే 'బాణము' అని అర్థం చెప్పుకున్నాం. బాణము - చోటులోకి దూసుకుపోయే లక్షణము కలది. ఇలా చోటు(space) లోకి - భూతభవిష్యత్ వర్తమాన కాలానుగుణంగా దూసుకుపోయే చూపులు కలిగిన మూడు కన్నులు కలది - అని ఈ అర్థాన్ని ఇంకా విపులంగా చెప్పుకోవచ్చును.

త్ర్యంబకత్వం - ఒక్క శివునికే ఉంది. అందుకే రుద్రనమకంలో వచ్చే మృత్యుంజయ మంత్రంలో 'త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనమ్ ....' అని వస్తుంది కాబట్టి, 'శివుని నేత్రలక్షణాలతో సారూప్యమైనది' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

1) మూడు కన్నులు కలది.

2) భూత భవిష్యత్ వర్తమాన కాలానుగుణంగా (చోటులోకి బాణం లాగా దూసుకుపోగల) చూపులు కలగిన మూడు కన్నులు కలది.

3) శివుని త్రినేత్ర లక్షణాలతో సారూప్యమైనది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 763. త్రిగుణాత్మికా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిగుణాత్మికాయై నమః' అని చెప్పాలి.

త్రిగుణ = సత్త్వ రజస్తమో గుణములను, ఆత్మికా = స్వరూపముగా గలది.

ఎదురుగా కళ్ళకు కనబడే విధముగా ఒక ఆకారము, పరిమాణము మొదలైన భౌతిక లక్షణాలతో ఉండటాన్ని 'వ్యక్తమవడం' అంటారు. ఏదైనా ఇలా వ్యక్తమవాలంటే ముఖ్యంగా మూడు గుణాలుండాలి. అవే సత్త్వరజస్తమో గుణాలు. ఒక గుడారం స్థిరంగా వ్యక్త స్థితిలో ఉండాలంటే - ఒకే సమయంలో మూడు బలాలు పనిచెయ్యాలి. గుడారానికి రెండువైపులాగే బలాలు రెండు. ఈ రెండు బలాలు వరుసగా రజస్తమో గుణాలవంటివి. ఇక మధ్యలో నిశ్చలంగా గుడారాన్ని నిలిపే బలం సత్త్వగుణం వంటిది. ఈ మూడు బలాలనే ఆంగ్లంలో వరుసగాDynamism, Inertia and Equilibrium, or Poise or Hrmonyఅని అంటారు.

ఈ మూడింటికి ప్రతీకలుగా - భారతీయ ఆర్షవాఙ్మయంలో బ్రహ్మ, రుద్ర, విష్ణువులు గాను; కేంద్రక భౌతికశాస్త్రంలో (Nuclear Physics) ప్రాథమిక కణాలైన

ప్రోటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్‌లుగాను చెబుతారు. భౌతికశాస్త్రంలో ఒక వ్యవస్థ సుస్థిరస్థితిని, ఈ మూడు బలాల సమన్వయస్థితిని – త్రిభుజ బల సూత్రంగా (Triangle law of forces) చెబుతారు. ఈ మూడు రకాల బలాలను సూచించే త్రిగుణాలను కూడా తన స్వరూపంగా కలిగినది అమ్మవారు.

ఈ త్రిగుణాలు మనల్ని అధిగమించకూడదు. మనయందు అవి ఆధారపడి ఉంటాయని గ్రహిస్తే – మనలోని అమ్మవారి తత్త్వం బాగా అర్థమవుతుంది. ఈ త్రిగుణాతీతమైనదే మోక్షస్థితి. అంటే – మోక్షస్థితి అని వేరే ఒక శుద్ధ స్థితి అంటూ ఉండదు. ఈ త్రిగుణాలకతీతమైన స్థితినే మోక్షస్థితిగా అర్థంచేసుకోవాలి.

మోక్షం ఇవ్వండి అని అడగడం – కిరాణా కొట్టుకు వెళ్ళి కేజి బెడ్డలు లేని బియ్యం ఇవ్వండి' అని అడగడం లాంటిది. 'బెడ్డలు లేని బియ్యం అని వేరే ఉండవు. బియ్యం కొనుక్కొని బెడ్డలు ఏరితే వచ్చేవి బెడ్డలు లేని బియ్యం. అలాగే త్రిగుణాత్మకమైన ప్రపంచంలో త్రిగుణాలు లేకుండా ఉండే స్థితి అని వేరే ఉండదు. త్రిగుణాతీతంగా బ్రతకడమే మోక్షం. త్రిగుణాలను సమన్వయ పరుస్తూ, త్రిగుణాతీతంగా ఉండే ఆత్మతత్త్వమే అమ్మవారి తత్త్వం. అటువంటి అమ్మవారిని ఉపాసిస్తే మనకు అలాంటి స్థితిని కలుగచేయడం ద్వారా మోక్షాన్నిస్తుంది.

1) త్రిగుణాల సమైక్య స్వరూపిణి.

2) త్రిగుణాతీతమైన ఆత్మతత్త్వంగా ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 764. స్వర్గాపవర్గదా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వర్గాపవర్గదాయై నమః' అని చెప్పాలి.

స్వర్గ = భోగమును, అపవర్గ = మోక్షమును, దా = ప్రసాదించునది.

మన చుట్టూ ఉండే వర్గం సువర్గమైతే – మనం సువర్గంలో ఉన్నట్లే ! ఈ వర్గం కూడా కేవలం సామీప్యానికి సంబంధించిన విధంగా కాకుండా సంబంధాన్ని కలిగి ఉండాలి.

వ్యక్తిగత కక్ష్యలో(Individual Plane) లో జీవించే ఇద్దరు వ్యక్తులు ఒక చోట చేరితే వారిద్దరి మధ్య సామీప్యం మాత్రమే ఉంటుంది కాని సంబంధము ఉండదు. ఇది 'సువర్గం'.ఎరుగని వారి స్థితి. 'సువర్గ' మంటే – గుంపులు గుంపులుగా మంచి విషయాలు, మంచి వస్తువులు, మంచి వ్యక్తులు కలసి ఉండేలా చెయ్యగలగడం, అని కూడా అర్థం. (మంచివాళ్ళకి సద్వినియోగం తెలుస్తుంది. గొప్పవాళ్ళకి సద్వినియోగం తెలియాలని లేదు. అందుకని 'సువర్గం' లో మంచివాళ్ళు అని మాత్రమే వ్రాయటం జరిగింది.) సువర్గంలో ఉన్నవారికి – ధైర్యం తమ ప్రవర్తనలో ఉంటుంది అని తెలుస్తుంది. 'సువర్గం' గురించి తెలియని వారు – ధైర్యం బాహ్యామైన వాటి మీదే ఆధారపడి ఉంటుందని అనుకుంటారు.

అమ్మవారు సువర్గం సూచించే 'స్వర్గాన్ని' అంటే భోగాన్ని ఇస్తుంది.

సువర్గంలో వర్గం పెరుగుతూ ఉండవచ్చు. అంటే – అనుభవించే వాటి సంఖ్య – అనుభవించే వాళ్ళ సంఖ్య పెరుగుతూ ఉండవచ్చు. కాని 'అపవర్గం' లో అవసరమైన వాటిని వదులుకోగలగడం, పేర్చుకోకుండా ఉండగలగడం తెలుస్తుంది. అవసరమైన వాటిని వదులుకోలేకుండా నెత్తిమీద బరువులా మోసేవాడు అపవర్గానికి అంటే మోక్షానికి దూరంగానే ఉంటాడు. అమ్మవారు ఈ అపవర్గం సూచించే 'మోక్షాన్ని' ఇస్తుంది. అందుకని అమ్మవారికి 'స్వర్గాపవర్గదా' అనే నామం బిరుదుగా వచ్చింది.

స్వర్గ సంబంధమైన భోగాలు – కాలంతోను, అనుభవించడంతోను – తరిగిపోతాయి. కాని, అపవర్గ సంబంధమైన మోక్షానుభూతి – కాలంతో గాని అనుభవించడంతో గాని తరగదు. దేవతలు స్వర్గ సంబంధమైన భోగాలు ఇవ్వగలరేమో కాని అపవర్గ సంబంధమైన మోక్షాన్ని ప్రసాదించలేరు. రెంటినీ ప్రసాదించకలది అమ్మవారే.

'భోగ, మోక్షములు రెంటినీ ప్రసాదించునది' – అని ఈ నామానికి అర్థం

## 765. శుద్ధా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శుద్ధాయై నమః' అని చెప్పాలి.

శుద్ధా = పరిశుద్ధురాలు.

క్రిందటి నామాల్లో సూచించినట్లుగా రాగ ద్వేషాదులు లేకుండా త్రిగుణాతీతంగా సువర్గ, అపవర్గాదులను అనుభవించే వారికి అమ్మవారు శుద్ధ స్వరూపంగా భాసించి సాక్షాత్కరిస్తుంది. కంటికి అంటిన దుమ్ము (మలినం), కళ్ళజోళ్ళకు అంటిన దుమ్ము (మలినం), ఇవి మాత్రమే కాక, మనస్సుకు పట్టిన దుమ్ము (మలినం లేదా అవిద్య) తుడిచి వేస్తే గాని పరిశుద్ధ జ్ఞానం కలుగదు. దీన్నే 'నిరంజన దృష్టి' అంటారు. ఈ శుద్ధత్వం వచ్చినపుడు – కొత్త సత్యం గోచరించినపుడల్లా పాతసత్యాలు కొట్టి వేయబడటం ఉండదు. పాత సత్యాలను మరి కాస్త సమన్వయ పరచుకోవడం వస్తుంది. మరింత బాగా అర్థం చేసుకోవడం వస్తుంది. సాధనలో – వేదం లోంచి వేదాంతంలోకి అడుగు పెట్టినపుడు – వేదం అంతం కాకూడదు. అంతమైతే – తరించడానికి బదులు – సాధకుడు అంతరిస్తాడు.

విశ్లేషణాత్మక దృష్టి(Analytical view) ఉన్నంత వరకూ ఈ శుద్ధత్వం రాదు. సంయోగాత్మక దృష్టి (Synthetic view) ఉంటేనే వస్తుంది.

1) పరిశుద్ధురాలు.

2) శుద్ధత్వమును రూపముగా నొందినది – అని ఈ నామానికి అర్థాలు.

## 766. జపాపుష్పనిభాకృతిః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జపా పుష్ప నిభాకృత్యై నమః' అని చెప్పాలి.

జపాపుష్ప = మందారపూవురంగుతో, నిభా = ఒప్పు, ఆకృతిః = ఆకారము (దేహం) గలది.

ధ్యానం – మౌనంగా జరగాలి, జపం = నెమ్మదిగా జరగాలి, భజన – నోరారా గొంతెత్తి పలికే విధంగా జరగాలి. జపానికి సంబంధం ఉన్న పుష్పం జపా పుష్పం. జపా పుష్పం అంటే – 'మందారపువ్వు'. మొగ్గలాగ ఉన్న స్థితిలోంచి – పువ్వు స్థితిలోకి వికసించడం అతి నెమ్మదిగా జరిగే పుష్పం జపా పుష్పం. ఈ వికసించడాన్ని స్పష్టంగా

చూడవచ్చును. అమ్మవారి నామాన్ని నెమ్మదిగా జపించినపుడు – నెమ్మదిగా అమ్మవారు ప్రసన్నమవడం కూడా స్పష్టంగా గమనించవచ్చును. అమ్మవారి ప్రసన్నతకు – ఈ జపా పుష్ప వికసనానికి పోలిక ఉండబట్టే ఈ పుష్పానికి జపా పుష్పం అని – మందార పుష్పం అనీ (మంద + అరతి – ఇతి మందార: స్పష్టముగా గమనించుటకు వీలగునట్లు నెమ్మదిగా వికసించునది – అని ఈ పదాలకు అర్థం). పేర్లు వచ్చాయి. అమ్మవారి దేహచ్ఛాయ కూడా ఈ మందార పుష్పవర్ణం లాగానే ఉంటుంది. ఈ రెండు కారణాల వల్ల అమ్మవారికి 'జపా పుష్పనిభాకృతిః' అని పేరు వచ్చింది. అందుకే ధ్యానశ్లోకంలో కూడా 'జపాకుసుమభాసురాం జపవిధౌ' – అన్నారు.

ఈ నామంలోని 'నిభా' అనే పదాన్ని 'ని + భా' అని విడదీస్తే 'నిశ్శేషమైన వెలుగు' అని అర్థం వస్తుంది.

1) సువర్ణము – బంగారు రంగు (పసుపురంగు) 2) జపాకుసుమవర్ణం (ఎఱుపు రంగు) 3) నీల వర్ణం – ఈ మూడు వర్ణాలను ధ్యానిస్తే మూడు రకాల అనుభూతుల నిస్తాయి. ముఖ్యంగా అమ్మవారి ఉపాసనకు – జపాకుసుమం, బ్రహ్మోపాసనకు – హిరణ్యవర్ణం, అవతారతత్త్వాన్ని తేలిగ్గా తెలుసుకోవడానికి 'నీలవర్ణం' గా గుర్తించి, ఆయా విధాలుగా ధ్యానాన్ని, ఉపసానను కొనసాగిస్తే – సత్ఫలితం తప్పకుండా కలుగుతుంది.

'మందారపువ్వు రంగుతో ప్రకాశించు ఆకారము (దేహము) గలది – అని ఈ నామానికి అర్థం.

## 767. ఓజోవతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఓజోవత్యైనమః' అని చెప్పాలి.

ఓజస్ + వతీ – ఓజోవతి = ఓజస్సు కలిగినది.

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్రము అని – శరీరంలో ఏడు రకాల ధాతువులు (Tissues) ఉంటాయి. వాటినే సప్తధాతువులంటారు. ఈ ఏడింటినీ కళ్ళతో చూడవచ్చు. అంటే – ఇవి భౌతిక మైన ధాతువులు. వీటిలో అన్నిటి కంటె సూక్ష్మమైనది – అన్నిటి కంటె విలువైనది – 'శుక్రము' ఈ శుక్రం తర్వాత కూడా కొన్ని ధాతువులుంటాయి. వాటి పేర్లు – 'ఓజోసి, సహోసి, బలమసి, భ్రాజోసి, దేవానాం ధామనామాసి, విశ్వమసి విశ్వాయుః సర్వమసిసర్వాయుః అభి భూః ఓం' – అని సంధ్యా వందనంలో సూచింపబడతాయి. ఇవి సూక్ష్మమైన ధాతువులే కాని – భౌతిక మైనవి కావు కాబట్టి సూక్ష్మదర్శినిలో కూడా వీటిని చూడలేం. తెలివిని, బలాన్ని ఎలా అయితే భౌతికమైన రూపాలుగా కళ్ళతో చూడలేమో ఓజస్సు, సహస్సు, భ్రాజస్సు మొదలైన ధాతువులను కూడా కళ్ళతో చూడలేము.

మనదేశం మారితే 'రసం' అనే పదం 'సీరమ్' గా మారుతుంది. (అంటే రసాన్నే ఆంగ్లంలో 'సీరమ్' అంటారు.) పైన చెప్పిన సప్త ధాతువుల్లో ఓజస్సు హృదయంలో అనాహత చక్రం వద్ద కల్పించబడుతుంది. దీనివల్లనే 'దివ్యప్రేమ' ఉద్భవించేది. ఈ దివ్యప్రేమ ఉన్న వారికి ఎదుటి వారిలో భౌతిక శరీరం కాక ఆధ్యాత్మిక శరీరం కనబడుతుంది. గర్భంలో పడటానికి శుక్రం కారణమైతే, ఆ పైన గుండె కొట్టుకోడం, శ్వాస ఆడటం లాంటివన్నీ ఈ 'ఓజస్సు' వల్లనే జరుగుతాయి, దీన్ని 'అష్టమధాతువు' అని కూడా అంటారు.

'ఓం' అనే దాని నుండి పుట్టేది, దానిని పుట్టించేది కాబట్టి – ఈ ధాతువును 'ఓజస్సు' అన్నారు. ఈ ఓజస్సు శుష్కిస్తే ధారణ సామర్థ్యం(Memory Power) తగ్గుతుంది. ప్రశ్నవేసిన టైంకి వర్జ్యం వచ్చినట్లు, రాహుకాలం వచ్చినట్లు, బుఱ్ఱపనిచెయ్యక సమాధానం చెప్పలేరు.

మంచి గంధం, తులసి, కర్పూరం, యాలక్కాయలు, కొన్ని ఇతర సుగంధ ద్రవ్యాల సాన్నిధ్యం వల్ల ఈ ఓజస్సును పెంపొందించుకోవచ్చును. సంధ్యావందనంలో తెలుపబడిన సూక్ష్మ ధాతువులన్నిటికీ వేరు వేరు ఉపయోగాలున్నాయి. వాటి వివరాలు క్రింద ఇస్తున్నాను.

1) ఓజస్ + అసి = ఓజోఽసి – ఈ ధాతువును ఆంగ్లంలో 'Sweetness o Consciousness' అంటారు.

2) సహస్ + అసి = సహోఽసి = అన్ని సమయాల్లోను తొట్రుపాటు లేకుండ నిలకడగా స్థైర్యంతో ఒకే విధంగా ఉండగలగటం ఈ సహస్సు ధాతువు వల్లనే జరుగుతుంది దీన్ని ఆంగ్లంలో 'Steadiness of consciousness' అంటారు. చుట్టూ ఉండే అన్ని రకాల పరిస్థితులు ఏ మాత్రం ప్రభావం చూపలేని విధంగా ఉంటూ ప్రవర్తనలోను, స్వభావంలోను ఏమీ తేడా రాకుండా ఉండటం ఈ సహస్సు ధాతువువల్ల వస్తుంది.

3) బలమ్ + అసి = బలమసి – ఈ బలమనే సూక్ష్మ ధాతువు వలన భౌతికమైన శక్తి పనిచేస్తుంది. ఆంగ్లంలో దీనిని'Strength of consciousness' అని అంటారు.

(ఒక్కొక్కప్పుడు భౌతికమైన దృఢమైన దేహదారుఢ్యం ఉండి కూడా బ్రతక లేనివారు 'సంకల్పబలం' వలన బ్రతుకుతారు. ఉదా: రమణమహర్షికి తాన చచ్చిపోతున్నట్లు తెలిసి, అయినా – తాను పోతున్నట్లు తనకు ఎలా తెలిసింది ? అని అనిపించి మళ్ళీ బ్రతికాడు. కాని, ఆపైన 'బ్రతికి లాభంలేదు' అన్నాడు. అయితే ఎందుక బ్రతికావు ? అంటే – ఈ సంగతి మీకు చెప్పడం కోసం' అన్నాడు)

4) భ్రాజస్సు – దీన్ని ఆంగ్లంలో (Mental light) అంటారు. ఈ వెలుగుకి అంద స్పర్శ ఉంటుంది. కళ్ళు మూసుకుని ఉన్నా అందరి రాకలను పోకలను గమనించగలగడ ఈ భ్రాజస్సు సూక్ష్మధాతువు వల్ల వస్తుంది. నిన్న చూడబడిన వాణ్ణి ఈ రోజు కూడా గుర్తించి పోల్చుకోగలగడం (Recollection and Recognition) ఈ భ్రాజస్సు ధాతువు వల్లనే వస్తుంది. అటుపైన –

5) దేవానాం ధామనామాసి – విశ్వమసి విశ్వాయుః.... పైనచెప్పిన 1, 2, 3, 4 ధాతువుల దాకా మనవి – అంటే ఇవి మన ఇంట్లో విద్యుద్దీపాల లాంటివి. అటుపైన 5 నుండి దేవతల ధాతువులు వర్తిస్తాయి. ఇవి రోడ్డు మీద మునిసిపాలిటీ వారి వీధి దీపాల్లాంటివి.

పైన తెల్పిన సూక్ష్మధాతువులన్నిటినీ ఆంగ్లంలో 'Basic Tissues of intelligence ' అంటారు.

1) ఓజస్సును కలిగినది, కలిగించునది.

2) ఓజస్సుగా మనలో ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 768. ద్యుతిధరా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ద్యుతిధరాయైనమః' అని చెప్పాలి.

ద్యుతి = కాంతిని, ధరా = ధరించునది.

వెలుగుల ముద్ద అమ్మవారు. అరుణారుణ కాంతులను విరజిమ్మే అవయవ సంపద కల అమ్మవారిని – ఈ 'ద్యుతి ధరా' నామంతో ధ్యానం చెయ్యాలి. ప్రపంచంలో సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్రాలు, మొదలైన వాటి ద్వారా కాంతి బయటకు వ్యక్తమై, ప్రసారమౌతుంది. అసలు కాంతి అనేది ఒకటి ఉంటే అది వ్యక్తమవడానికి ఈ సూర్యచంద్రాదులు ఇంధనంలా పనిచేస్తారు. నూనె దీపం వెలుగుతుంటే నూనె, వత్తులు లాంటి వాళ్ళు ఈ సూర్య చంద్రాదులు అయితే – అసలు కాంతి అమ్మవారు లాంటిదన్నమాట!

అందరిలోను కాంతిని ధరించి ఉండేది నిజంగా 'నేను' ఒక్కటే ఈ నేను తో సూచింపబడే అమ్మవారే 'ద్యుతిధరా'.

కొందరిలో సౌందర్య వర్చస్సు ఉంటుంది. ఇది ఒక రకమైన ద్యుతి. మరి కొందరిలో శౌర్య తేజస్సు ఉంటుంది. ఇది ఒక రకమైన ద్యుతి. ఇంకొందరిలో జ్ఞాన తేజస్సు (బ్రహ్మతేజస్సు) – ఇలా ఎన్నో రకాలైన తేజస్సులుంటాయి. ఈ 'తేజస్సు'ను కూడా ద్యుతి అంటే – ఇన్ని రకాల తేజస్సుల రూపంలో ఉండే అమ్మవారి నామాన్ని 'ద్యుతిధరా' అనవచ్చును.

1) కాంతిని ధరించునది.

2) అందరిలోను 'నేను' వెలుగును ధరించి ఉండునది.

3) శౌర్య, బ్రహ్మాది వివిధ తేజస్సులలో ఉండే కాంతిగా ఉండునది. – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 769. యజ్ఞరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యజ్ఞరూపాయైనమః' అని చెప్పాలి.

యజ్ఞ = యజ్ఞములను, రూపా = రూపముగా ఉండునది.

నలుగురికీ ఉపయోగపడే మంచి పని ఏదైనా యజ్ఞం అవుతుంది. వంటింట్లో తల్లి అన్నం వండి, ఇంట్లోని వారికి పెట్టడం అనే పాకయజ్ఞం దగ్గరనుంచి, ఉపన్యాసాల ద్వారా జ్ఞానాన్ని నలుగురికీ పంచిపెట్టడం అనే జ్ఞానయజ్ఞం, లోకకళ్యాణార్థం పరిపాలకులచే నిర్వహింపబడే మహా యజ్ఞాల దాకా అన్ని యజ్ఞాలే అవుతాయి. 'యజనము' అన్నా కూడా యజ్ఞమే! గృహస్థు తన ఇంటిలోని వారికి, ఇంటికి వచ్చినవారికి, యాచించిన వారికి, అందరికీ ఉపయోగపడే విధంగా పనులు చెయ్యాలిగాబట్టి గృహస్థును 'గృహయజమాని' అని గూడా అంటారు.

'అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా
దానం పరిగ్రహం చైవ బ్రాహ్మణా నామ కల్పయత్ -

అని బ్రాహ్మణునికి చెప్పిన షట్కార్యాలలో 'యజనము' - 'యాజనము' కూడా ఉన్నాయి. వీటికి యజ్ఞాలు చెయ్యడం, చేయించడం - అనే అర్థాలు. ఇక్కడ 'యజ్ఞము' అంటే మంచి పనులనే అర్థం కూడా చెప్పుకోవాలి.

బ్రహ్మాండ స్థాయిలో ప్రజాపతి యజ్ఞాలతో ప్రజా సంసర్గ కార్యాన్ని నిర్వహిస్తున్నాడు. మనుష్యులు దేవతలను ఉద్దేశించి యజ్ఞాలు చేస్తే, ఆ దేవతలు ప్రసన్నమై ఎండ, వేడిమి, వర్షం, వెన్నెల మొదలైన వాటిని ఆ దేవతలు మనుష్యులకు అందే ఏర్పాటు చేస్తున్నారు. ఇలా ఒకరికొకరు చేసుకొనే పనులు కూడా యజ్ఞార్థ కర్మలే! ఈ యజ్ఞార్థ కర్మల వలన విశ్వ శ్రేయస్సు కలుగుతుంది. లోక కళ్యాణం జరుగుతుంది. సృష్టి స్వరూపిణి, జగజ్జనని, లోకమాత అయిన అమ్మవారికి కావలసింది ఇదే!

విష్ణుమూర్తిని సాక్షాత్తు యజ్ఞస్వరూపుడే అని 'యజ్ఞోవై విష్ణుః' అంటారు. గీతలో కూడా తాను యజ్ఞ స్వరూపుడనని భగవానుడు చెబుతాడు. లోక కళ్యాణానికి ఉపకరించే

పాకయజ్ఞ, హవిర్యజ్ఞ, సోమయాగ, అంబాయజ్ఞముల వంటి యజ్ఞాలన్నీ అమ్మవారి రూపాలే ! అమ్మవారి ఆజ్ఞలే ! అని అర్థం చేసుకోవాలి. (వివిధ యజ్ఞాల పేర్లు అనుబంధంలో తెలుపబడినాయి).

'యజ్ఞముల రూపముగా ఉండునది' – అని ఈ నామానికి అర్థం.

## 770. ప్రియవ్రతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రియవ్రతాయై నమః' అని చెప్పాలి.

వ్రతా = వ్రతములందు, ప్రియ = ప్రీతికలది.

'దీక్ష' అనే మాటను వేదాల్లో 'వ్రతం' అంటారు. ('అన్నం ననిన్ద్యాత్ – తద్వ్రతమ్' 'అన్నం నపరిచక్షీత – తద్వ్రతమ్' – తైత్తిరీయం) శ్రద్ధాభక్తులతో చేసే పుణ్య కార్యాలను, ప్రజోపయోగ కార్యాలను, దేవతారాధనలను, అర్చనలను, పూజా పునస్కారాదులన్నిటినీ 'వ్రతాల'ంటారు. ఏ దేవతను ఎలా అర్చించినా దేవతా స్వరూపాలన్నీ అమ్మవారే కాబట్టి, భక్తి శ్రద్ధా దీక్షలు ఆత్మ గుణాలు కాబట్టి – అమ్మవారు వ్రతాలంటే చాలా ప్రీతి చెందుతుంది.

'ప్రియ' అంటే 'ప్రియుడు' అని అర్థం. అమ్మవారికి ప్రియుడు తన భర్త అయిన సదాశివుడే కాబట్టి – 'సదాశివుని యందు వ్రత దీక్ష కలది' అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చు.

'ప్రియ' అనే పదం ప్రేమను సూచించే పదం కామట్టి 730వ నామంలో చెప్పినట్లుగా అమ్మవారు 'ప్రేమరూపం' కూడా కాబట్టి ఆ ప్రేమను అందరికీ అందివ్వడంలో వ్రతంగా అంటే దీక్షగా వ్యవహరిస్తుంది కాబట్టి అమ్మవారు 'ప్రియవ్రతా'.

1) వ్రతముల యందు ప్రీతి కలది.

2) సదాశివుడే వ్రతంగా గలది.

3) అందరికీ ప్రేమను పంచటంలో వ్రతంగా గలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 771. దురారాధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దురారాధ్యాయై నమః' అని చెప్పాలి.

దురారాధ్యా = దుష్టులచే ఆరాధింప వీలుగానిది.

ఏ పనిని చెయ్యడానికైనా ఒక అర్హత ఉండాలి. అందరూ అన్ని పనులు చెయ్యడానికి అర్హులు కారు. ఆరాధనా విషయాల్లో అర్హత అనేది మంచితనాన్ని బట్టి వస్తుంది కాని బలాన్ని బట్టి కాదు. అందులోను అమ్మవారిని ఆరాధన చెయ్యాలంటే అంతకు పూర్వంఎంతో పుణ్యంచేసి ఉండాలి. అలా పుణ్యంచేసుకున్నవారికే అమ్మవారిని ఆరాధించాలనే అభిలాష కలుగుతుంది. మిగిలిన దూషిత మనస్సు కలవారికి, దుష్టులకు అమ్మవారి ఆరాధనపై దృష్టి మళ్ళదు. ఆదిశంకరులు, సౌందర్యలహరిలోని 'శివశ్శక్త్యాయుక్తో.... అన్న ప్రప్రథమ శ్లోకంలోనే 'ప్రణంతుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి' – అన్న చివరి పాదంలో చెబుతారు. 'నీకు నమస్కారం పెట్టటానికి కాని, నిన్ను స్తుతించటానికి గాని ఏ మాత్రము పుణ్యము చెయ్యని వాడు ఏ విధంగా అర్హుడవుతాడమ్మా ? (అంటే – అనర్హుడు అని భావం)' అని దీని అర్థం. కాబట్టి, అమ్మవారిని అందరూ ఆరాధించలేరు. ఆ అవకాశం అందరికీ రాదు. ఆరాధన చెయ్యాలన్నా ఎంతో పూర్వ జన్మ సుకృతం ఉండాలి – అని ఆదిశంకరుల అభిప్రాయం. ఈ అభిప్రాయానికి మూలం లలితా స్తోత్రంలోని ఈ 'దురారాధ్యా' నామమే – అని ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

దూషిత మనస్సు కలవారిచే ఆరాధింపవీలు కానిది – అని ఈ నామానికి అర్థం.

## 772. దురాధర్షా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారిని నమస్కరించేటప్పుడు 'దురాధర్షాయై నమః' అని చెప్పాలి.

దురాధర్షా = తిరస్కరించుటకు గాని, ఎదుర్కొని వశపరచుకొనుటకు కాని వీలు కానిది.

ఒకరిని ఎదుర్కొని వశపరచుకోవాలంటే బలమైనా ఉండాలి, ధనమైనా ఉండాలి, లేదా – యుక్తి సామర్థ్యాలైనా ఉండాలి. ఈ చెప్పిన వాటిలో వేటిలోను అమ్మవారిని మించిన వారుండరు. ఎవరు ఎదుర్కొన్నా అమ్మవారికి వాళ్ళు వశమై పోవాల్సిందే తప్ప అమ్మవారు వాళ్ళ వశం కాదు. వాళ్ళ బలపరాక్రమ, ధన, యుక్తి సామర్థ్యాలు అమ్మవారి ముందు ఎందుకూ పనికిరావు. అలసులు, మందబుద్ధులు, ఇంద్రియ లోలురు, చపల చిత్తులు అయితే అమ్మవారిని ఏ మాత్రం అవగాహన చేసుకోలేరు. అమ్మవారిని దర్శించలేరు. భక్తులు లేదా భక్తితో కూడిన జ్ఞానులే అమ్మవారిని అర్థం చేసుకుని దర్శించు కోగలరు. వారినే అమ్మవారు అనుగ్రహించి ఆదుకుంటుంది. 'భక్తివశ్యా' అనే 120వ నామ వివరణను ఇక్కడ సమన్వయించుకోవాలి.

ఎదుర్కొని వశము చేసుకొన వీలులేనిది – అని ఈ నామానికి అర్థం.

## 773. పాటలీకుసుమప్రియా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పాటలీ కుసుమప్రియాయైనమః' అని చెప్పాలి.

పాటలీ కుసుమ = పాటలీ పుష్పమునందు, ప్రియా = ప్రీతికలది.

అమ్మవారు సృష్టి స్వరూపిణి, ప్రకృతి స్వరూపిణి కాబట్టి ప్రకృతిలో లభించే పువ్వులన్నీ అమ్మవారికి ఇష్టమే! 'తీపి పదార్థాలంటే ఇష్టమైనా – మళ్ళీ ఆ తీపి పదార్థాల్లో ప్రత్యేకించి కొన్ని తీపి పదార్థాలంటే – మరీ ఇష్టంఉంటూ ఉండటం సహజం. అలాగే పువ్వులన్నీ ఇష్టమే అయినా, సంపెంగ, మందార, దాడిమీ పుష్పాలలాగానే, 'పాటలీకుసుమం' అంటే కూడా అమ్మవారికి చాలా ఇష్టం. ఇందుకు కారణం ఉంది.

ఈ తెలుపు ఎఱుపుల సమ్మిశ్ర వర్ణాన్ని 'పాటలవర్ణం' అంటారు. వాత్సల్యానికి, ప్రేమకు, ఆర్ద్రతకు, ఆప్యాయతకు చిహ్నమైన, సజీవమైన హృదయం కూడా ఈ రంగులోనే ఉంటుంది. అందుకే అమ్మవారికి ఈ రంగు అంటే అంత ఇష్టం. హృదయంలోని ప్రేమను సూచించడానికి సంకేతించబడిన గులాబీ పువ్వు కూడా ఈ రంగులోనే ఉంటుంది. (Rose is for Love).

'పాటలీ కుసుమము' అనకుండా 'కుసుమ' అన్నా కూడా పాటలీ కుసుమమనే అర్థం చెప్పడం కూడా ఉంది. ఈ అర్థంలోనే హృదయాన్ని 'కుసుమపురం' అంటారు. అందరిలోని 'పాటలీ కుసుమ' వర్ణంలో ఉండే హృదయమే అమ్మవారికి ఇష్టమైన నివాసం కాబట్టి - అమ్మవారిని 'పాటలీ కుసుమప్రియా' అని అన్నారు.

అయ్యవారికి బిల్వవృక్షం ఇష్టమైతే - అమ్మవారికి పాటల వృక్షం ఇష్టమన్నమాట!

పాటలీ కుసుమమునందు ప్రీతి కలది - అని ఈ నామానికి అర్థం.

## 774. మహతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించెటప్పుడు 'మహత్యైనమః' అని చెప్పాలి.

మహతీ = అందరికన్నా పెద్దది.

అందరికన్నా పెద్దవాడైన భగవంతుణ్ణి 'మహాన్' అని పిలుస్తారు. ఈ 'మహాన్' పుంలింగ శబ్దానికి స్త్రీలింగ శబ్దమే 'మహతీ'. అందరి కన్నా పెద్దవాడు భగవంతుడైతే - ఆయన్ని గురించిన అభిప్రాయం - భగవతి అవుతుంది. ఈ భగవతి పేరు 'మహతీ (అణోరణీయాన్ మహతో మహీయాన్ - తైత్తిరీయం)

మనవెన్నెముకనే దండంగా, వెన్నెముక వెంబడి ఉండే ఇడా, పింగళా సుషుమ్నా నాడులే తంత్రులుగా ఉండే వీణను ప్రతి వ్యక్తిలోను ఏర్పాటు చేశాడు భగవంతుడు. ఈ వీణ దానంతటది మ్రోగితే 'కచ్ఛపీ' అవుతుంది. ఇదే సరస్వతీ వీణ. మన ద్వారా పలకబడే సత్యము, ఋతము ఈ వీణ ద్వారానే పలుకబడతాయి. ఇదే రకమైన వీణను నారదుడికి ఇచ్చాడు. ఆ వీణ పేరు 'మహతి'. ఆ వీణలోని తంత్రులు మీటకుండానే మూరు పలుకుతాయి. నారదుడు ఒకసారి 'నారాయణ' అంటే ఆ మహతీ తంత్రులు మళ్ళీ 'నారాయణ' అంటాయి.

ఈ 'కచ్ఛపీ' - 'మహతీ' రెండు వీణల ద్వారా గూడా పలికేది అమ్మవారే !

1) అన్నిటి కన్నా పెద్దది.

2) మనలో యోగదండా కృతిలో ఉన్న వీణ - అని ఈ నామానికి అర్థం.

# 775. మేరునిలయా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మేరు నిలయాయై నమః' అని చెప్పాలి.

మేరు = మేరువును, నిలయా = నివాస స్థానముగా గలది.

అమ్మవారు మేరు పర్వత శిఖరం మీద ఉంటుందిట. భూమ్మీద ఈ మేరు పర్వతం ఉత్తరదిశగా ఉంటుంది. భూమి యొక్క ఉత్తర ధ్రువాన్నే 'మేరువు' అంటారు. భూమి యొక్క దక్షిణ ధ్రువాన్ని 'మందరం' అంటారు. ఈ క్రింది పటంలో చూపిన విధంగా ఈ రెంటినీ కలిపేNS రేఖను – అంటే భూమి యొక్క ధృవాక్షాన్ని భూమికి సంబంధించిన మేరువు అంటారు. అలాగే మనలో కూడా మూలాధారం దక్షిణ ధ్రువం అయితే, సహస్రారం, లేదా బ్రహ్మరంధ్ర ప్రాంతం – 'ఉత్తర ధ్రువం' అవుతుంది. ఈ రెంటినీ కలిపే వెన్నెముకను 'యోగదండము' లేదా 'బ్రహ్మదండము' లేదా 'మేరుదండము' అంటారు. ఈ దండానికి పై కొన 'మేరువు', క్రింది కొన 'మందరం' అవుతాయి. (ఈ మేరువు గురించి ఇంకా పూర్తి వివరాలు కావాలంటే ప్రథమ భాగంలో వచ్చే 'సుమేరు మధ్య శృంగస్థా' అనే 55వ నామ వివరణను గూడా చదువుకోవాలి). అమ్మవారి మెట్టినిల్లు సహస్రారం కాబట్టి, ఇది మేరువును సూచిస్తుంది కాబట్టి, అమ్మవారు 'మేరునిలయా' అయింది.




శ్రీ చక్రంలోని కేంద్ర బిందువు ఈ మేరువును సూచిస్తుంది. 'బైందవాసనా' అనే నామం ముందు రాబోతోంది. శ్రీ చక్ర పరంగా ఆ నామం యొక్క అర్థం కూడా ఈ 'మేరునిలయా' నామం యొక్క అర్థాన్నే సూచిస్తుంది. (దృఢమైన, అంటే – 3 - D శ్రీ చక్రంలో, అంటే – శ్రీ చక్ర ఉద్ధారంలో ఎత్తుగా గోపురంలా ఉండే చోటులో మధ్య బిందువు ఈ మేరువు. అమ్మవారి స్థానం అది కాబట్టి – అమ్మవారు 'మేరునిలయా').

1) సహస్రారమందు ఉండునది.

2) వెన్నెముక పై కొనవద్ద ఉండునది.

3) భూమికి ఉత్తర ధ్రువమందు ఉండునది - అని ఈ నామానికి అర్థాలు.

## 776. మందార కుసుమ ప్రియా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మందార కుసుమప్రియాయైనమః' అని చెప్పాలి. .

మందార కుసుమ = మందార పుష్పము నందు, ప్రియా = ప్రీతి కలది.

అమ్మవారు సృష్టిని ప్రసవించినట్లే - కాబోయే కాయల్ని - పిందెల రూపంలో పువ్వులు ప్రసవిస్తాయి. పువ్వులో ఉండే అందం, ఆకర్షణ, సౌకుమార్యం, సువాసన, మాధుర్యం (తేనె), ఒకవిధమైన సౌష్ఠవనిర్మాణం(Symmetrical Construction) మొదలైన లక్షణాలన్నీ అమ్మవారి కున్నాయి. కాబట్టి - పువ్వులకు అమ్మవారికి చాలా దగ్గర సంబంధం ఉన్నట్లు తెలుసుకోవాలి. అన్ని రకాల పువ్వులూ ఇష్టమైన అమ్మవారికి కడిమి పువ్వులు, మందార పువ్వులు, సంపెంగ పువ్వులు, పాటలీ కుసుమాలు మొదలైనవి మరీ ఎక్కువ ఇష్టం. 'మందం - అరతి ఇతి మందారః' అని మందార పువ్వుకు వ్యుత్పత్తి అర్థం. మందార పువ్వు వికసించడం అతి నెమ్మదిగా జరుగుతుంది. ఈ వికసన ప్రక్రియను మనం స్పష్టంగా చూడవచ్చును గూడా! అమ్మవారిని ధ్యానిస్తే అమ్మవారు కూడా ఇలాగే మనకు నెమ్మదిగా స్పష్టంగా ప్రసన్నమౌతుంది. మందార ప్రసూన వికసనానికి సరిపోల్చే విధంగా అమ్మవారి ప్రసన్న వికసనం ఉంటుంది కాబట్టి - మందార పువ్వు అంటే అమ్మవారికి ఇష్టం. (ఇంతకు పూర్వం వచ్చిన 'జపాకుసుమనిభాకృతిః' అన్న 766 నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవచ్చును).

స్వర్గంలో కూడా మందార వృక్షం ఉంటుంది. ఈ మందార వృక్ష సంబంధమైన పువ్వు అని కూడా ఈ నామంలోని మందార కుసుమానికి అర్థం చెప్పుకోవచ్చును. ఈ మందార వృక్షం దీనుల కోర్కెలు తీర్చి, వారి దైన్యాన్ని పోగొడుతుంది కాబట్టి, తను

గూడా అలాంటిదే కాబట్టి, అమ్మవారికి ఈ మందారం అంటే ఇష్టం ఉండటం సముచితమే ఔతుంది.

మందార పుష్పము నందు ప్రీతి కలది – అని ఈ నామానికి అర్థం.

## 777. వీరారాధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వీరారాధ్యాయైనమః' అని చెప్పాలి.

వీర = వీరుల చేత, ఆరాధ్యా = ఆరాధింపబడునది.

వీరరసం అందరి సొమ్మూ కాదు. అనవసరమైనపుడు లేచి రెచ్చి పోయే వాడికి ఈ వీరరసం ఉండదు. మానవజాతిలో కొందరికే ఈ వీర లక్షణం రక్తంలోనే జీర్ణించుకుని ఉంటుంది. వాళ్లే 'క్షత్రియ వర్గం' క్రిందకు వస్తారు. మిగిలిన వారు – మిగిలిన బ్రహ్మ, వైశ్య, శూద్ర వర్ణాల్లో దేనికోదానికి చెందుతారు.

తమశక్తి శౌర్యాలను పెంచుకుంటూ ధనుర్విద్యాది క్షాత్రసంబంధమైన విద్యాశిక్షణాకాలంలోనూ, యుద్ధానికి వెళ్ళేముందు, విజయోత్సవాలలోను 'దుర్గాదేవి' ని ఆరాధించడం ఆచారంగా వస్తోంది. ఇలాంటి వీరుల చేత ఆరాధింపబడేది కాబట్టి- అమ్మవారు 'వీరారాధ్యా'.

వీరు లంటే మానవులను పై నుండి పరిపాలించేవారు – వీరే ఇంద్రాది దేవతలు, త్రిమూర్తులు – వీరందరూ కూడా అమ్మవారి ఆదేశానుసారం వర్తిస్తూ, ఆజ్ఞలకు లోబడి ప్రవర్తిస్తూ అమ్మవారిని అర్చిస్తారు కాబట్టి అమ్మవారు 'వీరారాధ్యా'.

శ్రీవిద్యా ఉపాసకులలో శ్రేష్ఠులను గూడా వీరులంటారు.

1) వీరులచే ఆరాధింపబడునది.

2) మానవులను పరిపాలించు దేవతా త్రిమూర్తులచే ఆరాధింపబడునది.

3) శ్రీ విద్యా ఉపాసక శ్రేష్ఠులచే ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థాలు.

## 778. విరాడ్రూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విరాడ్రూపాయై నమః' అని చెప్పాలి.

విరాట్ = విరాట్, రూపా = రూపమును ధరించునది.

చతుర్దశ భువనాలతో కూడినదే ప్రపంచం. ఈ ప్రపంచంలో స్వేదజాలు, అండజాలు, పిండజాలు మొదలైన జీవ సముదాయ మంతటి యొక్క సమష్టి స్వరూపమే విరాడ్రూపము. ఊర్ధ్వలోకాల్లో అన్నిటికన్నా ఊర్ధ్వంగా ఉన్న సత్యలోకం నుండి అధోలోకాల్లో అన్నిటి కన్నా క్రిందుగా నున్న పాతాళం వరకూ విస్తరించి ఉన్న ఈ విశ్వాన్ని ఒక పెద్ద రూపంగా ఊహిస్తే ఆ రూపమే విరాడ్రూపమౌతుంది. ఈ విరాడ్రూపాన్ని అమ్మవారి శిరస్సు నుండి పాద పర్యంతం న్యాసం చేయువచ్చు. (ఈ వివరాలు అనుబంధంలో ఇవ్వబడినాయి).

'చతుర్దశ భువనాలలో విస్తరిల్లి ఉన్న ఈ విశ్వం యొక్క సమష్టిరూపము – అని ఈ నామానికి అర్థం.

## 779. విరజా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విరజసేనమః' అని చెప్పాలి.

విరజా= రజస్సుకు అతీతంగా ఉండునది.

సృష్టి అంతా అణువుల, పరమాణువుల మయం. ఈ పరమాణువులు, అణువులనే రజస్సులంటారు. సృష్టి ఏర్పడక పూర్వం(Preatomic State) మహాతేజస్సే ఉంటుంది. ఈ మహాతేజస్సు అనే సూక్ష్మస్థితి నుండి – స్థూలస్థితి అయిన ద్రవ్యస్థితికి రావడానికి దిగివచ్చే దారిని 'అగ్ని' అంటారు. ఈ అగ్ని ద్వారానే స్థూలం నుండి సూక్ష్మానికి ఎక్కడం గూడా జరుగుతుంది. రజస్సుతో రూపొందే సృష్టికి ముందు మహాతేజస్వినిగా ఉండే అమ్మవారిని 'విరజా' అంటారు.

ధ్యానంలో ధ్యానింపబడేది కదలకుండా ఉంటే దాన్ని 'ధారణ' అంటారు, ధ్యానించేవాడు కదిలితే 'భావన' అంటారు. ధారణ, ధ్యాన సమాధులు నిలిచిన చోట- 'సంయమము' ఉంటుంది. ఈ సంయమము వచ్చినవాడు మాత్రమే సృష్టికి ముందున్న 'విరజాస్థితి' ని అనుభూతి పొందకలడు. ఈ స్థితిని పొందినవాణ్ణి మాత్రమే 'సంయమి' అనాలి. భగవద్గీతలో 'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' అన్న శ్లోకంలో ఈ సంయమి గురించే చెప్పబడినట్లుగా అర్థం చెప్పుకోవాలి. ఈ విరజాస్థితిలో ప్రతి వస్తువులోను 'నేను' అనే కిరణమే భాసిస్తుంది.

సత్త్వరజస్తమో గుణ భూయిష్ఠమైన, సృష్టి స్వరూపిణి అయిన - అమ్మవారు త్రిగుణాలకు అతీతంగా ఉండేదే కాబట్టి, అమ్మవారు - 'విరజా'. చతుర్దశ భువన పర్యంతం విస్తరించి ఉన్న 'విరాడ్రూపిణి' గా ఉన్నా - వీసమెత్తు కూడా అహంకారం కాని, గర్వం కాని, దర్పం కాని లేని శుద్ధ సత్త్వ స్వరూపురాలే అవటం వలన - అమ్మవారు 'విరజా'.

రజస్సు లేనిది. రజస్సులకతీతమైనది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 780. విశ్వతోముఖీ

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వతోముఖ్యైనమః' అని చెప్పాలి.

విశ్వతః = విశ్వమునందలి అన్నివైపులకు, ముఖీ = ముఖములు కలది.

విశ్వంలో ఎటు చూసినా అమ్మవారి ముఖాలే కనబడే దృశ్యాన్ని తేలిగ్గా అర్థం చేసుకోవాలంటే - విశ్వంలోని అన్ని జీవరాసుల ద్వారాను అమ్మవారే కనబడే స్థితికి ఎదిగిన సాధన జరగాలి. అప్పుడు ఎటుచూసినా, ఎవరితో మాట్లాడినా - అమ్మవారే కనబడుతుంది. ఇది సాధనలో పరాకాష్ఠ స్థితిని సూచిస్తుంది. అర్జునుడు విశ్వరూపం చూస్తున్నపుడు పొందిన అనుభూతి భగవద్గీతలో -

నమః పురస్తాత్ అథపృష్ఠతస్తే
నమోఽస్తుతే సర్వతఏవసర్వ
అనంతవీర్యామిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసిసర్వః (గీత 11-40)

అని చెప్పబడింది. సర్వత్రా వ్యాపించి ఉన్నవారిని చూసినప్పుడే ఇలాంటి స్థితి చూచేవాడికి తారసిల్లుతుంది. సరిగ్గా భగవానుని విశ్వ రూపం చూస్తున్న అర్జునునికి ఈ స్థితి కలిగింది. అమ్మవారిని కూడా ఇదే విధమైన విశ్వరూపంగా ధ్యానిస్తే ఈ దర్శనానుభూతి కలుగుతుంది.

సృష్టికి మూలకారణమైన వారిని పురుష సూక్తంలో చెప్పినట్లు 'సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్' - అనే విధంగానే ధ్యానించాలి.

'సహస్ర శీర్షవదనా' 'సహస్రాక్షీ' 'సహస్రపాత్' అన్న 282, 283, 284 నామాల వివరణ కూడా ఇక్కడ చదువుకుంటే - అన్ని విధాలైన సమన్వయం కుదిరి, ఈ నామం యొక్క అర్థం పూర్తిగా ద్యోతకమౌతుంది.

మహన్యాస రుద్రాభిషేకంలో చేర్చబడిన తైత్తిరీయమహానారాయణమ్ లోని -

''విశ్వతః చక్షురుత విశ్వతోముఖో
విశ్వతో హస్త ఉత విశ్వతస్పాత్
సంబాహుభ్యాం నమతి సంపతత్రైః
ద్యావా పృథివీ జనయన్దేవ ఏకః'' - అనే మంత్రాన్ని కూడా ఇక్కడ సమన్వయ పరచుకోవాలి.

ప్రపంచంలో ఎక్కడ ఏది జరుగుతోందో తెలుసుకునే సాక్షీ స్వరూపిణి గా అమ్మవారిని అర్థం చేసుకున్నప్పుడు గూడా ఈ నామం యొక్క అర్థం బాగా అవగతమౌతుంది.

1) విశ్వమునే తన ముఖముగా గలది.

2) విశ్వములోని సమస్త జీవరాసుల ద్వారా దర్శింపబడునది.

3) విశ్వమంతటా నిండి యున్నది - అని ఈనామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 781. ప్రత్యగ్రూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రత్యగ్రూపాయై నమః' అని చెప్పాలి.

ప్రత్యక్ = బహిర్ముఖముగా కాకుండా- అంతర్ముఖముగా తెలుసుకొనెడి, రూపా = రూపము గలది.

మనకు ముందు ఉన్నదిశను 'ప్రాక్ దిశ' – 'ప్రాగ్దిశ' అంటారు. మనకు వెనుక ఉన్న దిశను 'ప్రత్యక్ దిశ' – 'ప్రత్యగ్దిశ' అంటారు. సాధారణంగా మన ఇంద్రియాలు మనకు ముందు ఉన్న విషయాలవైపు వెతుకుతూ పోతూ ఉంటాయే తప్ప – అవి పని చెయ్యటానికి వాటి వెనుక ఉండి ప్రేరేపించే ఆత్మవైపుకు వర్తించవు. అలా వెనుక వైపు ఉన్న వాటి ప్రేరణ స్థానాన్ని గుర్తిస్తే తప్ప ఆత్మ సంగతి తెలియదు.

మనమందరమూ మేల్కాంచిన ఆత్మలం. మనకు మేల్కాంచిన తర్వాత మనం ఉన్నట్లు తెలుస్తుంది గాని మేల్కాంచక పూర్వం తెలియదు. మేల్కాంచక పూర్వం ఉన్న స్థితినే మనం 'నిద్ర' అంటాము. దీనిని బట్టి – దేనియందు మనం మెలకువగాలేమో ఆ స్థితిని మనం 'నిద్ర' అంటాము అని తెలుస్తోంది. అలా మనం మెలకువగా లేని నిద్రస్థితిలో మనకు తెలియకపోయినా కూడా ఉండే స్థితిని 'ప్రత్యక్ స్థితి' అంటారు. మేల్కాంచిన ఆత్మలమైన మనము మన ఈ ఆత్మలకు మూలకారణమైన ఆ ప్రత్యక్ స్థితిలోని ఆత్మను దర్శించగలిగితే ఆ ఆత్మ యొక్క రూపం 'ప్రత్యగ్రూపం' ఔతుంది. ఆ ప్రత్యగ్రూపమే అమ్మవారు.

రైలు బయలు దేరేది మనం ఎక్కిన చోటు(Station) నుండే అనుకోడం పొరపాటు. రైలు మనం ఎక్కిన చోటు నుండే కాక ఇంకా ముందు నుండి కూడా ఉండి ఉండవచ్చు.

అలాగే మన 'జననం' అనేది మనం ఒకసారి భూమి మీద పడడం దగ్గర నుండి మాత్రమే కాదు. ఇంతకు ముందు నుంచీ ఉంటుంది.

ఈ విధంగా రైలు బయలుదేరడానికి, మన జననాలకు వెనుకగా – అసలైన ప్రారంభంగా ఏది ఉంటుందో, అలాగే – బాహ్యలోకంలో ఆత్మలుగా చెలామణి అయ్యే

మనకు – వెనుకగా, ప్రారంభస్థితిలో ఈ ఆత్మలకు మూలమైనది ఉంటుంది. దీన్నే 'ప్రత్యక్ స్థితి' అంటారు. ముందుకు కాకుండా మన దృష్టి వెనుకవైపుగా, అంటే – అంతర్ముఖంగా మళ్ళితే గాని ఈ ప్రత్యక్ స్థితి, ఆ ప్రత్యక్ స్థితిలో ఉన్న అమ్మవారి రూపం దర్శనం కాదు. దీన్నే ఆంగ్లంలో 'Awakening towards the background consciousness' అంటారు.

అంతర్ముఖ జ్ఞానంతో దర్శనమగు రూపము గలిగినది – అని ఈ నామానికి అర్థం.

## 782. పరాకాశా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరాకాశాయై నమః' అని చెప్పాలి.

పరా = పరమైన, (నేపథ్యముగా ఉన్న), ఆకాశా = ఆకాశముగా ఉన్నది.

'ఆకాశం' అంటే చోటు(space). ఇది పంచభూతాల్లో సూక్ష్మాతి సూక్ష్మమైనది. దీని కన్నా సూక్ష్మమైంది ఇంకోటి లేదు. దీనిపైన ఉండేది ఇక మనస్సే !

చోటు – రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి పరిమితమైనది(Limited space). రెండోది అపరిమితమైనది(Unlimited or back gorund space). గది కట్టక పూర్వం ఉన్న చోటు అపరిమితమైంది. దీన్ని 'ఆకాశము' అంటారు. గది కట్టిన తర్వాత నాలుగు గోడల మధ్య ఉన్న చోటు కొంత వాసయోగ్యంగా ఉంటుంది కాబట్టి ఆ గదిలో చోటును 'వసతి' అంటారు. ఈ 'వసతి' ఆ ఆకాశంలోని భాగమే కాని వేరు కాదు. ఇలాంటి గదులెన్నో ప్రపంచంలో ఉండవచ్చు. ఇన్ని గదులకూ వెనుక నేపథ్యంలో ఉండే ఆ చోటుకు 'నేపథ్య ఆకాశం' (Back Ground space) అంటారు. ఇంతవరకు చెప్పింది మన ఇంటి గదిలోని చోటుకు మాత్రమే పరిమితమైన విషయం. ఇదే విషయాన్ని అన్ని కక్ష్యల (Planes) లోను అన్వయించుకోవాలి.

అయస్కాంతం(Magnet) ఉంటే – దీని చుట్టూ కొంత మేరకు దాని వల్ల ప్రభావితమయ్యే అయస్కాంత క్షేత్రం(Magnetic field) ఎలా అయితే ఉంటుందో –

అలాగే మనం ఎఱుగున్న భూమి (Earth)చుట్టూ దానికి సంబంధించిన క్షేత్రం (Earth field) ఉంటుంది. భూమి చుట్టూ ఉండే ఈ క్షేత్రాన్ని 'భూమి – ఆకాశం'(Geocentric space) అంటారు. 'అయస్కాంత క్షేత్రం', 'భూమి – ఆకాశం' నమూనాలు ఈ క్రింది పటంలో చూపబడ్డాయి.




అయస్కాంత క్షేత్రం




E భూమి – S ఆకాశం

ఇలాగే రెండు గ్రహాలకు మధ్య ఉన్న ఆకాశాన్ని 'గ్రహ – ఆకాశం'(Planetary space) అంటారు. ఇలా గ్రహాలు, అంతర గ్రహ ఆకాశంతో ఉండే సూర్యుని వ్యవస్థను (System) 'సూర్యకుటుంబం' (Solar system) అంటారు. సూర్యుడు, గ్రహాలు ఏర్పడక పూర్వం కూడా ఈ ఆకాశమే నేపథ్యంగా ఉంటుంది. సూర్య కుటుంబం యావత్తూ పూర్తిగా నిండిన జిల్లేడు కాయలాగా బ్రద్దలైతే(Explode) – నిప్పుపుట్టి, వెలుగుపుట్టి, వెలుగురవ్వలు చెల్లా చెదరై ఈ నేపథ్య ఆకాశంలో సూర్య విత్తనాలు (Seeds of SUN) వెదజల్లబడతాయి. ఈ విత్తనాలు వాటి అంకుర వికాస కాలానికి ఎదురుచూస్తూ ఉంటాయి. (These seeds of suns in back ground space once again await the day of their germination)

(మనం ఎరుగున్న సూర్యుడు కాక ఇలాంటి వాళ్ళు ఇంకా నలుగురు ఉంటారు. ఈ ఐదుగురు సూర్యులను చిన్న సూర్యులు(Junior suns) అంటారు. ఈ ఐదుగురూ కాక ఇంకా ఏడుగురు పెద్ద సూర్యులు(Senior suns) ఉంటారు. ఈ ఏడుగురు ఎవరో కాదు. సప్తర్షి మండలం లోని ఏడు నక్షత్రాలే. ఖగోళ శాస్త్రంలో ఈ మండలాన్ని, The great bear అనీ Ursa major అనీ అంటారు. ఈ ఏడు నక్షత్రాలు చిన్న సూర్యులైన ఐదుగురికి శిక్షణ ఇస్తూ ఉంటాయి. ఈ రెండు వర్గాలకు చెందిన మొత్తం 12 సూర్యుళ్ళు కలసి ఇంకొక కేంద్రం చుట్టూ తిరుగుతూ ఉంటారు. ఇంకా వీటి గురించి పూర్తి వివరాలు

కావాలంటే, A. బెయిలీ' వ్రాసిన 'Esoteric Astrology' పుస్తకం చదువుకోండి. వీటికి సంబంధించిన మరి కొన్ని వివరాలు 'అరుణమ్' లో కూడా ఉంటాయి. మా గురుదేవులు వ్రాసిన 'సుపర్ణ సూక్తం' లో గూడా ఉంటాయి.

సూర్య వీత్తనాలు వెదజల్లబడటానికి నేపథ్యంలో ఉన్న చోటును 'పరాకాశం' అంటారు. ఇటువంటి పరాకాశాన్ని ధ్యానం చేత మాత్రమే దర్శించగలిగి, అవగాహన చేసుకోవలసినదే గాని ఇతరత్రా సాధ్యం కాదు. ఈ ధ్యానంలో కూడా – మనకు తోచే సమాధానాలు అనే బిరడా పెట్టి, సోడాబుడ్డిని కొట్టినట్లు కొట్టగూడదు. పూర్తిగా స్వేచ్ఛగా వదిలేస్తే అసలు తత్త్వం దర్శనమౌతుంది. అప్పుడు – మన కన్నులో ఏ భాగమైతే చూస్తుందో అది ఈ చోటే అని, అలాగే, మన హృదయంలో ఏ భాగమైతే 'లబ్, డబ్' అని కొట్టుకుంటూ కదులుతుందో అదీ ఈచోటే, – అని అవగతమౌతుంది. (Empty space in our eye is the real eye and the empty space in our heart in the real heart).

(ఒక వస్తువు చూడబడుతున్నపుడు – ఆ చూడబడే వస్తువు చూచే శక్తిలా మారి, చూచేవాడిలోకి లీనమౌతుందన్నమాట ! ఇలా జరగడాన్నే 'వెలుగు' అన్నారు. ఇలా జరుగుతుందని తెలియుదా అంటే – 'తెలియుదు' అని అనడం కాదు తెలుసుకోవాలి. దీన్ని ఎరిగి ఉండటమే 'వెలగడం' అని అర్థం చేసుకోవాలి. అంటే – ఈ ప్రక్రియల్లో వస్తువు శక్తిగాను, శక్తి చోటు గాను తారుమారౌతాయన్నమాట !

ఇలా వస్తువు శక్తిగా, ఆ శక్తి మళ్ళీ వస్తువుగా (వస్తువు<=> శక్తి) మారే శ్రుతిబద్ధమైన పాటను 'సామ' అన్నారు. 'ఏతస్సామగాయన్నాస్తే హాఉ, హాఉ, హాఉ .....' అని తైత్తిరీయం భృగువల్లిలో చెప్పబడుతుంది).

హృదయంలోని చోటునే దహరాకాశం, లేదా సూక్ష్మంగా 'దభ్రం' అంటారు. 'దభ్రం విపాపం' అని దహరం గురించి మహానారాయణమ్ లోని ఒక మంత్రంలో వస్తుంది. అంటే – 'మనలో పాపం అంటని ప్రదేశం ఈ దహరాకాశం' – అని ఈ మంత్ర భాగానికి అర్థం. గదిని ఎంత పాడుచేసినా ఆ గదిలోని చోటుకు 'కలరావ్యాధి' రాదు అన్నట్లుగా ఈ 'దభ్రం వి పాపం' అన్న మంత్రాన్ని అర్థం చేసుకోవాలి.

చోటులోని ఒక వస్తువు ఇంకొక చోటుకు వెళ్ళాలంటే 'స్థానభ్రంశం'(Displacement) అవసరం. కాని ఈ చోటులోని ఒక చోటు ఉండే ప్రజ్ఞకు ఇంకొక చోటు ఉండే ప్రజ్ఞకు మధ్య ఇలాంటి స్థాన భ్రంశం అవసరం లేదు. ఎక్కడ ప్రజ్ఞ అక్కడే ఉండి కూడా రెంటికీ మధ్య ప్రసారాన్ని సాధించవచ్చును.

మనలోని ఆకాశానికి బయట ఆకాశానికి ధ్యానం ద్వారా సంధానం(Link) లేదా శ్రుతి (Tuning) ఏర్పాటు చేసుకుంటే – అలసట రాదు. తీసుకునే ఆహార పరిమాణం (మోతాదు) తగ్గినా నీరసం, నిస్సత్తువ రావు. ఎన్ని పనులైనా చెయ్యవచ్చును. మాస్టర్ సి.వి.వి. గారు ఈ విషయంలో ప్రత్యేక కృషి (Specialize) చేసారు. 'Plenty of Prana' అనే మంత్రాన్ని ఆధారం చేసుకుని తన లోపలి ఆకాశానికి బయట ఆకాశానికి ఈ సంధానాన్ని (Link) ఏర్పాటు చేసుకోమన్నారు. ఇది ఏర్పాటైతే బయట ఆకాశంలోంచి సూటిగా (Direct) మనకు ఆహారం వస్తుంది. పరాకాశానికి (Back ground space) మనలోని దహరాకాశాన్ని సంధాన పరచగల మంత్రపదమే'Plenty of Prana'.

(ఆయుర్దాయం ఉన్నంత కాలం ఈ దేహం తిన్నగా నడిచేందుకు ఇటువంటి మంత్రాలెన్నైనా ఉపయోగపడతాయి కాని – ఆయుర్దాయాన్ని పెంచేవి కావు. పెంచగలిగేవే అయితే ఈ మంత్రం ఇచ్చిన సి.వి.వి. గారు ఇప్పటి దాకా భౌతికంగా ఉండకలిగే వారే కదా ! ఈ విషయం ఆయనే వారి శ్రీమతితో గూడా 'చందూ' విషయంలో చెప్తారు).

మహానారాయణంలో చెప్పబడిన 'పరమేవ్యోమన్ ప్రతిష్ఠితా' మంత్రంప్రకారం కూడా అమ్మవారు పరాకాశ స్వరూపమే !

నేపథ్య ఆకాశ రూపముగా ఉన్నది – అని ఈ నామానికి అర్థం.

## 783. ప్రాణదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రాణదాయైనమః' అని చెప్పాలి.

ప్రాణ = ప్రాణములను, దా = ఇచ్చునది.

మందులు ప్రాణాలను ఇవ్వలేవు. పోబోయే ముందు ఎంత విలువైన మందులను ఎన్ని దేహంలోకి ఎక్కించినా ప్రాణశక్తి (Vital body) తిరిగి మన వైపుకే వాటిని త్రిప్పికొడుతుంది (Expels)

ఈ దేహంలో నిరంతరం అశనములు(Organic) – అనశనములు (Inorganic) గాను, అనశనములు అశనములుగాను మారుతూ ఉంటాయి. (సాశనానశనే అభి - పురుష సూక్తం) నిరంతరం జరిగే ఈ మార్పుల వల్ల – 'దేహం' పెరుగుతుంది కాని, 'దేహి' (జీవి) పెరగడు. ఈ జీవి పుట్టినప్పటి నుండి పోయేంతవరకు గూడా పెరుగుదలా తరుగుదలా లేకుండా ఒకలాగే ఉంటాడు. ప్రాణ, అపానాల మధ్య; అశన, అనశనాల మధ్య జరిగే ద్విగతి స్పందనను ఆంగ్లంలో Double Pulsation అంటారు. 'ప్రాణశక్తి'ని 'ప్రాణాగ్ని' అంటారు. ఆయుర్వేదంలో 'పాచకాగ్ని' అంటే పచనం చేసేది(The fire of Metabolism) అనీ, 'రేచకాగ్ని' అంటే బయటకు నెట్టేది(The fire of excretion) అనే ద్వంద్వ పదాలతో చెబుతారు. అంగముల యందు 'నిహితం' అంటే – 'ఉంచబడినదాన్ని' 'అగ్ని' అంటారు. గర్భంలో ఉన్న జీవిని మొట్ట మొదటగా మేల్కొల్పింప చేసేది ఈ అగ్నియే! ఈ విధంగా మనలో పనిచేసే ప్రాణశక్తిని ఇచ్చేది అమ్మవారే కాబట్టి, అమ్మవారు 'ప్రాణదా'!

ప్రాణాలను ఇచ్చునది – అని ఈ నామానికి అర్థం.

## 784. ప్రాణరూపిణీ

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రాణరూపిణ్యై నమః' అని చెప్పాలి.

ప్రాణ = ప్రాణముల యొక్క, రూపిణీ = రూపముగా ఉండునది.

జీవదేహ సంబంధం – ప్రాణాలతోనే సంధానం కావింపబడి ఉంటుంది. ప్రాణాలు తిన్నగా పనిచేస్తున్నంత వరకే జీవ దేహ సంబంధం తిన్నగా ఉండి, జీవి తన దేహంతో ఈ ప్రపంచంలో జీవిస్తాడు. లేకపోతే దేహాన్ని విడిచి తన దోవన తాను పోతాడు.

ప్రాణాలు ఐదుగా చెబుతారు. వీటినే పంచ ప్రాణాలు అంటారు. వీటినే పంచ వ్యాహృతులుగా – ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానముగా గూడా చెబుతారు.

1) దేన్నైనా స్వీకరించే శక్తిని గాని, ఆకర్షించే శక్తిని గాని 'ప్రాణము' అంటారు. 2) దేన్నైనా వికర్షించే శక్తి ని గాని విసర్జించే శక్తి ని గాని 'అపానము' అంటారు. 3) శరీరంలోపలకు తిన్నగా వ్యాపింప గలిగే శక్తిని 'వ్యానము' (వి + అనం) అంటారు. 4) శరీరం నుండి బయటకు పనిచేసే శక్తిని 'ఉదానం' అంటారు. 5) బయట వాటికి – శరీరం లోపల వాటికి మధ్య సమన్వయాన్ని కలిగి తిన్నగా నిలబడేట్లు చేసే శక్తిని 'సమానము' అంటారు. (వీటి గురించి శాస్త్రపరమైన పూర్తి వివరాలు కావాలంటే నేను వ్రాసిన తైత్తిరీయోపనిషత్తు చదవండి) ఈ విధమైన ఐదు రకాల ప్రాణశక్తుల రూపంలోను మనలో అమ్మవారు ఉండి మనలను తిన్నగా నడిపిస్తుంది.

ప్రతి జీవిలోనూ ప్రాణరూపముగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 785. మార్తాండ భైరవారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మార్తాండ భైరవారాధ్యాయై నమః' అని చెప్పాలి.

మార్తాండ భైరవ = మార్తాండ భైరవునిచే, ఆరాధ్యా = ఆరాధింపబడునది. భైరవులు ఎనిమిది మంది ఉంటారు. ఈ భైరవుల వివరాలు ద్వితీయభాగంలోని అనుబంధంలోను, 'మహాభైరవ పూజితా' అన్న 231 నామంలోను ఇవ్వబడ్డాయి. అంతేకాదు. ఈ భైరవుల గురించి మరికొన్నివిశేషాలు 276 నామం అయిన 'భైరవీ' అనే నామ వివరణలో కూడా ఇవ్వబడినాయి.

ఎనిమిది మంది భైరవుల సమష్టి రూపాన్ని 'మహాభైరవుడు' గా అర్థం చేసుకోవచ్చును. ఆదిత్య మండలంలో మధ్యన ఉండే నారాయణుణ్ణే 'మహాభైరవుడు' అంటారు. మహాభైరవుడు – అమ్మవారిని చక్కగా ఆరాధించి, అమ్మవారి అనుగ్రహం వలన సూర్య తేజస్సును పొందాడు. అప్పటి నుండే మార్తాండ భైరవుడనే నామంతో

పిలవబడ్డాడు. ఈ మార్తాండ భైరవునిచే ఆరాధింపబడింది కాబట్టి – అమ్మవారు, 'మార్తాండ భైరవారాధ్యా'.

ప్రథమ భాగ అనుబంధంలో శ్రీమన్నగర వర్ణనలో చెప్పబడినట్లు ఇరువది రెండవ ఆవరణానికి దేవత ఈ మార్తాండ భైరవుడే! ఈ మార్తాండ భైరవుడు తన ఇద్దరు భార్యలైన చక్షుష్మతీ, ఛాయాదేవిలతో కలసి అమ్మవారిని ఆరాధిస్తాడు.

ఉచ్ఛ్వాస నిశ్వాసలకు, మనం పలుకుదామన్న ఇచ్ఛకు మధ్య ఉన్నవారే భైరవులు. మనం పలకబోయే మాటకు ఉత్పత్తి కేంద్రంగా ఉండే వాడు మార్తాండ భైరవుడైతే, వాక్కులాగా బయటకు వచ్చేవాళ్ళు భైరవులు అవుతారు. అందుకే భైరవులకు సమష్టి రూపం మార్తాండ భైరవుడౌతాడు. ఈ మార్తాండ భైరవ మంత్రానికి ''సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే సఏకః' అనేవి మూలమంత్రాలుగా తైత్తిరీయంలో చెప్పబడతాయి. గ్రామాల్లో ఈ మంత్ర ఉపాసన చేస్తే – త్వరితంగా వ్యాపించే అంటు వ్యాధులు, తరుణ వ్యాధులు త్వర త్వరగా దూరమై గ్రామ ప్రజలు కాపాడబడతారు. ఈ ఉపాసనలో తెల్లజిల్లేడు, ఉమ్మెత్తల వాడకం కూడా ఉంటుంది. ఉమ్మెత్త (ఉన్మత్త) మానసిక రుగ్మతలను కూడా పోగొడుతుంది. (ఈ విషయం 276 నామ వివరణలో విపులంగా చెప్పబడినది).

'మార్తాండభైరవునిచే ఆరాధింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 786. మంత్రిణీన్యస్తరాజ్యధూః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మంత్రిణీన్యస్తరాజ్య ధురేనమః' అని చెప్పాలి.

మంత్రిణీ = మంత్రిణి అయిన శ్యామలాదేవి యందు, న్యస్త = ఉంచబడిన రాజ్యధూః= రాజ్యభారము కలది.

అమ్మవారికి 16 మంది మంత్రిణులుంటారు. వీరి పేర్లు ప్రథమ భాగ అనుబంధంలో ఇవ్వబడినాయి. ఈ పదహారు మంది మంత్రిణులలో అతి ముఖ్యురాలు శ్యామలాదేవి. విశ్వసామ్రాజ్య పరిపాలనా బాధ్యతలను అమ్మవారు ఈశ్యామలాదేవి మీద

ఉంచుతుంది. శ్యామాలా దేవి - కృష్ణ (లేదా విష్ణు) సంబంధమైన దేవి. (శ్రీ కృష్ణః శ్యామలాదేవి శ్రీరామోలలితాంబికా) విష్ణువు జగత్పోషక కారుడు కాబట్టి, అమ్మవారు రాజ్యాన్ని - విష్ణు సంబంధమైన శ్యామలాదేవికి అప్పచెప్పింది.

'మంత్రి' అనే పుంలింగ శబ్దానికి 'మంత్రిణీ' అనేది స్త్రీలింగ పదం. మంత్రములో సలహా ఇచ్చేవాణ్ణి 'మంత్రి' అంటారు. మంత్రాన్ని ఉచ్చరించడానికి లోపల సంకల్పంగా పనిచేస్తూ మన చేత' ఓం - సోహం - ర్ - నాదం' మొదలైనవాటి ఉచ్చారణ సహకారంతో మాటలను పలికించేది, ఆలోచనలను కలుగ చేయునది కూడా కాబట్టి - శ్యామల - మంత్రిణి అయింది.

'మంత్రిణి అయిన శ్యామలాదేవి యందు ఉంచబడిన రాజ్యభారము కలది' అని ఈ నామానికి అర్థం.

## 787. త్రిపురేశీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిపురేశ్వర్యైనమః' అని చెప్పాలి.

త్రిపురా = మూడు పురములకు, ఈశీ = అధినాథురాలు.

ప్రతి జీవి మూడురకాలైన దేహాలను కలిగి ఉంటాడు. 1) స్థూలదేహం 2) సూక్ష్మదేహం 3) కారణ దేహం. ఈ దేహాలు జీవుడు ఉండే స్థావరాలు కాబట్టి వీటిని 'పురములు' అని కూడా అంటారు. ఈ మూడు పురాలకు ప్రభ్వీ కాబట్టి అమ్మవారు - త్రిపురేశీ.

వెలువడబోయే వాక్కు మూడు స్థాయిల్లో ఉంటుంది అవి - తార, మధ్యమ, మంద్రము. వీటని కూడా మూడు పురాలంటారు. వాక్కును పుట్టించేది, వాక్కు అయేది, ఉచ్చరించేది - అంతా వాగ్దేవే కాబట్టి ఆ వాగ్దేవి 'త్రిపురేశి' అవుతుంది. ఈ మూడు పురాల ద్వారా వ్యక్తమయే వాగ్దేవి రూపంలో ఉండేది అమ్మవారే కాబట్టి - ఈ అర్థంలో కూడా అమ్మవారు 'త్రిపురేశీ'. దీన్నే 'త్రిషధస్థా' అంటారు. ఈ మూడు స్థాయిలు వరుసగా కంఠం నుండి, హృదయం నుండి, నాభి నుండి వ్యక్తమయే వాక్కుల్లో ఉంటాయి.

కల్మషాలను తొలగించేందుకు మన నాదలోకంలో పనిచేస్తున్న త్రిపురేశ్వరిని 'త్రిపురభైరవి' అంటారు. ఈ నాదోపాసనలో ఆనందానుభూతి, అభయ, వరదాను గ్రహాల్ని ప్రసాదించేటప్పుడు 'త్రిపురసుందరి' అవుతుంది. ఈ మూడు పురాలకు అంతఃపురం ఒకటుంది. దాన్నే 'అంతఃస్మితం' అంటారు. అందుకే - త్రిపురసుందరిని 'అంతస్మితోల్లసిత మిందు కళావతంసం' అని కూడా అంటారు. ఈ తార, మధ్యమ, మంద్ర స్వరాలు - దివ్య ప్రజ్ఞ, మానవ ప్రజ్ఞ, అంతఃప్రజ్ఞలను కదిలిస్తాయి. ఇవి ప్రాతః సంధ్య, మాధ్యాహ్నిక సంధ్య, సాయంసంధ్యా కాలాలను కూడా సూచిస్తాయి.

మూడు పురములుగా చెప్పబడువాటికి ప్రభ్వీ - అని ఈ నామానికి అర్థం.

## 788. జయత్సేనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జయత్సేనాయైనమః' అని చెప్పాలి.

జయత్ = జయించుచున్న, సేనా = సేనలు గలది.

సృష్టి ఉన్నంతకాలం అమ్మవారిదే జయం. ఈ జయాన్ని చేకూర్చే సేనలు అమ్మవారికి పుష్కలంగా ఉన్నాయి. అన్ని రకాల ఘర్షణలలోను మంచికి, ధర్మానికి, న్యాయానికి, జయం చేకూర్చే విధంగా ఈ సేనలు అమ్మవారికి ఉపకరిస్తాయి.

మనిషి జీవితంలో జయం రావాలంటే అటు - తమోగుణమూ పనికిరాదు. ఇటు - రజోగుణమూ పనికిరాదు. సత్త్వగుణమే వర్తించాలి. ఈ సత్త్వగుణం అగ్రగణ్యుడైన వంటవాని చేత (Expert cook) వండబడిన వంటలాంటిది. వండిన వంటకంలోని వివిధ పదార్థాలు (Constituents) గుర్తుకు వస్తూ ఉండేట్లుగా ఉంటే 'వంట తగలబడ్డది' అని అర్థం. కేవలం వంటకం రుచి మాత్రమే ఉంటే'Success' అని అర్థం. సరిగ్గా మన జీవితం గూడా - మన లోని అన్ని భాగాలు పదార్థాలు విడివిడిగా ఎప్పటికప్పుడు గుర్తుకు వస్తూ, మన ఆలోచనలకు పనులకు అడ్డు వస్తున్నట్లు ఉంటే - మనకు మరణం ఆసన్న మౌతోంది అని అర్థం. ఇవన్నీ గుర్తుకు రాకుండా నిరంతరానందస్థితిలో మనిషి గానే ఉంటే సత్త్వగుణంలో జీవిస్తున్నామని అర్థం.

ఒక వేళ ఎప్పుడైనా పొరపాటున మన వల్ల తప్పు జరిగితే, ఎప్పుడూ ఆ తప్పుడు పనే గుర్తుకు వస్తూ ఉంటే – అది సత్త్వగుణ జీవితం అవదు. అయితే – చేసిన తప్పుకు పశ్చాత్తాపం పడరాదా అంటే – పశ్చాత్తాపం వల్ల, జరిమానాల వల్ల – సమస్య పరిష్కారం కాదు. జరిమానాలు చెల్లించే అవకాశం కనుక ఉంటే చేయబోయే తప్పుడు పనులకు కూడా హెచ్చు మొత్తంలో ముందే జరిమానాలు కట్టి తప్పుడు పనులకు మార్గాన్ని సుగమం చేసుకుంటాం. 'అయితే ఏం చెయ్యాలి ?' అంటే –

చేసిన పనికి పశ్చాత్తాప పడుతూ మళ్ళీ మళ్ళీ ఆ తప్పుడు పనులను తలవడం కంటే, జరిమానాలు కట్టడం కంటే – మళ్ళీ ఎప్పుడూ అలా తప్పుడు పని చెయ్యకుండా ఉండటమే నిజమైన పరిష్కారం అవుతుంది. చేసిన చెడ్డ పనిని స్మరించడం కంటె చెయ్యబోయే ఇంకొక మంచి పనిమీద బుద్ధిని పెట్టడం, మనస్సును ప్రసరింపచెయ్యడం మంచిది. ఈ విధంగా గడిపిన జీవితం 'సత్త్వగుణజీవితం' అవుతుంది. ఇటువంటి ప్రవృత్తి వల్ల జీవితంలో జయము, మాధుర్యమే తప్ప ఓటమి, దుఃఖము ఉండవు. ఈ విధమైన జీవితాన్ని పొందాలన్నా, మనలో జయాన్ని చేకూర్చే సత్త్వగుణ జ్ఞాన సంపర్క భావాలను పొందాలన్నా అమ్మవారి ఈ నామాన్ని 'జయత్సేనాయైనమః' అని సంపుటి చేసి జపించాలి.

1) జయించు సేనలు గలది.

2) 'జయమును చేకూర్చు వివిధ జ్ఞాన సంపర్క భావములు కలుగ చేయునది' – అని ఈ నామానికి అర్థాలు.

## 789. నిస్త్రైగుణ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిస్త్రైగుణ్యాయైనమః' అని చెప్పాలి.

నిస్త్రై గుణ్యా = త్రిగుణరహితమైనది లేదా త్రిగుణములు అంటనిది.

సృష్టి అంతా త్రిగుణ సమ్మి శ్రమే ! సృష్టికి స్వరూపమే అయినా అమ్మవారు ఆ త్రిగుణాలేమీ అంటనిదే ! భగవద్గీతలో కూడా భగవానుడు 'త్రైగుణ్య విషయావేదా ; నిస్త్రై గుణ్యో, భవార్జున' అని అర్జునునికి ఉపదేశం చేశాడు (2-45).

వేదాల్లో చెప్పబడిన కర్మకాండ అంతా త్రిగుణ సంబంధమైనదే అయినా, కర్మలు ఆచరిస్తూ కూడా నీవు మాత్రం ఆ త్రిగుణాలకు అతీతంగా ఉండాలి' అని దీని అర్థం. అంటే ఈ ఉపదేశాన్ని - 'నీళ్ళలోనే ప్రయాణం చేస్తూ ఉన్నప్పటికీ - పడవలోకి నీళ్ళు ఎక్కకుండా పడవ ప్రయాణం సాగేట్టు చూసుకో' అన్నట్లుగా అర్థం చేసుకోవాలి.

హోమియోపతీవైద్యంలో - ఇచ్చేవి పంచదార మాత్రలే అయినా - ఆ మాత్రలు వేసుకుంటే పంచదార ప్రమేయం లేకుండా రోగం కుదురుతుంది. అలాగే, త్రిగుణాలతోనే కర్మలు ముడిపడి ఉన్నా - ఆ త్రిగుణాలంటకుండా కర్మఫలాలు పొందవచ్చు. పూర్తిగా త్రిగుణాత్మకమైన యావత్ సృష్టినీ చేసినా' - ఆ త్రిగుణాలేమీ అమ్మవారికి అంటవు - అని ఈ నామం చెబుతుంది.

త్రిగుణములు అంటనిది - అని ఈ నామానికి అర్థం.

## 790. పరాపరా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరాపరాయైనమః' అని చెప్పాలి.

పరా = పరబ్రహ్మ పరమైనటువంటి, అపరా = ప్రపంచపరమైనటువంటి - సమన్వయ రూపము.

ఈ నామంలోని 'పరా', 'అపరా' పదాలకు రకరకాల అర్థాలున్నాయి.

1) పరా - అంటే - పరబ్రహ్మపరమైన సూత్ర ధారిత్వము.

'అపరా' అంటే - ఆ సూత్ర ప్రకారం నడిచే ప్రపంచము. ఈరెంటి యొక్క సమన్వయ స్వరూపము.

2) పర - అంటే - పరలోకం, అపర = ఇహలోకం.

3) పర = అంటే ఇతరులు, అపర = కావలసినవారు.

4) పర - అంటే శత్రువులు, అపర = శత్రువులు కానివారు.

5) పర - అధికమైన, అపర = అధమమైన.

6) పరా - మూలమైన పరావాక్కు, అపరా = ఇతర స్థితులలోని వాక్కులు.

జీవులను నడిపే పరాప్రకృతికి సంబంధించిన చైతన్యము యొక్క దేహంతో జీవులుగా వ్యక్తమయేందుకు కావలసిన పంచభూతమనో బుద్ధి అహంకారాదులతో కూడిన అష్ట ప్రకృతుల యొక్క - సమన్వయ స్వరూపమే అమ్మవారు - అని ఈ నామం చెబుతుంది.

జీవుడు - జీవునికి సంబంధించినవి; అంటే - మనం - మన ఇల్లు; మనం - మన ఉద్యోగం; మనం - మన ఆస్తిపాస్తులు; ఇలా జంటగా ఉన్నవాటిలో మొదటిది పరా, రెండవది అపరా అవుతాయి. ఈ రెంటి యొక్క సమన్వయ స్వరూపము అమ్మవారిది.

పరాపర తత్త్వ సమన్వయ స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 791. సత్యజ్ఞానానందరూపా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యజ్ఞానానందరూపాయైనమః' అని చెప్పాలి.

సత్య = సత్యమును, జ్ఞాన = జ్ఞానమును, ఆనంద = ఆనందమును, రూపా = రూపముగా గలిగినది.

ఏ కాలంలో అయినా, ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏ మాత్రం మార్పులేకుండా ఒకే విధంగా అస్తిత్వాన్ని కలిగి ఉన్న దాన్ని 'సత్యం' అంటారు. అలాగే లోటుపాట్లు, లొసుగులు, చేర్పులు, మార్పులు, కూర్పులు అవసరం లేని, స్వయం ప్రబోధక, స్వయం ప్రచోదిత, స్వయం ప్రకాశబుద్ధి వికాసమే అసలైన జ్ఞానం. అలాగే - సర్వము నందు సమానమైన ప్రేమ కల్గి, సర్వ కాల సర్వావస్థల యందు ఏమి జరిగినా పొంగిపోవడం, క్రుంగిపోవడం లేకుండా నిరంతరం సంతోషంగా ఉండటమే పరమోత్కృష్టమైన ఆనందం. ఇటువంటి సత్య, జ్ఞాన ఆనందాలను తన రూపంగా కలిగినది అమ్మవారు. వాస్తవానికి

ఈ నామ సారాంశం ఒక్కటే - విశ్లేషణాత్మకంగా విడివిడిగా కనిపించే విభాగాల మధ్య సంయోగాత్మక దృష్టిని ఏర్పరచుకోవాలి - అని. అప్పుడే అమ్మవారి సామరస్య లక్షణం, - ఈ సృష్టికి, సృష్టికారిణికీ మధ్య ఉన్న సంబంధం అర్థమౌతాయి. ఈ విధంగా అర్థం చేసుకుంటూ ఉంటే - చిట్టచివరకు అమ్మవారికి, అయ్యవారికి మధ్య ఉన్న సామరస్యం - అర్థమౌతుంది. ఇద్దరిలోను ఎక్కువ తక్కువలు, హెచ్చుతగ్గులు లేని అభేదత్వం గోచరిస్తుంది. ఈ దృష్టి అద్వైత శుద్ధికి, ధ్యానఫలసిద్ధికి దారితీస్తుంది.

1) సమరసత్వము నందు ఆసక్తి కలది.

2) సదాశివునితో సమరసత్వము కలది - అని ఈ నామానికి అర్థం.

## 793. కపర్దినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కపర్దిన్యైనమః' అని చెప్పాలి.

కపర్దినీ = జటాజూటమును ధరించునది.

కం - పృదయతీతి - ఇతి 'కపర్ద'. అని కపర్ది పదానికి నిరుక్తార్థం. ప్రతివారికీ ఎవరి అభిప్రాయాలు వారి వారి బుఱ్ఱల్లో ఉంటాయి. బుఱ్ఱల్లోని ఈ అభిప్రాయాల కట్టనే 'కపర్దం' (జటాజూటం) అంటారు. అయితే అమ్మవారికి - అభిప్రాయాలను సూచించే ఈ జటాజూటం ఉంటుంది కాని, అది చిక్కులు పడి ఉండదు. మనకి గూడా అభిప్రాయాలు - అనే జుట్టు ఉంటుంది కాని అది చిక్కులు పడి ఉంటుంది. ఆ చిక్కులు విడగొట్టుకోటానికి చేసేవే యోగాలు, ప్రాయశ్చిత్తాలు, క్రతువులు, కర్మకాండలూను.

1) కపర్దము కలిగినది - అనగా జటాజూటము కలిగినది.

2) కపర్ది (శివుని) యొక్క శక్తిస్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 794. కళామలా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళామాలాయైనమః' అని చెప్పాలి.

కళ = కళలను, మాలా = మాలగా ధరించినది.

'కళ' అంటే అంశము, లేదా - 'విభాగము' అని సాధారణ అర్థం. ఈ 'కళ' అనే పదం చంద్రుని విషయంలోను, లలితకళల విషయంలోను వాడుతూ ఉంటాము. అమ్మవారు చంద్ర సంబంధమైనది కాబట్టి 'కళ' అనే పదాన్ని చంద్రసంబంధమైనదిగా అర్థం చెప్పకుంటే - చంద్రునికి ఉన్న పదహారు కళలను మాలగా ధరించినది అని అర్థం చెప్పుకోవాలి. అంటే అమ్మవారు షోడశకళాప్రపూర్ణ.

'కళ' అనే పదాన్ని లలిత కళల పరంగా అర్థం చెప్పుకుంటే లలిత కళలు 64 ఉంటాయి. కాబట్టి - '64 లలితకళలను మాలగా ధరించునది' అనే అర్థంచెప్పుకోవాలి.

'కళ' అంటే విభాగం అన్నారు కదా అని 'కళ'కు 'శకలం' అనే పదం అర్థం చెప్పుకోకూడదు. కుండబ్రద్దలయితే ఏర్పడే ముక్కలు కుండ యొక్క విభాగాలే అయినా అవి సమాన పరిమాణాల్లో ఉండవు. వాటి మధ్య ఒక స్పష్టమైన సంబంధం కూడా ఉండదు. అందుచేత ఈ కుండ పెంకుల్ని 'శకలాలు' అనాలి.

పళ్ళెంలో మైసూరు పాకును కత్తితో ముక్కలుగా కోసినపుడు ఏర్పడే భాగాలు గూడా విభాగాలే కాని - ఇవి కుండబ్రద్దలైతే ఏర్పడే పెంకుల్లాంటివి కావు. ఈ ముక్కలు అన్నీ సమానపరిమాణాల్లో ఒక నిర్దిష్టమైన ఆకారాల్లో, ఒక స్పష్టవ పద్ధతిలో కోయబడి ఉంటాయి. కాబట్టి, వీటిని 'శకలాలు' అని కాకుండా - 'కళలు' అని అనవచ్చును.

15 తిథులలోని చంద్రుని వెన్నెలకు సంబంధించిన విభాగాలు కూడా ఇలాగే ఒక నిర్దిష్ట పద్ధతిలో ఉంటాయి కాబట్టి వాటిని 'కళలు' అన్నారు.

16 తిథులకు చెందిన 16 నిత్యాదేవతలుంటారు. (ప్రథమ భాగంలో ఈ నిత్యాదేవతల పేర్లు తెలుపబడ్డాయి). ఈ పదహారు నిత్యాదేవతలచే నిత్యమూ

ఆరాధింపబడేది కాబట్టి - అమ్మవారు వాటిని మాలగా ధరించినట్లుగా ఈ నామంలో ఉత్ప్రేక్షించబడింది.

64 విద్యాకళలు, 64 వృత్తికళలు, సూర్యకళలు, అగ్నికళలు, మొదలైన వన్నిటినీ అమ్మవారు మాలగా ధరించినట్లుగా ఉత్ప్రేక్షించబడినట్లు ఈ నామాన్ని అర్థం చేసుకోవాలి.

వివిధ కళలను మాలగా ధరించినది - అని ఈ నామానికి అర్థం.

## 795. కామధుక్

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామధుహేనమః' అని చెప్పాలి.

కామ = కోరికలను, ధుక్ = పిండి ఇచ్చునది.

ఈ నామంలో అమ్మవారిని వ్యాసుల వారు కామధేనువుతో పోల్చారు. కామధేనువుకు నాలుగు పొదుగులుంటాయి. ఈ నాలిగింటి ద్వారా అందరికీ క్షీరం పిదికి ఇచ్చినట్లు కావలసినవి ప్రసాదిస్తుంది. అమ్మవారికి కూడా నాలుగు చేతులుంటాయి. ఈ నాలుగు చేతులతో భక్తులకు కావలసినవి ప్రసాదిస్తుంది అని అర్థం.

వాక్కును కూడా కామధేనువుతో పోలుస్తారు. ఈ వాక్కుకు పరా పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని నాలుగు స్థితులుంటాయి. ఈ నాలుగు స్థితులలోని వాక్కులను నాలుగు పొదుగులతో పోల్చి సరస్వతీ సూక్తంలో

'దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవోవదన్తి

సానోమంద్రేషమూర్జం దుహానా ధేనుః వాగస్మాను పతుష్టుతైతు'.

అని చెప్పారు. కాబట్టి కామధేనువు నాలుగు పొదుగుల ద్వారా క్షీరాన్ని ఇచ్చునట్లు- నాలుగు స్థితులలో ఉండే వాక్కును మన ద్వారా వ్యక్తము చేయునది - అని ఈ నామాన్ని అర్థం చేసుకోవచ్చును.

ఈశ్వరుడు విశ్వం నిండా నిండి ఉన్నప్పటికీ (ఈశావాస్య మిదం సర్వం)

అవ్యక్తంగానే ఉంటాడు. అంటే – కనబడకుండానే ఉంటాడు. ఆవులోనే పాలు అవ్యక్తంగా ఉన్నా – పొదుగు ద్వారా పిండితే ఎలా వ్యక్తమౌతాయో, అలాగే – విశ్వం నిండా శివుడు నిండి ఉన్నా – సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారి ద్వారానే ఆ శివుని రూపం వ్యక్తమవుతుంది. భక్తులకు ఆ కాముని రూపం ఇవ్వబడుతుంది, అంటే – సాక్షాత్కరింపబడుతుంది – అనే అర్థం కూడా ఈ 'కామధుక్' నామంలో నిగూఢంగా ఉన్నదనుకోవచ్చును.

1) (భక్తుల) కోర్కెలను పిదుకునది అనగా తీర్చునది.

2) కామధేనువు నాలుగు పొదుగుల నుండి క్షీరాన్ని ఇచ్చినట్లు నాలుగు స్థితులలో ఉండు వాక్కులను మన ద్వారా వ్యక్తము చేయునది.

3) విశ్వం నిండా అవ్యక్తంగా నిండి ఉన్న కాముణ్ణి (శివుణ్ణి) భక్తులకు సాక్షాత్కరింప చేయునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 796. కామరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామరూపిణ్యై నమః' అని చెప్పాలి.

కామా = కోరిక, లేదా – కోరుకున్న, రూపిణీ = రూపముగా వ్యక్తము కాగలది.

నిర్గుణుడు, నిరాకారుడు అయిన శివుణ్ణి ఒక రూపంలో చూడాలంటే సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారి ద్వారానే సాధ్యం. ఎందుకంటే నిరాకారుడైన శివునికి వ్యక్తరూపం అమ్మవారే కాబట్టి – అమ్మవారిని – 'పురమథితుః ఆహోపురుషికా' అన్నారు ఆదిశంకరులు సౌందర్యలహరిలో. అంటే 'శివుని అహంకార స్వరూపమైన అమ్మవారు' అని దీని అర్థం.

'కామ' అంటే – 'కోరినటువంటి' – లేదా 'కోరుకున్నటువంటి' అని అర్థం చెప్పుకుంటే – ఏ రూపంలో దర్శించాలని మనం కోరుకుంటే ఆ రూపంలో వ్యక్తం కాగలది. అందుకని కామరూపిణీ. అలాగే – 'తాను ఏ రూపంలో వ్యక్తం కావాలనుకున్నా ఆ రూపంలో వ్యక్తం కాగలది' అని అర్థం చెప్పవచ్చును.

ఎదుటి వారిని ఏ విధంగా ఊహిస్తే ఆ విధంగానే వాళ్ళు మనకు కనబడేలా చెయ్యకలదు అమ్మవారు. ఎదుటివారు ఒకే వ్యక్తి అయినా – భార్య చూస్తే భర్తలాగాను, తల్లి చూస్తే కొడుకులాగాను, చెల్లెలు చూస్తే అన్నలాగాను, కొడుకు చూస్తే తండ్రిలాగాను, ఆఫీసరు చూస్తే తన క్రింద పనిచేసే ఉద్యోగస్థుడు గాను – ఇలా ఎవరు ఏ దృష్టితో చూస్తే ఆ దృష్టితో – ఒకే వ్యక్తి ఇన్ని రకాలుగాను కనబడేట్లు చేసేది అమ్మవారే!

వామనుడు బలిచక్రవర్తిని మూడు అడుగులు అంటే – మూడు కొలతలు (పొడుగు, వెడల్పు, ఎత్తు) మాత్రమే అడిగినా – ఈ మూడు కొలతలలోనే మొత్తం విశ్వం యొక్క పరిమాణం ఇమిడి ఉంది కాబట్టి – మొత్తం విశ్వాన్ని తన మూడు అడుగులతో ఆక్రమించేశాడు. అలాగే, అమ్మవారు ఈ విశ్వమంతా నిండి ఉంటుంది. అలాంటప్పుడు ఎక్కడ ఎవరికి ఏ రూపంలో వ్యక్తమవ్వాలన్నా ఆవిడకు వీలుగానే ఉంటుంది.

ప్రతివారిలోను ఉండే చిన్న చిన్న కోర్కెల దగ్గర నుండి – మహాకామేశ్వరుని కోరే కోర్కె రూపం దాకా వివిధ కోర్కెల రూపంలో కనబడి భక్తులను అనుగ్రహించ గలిగేది అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

1) శివుని రూపములో ఉండునది.

2) కోరిన లేదా కోరుకున్న రూపముతో ఉండునది.

3) ఎదుటివారిని ఏ విధంగా ఊహిస్తే ఆ విధంగానే వారు కనబడేట్లు చేయకలది.

4) ప్రతివారిలోను ఉండే చిన్న చిన్న కోర్కెల రూపాల దగ్గర నుండి మహాకామేశ్వరుని కోరే కోర్కె రూపందాకా కనబడి భక్తులను అనుగ్రహించ కలిగేది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 797. కళానిధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళానిధయే నమః' అని చెప్పాలి.

కళా = కళలకు, నిధిః = గని లేదా సముద్రము వంటిది.

'కళ' అనే పదంతో వచ్చే పూర్వ నామాల్లో చెప్పిన వివిధ కళలకు గని వంటిది. ప్రసన్నమైన వెన్నెలలు విరజిమ్మే చంద్రుణ్ణి తన ముఖంగా కలిగినది కాబట్టి – అమ్మవారు కళానిధిః

శ్రీ విద్యకు సంబంధించినంత వరకు ముఖ్యమైన కళలు రెండు. 1) శబ్ద గ్రహణము లేక = శ్రుతి విద్య 2) రూప గ్రహణము లేదా క్రతు విద్య. శబ్ద గ్రహణానికి అవసరమయే – ఉచ్చారణ, శ్రవణము అనే రెండు భాగాల్లో, ఉచ్చారణకు సంబంధించిన – వేదాలు, ఛందస్సులు, అక్షరాలు, శబ్దాలు, అర్థాలు, ఉదాత్త అనుదాత్త స్వరిత స్వరాలు, పరాపశ్యంతీ, మధ్యమావైఖరీ వాక్కులు, సప్తవిభక్తులు, భాషా భాగాలు – ఇక శ్రవణానికి సంబంధించిన – మనన, నిధి, ధ్యాస, టీక, తాత్పర్య, భావ, విభావ, అనుభావ, సంచారీ భావాలు, ఆలంబన, ఉద్దీపన, సాత్విక భావాలు – ఇవన్నీ కళలే ! ఇలాంటి వన్నీ ఏక ముఖానికి వస్తే ఉండే స్థాయీ భావంలో మనం ఉంటే – రసస్థితిలో ఉంటాం. ఈ రసస్థితి సర్వకళలకు ధ్యేయమైన స్థితి. ఈ రసస్థితిని కలుగచేసే కళలకు అమ్మవారు నిధి. (జగన్నాథ పండితులు వ్రాసిన 'రసగంగాధరం', ఆనంద వర్ధనుడు వ్రాసిన 'ధ్వన్యాలోకం' గ్రంథాలు చదువుకుంటే ఈ స్థాయీ భావ విశేషాలు తెలుస్తాయి.)

1) వివిధ కళలకు నిధి వంటిది.

2) చంద్రుని రూపముగా ఉండునది.

3) రసస్థితిని కలుగజేయు శ్రీ విద్యా కళలకు నిధి వంటిది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 798. కావ్యకళా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కావ్యకళాయై నమః' అని చెప్పాలి.

కావ్యకళా = నాటకాది కావ్యకళా స్వరూపిణి.

వేదాలు, పురాణాలు, కావ్యాలు ఇవన్నీ కూడా విద్యా కళల క్రిందకే వస్తాయి. రామాయణాది ఇతి హాసాలు, అభిజ్ఞాన శాకుంతలము మొదలగు నాటకాలు,

రఘువంశాది గ్రంథాలు మొదలైనవన్నీ కావ్యాల క్రిందకే వస్తాయి. వీటి కళాస్వరూపం కూడా అమ్మవారే! అందుకే 613వ నామంలో 'కావ్యాలోపవినోదినీ' అని అమ్మవారు చెప్పబడింది. (ఈ నామ వివరణ తృతీయ భాగంలో చదువుకోండి).

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దాలున్న ఏ గ్రంథమైనా కావ్యం క్రిందకే వస్తుంది' - అని జగన్నాథ పండితులంటారు.

ఈ కావ్యాలన్నీ అభిదార్థ, లక్షణార్థ, వ్యంగ్యార్థ, వేదార్థ, రహస్యార్థ ప్రతిపాదకంగా ఉంటాయి కాబట్టి వీటిని చదువుతున్నపుడు కళాత్మంగానే ఆనందించ వచ్చును. ఈ ఆనందాన్ని కలిగించేది కాబట్టి అమ్మవారు 'కావ్యకళా'.

కావ్యకళాస్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 799. రసజ్ఞా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రసజ్ఞాయై నమః' అని చెప్పాలి.

రస = నవరసములు , జ్ఞా = తెలిసినది.

'రసోవైసః రసగ్గ్ హ్యేవానందోభవతి' – అని తైత్తిరీయం.

పరబ్రహ్మ రస స్వరూపుడు కాబట్టి, అమ్మవారు 'పరబ్రహ్మ జ్ఞానము కలది' - అని ఈ నామానికి అర్థం. లేదా అమ్మవారు 'రస స్వరూపురాలు' అని కూడా అర్థం చెప్పవచ్చును.

రసాలు తొమ్మిదిగా ఆలంకారికులు చెబుతారు. కావ్యాల్లో రస పోషణ ప్రధానమైంది. రసజ్ఞానం లేకపోతే ఎటువంటి కావ్యమైనా చప్పగా ఉంటుంది. అందుకే – 'జయంతి తే రససిద్ధిః కవీశ్వరాః' అన్నారు. అమ్మవారికి నవరసాల గురించి సైద్ధాంతిక జ్ఞానమే కాదు నవరసాలు అభినయించ గల నటనా కౌశలం కూడా ఉంది. సౌందర్యలహరిలోని – 'శివేశృంగారార్ద్రా, తదితర జనే కుత్సనపరా.... 'తే మయిదృష్టిస్సకరుణా' అన్న 51వ శ్లోకంలో అమ్మవారు నవరసాలను ఏ విధంగా అభినయించగలదో ఆదిశంకరులు ప్రత్యేకంగా చెప్పారు.

రఘువంశాది గ్రంథాలు మొదలైనవన్నీ కావ్యాల క్రిందకే వస్తాయి. వీటి కళాస్వరూపం కూడా అమ్మవారే! అందుకే 613వ నామంలో 'కావ్యాలోపవినోదినీ' అని అమ్మవారు చెప్పబడింది. (ఈ నామ వివరణ తృతీయ భాగంలో చదువుకోండి).

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దాలున్న ఏ గ్రంథమైనా కావ్యం క్రిందకే వస్తుంది' - అని జగన్నాథ పండితులంటారు.

ఈ కావ్యాలన్నీ అభిదార్థ, లక్షణార్థ, వ్యంగ్యార్థ, వేదార్థ, రహస్యార్థ ప్రతిపాదకంగా ఉంటాయి కాబట్టి వీటిని చదువుతున్నపుడు కళాత్మంగానే ఆనందించవచ్చును. ఈ ఆనందాన్ని కలిగించేది కాబట్టి అమ్మవారు 'కావ్యకళా'.

కావ్యకళాస్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 799. రసజ్ఞా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రసజ్ఞాయై నమః' అని చెప్పాలి.

రస = నవరసములు , జ్ఞా = తెలిసినది.

'రసోవైసః రసగ్గ్ హ్యేవానందోభవతి' – అని తైత్తిరీయం.

పరబ్రహ్మ రస స్వరూపుడు కాబట్టి, అమ్మవారు 'పరబ్రహ్మ జ్ఞానము కలది' - అని ఈ నామానికి అర్థం. లేదా అమ్మవారు 'రస స్వరూపురాలు' అని కూడా అర్థం చెప్పవచ్చును.

రసాలు తొమ్మిదిగా ఆలంకారికులు చెబుతారు. కావ్యాల్లో రస పోషణ ప్రధానమైంది. రసజ్ఞానం లేకపోతే ఎటువంటి కావ్యమైనా చప్పగా ఉంటుంది. అందుకే – 'జయంతి తే రససిద్ధిః కవీశ్వరాః' అన్నారు. అమ్మవారికి నవరసాల గురించి సైద్ధాంతిక జ్ఞానమే కాదు నవరసాలు అభినయించ గల నటనా కౌశలం కూడా ఉంది. సౌందర్యలహరిలోని – 'శివేశృంగారార్ద్రా, తదితర జనే కుత్సనపరా.... 'తే మయిదృష్టిస్సకరుణా' అన్న 51వ శ్లోకంలో అమ్మవారు నవరసాలను ఏ విధంగా అభినయించగలదో ఆదిశంకరులు ప్రత్యేకంగా చెప్పారు.

సర్వతత్త్వములతో పూర్ణముగా పోషింపబడినది కాబట్టి అమ్మవారు 'పుష్టా' అంటే - భౌతికంగా కనబడే పంచభూతాత్మకమైన దేహం, ఇంద్రియాలు, ధాతువులు, అభిప్రాయాలు, అనుభూతి, ఆనందం ఇలా అన్నిటిలోను నిండి ఉన్న సృష్టి స్వరూపిణి కాబట్టి అమ్మవారు 'పుష్టా'.

'పుష్' అంటే పోషించు(to nourish) అని అర్థం.

సృష్టిలో పరిపూర్ణంగా సర్వతత్త్వాలతో పోషింపబడేదే కాకుండా సృష్టిలో ఎవరిక్కావలసినవి వాళ్ళకు ఏర్పాటు చేసి పరిపూర్ణంగా పోషించేది కూడా కాబట్టి అమ్మవారు 'పుష్టా'.

1) సర్వతత్త్వములతో పూర్ణముగా పోషింపబడునది.

2) సృష్టిని పరిపూర్ణముగా పోషించునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 802. పురాతనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పురాతనాయైనమః' అని చెప్పాలి.

పురాతనా = అన్నిటికీ ముందు ఉన్నది.

సృష్టి స్వరూపిణి అమ్మవారు. ఈ సృష్టి వ్యక్తమవడానికి వెనుక ఉన్న నేపథ్యం అయ్యవారు. (సినిమాల్లో బొమ్మలు అమ్మవారైతే ఆ బొమ్మలు పడే తెర అయ్యవారు అన్నట్లు) అయితే - అయ్యవారిలోంచి అమ్మవారు వస్తూ పోతూ ఉంటుంది కాబట్టి - అయ్యవారు, అమ్మవారు అని వేర్వేరుగా చెప్పాల్సి వచ్చింది గాని లేకపోతే నిజానికి ఇద్దరూ ఒక్కటే ! వీళ్ళిద్దరికీ ముందెవరూ లేరు. వీళ్ళలో ఒకరు ముందు ఒకరు వెనుక అని కూడా లేదు. ఇద్దరూ ఆది నుండి కలసి ఉంటున్నారని గీతలో 'ప్రకృతిం పురుషం చైవ విద్ధి అనాదీఉభావపి' (13-20) అని గూడా చెప్పబడింది కాబట్టి - అమ్మవారు అన్నిటి కన్న ముందున్నది.

('ఈ సృష్టి ఎప్పటి నుండి ? అని ఎవరైనా ప్రశ్నవేస్తే - ఈ ప్రశ్న వేసేవాడు పుట్టిన తర్వాత - ఈ ప్రశ్న పుట్టింది గాని - ఈ సృష్టి మాత్రం ఈ ప్రశ్న వేసేవాడు పుట్టక ముందు నుండే ఉంది.)

అన్నిటి కన్న ముందు ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 803. పూజ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పూజ్యాయైనమః' అని చెప్పాలి.

పూజ్యా = పూజింపతగినది.

సృష్టికి ఆదిగాను, సృష్టి, స్థితి, లయకారిణి గాను ఉండే అమ్మవారు సర్వుల చేత పూజనీయురాలే అవుతుంది.

దేనిని, ఎవరిని, ఎక్కడ, ఎప్పుడు చూచినా పూజ్యభావమే కలిగితే అమ్మవారిని పూజించినట్లే ! ఈ నామంకూడా 'నామపారాయణ ప్రీతా' నామంలాంటిదే ! మనం సాధనా మార్గంలో ఉంటే - ఇటువంటి నామాల్లో అమ్మవారి విశేషలక్షణాలకంటే మన విద్యుక్త ధర్మం గురించే ఎక్కువ చెప్పుకోవాలి.

'భగవదనుగ్రహం మనకు ఎప్పుడు ఎలా సంక్రమిస్తుంది' అన్నది తెలిసి ఏదన్నా చేస్తే - భగవంతుణ్ణి మన ప్రణాళికలకు, నియమనిబంధనలకు సూత్రాలకు ఇరకబెట్టినట్లే! దేవుడలా ఇరకబడడు కాబట్టి - వచ్చినా అది అనుగ్రహం అవదు. అందుకని ఆ అనుగ్రహం వచ్చినపుడు 'టైం' వచ్చినట్లు లెక్కవేసుకోవాలి గాని - 'అనుగ్రహం ఎప్పుడు వస్తుంది' అని టైం అడగకూడదు. ధ్రువుడు తన తండ్రి తొడను కోరితేనే 'హరిపదం' వస్తే - ఇక చుట్టూ ఉన్న వ్యక్తుల్ని ఆరాధిస్తే ఇంకెంతంటిది వస్తుందో ? అనే విధంగా మన ఆలోచన, సాధన సాగాలి.

సర్వుల చేత పూజింప తగినది - అని ఈ నామానికి అర్థం.

## 804. పుష్కరా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుష్కరాయైనమః' అని చెప్పాలి.

పుష్కరా = పోషణ కలుగ చేయునది.

'పుష్' అంటే పోషించు (To Nourish) అని అర్థం కాబట్టి 'పుష్కరా' అంటే, పోషించు స్వభావం కలది - అని ఒక అర్థం.

'పుష్కరమనే పేరుగల ఒక దివ్య తీర్థ రూపముగా చెల్లునది' అని మరో అర్థం.

ముహూర్తములందు లగ్నాల లెక్కలలో అత్యుత్తమ కాలావధిని పుష్కర లగ్నం అంటారు. 'అటువంటి పుష్కర కాల స్వరూపిణి' అని ఇంకో అర్థం.

బృహస్పతి రాశి చక్రాన్ని పన్నెండు సంవత్సరాలలో చుట్టి వస్తాడు. ఈ దేవ గురువుకు సంబంధించిన ఈ బృహస్పతి గ్రహ పరిభ్రమణ కాలాన్ని పుష్కర కాలం అంటారు. ఈ పుష్కర కాల రూపంలో ఉండునది అని మరో అర్థం.

'పుష్కరా' అంటే మెట్ట తామర పువ్వు అని కూడా అర్థం ఉంది. ఈ మెట్ట తామర అతి త్వరితంగా పిలకలు వేసుకుంటూ పెరగుతూ చుట్టు ప్రక్కలకు వ్యాపిస్తుంది. సరిగ్గా సృష్టి ప్రకియ కూడా ఇదే విధంగా జరుగుతూ ఉంటుంది. ఇటువంటి సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారిని 'పుష్కరా' అన్నారు. ఈ విధంగా ఎన్నో అర్థాలు ఈ నామానికి చెప్పవచ్చును.

## 805. పుష్కరేక్షణా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుష్కరేక్షణాయైనమః' అని చెప్పాలి.

పుష్కరా = పోషణాత్మకమైన లేదా పుష్టికరమైన, ఈక్షణా = చూపులు కలది.

పోషణాత్మకమైన, లేదా పుష్టికరమైన లక్షణాన్ని అమ్మవారు తన కన్నులలో ప్రసరింపచేస్తుంది. అప్పుడప్పుడు మన ద్వారా గూడా అమ్మవారు ఈ రకమైన చూపులు కలుగచేసి ఇతరులపై ప్రసరింప చేయవచ్చు. అంటే - మనుష్యులందరి ద్వారా గూడా అమ్మవారు ప్రసరింపగలదు. మనద్వారా గూడానా ? అని ఎవ్వరూ ఆశ్చర్య పడక్కరలేదు. అందరినీ అమ్మవారు ఉపయోగించుకోవచ్చును. మధ్యలో మనం భయపడడం, బిడయబడటం అనవసరం.

(అన్ని ప్లగ్‌ల ద్వారా విద్యుత్తు ప్రసరించడానికి అవకాశం ఉంది. ఏదైనా ఒక ప్లగ్ - 'నేను క్షుద్రుణ్ణి నా ద్వారా విద్యుత్తు ప్రసరించడమేమిటి ?' అని అనుకుంటే ఎలా అర్థం లేదో - అలాగే, మనిషి అయినా నా ద్వారా అమ్మవారు ప్రసరించగలదా ? అని అనుకున్నా అంతే !

పోషణాత్మకమైన, పుష్టికరమైన చూపులు గలది - అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 806. పరంజ్యోతిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరంజ్యోతిషే నమః' అని చెప్పాలి.

పరం = పరమ ఉత్కృష్టమైన, జ్యోతిః = స్వయం ప్రకాశ స్వరూపిణి.

ముందు నామంలో చెప్పిన స్థితిలో మన ద్వారా అమ్మవారు ప్రసరించే సాధనా మార్గంలో మనం ఉండి, అమ్మవారికి పూర్తిగా శరణాగతి చెందితే - మనందరి వెనుక ఉన్న ఆ పరంజ్యోతి స్వరూపం కనబడుతుంది. అంటే - మనలో ఉన్న సాపేక్షకత అంతా (Relativity) విచ్చుకుని, నిరపేక్షకతలో (Absolute) లీనమైన స్థితిలో ఈ పరంజ్యోతి అనుభూతి కలుగుతుందన్నమాట !

'ఇటుపైన ఏమున్నది ?' అన్న ప్రశ్న మనలో ఎప్పుడు నశిస్తుందో - ఆ స్థితిలో మనలో ఉన్న వెలుగు 'పరంజ్యోతి' మనం చదువుకున్న కొలదీ ఏ విషయంలో అయినా 'షరతులు' పెంచుకుంటాము. అప్పుడు మనకు 'విషయం గురించి' మాత్రమే తెలుస్తుంది

కాని, ఆ విషయం 'సూటిగా' (Direct) తెలియదు. అప్పుడు దాని చుట్టూ తిరుగుతాము తప్ప దానిలోకి ప్రవేశించలేము. అసలైన అనుభూతిని పొందలేము. విత్తనం నుండి చెట్టు, చెట్టునుండి విత్తనం – అనే పూర్తి చక్రభ్రమణ మార్గం తెలిసినపుడు – ఈ పరంజ్యోతి తెలిసినట్లే! కాని, 'విత్తనం ముందా చెట్టు ముందా' అని ప్రశ్నవేస్తే వాడికి ఈ పరం జ్యోతి దర్శన మివ్వదు.

ఈ పరంజ్యోతిని దర్శించడానికి ఎక్కడకో వెళ్ళక్కర్లేకుండా, మనలోనే ఈ పరంజ్యోతిని ఆత్మజ్యోతిగా దర్శించుకునే స్థితికి కూడ మనం ఎదగాలి.

పరమ ఉత్కృష్టమైన స్వయం ప్రకాశ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 807. పరంధామా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరంధామ్నే నమః' అని చెప్పాలి.

పరం = పరమోత్కృష్టమైన, ధామం = మార్గము.

'ధామం' అంటే 'మార్గం' అనే కాకుండా 'వెలుగు' అని కూడా అర్థం ఉంది. పరంజ్యోతికి మార్గమే పరంధామం. ఏది ఉంటే మార్గం కనబడుతుందో – అదే నిజమైన ధామం. మథనపడే వాణ్ణి చూస్తున్నపుడు – ఆ బాధ పడేవాడికి నొప్పి తగ్గాలి అనేది మనలో ఎంత కలుగుతూ ఉంటుందో అంతగా – వాడికి బాధ తగ్గుతూ ఉంటుంది. 'తగ్గడం దేనికి ? అనే రాక్షసుడు మనలో పుట్టకుండా ఉన్నంతవరకు ఇది పని చేస్తూ ఉంటుంది, పరంధామం గోచరిస్తూ ఉంటుంది.

ఒక చోట వెలిగేది 'జ్యోతి' అయితే – దాన్ని చూపేది 'ధామం' అవుతుంది. పరమాణువు నుండి పరాత్పరుని (పరమాత్మ) దాకా ఉన్న దాన్నే 'పరంధామం' అంటారు. అంటే – ఇంతకు పూర్వం చెప్పుకున్న రెండు నామాలు – ఇక రాబోయే రెండు నామాల వరుసలోను 'పరంధామం' ఇమిడి ఉంది. అదే ఈ నామాల వరుసలోని ఔచిత్యం.

(ఈ నామాల స్తోత్రం వెయ్యి పోస్టల్ స్టాంపులున్న కాగితంలాంటిది కాదు. ఈ స్తోత్రం – అమ్మవారి చిత్రం ఉన్న పెద్ద కాగితం లాంటిది. నామాలన్నీ ఆ పెద్ద కాగితం యొక్క ముక్కలు లాంటివి. ఒక ముక్కకి ఇంకొక ముక్కకి సంబంధము, సమన్వయము ఉంటుంది.)

ఈ పరంధామమే – 'పరమపదం'. ఇది ఒక తురీయస్థితిలాంటిది. ఏ స్థితికి చేరితే తిరిగి మళ్ళీ పాతస్థితులు ఉండవో – ఆ స్థితిని 'పరాస్థితి' అంటారు. (యద్గత్వాన నివర్తంతే తద్ధామపరమం మమ) ఆ పరాస్థితిని పరమ పదమని – దీన్ని చేరే మార్గాన్నే 'పరంధామం' అనీ అంటారు.

పరమోత్కృష్టమైన మార్గము – అని ఈ నామానికి అర్థం.

## 808. పరమాణుః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమాణవేనమః' అని చెప్పాలి.

పరమాణుః = అత్యంత సూక్ష్మపరిమాణము గలది.

వివిధ పరిమాణాల్లో ఉండే వస్తు జీవ గ్రహతారకాదులతో ఉండేదే ఈ విశ్వం. (అణోరణీయాన్ మహతోమహీయాన్) అటువంటి విశ్వంలో అన్ని వస్తువులు, పదార్థాలు, వ్యక్తులు, గ్రహాలు తారకలూ, సర్వమూ ఏ సూక్ష్మాతి సూక్ష్మమైన కణాలతో రూపొందింపబడతాయో అటువంటి సూక్ష్మాతి సూక్ష్మమైన కణమే పరమాణువు (Atom). ఈ పరమాణువులో పరమాణు పరిమాణంలో – వృక్షమనే విశ్వానికి విత్తనంలాగా ఉండి విస్తరిల్లింది కాబట్టి – అమ్మవారు 'పరమాణుః', అంటే, పరంజ్యోతి – పరంధామమును పొందడానికి మొదట పరమాణువుగా రూపొందుతోందన్నమాట!

చిన్న సామాన్లతో పెద్ద సామాన్లు తయారు చేస్తారు అనుకోవడం ఎంత సత్యమో – పరమాణువులు కలసి అణువులు, అణువు కలసి మూలకాలు (Elements). ఆ మూలకాలతో పదార్థాలు తయారవుతున్నాయనుకోడం అంతే సత్యం ! అన్నీ చోటులోంచే పుడతాయి. ఏ ఆకారంలో అయినా 'పుట్టక పూర్వం ఎలా పుడతాయి'

అనుకోవచ్చు. గాని, పుట్టిన తరువాత ఇలా పుడతాయి అని తెలుసుకుంటాము. అన్నిటి కన్నా చిన్న పరమాణువు 'నేను' అన్నదే ! ఈ 'నేను' అనే పరమాణువులోనే బ్రహ్మ, విష్ణు, రుద్ర సమన్వయాత్మకమైన ప్రోటాన్, న్యూట్రాన్, ఎలక్ట్రాన్ ప్రాథమిక కణాల సముచ్చయం ఉంటుంది.

అత్యంత సూక్ష్మమైన పరిమాణముగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 809. పరాత్పరా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరాత్పరాయైనమః' అని చెప్పాలి.

పరంజ్యోతిని చేరడానికి ఉండే పరంధామంలోని మెట్లు(Steps) – మనకంటె పరమైనవి, ఆ పరం కంటె పరమైనవి. ఒక దాని కంటె ఇంకొకటి, ఒక దాని మీద ఒకటి, ఒక దానిపైన ఇంకొకటి లాగా – సాధనా పురోభివృద్ధిలో వచ్చే స్థితులలాంటివి – ఈ మెట్లు.

దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారము, మహత్తు, పరబ్రహ్మ – ఇవి ఒకరకముగా ఒక దానిపైన ఒకటి ఉండే మెట్లే !

మనకంటె గొప్పవారు దేవతలు. దేవతల కంటె గొప్పవారు త్రిమూర్తులు. త్రిమూర్తులకంటె గొప్పది అమ్మవారు. అందుకని అమ్మవారు పరాత్పరా.

బ్రహ్మ ఆయుష్కాలమైన 'పరాకాలానికి' కూడా పైన అతీతంగా ఉండేది కాబట్టి అమ్మవారు 'పరాత్పరా'.

1) మనకంటే, పరమైన వాటిలో అత్యుత్తమ మైన స్థితిలోనిది.

2) దేవతల కంటే త్రిమూర్తుల కంటే గూడా గొప్పది.

3) బ్రహ్మ ఆయుష్కాలానికి గూడా పైన అతీతంగా ఉండేది.

## 810. పాశహస్తా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పాశహస్తాయైనమః' అని చెప్పాలి.

పాశ = పాశమును, హస్తా = హస్తమునందు ధరించునది.

పరాత్పరా మార్గంలో లేని వారిని పై స్థితులలోనికి(Next higher steps) లాగడం కోసం ఈ పాశం ఉపయోగిస్తుంది. తన బిడ్డల మీద ఉండే అనురాగము వల్లనే ఈ పాశాన్ని వారి విషయంలో ఉపయోగిస్తుంది. అందుకనే అమ్మవారు 'రాగ స్వరూప పాశాఢ్యా' అని చెప్పబడింది. (ఈ 'రాగ స్వరూపపాశాఢ్యా' నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి).

1) పాశమును హస్తమునందు ధరించునది.

2) భక్తుల పాశమును తన చేత నిల్పునది – అని ఈ నామానికి అర్థాలు.

## 811. పాశహంత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పాశహంత్ర్యైనమః'' అని చెప్పాలి.

పాశ = పాశమును, హంత్రీ = ఛేదించునది.

మనం బ్రతికి నన్నాళ్లూ మన ప్రజ్ఞకు చుట్టూ ఆకృతిగా ఈ పాశం ఏర్పాటు చేసి, చనిపోగానే దాన్ని లాగేసేది – అని ఈ 'పాశహస్తా', 'పాశహంత్రీ' నామాలను అర్థం చేసుకోవచ్చును.

## 812. పరమంత్రవిభేదినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమంత్ర విభేదిన్యైనమః' అని చెప్పాలి.

పర = ఇతరులు, లేదా - శత్రుబుద్ధి కలవారు చేయు, మంత్ర = అభిచార ప్రయోగాలు, ఇతర దుష్టమంత్రాలను, విభేదినీ = నిర్మూలించునది.

ప్రపంచంలో సన్మార్గులూ ఉంటారు, వీరితో పాటు దుర్మార్గులూ ఉంటారు. దుర్మార్గుల మార్గానికి సన్మార్గులు కూడా ఇబ్బంది పడుతూఉంటారు. ఒక్కొక్కప్పుడు (కొందరు క్షుద్రమంత్రోపాసనలు చేసి అభిచారములను (చేతబడులు, చిళ్ళంగి, బాణామతి మొదలైనవి) సన్మార్గులపై ప్రయోగించవచ్చు). సన్మార్గులను రక్షించే అమ్మవారు కాబట్టి - ఆ దుష్టమంత్రాలను పనిచెయ్యకుండా నిర్మూలించి తన భక్తులైన ఆ సన్మార్గులను రక్షిస్తుంది.

మన సాధనకు సంబంధించిన ఇంకో అర్థం ఈ నామంలో ఉంద. 'పర' అంటే 'శత్రువులు' అనే కాకుండా 'పర' అంటే 'ఇతరులు' అని కూడా అర్థం. మనందరం సాధారణంగా మనకు కావలసిన వాళ్ళని, నచ్చినవాళ్ళని (జాతిరీత్యా గాని, మతరీత్యాగాని, వర్ణ రీత్యాగాని, కులంలో మళ్ళీ శాఖ, ఉపశాఖల రీత్యాగాని) 'మన వాళ్ళు' అని చెప్పుకుంటాం. ఇలా మనవాళ్లు కాని వారందఱూ మన దృష్టిలో పరాయివాళ్లే! వాళ్లనే 'పరులు' అంటాము. ఇలా అన్ని విషయాల్లోను ఈ 'పర' అనే భావాన్ని వర్తింప చేసి నిత్యం ఉదయం లేచిన దగ్గర నుండి పడుకోబోయే వరకు ఈ 'పర' అనే పదాన్ని మంత్రంగా జపిస్తూ ఉంటాము. ఇలా నిత్యమూ జపించే ఈ 'పరమంత్రాన్ని' జగత్తులోని అందరికీ తల్లి అయిన అమ్మవారు ఛేదిస్తుంది. అంటే, మనకు 'అన్యము' అనే భావం రాకుండా 'పరులు' అనే భావం రాకుండా - ప్రపంచంలోని అందరినీ, అందరి దేవతలను, అందరి గురువులను సమదృష్టితో అంటే - పరగురువులు, పరదైవాలు, పరమంత్రాలు, అంటే - ఇతర మార్గాల గురువులు, ఇతర మార్గాల వారి దైవాలు, ఇతర మార్గాల వారి మంత్రాలు అనే భేదం లేకుండా - అందరినీ, అన్నిటినీ సమదృష్టితో చూడగలగడం నేర్పుతుంది. (నాకు అలా నేర్పింది కాబట్టి చెప్పగలుగుతున్నాను. ఇలా ఉండడం లౌక్యాన్ని, బ్రతుకనేర్చే గుణాన్నీ తెలుపుతుందనుకుంటే నేనేమీ చెప్పలేను - అలా అనుకున్నవారిని చూచి జాలిపడటం తప్ప! - వివరణ కర్త). ఈ సమదర్శిత్వం ఉంటేనే జ్ఞానం పరిపక్వస్థితికి వచ్చినట్లు లెక్క! (విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని - శునిచైవ స్వపాకేచ పండితాః సమదర్శినః - గీత) ('శివ స్మరణం చేయడం విభూతి, బొట్టును ధరించడం తప్పనుకునే వైష్ణవులకు, వైష్ణవ పీఠాధిపతులకు; 'నారాయణ' స్మరణ చెయ్యడం నామాలను పెట్టుకోవడం తప్పనుకునే శైవులకు, పీఠాధిపతులకూ గూడా ఈ విషయం వర్తిస్తుంది - వివరణ కర్త).

మనలో జాగ్రత్త పడడం ఉండవచ్చు గాని, భయపడడం ఉండకూడదు. కాని మనం ఈ 'జాగ్రత్త పడటం' అనే దాన్ని 'భయంగా' తీసుకుంటాము. జంతువుకైతే 'భయపడటం' రక్షణకు కారణమౌతుంది. కాని – మనుష్యులకు ఈ 'భయం' అజ్ఞానానికి దారితీసి, పురోభివృద్ధి లేకుండా చేస్తుంది. కాని జ్ఞానోదయం కలిగిన వారికి – ఈ అభిచార ప్రయోగాలు, చేతబడులు మొదలైనవి అన్నీ అసూయతోను, అజ్ఞాన బుద్ధితోను చేసేవే అని తెలుస్తుంది శక్తుల్ని చెప్పుచేతల్లో పెట్టుకోగలిగామని చెప్పుకోడం కోసమే అని తెలుస్తుంది.

1) పరుల చేత భక్తులపై ప్రయోగింపబడు దుష్టమంత్రాదులను నిర్మూలించునది.

2) 'పరులు' 'పరాయివాళ్ళు' అనే అన్య దృష్టితో నిత్యం జపం చేసేవారి ఆ 'పరమంత్రాన్ని ఛేదించి వారికి 'అనన్య దృష్టి' ఏర్పడునట్లు చేయునది.

3) దొంగ త్రోవలు తొక్కే బుద్ధిని విభేదనం చేసేది– అని ఈ నామానికి అర్థాలు.

## 813. మూర్తా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మూర్తాయైనమః' అని చెప్పాలి.

మూర్తా = మూర్తి కలిగినది, అనగా రూపము కలిగినది.

పంచ భూతాత్మకమైన పరమాత్మ స్వరూపమే అమ్మవారు. మిగిలిన అన్నిటినీ ఎలా అయితే చూడకలుగుతున్నామో అలాగే అమ్మవారిని కూడా భౌతిక రూపంగా చూడవచ్చు.

ఈ భౌతికరూప వర్ణనే లలితాస్తోత్రంలో మొదటి నామాల్లో ఉంది. సౌందర్యలహరిలో ఆదిశంకరులు కూడా – 'క్వణత్ కాంచీదామా'... అన్న 7వ శ్లోకంలో ఇచ్చారు.

రూపమును గలిగి యున్నది – అని ఈ నామానికి అర్థం.

# 814. అమూర్తా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అమూర్తాయైనమః' అని చెప్పాలి.

అమూర్తా = అనగా మూర్తి లేనిది, రూపము లేనిది.

వాస్తవానికి ముందు నామం ఈ నామం కలిపి చెప్పుకుంటేనే మనకు బాగా అర్థమవుతుంది.

సృష్టిమొత్తం మీద – 'రూపం కలది', 'రూపం లేనిది' – అనే రెండు లక్షణాలూ చెల్లేది ఒకటుంది. దాని నుండి రకరకాల రూపాలు పుడుతూ, పోతున్నాయి – ఇది బ్రహ్మ విద్యలో మొట్టమొదటి పాఠం.

''నిర్వచింపగలిగేది – నిర్వచింపలేనిది; ఆశ్రయము కలిగినది – ఆశ్రయము లేనిది; తెలియబడు జ్ఞానము – తెలియబడని జ్ఞానము; సత్యము – అసత్యము – ఇలాంటి జంట లక్షణాలు రెండూ చెల్లే తత్త్వమే ఈ పరబ్రహ్మతత్త్వము, సర్వాంతర్యామి తత్త్వము'' – అని తైత్తిరీయం బ్రహ్మవల్లిలో చెప్పబడింది. (నిరుక్తంచా నిరుక్తంచ, నిలయనంచానిలయ నంచ, విజ్ఞానంచావిజ్ఞానంచ, సత్యంచానృతంచ సత్యమభవత్) సరిగ్గా ఈ మంత్రసారాంశమే ప్రస్తుతం వివరిస్తున్న 'మూర్తా –అమూర్తా' నామాల వివరణ.

'అవినాశితు తద్విద్ధియేన సర్వమిదంతతమ్' (గీత 2-17) అని ఇదే విషయం గీతలో గూడా చెప్పబడింది.

'అజాయమానో బహుధా విజాయతే' – అని పురుష సూక్తంలో కూడా ఇదే విషయం చెప్పబడింది.

(పుట్టుక లేని వాడైనా బహువిధాలుగా పుడుతున్నాడు – అని ఈ మంత్రార్థం)

ప్రత్తి – బట్ట; మట్టి – కుండ; బంగారము – విగ్రహము, – ఇలాంటి ఉదాహరణలను సృష్టిపరంగా కూడా అన్వయించి ధ్యానం చేస్తే ఈ పై రెండు మంత్రాలకు (మూర్తా – అమూర్తా) అర్థం కుదురుతుంది. అర్థం దొరుకుతుంది.

"ఒక ప్రక్క రూపం ఉంది అంటూనే – రూపం లేదనడం పైగా ఈ రెండు లక్షణాలు కూడా ఒకరికే చెల్లుతాయనడం – 'తప్పు – రైటు' రెండూ ఒకటే అనడం లాంటిది కాదా ? తప్పును – రైటు అన్నా ఒప్పుకోవలసిందేనా ?" – అని ఎవరైనా అంటే – 'తప్పు' – 'రైటు' అనే నిర్ణయం ఎవరి ప్రకారం ? 'ఏది రైటు' ? 'ఏది తప్పు' ? అనేది ఎవరి ప్రకారం ? ఈ ప్రశ్నవేసినవారు పుట్టక ముందు నుంచీ (ఆ పుట్టిన వారు ఎంత ముందు పుట్టినాసరే!) ఉన్న తత్త్వం తాలూకు లక్షణాలుఇవి. (పుట్టడమే ఆలస్యంగా పుట్టి, అంతకు పూర్వము ఉన్నవి చెల్లవనడం ఏం సబబు ? సృష్టికి ముందే పుట్టి ఈ ప్రశ్నలు వేస్తే కాస్త సర్దుకోడానికి అవకాశం ఉండేది' అని జ్ఞానోదయం కలగాలి.)

కొందరు సగుణోపాసన, నిర్గుణోపాసన అంటూ ఉంటారు. అంటే అర్థమేమిటి? సగుణం, నిర్గుణం రెండూ ఉన్నట్లే కదా ! రెండూ ఉపాసింపబడుతున్నట్లే కదా !

వాడిది 'సకామోపాసన' అనీ, 'సగుణోపాసన' అనీ – బ్రహ్మవేత్తలు, పండితులమనుకునే వారు, నిర్గుణోపాసకులమనకునే వారు – ఏదో తేలికభావంతో హేళనగా విమర్శించకూడదు. ('గుణం' లేకపోతే ఉపసానకు అర్థం లేదని గూడా వీరు గుర్తుంచుకోవాలి). అలా అనడం వలన వాడు చేసేది తప్పు అనుకుని ఆనాటి నుండి ఏదీ చెయ్యకుండా గూడా తయారవుతాడు. అలా అవడం వల్ల వాణ్ణి కర్మ భ్రష్టుణ్ణి చేసిన వారౌతారు గూడా! అలా విమర్శించినందువల్ల, చెప్పినందువల్ల ఏమైనా ఉపకారం జరిగిందా ? – జరిగితే – అనవచ్చు, లేకపోతే అనకూడదు.

'జ్ఞాన' మనే కాగితంలో 'అజ్ఞాన' మనే పొట్లం కట్టుకుంటున్నాము. – అన్న విధంగా సృష్టికర్తని, సృష్టిని అర్థం చేసుకోవాలి.

ఒకే దారంతో అల్లబడిన ద్వారపు తెఱ (Door Curtain) మీద నెమలి, కోడి మొదలైన బొమ్మలు అల్లినపుడు ద్వారపు తెఱలోని దారానికి ఈ రూపాలు ఉన్నట్లా ? లేనట్లా ?

అలాంటి తత్త్వమే అమ్మవారిది అని ఈ రెండు నామాలు చెబుతాయి. నామరూపాత్మక ప్రపంచ మంతా మూర్తియుతమైనది. దాంట్లోని సార రూపమైన కంటికి కనవడని పరమాత్మ అమూర్తమైనది.

మూర్తా – రూపము గలది, అమూర్తా = రూపము లేనిది – అని ఈ రెండు నామాలకు అర్థాలు.

## 815. అనిత్యతృప్తా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనిత్యతృప్తాయై నమః' అని చెప్పాలి.

(ఈ నామాన్ని 'నిత్యతృప్తా' గా చెప్పుకోవచ్చు గాని – ఈ 'నిత్యతృప్తా' 566వ నామంగా ఇంతకు పూర్వమే వచ్చింది. అయినా, మళ్లీ 'నిత్యతృప్తా' నామాన్ని ముందు వివరించి తర్వాత 'అనిత్యతృప్తా' నామ వివరణను తెలియపరుస్తాను – వివరణ కర్త).

నిత్య = నిత్యము, తృప్తా = తృప్తిని కలిగి యున్నది.

కావలసినవి, పొందవలసినవి ఇంకా ఉంటే తృప్తి ఉండకపోవచ్చును. కాని, అమ్మవారికి తీరని కోరికలు, పొందవలసినవి ఏమీ ఉండవు. కాబట్టి అమ్మవారు 'నిత్యతృప్తా'.

'తృప్తిరితివృష్టౌ' అని తైత్తిరీయం చెబుతుంది. తృప్తి వృద్ధిని కలిగిస్తుంది. ఆనందాన్నిస్తుంది. తృప్తిలేకపోతే ఎంత సంపద ఉన్నా, ఎంత అందమున్నా, ఎన్ని పదవులు ఉన్నా, ఎంత ధనమున్నా – వాడు దరిద్రుని క్రిందే లెక్క. ఇన్ని ఉన్నా – వాడి మొహం లేవదు. తను తినేది మిరపకాయ, ఉల్లిపాయ; త్రాగేది గంజి మాత్రమే అయినా రిక్షా లాగేవాడు తృప్తిగా తింటూ, ఉంటూ – ఆనందంగా ఉంటాడు. మన కుటుంబ సభ్యులను 'ఓవర్ బ్రిడ్జి మీంచి గూడా రిక్షాలో కూర్చోపెట్టుకుని లాగేస్తాడు. మనం మృష్టాన్న భోజనం సుష్టుగా చేసి – ఆపిల్ పండు తిని, తాంబూలం వేసుకున్నా ఇంకా ఏదో పిండి వంట చేసుకోలేదని వెర్రిగా బాధపడతాం. ముఖంలో తృప్తి ఉండదు. ఇన్ని తిన్నా వంద గజాల దూరం నడవడానికి సిటీబస్ కోసం అరగంట నిరీక్షిస్తాం.

గీతలో సంతుష్టిని గుఱించి – 'యదృచ్ఛాలాభసంతుష్టో' అన్నాడు గీతాచార్యుడు. చెయ్యవలసిన పని చేసి – యాదృచ్ఛికంగా వచ్చిన దానికి తృప్తి చెందాలి. అంతేకాని రానిదాని కోసం, లేని దాని కోసం ఆరాటపడకూడదు. ముందు వచ్చిన దాన్ని స్వీకరిస్తే

రావలసింది అవసరమైతే తర్వాత వస్తుంది. ఇది నిత్యతృప్తి ఉన్నవారి లక్షణం. ఈ నిత్యతృప్తి ఉన్న వాళ్ళనే 'మునులు' అంటారు. (మునిర్మోక్షపరాయణః) (ఈ మునుల మనస్సులలో అమ్మవారు హంసలా విహరిస్తుందని తర్వాత రాబోయే నామంలో చెప్పబడుతుంది.)

'నిత్యమూ ఎవరి సంభాషణల వల్ల అతని చుట్టూ ఉన్నవారు ఆహ్లాదపడుతూ ఉంటారో – అతనికి అంజలి ఘటిస్తున్నాను' – అన్నాడు విష్ణుగుప్తుడనే చాణక్యుడు. (మా గురుదేవులు శ్రీమాన్ కృష్ణమాచార్యుల వారితో సంభాషణ అలాగే ఉండేది. నిత్యతృప్తి ఉన్నవారితో సంభాషణ అలాగే ఉంటుంది. శిష్యులు అనుకరించి, ఆచరించి, అనుసరించి కొనసాగించవలసినవి ఇలాంటివి కాని – గురువు నవ్వినట్లు నవ్వడం, పంచకట్టినట్టు కట్టడం, నామం పెట్టినట్లు పెట్టడం కాదు – వివరణ కర్త).

సముద్రంలోని నీరు అలలతో పైకెగిసి తుంపరలుగా మారినా, ఆ తుంపర్లల్లో ఉప్పదనం పోదు (వాసనలు పోవు) ఆ తుంపరలు ఆవిరి అవటం ప్రారంభిస్తే – ఆ ఉప్పదనం ఉండదు. నిత్యతృప్తితో ఉండే వారి మనస్సు అలా ఉంటుంది.

నిత్యమూ తృప్తిగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

అనిత్యతృప్తా :

స్తోత్ర శ్లోక పాఠంలోని 'మూర్తామూర్తా నిత్య తృప్తా నామాల వరుసను 'మూర్తా – అమూర్తా' అని, 'అనిత్యతృప్తా' అనే విధంగా కూడా విడదీసి చదవడానికి అవకాశం ఉంది. అలాంటి సందర్భంలో ఈ నామం 'నిత్యతృప్తా' బదులు 'అనిత్యతృప్తా' గా మారుతుంది. ఇంతవరకు పైన 'నిత్యతృప్తా' నామానికి వివరణ ఇవ్వడం జరిగింది. ప్రస్తుతం అనిత్యతృప్తా నామానికి వివరణ తెలుపబడుతోంది.

ఇంతకాలం నుండి ఇన్నిసార్లు సృష్టి ప్రళయాలు జరుగుతున్నా, లేదా – జరిపిస్తున్నా – అమ్మవారికి ఇంకా తృప్తి కలగలేదు. ఇక ముందు కూడా ఇలాగే కొనసాగిస్తుంది కూడా! అందుకని అమ్మవారు 'అనిత్యతృప్తా'. అయితే – 'ఇలా ఎందుకు అన్నిసార్లు' ? అని సందేహం వస్తే – "రాను రాను పరిపూర్ణ మవడం(Perfection) కోసమేనేమో ఈ ప్రక్రియను అమ్మవారు ఇలా ధారావాహికంగా మాటి మాటికీ (Repetition) కొనసాగనివ్వడం" అని సమాధానం చెప్పుకోవాల్సి వస్తుంది.

'సృష్టి బాధ్యతను' నిర్వర్తించుటలో తృప్తి పడి ఆపకుండా పరిపూర్ణత కొరకు అనిత్యతృప్తిగా కొనసాగించుచునే ఉండునది' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 816. మునిమానసహంసికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మునిమానస హంసికాయై నమః' అని చెప్పాలి.

ముని = మునుల యొక్క, మానస = మనస్సులందు విహరించు, హంసికా = ఆడుహంస.

నియమ నిష్ఠలతో ఏమీ ఆర్భాటాలు, పటాటోపాలు లేకుండా మౌనంగా ధ్యానాదులతో అమ్మవారిని ఉపాసించే వారిని 'మునులు' అంటారు. ఈ మునుల మనస్సులు నిలకడగా ఉండే సరస్సులలాగా ఉంటాయి. అటువంటి మునుల మానస సరోవరంలో ఉచ్ఛ్వాస, నిశ్వాసలనే రూపంలో ఉండే ఆడుహంసలాగా విహరిస్తూ అమ్మవారు ఉంటుంది. అందుకని అమ్మవారు – 'ముని మానసహంసికా'.

మునుల మనస్సులలో విహరించు ఆడుహంస – అని ఈ నామానికి అర్థం.

## 817. సత్యవ్రతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యవ్రతాయై నమః' అని చెప్పాలి.

సత్య = సత్యమునందు, వ్రతా = వ్రతనిష్ఠ కలది.

పరబ్రహ్మకు సంబంధించిన – సత్యం, జ్ఞానం, అనంతం – ఈ మూడు లక్షణాల్లో సత్యం – ప్రధానమైనది, ప్రథమ మైనది కూడా!

ప్రపంచంలో ఉన్నవన్నీ పరమాణువులతో రూపొందింపబడినవే! ఆ పరమాణువులు ప్రోటాన్, న్యూట్రాన్, ఎలక్ట్రాన్‌లనే ప్రాథమిక కణాలతో రూపొందింప బడి ఉంటాయి. ఈ ప్రాథమిక కణాల లక్షణాలుగాని, ధర్మాలుగాని, స్వభావాలు గాని

పూర్తిగా సత్యానికి కట్టుబడి ఉండేవే ! ఇలా ఉండగలగడం వాటి నిత్య సత్యత్వాన్ని తెలియజేస్తుంది. అలా వాటిలో సత్యస్వరూపిణి గా ఉంటుంది కాబట్టి - అమ్మవారు 'సత్యవ్రతా'.

'ఎవరైనా ఒకరు అబద్ధమాడుతున్నపుడు కూడా - తాను అబద్ధము ఆడుతున్నాననే సత్యం - ఆ క్షణంలోనే వారికి తెలియనివ్వడం' - అమ్మవారి సత్యవ్రతాన్ని తెలియజేస్తుంది.

పరా, పశ్యంతీ స్థితులలోని వాక్కుల్లో అసత్యం ఉండదు. మధ్యమా స్థితిలో మనం ఏదైనా కొంత కక్కుర్తి పడితే (Commission) అప్పుడు దాని తాలూకు వైఖరీలో అసత్యం వస్తుంది.

సత్యమును నిష్ఠగా కలిగినది - అని ఈ నామానికి అర్థం.

## 818. సత్యరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యరూపాయై నమః' అని చెప్పాలి.

సత్య = సత్యమునే, రూపా = రూపముగా గలిగినది.

'సత్' అంటే అస్తిత్వానికి సంబంధించిన ఒక శక్తి అనుకోవచ్చును. దీన్ని బట్టే అస్, స్థ, సత్ అనే ధాతువులు (Roots) వస్తాయి.

విత్తనంలో చెట్టు ఉన్న స్థితిని 'సత్యం' అంటారు. సృష్టి అంతా ప్రకృతిలో - శాశ్వతంగా అశాశ్వతం. ఎందుకంటే - సృష్టిలో అది వస్తూపోతూ ఉండేదేగాని స్థిరంగా ఉండిపోయేది కాదు కాబట్టి.

సంయోగాత్మక, విశ్లేషణాత్మక లక్షణాలు గల వాటిని సమన్వయ పరచగల బుద్ధిని, వేరు వేరుగా చూడగలిగే రెండు కళ్ళతో చూచినా - ఒకే రూపం, ఒకే బొమ్మను చూచే దృష్టిని మనకు ఇచ్చింది అమ్మవారు. 'సృష్టి అంటే ఈ విధంగా రెంటి సమన్వయము'. - అనే సత్యరూపంలో ఉండే అమ్మవారి పేరు 'సత్యరూపా'.

సత్యం అంటే బ్రహ్మ ('బ్రహ్మ సత్యం జగన్మిథ్యా') కాబట్టి సత్యరూపా అంటే - 'బ్రహ్మరూపా' అని అర్థం వస్తుంది.

1) సంయోగాత్మక, విశ్లేషణాత్మక సమన్వయ సృష్టి రూపము.

2) బ్రహ్మరూపము.

3) అస్తిత్వ మానుషరూపము - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 819. సర్వాంతర్యామినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వాంతర్యామిన్యైనమః' అని చెప్పాలి.

సర్వ = అన్నిటియందు, అంతర = లోపల ఉండి, యామినీ = నియంత్రించునది.

సమస్త వస్తు వ్యక్తి జీవ జాలంలోను - అమ్మవారే నిండి ఉన్నది. అలా అన్నిటి నిండా ఉండటమే కాదు లోపల ఉండి అన్నిటినీ విశ్వ ప్రణాళికానుసారము తిన్నగా నియంత్రిస్తుంది గూడా! అందుకే సాధకులకు అన్నిటి కన్న ముఖ్యంగా ఉండాల్సింది అనన్యభావన. అనన్యభక్తి. (భక్త్యాత్వనన్యా) ఇలాంటి అమ్మవారు ప్రతి జీవిలోను ఎక్కడ ఉంటుంది అన్నదాని కృష్ణుడా సమాధానం ఇచ్చారు. 'ఈశ్వర స్సర్వ భూతాని హృద్దేశే అర్జున తిష్ఠతి' - గీత. ప్రతి జీవి హృదయంలోను దహరాకాశంలో ఉన్నది - ఆ సర్వాంతర్యామియే! దహరాకాశంలో ఉన్నది సర్వాంతర్యామియా ? సర్వాంత ర్యామినియా అనే సందేహం వస్తే - ఇంతవరకు బ్రహ్మ విద్యాపరంగా చెప్పుకున్న వివరణ అవగాహన కాలేదన్నమాటే !

సర్వము నందు లోపల నుండి నియంత్రించునది - అని ఈ నామానికి అర్థం.

## 820. సతీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యైనమః' అని చెప్పాలి.

సతీ = ఉండునది.

ఈ విశ్వం ఇలా మనం చూస్తున్నట్లుగా సర్వ జీవ వస్తు జాలంతో కనబడటానికి మొట్టమొదట్లో 'ఉండడం' (దీనిని ఆంగ్లంలో 'Be-ness' అనే ఒక పదంగా చెప్పుకోవచ్చు) గా ఉండేది. ఆ 'ఉండటం' మార్పుచెందడం(Becoming) గా మారింది. అటుపైన ఈ జీవులు(Beings) ఉద్భవించారు. ఇలా మూడు స్థితులలోని మార్పులతో ఉద్భవించిన ఈ విశ్వానికి మొట్టమొదట్లో ఉన్న 'ఉండడం'(Be-ness) అనేదే 'సత్', ఈ శబ్ద స్త్రీలింగ పదం – 'సతీ' కాబట్టి, ప్రతి వస్తు జీవ జాలంలో 'ఉండడం' అనే సూత్రం(Principle)గా ఉన్న అమ్మవారి పేరు 'సతీ'.

మనం ఉండట మంటే – మన మనస్సరస్సులో మనం వేరేగా, – అలలు వేరుగా ఉండటం. అలలు ఉన్నంతవరకు మనస్సరస్సులో ఆ సర్వాంతర్యామిని అయిన 'సతీ' దేవి ప్రతిబింబం కూడా తిన్నగా ఉండదు.

మనమనస్సనేసరస్సులో 'మన' మంటూ వేరేగా ఒక అస్తిత్వాన్ని కలిగి ఉన్నాం – అనే అభిప్రాయాలు అలలలాటివి. ఈ అలలు ఉన్నంతవరకు మన మన స్సరస్సుల్లో ఆ సర్వాంతర్యామిని ప్రతిబింబం కూడా ఉండదు. ఈ అలల అట్టహాసం, ఆర్భాటం, ఆరంభ శూరత్వం సద్దు మణిగి, మన స్సరస్సుల్లోకి లీనమై, నిలకడ స్థితిలో మనస్సు ఉంటే – అపుడు మళ్ళీ సర్వాంతర్యామిని సుప్రతిష్ఠమై, మనలను ప్రచోదనం చేస్తుంది. ఇలా తాత్కాలికంగా స్మరణకు రాకపోయినా, శాశ్వతంగా అందరిలోను ఉండి అందరినీ నడిపించే ఆ సర్వాంత ర్యామిని పేరే 'సతీ' దేవి.

దక్షుని కూతురుగా పుట్టి, దక్షాధ్వర్యంలో పతికి జరిగిననిరాదరణను, నిందను భరించలేక యోగాగ్నిలో దేహాన్ని ఆహుతి చేసుకుని మళ్ళీ మేనకా హిమవంతుల బిడ్డగా పుట్టిన పార్వతి పూర్వజన్మలోని పేరు గూడా – 'సతీ'.

1) సర్వము నందు 'ఉండటం' అనే సూత్రంగా ఉన్న సర్వాంతర్యామిని పేరు.

2) దక్షుని కూతురు.

3) సర్వస్త్రీ దేవతలకు సమష్టిరూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చు.

## 821. బ్రహ్మాణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రహ్మాణ్యైనమః' అని చెప్పాలి.

బ్రహ్మాణీ = బ్రహ్మకు అస్తిత్వమును కలుగచేయునది.

'యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి.
యత్ప్రయంత్యభి సంవిశంతీతి' తైత్తిరీయం.
దేని నుండి ఈ సమస్త భూత జాలం పుడుతోందో, దేనివలన జీవిస్తోందో, దేనిలోకి చివరకు లీనమౌతోందో - దానిని 'బ్రహ్మ' అంటారు - అని ఈ మంత్రానికి అర్థం. అటువంటి బ్రహ్మను మన అస్తిత్వంగా చేసేది కాబట్టి అమ్మవారు 'బ్రహ్మాణీ'.

'పరబ్రహ్మము' అన్న పదానికి ఉన్న అభిప్రాయం పట్ల వైయాకరణులు (grammarians) నపుంసకులు. అందుకని వారు 'బ్రహ్మ' శబ్దాన్ని నపుంసకలింగంగా చేశారు. 'గాయత్రీ' అనేది ఒక ఛందస్సు. మరి ఇది ఆడా, మగా అంటే ? శబ్దం స్త్రీలింగం కాబట్టి 'ఆడది' అన్నారు. అంతే! అలాంటిదే ఈ బ్రహ్మ శబ్దం కూడా! (అంతేకాని పరబ్రహ్మ నపుంసకుడు కాదు. పరబ్రహ్మ నపుంసకుడు అయితే మనం అంచనా వేయలేని ఇంతటి సృష్టిని ఎలా చేస్తాడు?) అటువంటి పరబ్రహ్మ అస్తిత్వాన్ని కలుగచేసేది కాబట్టి అమ్మవారు - బ్రహ్మాణీ.

## 822. బ్రహ్మ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు - 'ఓం బ్రహ్మణే నమః' అని చెప్పాలి.

బ్రహ్మ = బ్రహ్మత్వము.

ఎప్పటికైనా పొందాలనుకునే బ్రహ్మత్వమును సూచించు నామము.

1) పరబ్రహ్మ స్వరూపిణి.

2) ముక్తి కాంక్ష కలిగిన వారికి పొందింప చేసే బ్రహ్మత్వరూపిణి.

## 823. జననీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జనన్యైనమః' అని చెప్పాలి.

జనని = పుట్టించునది.

1) సకల ప్రపంచమును పుట్టించునది.

2) భౌతిక జననమునకు మూలకారణము.

3) తల్లి రూపములో ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 824. బహురూపా

నాలుగు అక్షరాల నామం ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బహురూపాయైనమః' అని చెప్పాలి.

బహు = బహువిధములై, రూపా = రూపములుగా ఉండునది.

'ఏకంసత్‌విప్రాబహుధావదంతి' – వాస్తవానికి ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ – కాని, ఆ పరబ్రహ్మే 84 లక్షల రకాల జీవరాసులలోన్నువస్తు పదార్థాలలోను విశ్వమంతా విస్తరించి ఉన్నాడు. ఇన్ని రూపాలుగా పరబ్రహ్మను చూపేది అమ్మవారే ! అందుకే అమ్మవారు 'బహురూపా'

పంచేంద్రియాలకు కనబడేవే కాక ఇంకా చాలా ఉన్నాయి. కనిపించడమే కాక, అనిపించడం, అభిప్రాయపడటం, Concepts, opinions, Hypothesis మొదలైన వాటన్నిటి వెనుకా కారణంగా ఉన్న నేపథ్యం అమ్మవారే! అంటే వీటన్నిటిరూపంలో ఉండేది అని అర్థం.

1) విశ్వమంతా బహురూపాలుగా పరబ్రహ్మను చూపించునది.

2) వేద వేదాంగ పురాణ శాస్త్రాదుల రూపాలుగా ఉన్నది.

3) కనబడే వాటి రూపాదులే కాకుండా అభిప్రాయ సిద్ధాంతాదుల రూపాలలో గూడా ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 825. బుధార్చితా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బుధార్చితాయైనమః' అని చెప్పాలి.

బుధ = బుద్ధిమంతులచే, అర్చితా = అర్చింపబడునది.

అమ్మవారిని అనేక విధాలుగా, అనేక మంది అరాధిస్తారు. అర్చిస్తారు. ఆరాధనా పద్ధతులన్నీ ఒకే రకంగా ఉండాలని లేదు. ఎవరి పద్ధతి వారిది. బుద్ధి మార్గంలో అర్చించే విధానం గూడా ఉంది. వీరు భౌతికంగా షోడశోపచారాలతో అమ్మవారిని అర్చించినా ప్రతి ఉపచారం ఎందుకు ఏర్పాటైందో దానిని దృష్టిలో పెట్టుకుని అర్చిస్తారు. ఉదా: పత్రం, పుష్పం ఫలం – తోయం – అమ్మవారికి సమర్పించాలంటే వీరి దృష్టిలో

'పత్రం' అంటే – మన యోగ్యతా పత్రాలు. అంటే – మన డిగ్రీలు, బిరుదులు, సామర్థ్యాలు. వీటిని సమర్పించడం.

పుష్పం – అంటే మంత్రపూతమైన మనస్సనే పుష్పం అర్పించడం.

ఫలం – మనం చేసే సుకర్మఫలాలను అర్పించడం.

తోయం – ఆర్తితో అర్థించడం.

ఈ నాల్గింటికి మనస్సు బుద్ధి చిత్తము అహంకారాలనే అర్థాలుగూడా చెప్పవచ్చు.

1. 'పతంత్యనేతీతి' – పత్రం. అంటే – 'పడిపోయేది పత్రం. మనిషిని పడేసేది – మనస్సు కాబట్టి – మనస్సే పత్రం'.

2. 'పుష్పతీతి పుష్పం' – అంటే 'వికసించేది పుష్పం. మనిషిలో వికసించేది బుద్ధి కాబట్టి – బుద్ధియే పుష్పం'.

3. 'ఫలతి – విశీర్యతే ప్రహారైః ఇతి – ఫలం'. 'ప్రహారైః' అంటే – వ్రేటుల చేత, 'విశీర్యతే' = పగులునది – ఫలం. జ్ఞానబోధ అనే దెబ్బలచేత పగిలేది మనలోని 'అహంకారం' కాబట్టి, 'అహంకారమే – ఫలం!

4. 'త్రాయతేపాలయతీతి – తోయం' రక్షించేది, పోషించేది కనుక తోయం. సోహం భావంతో ఉన్నప్పుడు ధ్యేయాన్ని సరిగ్గా గుర్తుంచుకుని క్రమక్రమంగా రక్షించేది చిత్తమే కాబట్టి ఈ చిత్తమే – తోయం. భగవంతునిలో ఐక్యభావన కలిగినపుడు పరవశంతో కలిగే ఆనందాశ్రువులే ఈ తోయం. ఐక్యభావన చిత్త లక్షణం కాబట్టి 'చిత్తమే – తోయం'. (వేదాంతం లక్ష్మయ్య గారికి కృతజ్ఞతలు)

మన ఒక్కొక్క ఇంద్రియశుద్ధికై ఒక్కొక్క ఉపచారం. ఇలా బుద్ధి మార్గంలో వీరి అర్చన ముడిపడి ఉంటుంది. వాస్తవానికి జ్ఞానస్వరూపిణి అయిన అమ్మవారి అర్చనలో ఈ అవగాహన చాలా అవసరం.

1) బుద్ధిమార్గములో అర్చింపబడునది. 2) విజ్ఞానవేత్తలచే విజ్ఞాన రూపంలో అర్చింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 826. ప్రసవిత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రసవిత్ర్యై నమః' అని చెప్పాలి.

ప్ర = ప్రకృష్టమైన పద్ధతిలో, సవిత్రీ = సృష్టించి ఇచ్చునది. సృష్టి జరగడంలో అనేక స్థితులున్నాయి.

1) సంకల్పం (విత్తనం వెయ్యడం లాంటిది). 2) కల్పనము (సూత్రబద్ధం చెయ్యడం) 3) సృజనం (సూత్రాన్ని అమలులో పెట్టడం) 4. సూతి (గర్భంలో పడపటం) 5) ప్రసూతి (గర్భంలోంచి బయటపడటం)

సూర్యుని లోంచి – భూమికి, భూమిమీద ఉన్నవారికి కూడా కిరణాల ద్వారా పైన తెల్పిన ప్రణాళికలో ఈ ప్రసవ శక్తి ఇవ్వబడింది. ఇదే పద్ధతిలో బ్రహ్మ దగ్గర నుంచి పిపీలికాల దాకా ప్రసవశక్తిని ఇచ్చిన అమ్మవారిని 'ప్రసవిత్రీ' అంటారు. భౌతిక సృష్టి విషయంలోనే కాదు. వాక్ సృష్టి, వాఙ్మయ సృష్టి విషయంలో కూడా ఇలాగే వస్తుంది.

1) ప్రకృష్టమైన పద్ధతిలో పిపీలికాది బ్రహ్మ పర్యంతము ప్రసవించి ఇచ్చునది. 2) వాక్ సంబంధమైన వాటిని మనస్సంబంధమైన వాటిని చక్కగా బయటకు వ్యక్తము చేయుటకు దోహదపడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 827. ప్రచండా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రచండాయై నమః' అని చెప్పాలి.

ప్రచండా = మరీ భయంకరమైనది – అనగా తీవ్రమైనది.

శక్తి స్వరూపిణి అయిన అమ్మవారి యొక్క కనబడే రూపం సందర్భాన్ని బట్టి మారుతుంది. ప్రళయ సందర్భంలో – ప్రచండంగాను, సృష్టి సందర్భంలో ప్రసన్నంగాను ఉంటుంది. అయితే ఇవి నైమిత్తకంగా – అంటే – ప్రత్యేక సందర్భాల్లో జరిగేవి. సుషుప్తిలో అంటే, నిద్రలో మనం నిత్య ప్రళయానుభూతిని పొందుతాము. జాగ్రదవస్థలో అంటే, మెలకువలో నిత్యసృష్ట్యనుభూతిని పొందుతాము.

అమ్మవారు కర్మఫల స్వరూపిణి అయినపుడు – శిక్ష క్రమానుబద్ధమైన మార్గంలో శక్తి మారుతుంది. ఈ కళను 'కాళీస్వరూపం'లో గుర్తిస్తాము. నిజానికి 'కాలీ' అనాలి గాని 'కాళీ' అనకూడదు. (ఈ 'కాలీ' శబ్దం కాలస్వరూపిణి అని గూడా స్ఫురింపజేస్తుంది కాబట్టి)

గీతలో కూడా – 'కాలఃకలయతామహమ్' అన్నాడు గీతాచార్యుడు. (అన్నిటినీ కలిపే వాటిలో నేను కాలపురుషుణ్ణి అని అర్థం).

అమ్మవారి ఈ ప్రచండ రూపానికి భయపడే – వాయువు వీస్తున్నాడు, సూర్యుడు – తపింప చేస్తున్నాడు, సర్వదేవతలు వారికి కేటాయించిన వారి వారి విధులు సక్రమంగా చేస్తున్నారు – అని ఉపనిషత్తు కూడా చెబుతుంది. ('భీషాస్మాద్వాతః పవతే...) అంటే విధి నిర్వహణలో తేడా వస్తే ఊరుకోదు. శిక్ష కఠినంగా వేస్తుంది. తప్పుకు శిక్ష పెద్దది ఉంటుందని తెలిస్తే తప్పులు చేయడానికి భయపడతారు. అందుకే అమ్మవారు ఈ విషయంలో ప్రచండంగా ఉంటుంది.

1) ప్రచండమైనది.

2) ప్రళయకాల స్వరూపిణి.

3) కర్మ ఫలస్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 828. ఆజ్ఞా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆజ్ఞాయై నమః' అని చెప్పాలి.

ఆజ్ఞా = ఆజ్ఞాస్వరూపిణి.

శక్తికి సద్వినియోగం జరిగేది శక్తుడు ఉన్నపుడే ! శక్తుడు ఉన్నపుడు 'శక్తి' – 'ఆజ్ఞ'గా మారుతుంది.

విధ్యుక్త ధర్మాలు ఎవరి చేత నిర్దేశింపబడినా – ఆ నిర్దేశింపబడిన ఆజ్ఞల రూపంలో ఉండేది అమ్మవారే అని గ్రహించాలి.

ఆజ్ఞా స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 829. ప్రతిష్ఠా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రతిష్ఠాయైనమః' అని చెప్పాలి.

ప్రతిష్ఠా = అధిష్ఠితమై - ప్రతిష్ఠతమైనది.

సర్వజగత్తుకు అధిష్ఠాత్రి అయినందున, సర్వజగుత్తు ఆమె యందు ప్రతిష్ఠితమైనందున అమ్మవారు - 'ప్రతిష్ఠా' అంటే చక్కగా జగత్తులో ఉండిపోయిందన్నమాట!

ఉండిపోవడానికి సంస్కృతంలో 'స్థ' అనాలి, బాగా ఉండిపోవడాన్నే 'ఉండి ఉండిపోవడం' గా చెప్పుకుంటే - ('ఉండి ఉండిపోవడమేమిటి ?' అని అనుమానం రావచ్చు. ఈ ప్రయోగం కొన్ని ప్రాంతాల్లో ఉంది వినండి - కాదు కాదు చదవండి -

విజయనగర ప్రాంతంలో వెళ్ళెళ్లిపోయొచ్చాడు - ('వెళ్ళి వెళ్ళి పోయొచ్చాడు') అంటారు. న్యాయానికి సరళంగా 'వెళ్ళి వచ్చాడు' - అంటే చాలు, కాని, ఈ 'వెళ్ళి వెళ్ళి పోయొచ్చాడు' అనే ప్రయోగం తెలుగులో డాక్టరేటు తీసుకుని విశ్వవిద్యాలయాల్లో, అధ్యాపకులుగా, రీడర్లుగా, ప్రొఫెసర్లుగా పనిచేసే వారు కూడా - వాళ్ళ విజయనగర ప్రాంతం వారు అయితే - అంటారు. నేను స్వయంగా విన్నాను కాబట్టి చెబుతున్నాను.

ఇలా అనడం - వెళ్ళడం, వెళ్ళిరావడం అనే విషయాలను మరింత బలపరచినట్లు ఖాయంగా చెప్పడానికేమో మరి! అలాగే - ప్రస్తుతం 'ఉండి ఉండిపోవడం' - ప్రయోగం కూడా!).

రెండుసార్లు ఉండి ఉండిపోవడం అని చెప్పడానికి సంస్కృతంలో 'స్థ, స్థ' అనాలి. ఇలా 'స్థ, స్థ' అని రెండు సార్లు అనడం కష్టం కాబట్టి 'తిష్ఠ' అన్నారేమో! 'తిష్ఠ'లోనే 'స్థ' 'స్థ' ఉంటే, దీనికి ముందు ఇంకా 'ప్ర' ఉపసర్గ ఉండడం దీని అర్థాన్ని మరింత బలపరుస్తుంది. (పూర్వం రోజుల్లో సంస్కృతం అందరూ బాగా మాట్లాడే భాష. కాని, పుస్తకంలో వ్రాయడానికి సంస్కరింపబడింది కాబట్టి 'సంస్కృతం' అయింది).

సృష్టి అయినప్పుడు కానప్పుడు కూడా తన ధర్మాన్ని కలిగి ఉండటం అమ్మవారి ప్రతిష్ఠకు చిహ్నం.

'శం' అంటే 'శమము' ( ఓర్పు) ఉంటే ప్రతిష్ఠ ఉంటుంది. తొందర పడితే ఉండదు. అయితే తొందరపడకుండా ఉండటానికి బాగా సాధన కావాలి. 'ఈసాధన చాలా కష్టం – అని చెప్పేవాడు ముందుకు వెళ్ళలేడు. 'శమం' ఉంటే ప్రతిష్ఠ ఉంటుంది – అని సాధించి ఋజువు చేసేవాడు. 'ప్రతిష్ఠావాన్ భవతి' – అంటే ప్రతిష్ఠావంతుడౌతాడు.

సర్వజగత్తుకు అధిష్ఠానమై, సర్వము తన యందు ప్రతిష్ఠిత మైనది – అని ఈ నామానికి అర్థం.

## 830. ప్రకటాకృతిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రకటాకృత్యైనమః' అని చెప్పాలి.

ప్రకట = ప్రకటమైన, ఆకృతిః = రూపములు గలది.

సృష్టిలో వ్యక్తమై, ప్రతిష్ఠతుడయే ప్రతి వ్యక్తీ – తన ద్వారా ఏది ప్రతిష్ఠితమైందో అది ఇలా ప్రకటితమైనది అని తన హృదయాన్ని చేతి బొటన వ్రేలితో సూచిస్తూ 'అహం – అహం' (నేను – నేను) అంటూ ఉంటాడు. అలా ప్రకటింపబడిన రూపము, లేదా– ఆకృతి ద్వారా సూచింపబడిన అమ్మవారి నామమే 'ప్రకటాకృతిః'

ప్రకటమైన ఆకృతి కలది – అని ఈ నామానికి అర్థం.

## 831. ప్రాణేశ్వరీ

నాలుగు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు – 'ప్రాణేశ్వర్యై నమః' అని చెప్పాలి.

ప్రాణ = ప్రాణములకు, లేదా – ప్రాణులకు, ఈశ్వరీ = ప్రాణమైనది.

ప్రాణమున్న జీవులను నడిపించే – ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, ప్రాణాలను – తిన్నగా నడిపించి, ప్రాణులకే ప్రాణమైన ముఖ్య ప్రాణ స్వరూపిణి – అమ్మవారు.

ప్రతి జీవిలోను – ప్రాణుల ద్వారా తన ఈశత్వమును (ఆధిపత్యమును) నిరూపించునది.

1) పంచ ప్రాణములను నడిపించు ముఖ్య ప్రాణ స్వరూపిణి.

2) ప్రాణములకు ప్రాణమైనది.

3) ప్రాణులకు ప్రాణమైనది.

4) ప్రతి జీవిలోను ప్రాణము ద్వారా తన ఈశత్వమును నిరూపించునది – అని ఈ నామానికి అర్థాలు.

## 832. ప్రాణదాత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రాణదాత్ర్యై నమః' అని చెప్పాలి.

ప్రాణ = ప్రాణములను, దాత్రీ = ఇచ్చునది.

ఫ్యాన్ – గాలిని పుట్టిస్తుందనుకోవడం పొరపాటే అవుతుంది. అసలు 'గాలి' అనేది ఒకటి ఉంటే – ఒక చోట ఉన్న గాలిని ఫ్యాన్ మరోచోటికి పంపుతుంది. అసలు గాలే లేకపోతే ఎంత క్రొత్త ఫ్యాన్ అయినా ఏ విధమైన గాలినీ ఇవ్వలేదు మోత తప్ప.

పంచప్రాణాలైన ప్రాణాపాన వ్యానోదాన సమానాలు గూడా ఫ్యాన్ లాగే నామమాత్రంగా మనలో ఉన్నప్పటికీ వాటి ద్వారా పనిచేసేది 'మహా ప్రాణమే! ఈ మహా ప్రాణాన్నే 'జగత్ప్రాణము' అంటారు. ఈ జగత్ప్రాణం గాలి కాదు – గాలిని వీయించే తెర వెనుక ఉన్న శక్తి. ఈ తెర వెనుక ఉన్న శక్తి కదిల్తే గాలి ఔతుంది. కదలకపోతే ఆకాశం ఔతుంది. (యథాకాశస్థితోవాయుః).

గాలిని పిలవడానికి – విశుద్ధి ప్రయత్నం, గాలిని పీల్చడానికి – అనాహత ప్రయత్నం ఉంటాయి. విశుద్ధి ఆకాశ తత్త్వం, అనాహతం ఉండే హృదయంలో దహరాకాశం ఉంటుంది. అంటే, గాలిని పిలిచేటప్పుడు, పీల్చేటప్పుడు వెనుక పనిచేసేది ఈ ఆకాశమే! వాయువుకు సంబంధించిన నేపథ్యంలోని ఈ ఆకాశమే 'మహాప్రాణం'.

ఈ మహా ప్రాణమే వాయుదేవుడు. మహా ప్రాణం వల్లనే అన్ని యంత్రాలకు చలన శక్తి లేదా చైతన్యశక్తి ఇవ్వబడుతుంది. ఈ మహా ప్రాణం యొక్క బీజాక్షరం 'హం'. జీవునికి దేవునికి మధ్య వంతెనలాంటిది ఈ మహా ప్రాణం (ఇటు నుండి అటు దూకాడు హనుమ. ఇటువైపు ఉచ్ఛ్వాసం, అటువైపు నిశ్వాసం. ఉచ్ఛ్వాసం – శ్వాసలో పైకెగరడం లాంటిదైతే, నిశ్వాసం – పై నుండి క్రిందకు దిగడం లాంటిది. ఈ రెండూ కలిస్తేనే దూకడం జరుగుతుంది. అంటే – ఈ శ్వాసరామాయణంలో 'సో' రాముడైతే, 'హం' హనుమ అన్నమాట! ఈ మహాప్రాణ నందనుడైన హనుమద్వారానే సంజీవని వలన లక్ష్మణుని ప్రాణాలు తిరిగి ఇవ్వబడతాయి. అలాగే, శ్వాస భారతంలోని నలో పాఖ్యానంలో – నలదమయంతులకు మధ్య దూత్యాన్ని నెఱపే 'హంస' ఇటువంటిదే!)

మహా ప్రాణ రూపంలో అన్నిటికీ ప్రాణాలను ఇచ్చునది – అని ఈ నామానికి అర్థం.

## 833. పంచాశత్పీఠరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచాశత్పీఠరూపిణ్యై నమః' అని చెప్పాలి.

పంచాశత్ = యాబది, పీఠ = పీఠముల, రూపిణీ = రూపముగా ఉన్నది.

సంస్కృత భాషలో 16 అచ్చులు, 34 హల్లులు కలిసి మొత్తం అక్షరాల సంఖ్య 50. ఈ అక్షరాలతోనే సంస్కృత వాఙ్మయ మంతా రూపొందింపబడి ఉంటుంది. అందుకని వీటిని ఒక విధంగా సంస్కృత భాషకు మాతృకావర్ణాలని చెప్పవచ్చును. ఈ శరీరంలోని షట్చక్ర దళాల మొత్తం సంఖ్య కూడా (4 + 6 + 10 + 12 + 16 + 2 = 50) ఈ మాతృకావర్ణాలకు – ఈ పద్మ దళాలు సూచించే శరీరంలోని ముఖ్య స్థానాలకు మధ్య న్యాస పద్ధతిలో అమ్మవారిని అర్చించే విధానం కూడా ఉంది. అందుకని అమ్మవారు పంచాశత్పీఠరూపిణి.

బాహ్య ప్రపంచంలో అమ్మవారి యాభై పీఠాలు కూడా ఉన్నాయి. ఈ యాభై పీఠాలను మాతృకా పీఠాలంటారు. 'అ' కారాది 'క్ష' కారాంతం ఉండే 51 అక్షరాలకు

ప్రతీకలుగా ఉండే ఈ 51 పీఠాల దేవతా స్వరూపాల ద్వారా అమ్మవారు అర్చింపబడుతుంది. (ఈ పీఠాల నామాలు అనుబంధంలో తెలుపబడినాయి.)

1) మాతృకావర్ణ సూచిత శరీర ముఖ్య స్థానములందు వసించి, ఆరాధింపబడునది.

2) ప్రపంచంలోని పంచాశత్పీఠాధిష్ఠాన దేవతల రూపములో ఆరాధింపబడునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 834. విశృంఖలా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశృంఖలాయైనమః' అని చెప్పాలి.

విశృంఖలా = తొలగింపబడిన సంకెళ్ళు గలది.

శృంఖలాలు - అంటే - సంకెళ్ళు. ఒక ప్రత్యేకమైన ప్రదేశానికే పరిమితమవడాన్ని సంకెళ్ళు సూచిస్తాయి. అమ్మవారు ఈ బ్రహ్మాండంలో కొన్ని చోట్ల మాత్రమే ఉండాలని లేదు. స్వేచ్ఛగా, ఎప్పుడైనా, ఎక్కడైనా ఎలా అయినా ఉండకలదు. ఆవిడ స్వేచ్ఛను అరికట్టే సంకెళ్ళు లేవు కాబట్టి అమ్మవారు విశృంఖలా.

(గత నామంలో ప్రపంచంలోని 50 పీఠాల్లో ఉండేదని చెప్పబడటం వలన వెంటనే 50 పీఠ ప్రదేశాల్లోనే ఉండాలనే నియమం ఏమీ లేదు, ఎక్కడైనా ఉండగలది అని తెలియ చెయ్యడం కోసం ఈ విశృంఖలా నామం వెంటనే చెప్పబడింది.)

భక్తుల సంసార శృంఖలాలను వదిలిస్తుంది కూడా కాబట్టి - విశృంఖలా.

సుషుమ్నా మార్గం వెంబడి ఉండే గ్రంథులు - అనే శృంఖలాలను విడదీస్తుంది కాబట్టి - విశృంఖలా.

అక్రమము నుండి క్రమమునకు, అధర్మం నుండి ధర్మం వైపునకు మార్పు వచ్చినపుడు మన లోపల ఉన్న ప్రజ్ఞకు ఈ విశృంఖలత్వం వస్తుంది. జీవితంలో బంధం తొలగి జీవించ కలిగినపుడు, నిబంధనలతో జీవితం నియమ బద్ధమైనపుడు, సంసారం

చేస్తూనే సంసారం అంటకుండా ఉన్నపుడు జీవికి – ఈ విశృంఖలత్వం చేకూరుతుంది. అభ్యాసేనరమతే అంతరాత్మా' అన్నారు. అంటే – సాధనామార్గంలో వచ్చే మార్పుతో అంతరాత్మ రమిస్తుంది – అని దీని అర్థం. పాపభీతికి తావు లేకుండా ఏ పనైనా చేస్తే అది మంచి పనే అవుతుంది. చెడ్డది అవదు. ఈ పాపభీతికి తావు లేని స్థితినే 'విశృంఖలత్వస్థితి' అంటారు. ఈ స్థితిని ఇచ్చే అమ్మవారి పేరు 'విశృంఖలా'.

చిక్కుల్లో ఇరుకున బడినవారు ఈ నామాన్ని 'విశృంఖలాయైనమః' అని జపించి చిక్కుల నుంచి ముక్తిని పొందవచ్చును.

('విశృంఖలత్వం' అంటే – 'విప్లవం' కాదని మాత్రం అర్థం చేసుకోవాలి.)

1) ఎక్కడైనా ఎప్పుడైనా ఎలాగైనా ఉండగలిగే స్వేచ్ఛకు సంకెళ్ళు లేనిది.

2) భక్తుల సంసార శృంఖలాలను వదిలించునది.

3) సుషుమ్నా మార్గం వెంబడి ఉండే గ్రంథులు – అనే శృంఖలాలను విడదీయునది.

4) చెడు నుండి మంచికి మార్పు వచ్చినపుడు, పాపభీతికి తావు లేనపుడు మనలో కలిగే అనుభూతి స్వరూపము.

## 835. వివిక్తస్థా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వివిక్తస్థాయైనమః' అని చెప్పాలి.

అన్నిటా అందరిలో అన్ని రకాలుగాను వర్థిల్లుతూ ఉండి కూడా – ఒంటరిగా, విడిగా ఉన్నట్లుగా గూడా ఉండేది గాబట్టి అమ్మవారిని 'వివిక్తస్థా' అన్నారు.

అన్వేషణ చేసుకుంటూ మనలో 'నేను' అనే వెలుగు కోసం వెళుతూ ఉంటే అమ్మవారు ఒంటరిగా మనలో కనపడుతుంది. దీపం తయారు చేసి – దానికి 'వెలుగుతున్నాను' అన్న జ్ఞానం కలుగచేస్తే ఏర్పడే దీపాల లాంటి వాళ్ళం మనం

అందరమూ. వెలుగుతున్నాను అనే జ్ఞానం తోనే, మనలో వెలుగుతున్నది ఎవరో తెలసుకోడానికి చేసే సాధనలో – అమ్మవారు ఒంటరిగా ప్రకాశిస్తున్న 'నేను' రూపంలో దర్శన మిస్తుంది. అలా దర్శన మిచ్చే అమ్మవారి నామం 'వివిక్తస్థా'.

నిద్రపోతున్నవాడు తనకు తాను ఉండడు కాని, తాను ఉంటాడు. అలా ఉంటుంది సృష్టికి పూర్వం ఈ సృష్టిస్వరూపిణి. ఈ స్థితిని కూడా వివిక్తస్థితి అనవచ్చు. ఈ స్థితిలోని అమ్మవారిని 'వివిక్తస్థా' అంటారు.

1) అంతటా నిండి ఉండి కూడా ఎక్కడా దొరకనట్లు ఒంటరిగా ఉండేది.

2) ఎన్ని రకాలుగా ఉన్నా తన ప్రత్యేకతను పోగొట్టుకోని విధంగా ఉండేది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 836. వీరమాతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వీరమాత్రేనమః' అని చెప్పాలి.

తిరుగులేని వారు వీరులు. త్రిమూర్తులు, దిక్పాలకులు మొదలైన వారు – వారికి కేటాయించిన పనులు చెయ్యడంలో తిరుగులేని వారు, అందుకే వాళ్ళు గూడా వీరులు. ఈ వీరులకు తల్లి కాబట్టి అమ్మవారు 'వీరమాతా'. అలాగే శ్రీ విద్యా దీక్షాపరుల్ని గూడా వీరులంటారు. వీరికి, వీరి శ్రీవిద్యకు కూడా అమ్మవారు జననిగాబట్టి 'వీరమాతా'.

గ్రహణ దృష్టికలవారి కన్నా, సమర్పణ దృష్టికలవారికి ఆధ్యాత్మ విద్య ఫలిస్తుంది. మనం ఆ విద్యను పొందుదాం అనే దృష్టితో(Possessivementality) కాకుండా, దానికి మనం ఉపయోగపడదాం అనే దృష్టి ఉంటే ఆధ్యాత్మిక విద్య బాగా అబ్బుతుంది. అంగరాజ్యం పోయి రాజ్యాంగం మనలో వర్ధిల్లుతుంది. ఆ స్థితిలో మనం వీరులుగా చెల్లుతాం. ఆధ్యాత్మిక విద్యలో ఈ స్థితిని మనకు కలుగచేసే అమ్మవారు 'వీరమాతా'.

(ఎందుకు ఆచరిస్తున్నాము అనే ప్రశ్న ఉదయించకుండా ధర్మాన్ని ఆచరిస్తూ ఉంటే మనకు అన్ని వైపుల నుండి అమ్మవారు ఆదుకుంటుంది. అప్పుడు మనం వీరులుగా

చెల్లుతాము. (అందుకే – భారతంలో వీరమాత – సత్యవతి అవుతుంది. అయితే, ఆమె ఈ వీరమాతృత్వాన్ని వ్యాసుని వలన పొందింది కాని, భీష్ముని వలన కాదు).

1) త్రిమూర్తి, దిక్పాలకాదులకు తల్లి.

2) శ్రీవిద్యలో పరిపక్వ స్థితికి వచ్చినవారికి తల్లి.

3) కారణరహితంగా ధర్మం ఆచరిస్తున్న వారికి తల్లి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 837. వియత్ప్రసూః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వియత్ప్రసువేనమః' అని చెప్పాలి.

వియత్ = ఆకాశమును, ప్రసూః = ప్రసవించినది అనగా పుట్టుటకు కారణమైనది.

అన్నీ ఉన్నట్లుగా కనపడే ఈ సృష్టిఎలా ఏర్పడుతోంది అన్న ప్రశ్నకు తైత్తిరీయంలో 'ఆత్మన ఆకాశః సంభూతః 'ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అద్భ్యఃపృథివీ.... అన్నాత్పురుషః' అని చెప్పబడింది. అంటే – ఆత్మనుండి ఏమి లేనట్లుగా కనబడే ఆకాశం పుడితే, ఆ ఆకాశం నుండి అన్నీ ఉన్నట్లు కనబడే ఈ సృష్టిఏర్పడింది – అని చెప్పబడింది. అమ్మవారు పిండాండంలో ఆత్మ, బ్రహ్మాండంలో పరమాత్మ స్వరూపిణి కాబట్టి – ఆకాశాన్ని ప్రసవించి ఇచ్చింది అమ్మవారే ! (పృథివ్యాపస్తే జోవాయురాకాశాలు – ఇవి పంచభూతాలు, అంటే – Five states of existence అంతేగాని five elements గాదు. మన శాస్త్రాలకు ఆంగ్ల అనువాదాల్లో దొర్లిన పొరపాట్లలో ఇదొకటి).

మనకు నిద్రలోంచి మెలకువ వచ్చినట్లు అమ్మవారిలోంచి ఆకాశం పుడుతుంది. ఈ స్థితిలోని అమ్మవారినే 'అదితి' అని గూడా పురాణాల్లో అంటారు.

1) ఆకాశమును ప్రసవించి ఇచ్చునది.

అనగా ఆకాశము పుట్టడానికి కారణమైంది – అని ఈ నామానికి అర్థం.

## 838. ముకుందా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముకుందాయై నమః' అని చెప్పాలి.

ముకుందా = ముకుందుని రూపము.

సృష్టి లీనమైనపుడు ఉండే స్థితిని పరబ్రహ్మగాను, పరమాత్మగాను, సృష్టి బయల్పడినపుడు 'పరాప్రకృతి' అని లేదా 'ముకుందా' అని చెప్పవచ్చును.

దేశ కాలాత్మక, నామరూపాత్మక సృష్టిస్వరూపిణిని – 'ముకుందా' అంటారు. 'ముక్తి నిచ్చేవాడు ముకుందుడని' వ్యుత్పత్తి అర్థం. అమ్మవారు గూడా ముకుందుని లాగే ముక్తి నిస్తుంది. సృష్టిస్వరూపిణే గాక, పోషకత్వాన్ని గూడా నిర్వహిస్తుంది. అందుకే అమ్మవారు 'ముకుందా' అనే పేరుతో కూడా పిలువబడుతుంది. (కుబేరుని ఒక నిధికి, ఒక విధమైన మణికి గూడా ముకుంద మనే పేరు వుంది).

1) దేశకాలాత్మక నామరూపాత్మక సృష్టిస్వరూపుడైన 'ముకుంద' నామసూచిత మైనది.

2) ముక్తిని ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 839. ముక్తినిలయా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముక్తి నిలయాయై నమః' అని చెప్పాలి.

ముక్తి = ముక్తికి (మోక్షమునకు), నిలయా = నిలయమైనది.

ముక్తులలో ప్రధానంగా నాలుగు రకాలు చెబుతారు. అవి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాలు. ఈ నాలుగు రకాల ముక్తులకు అమ్మవారు నెలవైనది. ఈ నాల్గింటిలో ఏ రకమైన ముక్తినైనా అమ్మవారు ప్రసాదించగలదు. లేదా ఈ నాలుగు రకాల ధ్యేయాల ద్వారా అమ్మవారు ప్రసన్నమై ఆ ధ్యేయ స్థితిలోని కలుగచేస్తుంది.

అన్ని రకాల ముక్తులకు నెలవైనది – అని ఈ నామానికి అర్థం.

## 840. మూలవిగ్రహరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మూలవిగ్రహరూపిణ్యై నమః' అని చెప్పాలి.

మూల = మూలకారణమునకు, విగ్రహ రూపిణీ = రూపముగా ఉన్నది.

ఈ సమస్త విశ్వానికి మూలకారణం పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మకు సగుణరూపమే కాబట్టి, అమ్మవారు 'మూలవిగ్రహరూపిణీ'.

విగ్రహపదాన్ని – వి + గ్రహము – అని విడదీస్తే, వి = వియదాది పంచభూతాలను, గ్రహ = పట్టుకునేది. అంటే – సృష్టికి కావలసిన రూపాలు తయారు చెయ్యడానికి పంచ భూతాలను వినియోగించేది. వినియోగిస్తే 'గ్రహం' 'విగ్రహం' ఔతుంది.

ఏ రకమైన ఆకారంలో ఉండి, ఏ పరిమాణంలో ఉన్న విగ్రహాన్ని తయారు చెయ్యడానికైనా – ప్రాథమిక మైన అచ్చు 'original mould' ఒకటి ఉండి తీరాలి. ఆ ప్రాథమిక మైన అచ్చునే 'మూలవిగ్రహం' అనాలి. ఈ మూలవిగ్రహం ఆకార పరిమాణాల్లో ఉంటుంది. ఆ ఆకార పరిమాణాలు అమ్మవారి లక్షణాలు కాబట్టి ప్రతి విగ్రహానికి మూలభూతమైన కారణ విగ్రహ అమ్మవారే ఔతుంది.

1) బ్రహ్మ యొక్క సగుణ రూపము.

2) సృష్టిలో వివిధ రకాల రూపాలను తయారు చెయ్యడానికి అవసరమైన ఆకాశాది పంచభూతాలను గ్రహించునది.

3) ఏ రకమైన విగ్రహాన్ని తయారు చెయ్యడానికైనా ప్రాథమికంగా ఉండే అచ్చుల (Moulds) రూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 841. భావజ్ఞా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భావజ్ఞాయై నమః' అని చెప్పాలి.

భావ = భావములు, జ్ఞా = తెలిసినది లేదా తెలుసుకొనునది.

ఇతరుల మనస్సులలోని భావాలు తెలుసుకోవడం పెద్ద గొప్పకాదు. కాని - ఎందుకు తెలుసుకుంటున్నాము? అన్నదాని సమాధానాన్ని బట్టి మనకది ఫలాన్నిస్తుంది.

ఒకడి మనస్సులోనివి గ్రహించేవాడికి - ఒకరి ఉత్తరాలుచించి చదివే వాడికీ - ఏమీ భేదం లేదు.

మనకున్న అభిప్రాయాలు మనకు కవచకుండలాల్లాంటివి. తీగద్వారా టెలీఫోన్ పనిచేసినట్లు మనకున్న అభిప్రాయాలద్వారా మనమీద చేతబడులు పనిచేస్తాయి. వీళ్ళమీదే కాదు - 'మనకు తెలుసుకనక మనకెవ్వరూ అపకారం చెయ్యలేరు' అని గర్వపడేవారి మీద కూడా పనిచెయ్యవచ్చు. ఈ క్షుద్రశక్తులకు మోసపోకూడదు. వాటిని తిట్టకూడదు కూడా!

అసలు ఉన్నది ఒకటే దేవత - క్షుద్రదృష్టితో పిలిస్తే వీడు క్షుద్రుడవుతాడు లేకపోతే మహానుభావుడవుతాడు.

భావము, అభిప్రాయము ఇవి రెండూ వేరు వేరు అర్థాలు కలిగినవి. భావం - మనకు ఎక్కువగా రైటు అనిపించేది. అభిప్రాయం - మన ఆవేశంతో కలసి ఉండేది. మనకు సన్నిహితుణ్ణి చూచినప్పటి స్థితిలో కలిగేది - భావం. మనం చూచిన క్రొత్త వ్యక్తిపై కలిగేది అభిప్రాయం. ఎండబెట్టిన విత్తనాలు నానబెడితే అవి తిరిగి పూర్వం ఉండే వాటిలా రావచ్చు. అదే విషయం - అభిప్రాయంలో జరిగితే అది 'భావన' అవుతుంది.

భావన భౌతిక (Physical) కక్ష్యమీద కన్నా - శక్తి (Vital) కక్ష్యలో ఎక్కువ పనిచేస్తుంది. శక్తి కక్ష్యమీద కన్నా మానసిక(Mental) కక్ష్యమీద ఇంకా బాగా పనిచేస్తుంది. మానసిక కక్ష్యమీద కన్నా సంకల్ప కక్ష్య(Creative will) మీద మరీ బాగా పనిచేస్తుంది. సంకల్పకక్ష్యలో వర్తించేదే మోక్షధర్మం. కాబట్టి, మోక్ష ధర్మాన్ని కలుగ చేయడానికి 'భావన' అవసరం. ఈ భావనను కలుగచేసేది కూడా అమ్మవారే!

1) భావనలను తెలిసినది, లేదా - తెలుసుకొనునది.

2) భావనచేత తెలియబడునది - అని ఈ నామానికి అర్థాలు.

# 842. భవరోగఘ్నీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భవరోగఘ్న్యైనమః' అని చెప్పాలి.

భవ = జనన మరణ చక్ర భ్రమణ సంసారమనెడి, రోగ = క్లేశములను, వ్యాధులను, ఘ్నీ = పోగొట్టునది.

'భవనాశినీ' అన్న 175వ నామ వివరణ కూడ ఇక్కడ చదువుకోవాలి.

'భవం' అంటే పుట్టుక కాబట్టి – 'భవరోగం' అంటే 'పుట్టుకతో ముడి పడి ఉండే జనన మరణ చక్రభ్రమణ సంసార యాత్రా క్లేశమ' ని చెప్పుకోవాలి. ఈ విధమైన భవ నిర్బంద యాత్రను లేకుండా చేస్తుంది అమ్మవారు. అంటే – జన్మ లేకుండా చేస్తుందని చెప్పవచ్చు, లేదా – భవసంబంధమైన రోగాలను కుదురుస్తుందని చెప్పవచ్చును.

జన్మ నెత్తిన మనుష్యులకు వచ్చే రోగాలు రెండు రకాలు. దేహానికి సంబంధించినవి ఒక రకమైతే, మనస్సుకు సంబంధించినవి (The limitations of our likes and dislikes) రెండోరకం. దేహానికి సంబందించిన నా[illegible]ని రోగాలనీ, మనస్సుకు సంబంధించినవి భవరోగాలనీ సాధారణంగా అంటారు. దేహ[illegible]చ్చే రోగాలు – అంటే – తలనొప్పి, కాళ్ళ నెప్పులు, అజీర్ణం, మలబద్ధం మొదలగునవి సాధారణంగా మందులు వాడితే తగ్గుతాయి. మనస్సుకు సంబంధించిన భవరోగాలు ఉదా: అసూయ, ద్వేషము, అనుమానం, గర్వం, మిడిసిపాటు మొదలగునవి. ఇవి, అజ్ఞానము వల్ల వచ్చే మరి కొన్ని – ఇవి మందుల వల్ల సాధారణంగా తగ్గవు. ఇటువంటి భవరోగాలకు మందు అమ్మవారి అనుగ్రహమే!

1) జనన మరణ చక్రభ్రమణ క్లేశమును పోగొట్టునది.

2) దైహిక, మానసిక రోగాలను పోగొట్టునది – అని ఈ నామానికి అర్థాలు.

## 843. భవచక్రప్రవర్తినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భవచక్రప్రవర్తిన్యైనమః' అని చెప్పాలి.

భవ = భావమయమైన మహాశక్తి చేత, చక్ర = సంసార చక్రమును, ప్రవర్తినీ = ప్రవర్తింప చేయునది.

అమ్మవారు ఒక్కసారి భావన చేసి వదిలి పెడితే ఈ భవచక్రం దానంతట అదే తిరుగుతూ ఉంటుంది. మధ్యలో ఏమీ కల్పించుకోనక్కరలేదు. చక్రంలో ఇరుక్కున్న వాళ్ళే వాళ్ళ ప్రవర్తన మూలంగా అలా ఈ చక్రంలో తిరుగుతూ ఉంటారు. జీవ వ్యవస్థకే కాకుండా అన్ని రకాల వ్యవస్థలకు ఈ చక్రం వర్తిస్తుంది. కాలాత్మకంగా రాత్రి – పగలు; శుక్ల – కృష్ణపక్షాలు; మాసాలు – సంవత్సరాలు, యుగాలు – మన్వంతరాలు, కల్పాలు; జ్యోతిష్టోమ అగ్నిష్టోమాది చక్రాలు; గుణాత్మకంగా – సత్త్వరజస్తమోగుణాలు; ప్రాదేశాత్మకంగా – పరమాణు గ్రహ గోళ తారకాదులు, బ్రహ్మాండాలు; జీవ పరంగా – జనన మరణ, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, మొదలైన అన్ని వ్యవస్థల యందలి నిరంతర చక్ర భ్రమణాన్ని ప్రవర్తింపచేసే అమ్మవారి పేరు – 'భవచక్రప్రవర్తినీ'!

'భవ' అంటే 'శివుడ'ని కూడా అర్థం ఉంది. కాబట్టి 'భవచక్రం' అంటే శివునికి సంబంధించిన చక్రం అని అర్థం వస్తుంది. భవచక్రం విడిగా వేరే ఉండదు. శ్రీ చక్రంలోని భూపుర, షోడశదళ, అష్టదళ, బిందువులు – ఈ నాలుగు శివచక్రం క్రిందకే వస్తాయి. (చతుర్భిః శ్రీకంఠైః) మిగిలినవి శక్తి చక్రాలు. ఈ రెంటి సమన్వయమే శ్రీ చక్రం. భవచక్రంతో కూడిన ఈ శ్రీ చక్రాన్ని ప్రవర్తింప చేస్తుంది కాబట్టి అమ్మవారు భవచక్రప్రవర్తినీ!

1) భవ సంబంధమైన చక్రభ్రమణ వ్యవస్థలన్నిటినీ ప్రవర్తింప చేయునది.

2) శివచక్రముతో కూడిన శ్రీ చక్రమును ప్రవర్తింప చేయునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 844. ఛందస్సారా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఛందస్సారాయైనమః' అని చెప్పాలి.

ఛందః = ఛందస్సుల, సార = సారరూపమైనది.

భవచక్ర ప్రవర్తన వల్ల దేశకాలాల మీద పడే ముద్రలనే 'ఛందస్సు' అంటారు. దేశకాలాల మీద భవచక్ర ప్రవర్తనాల ఛాదనం వలన వచ్చిన ముద్రలు(Patterns) కాబట్టి వీటిని 'ఛందస్సు' లన్నారు.

మన యందు ఉండే పరిమిత లక్షణాలను వాటికి కూడా ఆపాదిస్తాము గాని, వాస్తవానికి దేశానికి కాలానికి కొలతలు లేవు ఇలా ఆపాదింపగా వచ్చేవే 'ఛందస్సులు'.

ఆవర్తనము(Periodicity), స్పందనము(Vibration), శ్రుతి (Tuning), అనుశ్రుతి (Rhythm), అనువాదము(Resonance), సంగీతము(Music), నడక (Metre), అక్షర గణాలు, యతులు, ప్రాసలు మొదలైనవన్నీ ఛందస్సుల క్రిందకే వస్తాయి.

ప్రతి భాషకు సంబంధించిన వాఙ్మయంలోను ఈ ఛందస్సు అనేది ఒక ప్రత్యేకశాస్త్రం. ఎన్నో నియమ నిబంధనలతో, లక్షణాలతో, పేర్లతో ఈ ఛందస్సు ఉంటుంది. సంస్కృతంలో ఉండే శ్లోకాలకు ఎన్నో విధాలైన ఛందో రీతులుంటాయి. ఏకాక్షర ఛందస్సు ఉండి (ఓం) వేరు వేరు సంఖ్యాక్షరాలలో ఉండే వివిధ ఛందస్సులున్నాయి.

అమ్మవారు శ్రీ విద్యా స్వరూపిణి. ఈ శ్రీ విద్యలో సర్వ ఉపనిషత్సారము, గాయత్రీసారము ఉంటాయి. వేదసారాలే ఉపనిషత్తులు. మంత్రాల సంకలనాలే వేదాలు. అయితే ఈ మంత్రాలన్నీ ఛందోబద్ధాలే ! అందుకని అమ్మవారు ఛందస్సారా.

ఒక్కొక్క రకమైన ఛందస్సు ఒక్కొక్క ప్రత్యేకమైన అనువర్తనం(Application) కలిగి ఉంటుంది. పంక్తి ఛందస్సు – పంచభూతాత్మకమైన ప్రపంచం గురించి, అనుష్టుప్ ఛందస్సు – వసులోకానికి చెందిన వృత్తాంతాల గురించి, త్రిష్టుప్ ఛందస్సు – రుద్ర

లోకానికి చెందిన ఏకాదశ రుద్రుల వృత్తాంతాల గురించి, జగతీ ఛందస్సు – దేవలోకానికి చెందిన ద్వాదశాదిత్యులు వృత్తాంతము గురించి చెప్పడానికి ఉపయోగిస్తారు. ఇక బృహతీ ఛందస్సు వినియోగం 673వ నామ వివరణలో చెప్పబడింది.

ఛందస్సులలోని అక్షర సంఖ్యను సూచించే ప్రధాన అంకెలు గూడా వినియోగాన్ని బట్టి మూడు విధాలుగా చెప్పవచ్చు. పైథాగరస్ మహాశయుడు వాటిని ఈక్రింది విధంగా విభజిస్తాడు.

1, 5, 7 – ఇవి అవి భక్తములు(Prime Numbers) వీటినే సృష్టికి సంబంధించిన అంకెలు (Numbers of Creation) అంటారు.

2, 4, 8 ఇవి విభక్తములు. వీటిని సృష్టిపంపిణికి సంబంధించిన అంకెలు(Numbers of Distribution) అంటారు.

3, 6, 9 ఇవి మండలాంగములు. వీటిని సృష్టిలోని కొలతలకు సంబంధించిన అంకెలు (Numbers of rotation and circular measure) అంటారు.

ఈ విధంగా అక్షరాలు అంకెల స్వభావాలను, వాటి కూర్పును తెలుపు ఛందస్సు యొక్క సారము అమ్మవారు అని ఈ నామం తెలుపుతుంది.

ఛందస్సుల సారమైనది – అని ఈ నామానికి అర్థం.

## 845. శాస్త్రసారా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాస్త్రసారాయైనమః' అని చెప్పాలి.

శాస్త్ర = శాస్త్రముల, సారా = సారరూపమైనది.

ప్రకృతి ధర్మాలను శాసించినట్లు చెప్పేవి శాస్త్రాలు. అమ్మవారి ఆజ్ఞానువర్తులై ప్రకృతి ధర్మాలుంటాయి. కాబట్టి, ఒక విధంగా మరి శాస్త్రాలన్నీ అమ్మవారి ఆజ్ఞల క్రిందకే వస్తాయి.

మానవులకి సంబంధించిన ప్రవృత్తికి నివృత్తికి నిత్య కృత్య వ్యవహారాలకు సంబంధించిన విషయాలన్నిటినీ ఈ వివిధ శాస్త్రాలు బోధిస్తాయి. ఇవిన్నీ వేద సమ్మితంగానే ఉంటాయి. పైగా ఎంతో హేతుబద్ధంగా, తర్కబద్ధంగా ఈ శాస్త్ర జ్ఞానం ఉంటుంది. అలా ఉన్న విషయాలే శాస్త్రాలౌతాయి గాని మాటి మాటికీ మారేవి శాస్త్రాలు కావు. ఈ శాస్త్రాల సారమంతా జ్ఞానమే! అమ్మవారు జ్ఞానస్వరూపిణి కాబట్టి 'శాస్త్రసారా' కూడా ఔతుంది.

సర్వశాస్త్ర సార రూపము - అని ఈ నామానికి అర్థము.

## 846. మంత్రసారా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మంత్రసారాయైనమః' అని చెప్పాలి.

మంత్ర = మంత్రముల, సారా = సారరూపమైనది.

'మననాత్ త్రాయతే' ఇతి మంత్రః'' - మననము చేయుట వలన రక్షించునది - మంత్రము - అని దీని అర్థం. మంత్రము అంటే గోపనంగా ( రహస్యంగా) ఉంచడం. సృష్టి సమస్తం గోపనంగా ఉంది. చెట్లు చిగిర్చి ఆకులు వేయడం, మొగ్గలు పూవులుగా మారడం, పువ్వు పిందెగా, పిందె కాయగా, కాయ పండుగా మారడం. ఇలాంటి సృష్టిలో జరిగే ప్రక్రియలన్నీ కంటికి కనబడకుండా చాలా అతి నెమ్మదిగా, గోపనంగా జరుగుతాయి. అయితే అన్నిటిలోని ఆకార పరిమాణ రూపాలలో సర్వాంతర్యామిని చూడకలుగుతున్నాము. 'మల్లియలార మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే !' అంటున్నప్పుడు - ఆ సర్వాంతర్యామి మల్లె పొదల్లో పొదల్లాగ , తీగల్లో తీగల్లాగ, పువ్వుల్లో పువ్వుల్లాగ ఉన్నాడనే భావన కలగడం కోసం పోతనగారు చెప్పిన పద్యం ఇది. అంతేగాని కృష్ణుడు పొదల్లో దాక్కున్నాడా ? తీగల్లో నక్కాడా ? పువ్వుల వెనుక ఉన్నాడా ? అని గాని కాదు.

ఇలా మామూలు మాటల్లోనే మంత్ర రహస్యాలుంటాయి. ఇలా అర్థం చేసుకుంటేనే మంత్రం దర్శనమిస్తుంది. సాధారణంగా పుందేవతా మంత్రాలను మంత్రాలని, స్త్రీ దేవతా

మంత్రాలను – విద్యలని అంటారు. ఏ మంత్రమైనా ఏదో ఒక దేవతనుద్దేశించి ఉంటుంది. ఆ దేవతలందరూ అమ్మవారి అంశలే కాబట్టి అమ్మవారు 'మంత్రసారా'.

ప్రణవం దగ్గర నుండి పంచదశాక్షరీ మంత్రం – రశ్మిమాలా మంత్రాలు షన్నీ – అక్షరాలతో వ్యక్తం చెయ్యాల్సినవే! ఈ మంత్రాలలోని అక్షరాలన్నీ పంచాదశ ద్వర్ణాలుగా గాని లేదా ప్రధానమైన మాతృకావర్ణాలుగాగాని ఉంటాయి. ఇవన్నీ అమ్మవారి రూపాలే అని పూర్వనామాలైన – 'పంచాశత్పీఠరూపిణి (533), 'మాతృకావర్ణ రూపిణి' (577) నామాలు వివరిస్తాయి. కాబట్టి అమ్మవారు 'మంత్రసారా'.

సర్వమంత్రముల సార రూపము – అని ఈ నామానికి అర్థం.

## 847. తలోదరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తలోదర్యైనమః' అని చెప్పాలి.

తల = సుకుమారమైన, ఉదరీ = ఉదరము గలది.

'తలము' అంటే 'లోకము' అని అర్థము. విశ్వం మొత్తంలో 14 లోకాలు ఉన్నాయి. వీటిలో భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం – అనే 7 లోకాలు ఊర్ధ్వలోకాలు అని; అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతళ – అనే ఏడు లోకాలు అధోలోకాలని అంటారు.

ఈ ఊర్ధ్వలోక అధోలోకాలన్నిటినీ అంటే మొత్తం 14 లోకాలను అమ్మవారు తన ఉదరమునందు (పొట్టలో) గలిగి ఉంది. కాబట్టి అమ్మవారు 'తలోదరీ'.

'తలము' అంటే – ఆకాశం అనే అర్థం కూడా ఉంది. పంచభూతాల్లో అన్నిటి కంటె సుకుమారమైంది – 'ఆకాశం'. అమ్మవారి ఉదరభాగం (కటి భాగం లేదా నడుము) ఆకాశమంత సుకుమారమైంది, కాబట్టి అమ్మవారు 'తలోదరి'.

(మంత్రసారాలు, శాస్త్రసారాలు తెలిసిన వాని ఉదరం సన్నగానే ఉంటుంది. సాత్త్వికాహారం తినే వారిలో 'శక్తి' తలోదరిగానే ఉంటుంది).

1) చతుర్దశ భువనాలను ఉదరము నందు కలది.

2) ఆకాశము వలె సుకుమారమైన ఉదరము (నడుమ భాగం) కలది అని ఈ నామానికి అర్థం.

## 848. ఉదారకీర్తిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఉదారకీర్త్యైనమః' అని చెప్పాలి.

ఉత్ = పైకి, అర = ప్రకాశించు, కీర్తిః = కీర్తి కలది.

'కృతి' అనే పదం నుండి 'కీర్తి' పదం వచ్చింది. కీర్తి అనేది చేసిన 'కృత్యాల' వల్ల వస్తుంది గాని, తీసుకున్న 'భత్యాల' వల్లరాదు. చాలా మంది చాలా ఎక్కువ విలువ కలిగిన భత్యాలు తీసుకుంటూ కూడా - ఏమీ చ్యెకుండానే, ఎవ్వరికీ తెలియకుండా పోతారు. కాని, తీసుకునే భత్యం (జీతం) తో సంబంధం లేకుండా, అది ఎంత తక్కువైనా - అందరికీ పనికివచ్చే కృత్యాలు ఎక్కువ చేసేవారు ఉంటారు. వారే కీర్తి వంతులౌతారు గాని 'బృహత్ భత్యాల' ఉద్యోగులు కాదు.

సూర్యుడు వేసవికాలంలో జలాశయాల్లోని నీరు తక్కువ ప్రమాణం లోనే తీసుకున్నా, వర్షాకాలంలో కుండపోతగా నీటిని మేఘాల ద్వారా గుమ్మరిస్తాడు - అలానే - రఘువంశరాజులు గూడా ప్రజల దగ్గర నుండి తక్కువ పన్నులు వసూలు చేసి, అందుకు ప్రతిగా వాళ్ళకు ఎక్కువ సౌకర్యాలు కలుగచేసేవారు - అని మహాకవి కాళిదాసు రఘువంశంలో -

శ్లో. ప్రజానామేవ భూత్యర్థం సతాభ్యో బలి మగ్రహీత్

సహస్రగుణ మస్రష్టుం ఆదత్తేహిరసంరవిః -

అని చెబుతాడు. సూర్యుని కిరణాలు కూడా సూర్యుని నుండి కోణరేఖల్లో సర్వదిక్కులకు వ్యాపించడం వల్లెనే ఇటువంటి ఉపయోగకరమైన కృత్యం చేయకలిగి ఇంతటి కీర్తిని పొందగలుగుతున్నాడు. అలాగే అమ్మవారు కూడా అన్ని లోకాలలో ఉండే

సర్వజీవులను సర్వకాల సర్వావస్థల యందు అన్ని విధాల ఆదుకుంటూ – శ్రీమాతగా సృష్టిస్తూ, శ్రీ మహారాజ్ఞిగా పోషిస్తూ, తలోదరిగా కడుపులో దాచుకుంటూ ఉంది కాబట్టి అమ్మవారు 'ఉదారకీర్తి' అవుతుంది.

'ఉత్' అంటే ఊర్ధ్వగతిలో ఆరాధించేవారికి అమ్మవారు కిరణమ్మయిగా దర్శనమిస్తుంది. ఊర్ధ్వగతిలో అంటే కుండలినీ యోగంలో మూలాధారం నుండి సహస్రార మార్గంలో అని అర్థం. ఈ మార్గం గుండా తమ కుండలినీ శక్తిని ఉద్బుద్ధం చేసుకుంటూ ఉపాసించే సాధకులకు సాధనా ఫలంగా అమ్మవారు పూర్తిగా వెలుగు ముద్దలాగా దర్శనమిస్తుంది.

ఎక్కడకు ఎప్పుడు వెళ్ళినా ఆ పరమేశ్వరుని దయాదాక్షిణ్యాలు, శక్తిసామర్థ్యాలు, గుణాగణాలు, ఔదార్యం, దర్శింపబడుతూ, కీర్తింపబడుతూనే ఉంటాయి. ఇదంతా ఆయన యశస్సే'. విశ్వవ్యాప్తంగా ఉండే ఈ యశస్సును 'మహద్యశస్సు' అంటారు. అందుకే పరమేశ్వరుణ్ణి 'తస్యనామమహద్యశః' అన్నారు. అయ్యవారి రూపమైన అమ్మవారి వల్లనే కదా అయ్యవారికీ యశస్సు వచ్చేది. అటువంటి అమ్మవారి నామమే 'ఉదారకీర్తిః'

1) కోణ రేఖలవలె పైకి ప్రకాశించు కీర్తికలది.

2) సూర్యుని కిరణముల వలె వ్యాపించిన కీర్తి కలది.

3) కుండలినీ శక్తిని ఊర్ధ్వమార్గంగా ఉద్బుద్ధం చేసుకుంటూ ఉపాసించువారికి దర్శన మిచ్చు రూపవైభవము.

4) అంతటా నిండిన కీర్తి కలది – అని ఈ నామానికి అర్థం.

## 849. ఉద్దామవైభవా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఉద్దామవైభవాయైనమః' అని చెప్పాలి.

ఉద్దామ = మహాప్రతిభావంతమైన, వైభవా = వైభవము గలది.

'ఉదారకీర్తి' కలది కాబట్టే అమ్మవారు 'ఉద్దామవైభవా' కూడా ఔతుంది – అనే విషయం తేలిగ్గానే అర్థమౌతుంది. కాని, ఈ నామంలోనిగూఢంగా మరికొన్ని కుండలినీ యోగపరమైన విషయాలున్నాయి.

ఉత్ = అంటే పైకి, దామ = అంటే – త్రాడు, (Rope) అనే అర్థాన్ని బట్టి – ఉద్దామ అంటే పైకి పేనబడిన త్రాడు – అనే అర్థం వచ్చి 'ఉద్దామవైభవా' అంటే ఇటువంటి 'పైకి పేనబడిన త్రాడు వలన తెలుసుకొనబడు వైభవము' అనే ఇంకో క్రొత్త అర్థం వస్తుంది.

మనందరిలో ఒక విశిష్టమైన త్రాడు ఉంది. దానినే 'సూత్ర' మంటారు. ఈ సూత్రాన్నే 'నేను' అనే ప్రజ్ఞ అనీ – అందరిలో ఉండే ఈ నేనుల సూత్రమే 'బ్రహ్మసూత్రమ' నీ అంటారు.

ఈ నేను సూత్రం ఘనీభవిస్తే 'శక్తి' అవుతుంది. ఆ శక్తి ఇంకా ఘనీభవిస్తే పదార్థం అవుతుంది. ఈ మూడు స్థితులలోని సూత్రాన్ని వరుసగా సువర్లోక, భువర్లోక, భూలోకాలతో పోలుస్తారు. వీటినే ఆంగ్లంలో Plane of Consciousness, Plane of Force, Plane of Matter అని అంటారు.

మనం ఊర్ధ్వ జీవులము (Vertical Beings) కాబట్టి, మనలో వెన్నెముక నిట్టనిలువుగా పైకి ఊర్ధ్వ ముఖంగా ఉంటుంది. ఈ వెన్నెముకలో మూడు పేటలతో పేనబడు త్రాడు ఉంటుంది. ఈ మూడు పేటలే – ఇడా, పింగళా, సుషుమ్నానాడులు. ఇవి వరుసగా చంద్ర, సూర్య, అనలాత్మకములు. ఈ మూడూ కూడా వెన్నెముక వెంబడి మూడు చోట్ల ముడిపడి ఉంటాయి. ఆ మూడు ముళ్లే బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి. ఈ ముడులను యోగసాధనా నైపుణ్యంతో విడదీయాలి.

శిష్యుడు తన సాధనలో ఇంద్రియలోలుడు కాకుండా, భ్రూమధ్యంలో తన ఇష్టగురువును గాని, ఇష్టదైవాన్ని గాని, లేదా ఒక దివ్యశక్తిని గాని దర్శిస్తూ ధ్యానిస్తే – అంతవరకు తనను నడిపించే గురువు అనుగ్రహాన్ని పొందుతాడు, ప్రజ్ఞ వికసిస్తుంది. తన కుండలినీ శక్తి మూలాధారం నుండి ఆజ్ఞాచక్రం వైపుకు ఊర్ధ్వ మార్గంలో ప్రసరిస్తుంది. ఈ స్థితిలో శిష్యుడిలో రావలసిన అనుకూలమైన మార్పులన్నీ వస్తాయి. ప్రతికూలమైనవన్నీ పోతాయి. క్రమశః సత్కర్మ సాధన ప్రారంభమవుతుంది. వెన్నెముకలోని ముప్పేటల నాడులు, మూడు చోట్ల ఉండే మూడు ముడులు విడిపోయి, తిన్నగా పైకి నిలబడిన త్రాడులా తయారౌతాయి. ఈ స్థితిలో సాధక శిష్యుడు పొందే అనుభూతే 'ఉద్దామ వైభవ' అనుభూతి. మనలో ఈ అనుభూతిని తెల్పే అమ్మవారి పేరు 'ఉద్దామవైభవా'.

1) మహా ప్రతిభావంతమైన వైభవము కలది.

2) సాధనలో పొందు ఉద్దామవైభవ అనుభూతి యొక్క స్వరూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 850. వర్ణరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వర్ణరూపిణ్యైనమః' అని చెప్పాలి.

వర్ణ = వర్ణముల యొక్క, రూపిణీ = రూపమునగా ఉన్నది.

'వర్ణ' అనే పదానికి చాలా అర్థాలున్నాయి. 'రంగు' అనే అర్థంలో – అన్ని రంగుల – రూపంలోను వ్యక్తమయేది అమ్మవారే అని, అలాగే 'అక్షరం' అనే అర్థంలో – అన్ని అక్షరాల స్వరూపంగా ఉన్నది అమ్మవారే అని, అలాగే మనుష్య జాతికి సంబంధించిన వర్ణం అనే(Class) అర్థంలో – అన్ని వర్ణాల రూపంలోను వ్యక్తమయేది అమ్మవారే అని – ఈ నామానికి అర్థాంగా చెప్పుకోవాలి.

'గౌరి', 'కాళి', 'లక్ష్మి', 'సరస్వతి' మొదలైన స్త్రీ దేవతలందరూ వేర్వేరు రూపాల్లోనే కాకుండా, వేర్వేరు దేహచ్ఛాయలలో ఉంటారు. ఇలా వివిధ రూపాల్లో, వేర్వేరు వర్ణాలతో ఉండే స్త్రీ దేవతలందరి స్వరూపాల్లో ఉండేది – అమ్మవారే కాబట్టి, అమ్మవారు 'వర్ణరూపిణీ'.

వర్ణాలు కనబడితేనే వస్తువులు కనబడతాయి, ఆ వస్తువుల్ని పోల్చుకుంటాము. ఈ వర్ణాలను బట్టి స్పందనలు(Vibrations) మారతాయి. గొంతు నుండి వచ్చే శబ్దాల స్పందనాలు అందరికీ ఒకే విధంగా ఉండవు. ప్రతి వ్యక్తి సప్తవర్ణాలు మాత్రమే(Visible Colours) చూడకలడు, అలాగే శబ్దాల విషయంలో కూడా! అంటే కొన్ని స్పందనలకు సంబంధించిన శబ్దాలే వినగలుగుతాడన్నమాట! వీటినే 'శ్రావ్య శబ్దాలు' లేదా 'శ్రావ్య ధ్వనులు' (Audible Sounds) అంటారు. అలాగే – స్పర్శ, రస, గంధాల విషయంలో కూడా మానవపరిధిలో హద్దులుంటాయి.

హద్దులతో సంబంధం లేకుండా అన్ని రూపాల, అన్ని శబ్దాల రూపంగా ఉండేది అమ్మవారే ఔతుంది.

మనం మాట్లాడుతూ 'గాంధీ' అని అంటే – గాందీ గారి రూపం మనలో కనిపిస్తుంది. అంటే – గాంధీ గారి రూపాన్ని సంధానం చేసే చోటు మనలో కొంత కేటాయించబడిందన్నమాట! ఎప్పుడు గాంధీగారి మాట ప్రసక్తి వచ్చినా ఈ చోటు వద్ద మనకు స్పందన కలుగుతుంది. అంటే – గాంధీ గారికి మనలో ఈ చోటు Switch లాంటిది అనుకోవచ్చును. ఇలా రూపం విషయంలోనే కాదు మిగిలిన శబ్ద స్పర్శ రస గంధాల విషయంలో కూడా మనలోనే వేరు వేరు చోట్ల వాటికి సంబంధించిన స్విచ్‌లు ఉంటాయి. అన్ని రకాల శబ్దాలకు, స్పర్శలకు, రూపాలకు, రసాలకు, గంధాలకు సంబంధించిన ఇటువంటి స్విచ్‌లు అన్నీ మన వెన్నెముకలో ఉంటాయి. ఈ వెన్నెముక Type Writer Key Board లాంటిది అనుకోవచ్చును. మనం చూసే రంగులు వాస్తవానికి రంగుల ప్రతి రూపాలే గాని – రంగులు కావు. ఆ రంగులకు అసలైన మూలకారణాలు మనలోని వెన్నెముకలో ఉంటాయి. నాడీ స్వరూపిణి అయిన అమ్మవారు అనుగ్రహించినపుడు మాత్రమే ఈ కారణ కేంద్రాలు పనిచేస్తాయి. కాబట్టి అమ్మవారు 'వర్ణ స్వరూపిణి'.

1) వివిధ రంగుల, అక్షరాల, శబ్దాల, రూప, రస, గంధాల రూపముగా ఉండునది.

2) వివిధ దేహచ్ఛాయలు గల గౌరీ, లక్ష్మీ, కాళీ మొదలగు స్త్రీ దేవతా రూపములుగా ఉండునది.

3) వివిధ శబ్దస్పర్శాదులు స్ఫురింప చేయుటకు వెన్నెముక యందు ఉండు ప్రేరణా శక్తి రూపము – అని ఈ నామానికి అర్థాలు.

## 851. జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతి దాయినీ

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతి దాయిన్యై నమః' అని చెప్పాలి.

జన్మ = జననము, మృత్యు = మరణము, జరా = ముసలితనము అను వికారములచే; తప్త = తపింపచేయబడు, జన = భక్తులకు, విశ్రాంతి = ఉపశమన సుఖమను, దాయినీ = ఇచ్చునది.

పదహారు అక్షరాలతో నిండుగా ఉండే ఈ నామం చాలా ముఖ్యమైంది. దీన్ని శ్రీ విద్యకు, శ్రీ లలితారాధనకు ఫలశ్రుతిగా చెప్పుకోవచ్చును.

'పునరపి జననం పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం ఇహ సంసారే బహుదుస్తారే కృపయాపారే పాహి మురారే' – అని భజగోవింద శ్లోకాల్లో శ్రీ శంకర భగవత్పాదులు చెప్పారు. 'ఈ జనన మరణ చక్రభ్రమణం (Cycle of Births & deaths) లోపడిన జీవుడు అలా నిరంతరం దానికి లోబడి – పుడుతూ – గిడుతూనే ఉంటాడు. దాని నుండి తప్పించుకోలేక దుఃఖిస్తూ, బయటపడేందుకు ఉపశమనం కోసం ఆకాంక్షిస్తాడు. అలాంటి వారికి ఈ గోవింద భజనం ఒక్కటే చక్రభ్రమణం నుండి బయటపడేందుకు మార్గం' అని ఆదిశంకరులు ఈ శ్లోకంలో సూచించారు. ఈ సూచనలకు మూలం వ్యాసుల వారు వ్రాసిన లలితా సహస్ర నామ స్తోత్రంలోని ఈ నామం అని చెప్పుకోవచ్చును. ఎందుకంటే – గోవిందరూపిణీ (267) ముకుందా (838) నామాల్లో చెప్పిన ఆ గోవిందుని రూపం అమ్మవారే కాబట్టి – అంటే, ఈ జనన మరణ సంసార చక్రభ్రమణం నుండి బయటపడాలంటే అమ్మవారిని భజించాలి అని చెప్పి వ్యాసుల వారు చూపించిన పరిష్కార మార్గాన్ని ఆదిశంకరులు కూడా అనుసరించి, ఆ అమ్మవారి రూపంలోనే ఉన్న గోవిందుణ్ణి భజించండి – అని ఇంకో రకంగా చెప్పి నిర్ధారించారన్నమాట!

ఇంతకు పూర్వం చెప్పబడిన 'భవచక్రప్రవర్తినీ', 'భవరోగఘ్నీ' నామాలు పరస్పరం విరుద్ధంగా ఉన్నట్లుంటాయి. ఎందుకంటే జనన మరణ చక్రంలో ప్రవర్తింపచేసేది అమ్మవారు అని – 'భవచక్రప్రవర్తినీ' నామం చెబుతోంది. ఈ 'భవచక్రానుభవరోగం పోగొట్టునది' – అని 'భవరోగఘ్నీ' 'భవనాశినీ' నామాలు చెబుతాయి. ఈ రెండు మూడు నామాల వివరణలో వైరుధ్యం కనబడుతుంది. ఈ విషయాన్ని చాలా సునిశితంగా అవగాహన చేసుకోవాలి.

ప్రతి జీవికి ఇచ్చిన మొదటి జన్మ పవిత్రమైనదే ! కాని మానవుడు మొదట చేసిన అవిధేయత వల్ల ఇన్ని ఇబ్బందుల్లు వచ్చాయి. ప్రకృతి సహజమైన ఆహార నిద్రాభయ

మైథునాల యందు స్వేచ్ఛ కలిగి తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించాడు. తత్ఫలితంగా జన్మ కర్మ బంధమైంది. కర్మబంధ ఫలితంగా జన్మలు కలుగుతున్నాయి. మనం'Free will' అంటాము కాని ఎంత చదివినా, ఎంత నేర్చినా – మనమందరము ప్రకృతికి బానిసలమే! దాని ముందు ఈ డిగ్రీల చదువులు, పదవులూ అన్నీ తక్కువే! ఏవి పనికిరాదని ప్రకృతి శాసిస్తుందో – అవే చేస్తాము. దీన్నే అవిధేయత అంటారు. (ఆడమ్ – ఈవ్‌లు దేవుని మాట వినకుండా దేవునిపట్ల అవిధేయతతో తినవద్దన్న ఆపిల్ పండు తిని కష్టాలు కొని తెచ్చుకున్నారు – అని ఇదే విషయం బైబిల్‌లో కూడా మొట్టమొదట అధ్యాయం Genesis లోనే చెప్పబడుతుంది.)

మొదట జన్మ తప్పించి మిగిలిన జన్మలన్నీ కర్మఫలితాలే ! సత్కర్మాచరణలో జన్మను పవిత్రీకరణం చెయ్యాలి. అప్పుడు గాని పరంపరగా వచ్చే జన్మలలో మార్పురాదు. తప్పులు తెలుసుకుని దిద్దుకుంటూ సర్వజీవుల్లోను సర్వాంతర్యామిని దర్శించడం మొదలు పెడితే – సర్వమూ చక్కదిద్దబడుతుంది. జన్మకర్మలు నాశనమౌతాయి.

'మృత్యువు' అనేది ఒక మానసిక వ్యాధి. దీనిని గురించి చెప్పడానికే 'కఠోపనిషత్తు' ఇచ్చారు మన పెద్దలు. ప్రజ్ఞాప్రసారంలో ఏర్పడే తాత్కాలిక అవరోధమే – మృత్యువు. ఎన్ని జన్మలు వస్తూపోతూ ఉన్నా – పూసలలోని దారంలాగా 'నేను' అనే ప్రజ్ఞను ఆలంబన చేసుకుని ఆ జన్మలు వస్తున్నాయని తెలుస్తుంది. ఈ జ్ఞానోదయం వచ్చినప్పుడు – మృత్యువు అంటే ఏమిటో తెలిసి, మృత్యభీతి తొలగుతుంది.

'జరా' అనేది మనం చేసిన దోషాల ఫలితమే! ఆహార నిద్రాభయ మైథునాదులందు ఎంతెంత దుష్కర్మ ఆచరించామో 'జరా' స్థితి అంతదుర్భరమౌతుంది. కాబట్టి, ఈ జన్మమృత్యు జరాబాధలు పూర్వదోషాల వలన కలుగుతున్నాయి. వీటితో తపింపబడే భక్తులందరికీ తమ తప్పులు తెలిసి సన్మార్గంలో జీవించేటట్లుగా జ్ఞానోదయం కలుగచేసి, వారి జీవితాలను చక్కదిద్ది, అమ్మవారు వారికి ఉపశమనాన్ని కలుగచేస్తుంది.

ఒక సంస్థలో ఒక ఉద్యోగివల్ల తప్పులు జరిగితే – జరిమానాలు, జీతం తగ్గించడాలు, డిప్రొమోట్ చెయ్యడాలు ఉంటాయి. చేసే తప్పులు ఎక్కువైన కొద్దీ ఈ

బాధలు పెరుగుతాయి. ఇక ఆ ఉద్యోగి పైకి రావడం అంటూ ఉండదు. అదే సంస్థలో అదే విధంగా క్రిందా మీదా పడుతూ లేస్తూ తన జీవితాన్ని కొనసాగించవలసి వస్తుంది. ఏనాడు తన తప్పులు తెలుసుకుని, వాటిని దిద్దుకుని జాగ్రత్త పడతాడో అప్పటి నుండి మళ్ళీ పై పదవులు పొందుతూ అభివృద్ధి పథంలో పయనిస్తాడు. ఈ మార్పు వచ్చేంతవరకూ ఆ ఉద్యోగికి బాధలు తప్పవు. ఈ సృష్టి వ్యవస్థలో జీవి పరిస్థితి కూడా ఇదే విధంగా ఉంటుంది. ఆ సృష్టికర్త నిర్వహించే ఈ సృష్టి వ్యవస్థలో దోషాలు చేసిన జీవి జనన మరణ చక్రభ్రమణంలో తిరుగుతూనే ఉంటాడు. ఆ సృష్టికర్త విధించిన నియమనిబంధనల ప్రకారం ఆ జీవి అలా ఆ చక్రంలో త్రిప్పబడుతూనే ఉంటాడు. ఎప్పుడైతే జ్ఞానోదయం కలిగి తప్పులు తెలుసుకుని దిద్దుకుని జాగ్రత్త పడతాడో - అప్పటి నుండి తన తప్పులకు ఉపశమనం కలిగి సృష్టికర్త అనుగ్రహానికి నోచుకుని పరిష్కారాన్ని, ఉపశమనాన్ని, విశ్రాంతిని పొందుతాడు. ఈ జ్ఞానోదయం అమ్మవారి అనుగ్రహం వల్ల రావల్సిందే !

పుట్టుక, చావు, ముసలితనముల వలన తపింపబడు జనులకు ఉపశమన సుఖమును కలుగచేయునది - అని ఈ నామానికి అర్థం.

## 852. సర్వోపనిషదుద్ఘుష్టా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వోపనిషదుద్ఘుష్టాయైనమః' అని చెప్పాలి.

సర్వ = సకల, ఉపనిషత్ = ఉపనిషత్తుల చేత, ఉద్ఘుష్టా = బహుధా ప్రతిపాదింపబడి, ప్రశంసింపబడినది.

కర్మకాండ, జ్ఞానకాండ కలసి ఉన్నవే వేదాలు. ఆ వేదాలలో ప్రతిపాదింపబడిన అతి ముఖ్య విషయాలన్నీ మళ్ళీ వేరే సంకలనం చేస్తే వచ్చినవే ఉపనిషత్తులు. మోక్షాన్ని పొందేందుకు, యోగజీవన విధానం గడిపేందుకు ఈ ఉపనిషత్తులు ఉపకరిస్తాయి. వేదాలకు అంతము నందు చెప్పబడిన ఈ ఉపనిషత్తులను 'వేదాంతాల' నీ, 'వేదశీర్షా' లు (శ్రుతిశిరస్సులు) అనీ కూడా అంటారు. జ్ఞానులు, విబుధ జనులు, పండితులు అందరూ నెత్తి మీద పెట్టుకుని గౌరవించే ఈ ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడే విషయాలన్నీ

అమ్మవారి గురించి, అమ్మవారి సృష్టి గురించి, సృష్టి ప్రణాళిక గురించి – ఇలా ఎన్నో విషయాలు అమ్మవారి పరంగానే ఉంటాయి. 'కేనోపనిషత్తు' అని ప్రత్యేకంగా అమ్మవారి శక్తి సామర్థ్యాలను గురించే వివరిస్తుంది. ఈ ఉపనిషత్తులు వేల సంఖ్యలో ఉన్నప్పటికీ - అందరూ తప్పక చదవవలసినవి, ముఖ్యమైనవి ఐన ఉపనిషత్తులు పది ఉన్నాయి. ఇవి - ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాంధోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు. వీటన్నిటిలో అమ్మవారి తత్త్వం తప్పకుండా ప్రతిపాదింపబడుతుంది. ఈ విషయం 'శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జ ధూళికా' అనే నామంలో ముందే చెప్పబడింది.

సర్వ ఉపనిషత్తులలోను బహుధా ప్రశంసింపబడి, ప్రతి పాదింపబడినది – అని ఈ నామానికి అర్థం.

## 853. శాంత్యతీత కళాత్మికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాంత్యతీతకళాత్మికాయైనమః' అని చెప్పాలి.

శాంతి = శాంతికి, అతీత = అతీతముగా ఉండు, కళ = కళయొక్క, ఆత్మికా = స్వరూపిణి.

మనలోని 'స్తబ్ధత' శాంతి కాదు. మనలో పెల్లుబికే ఆనందం యొక్క నిలకడ స్థితిని 'శాంతి' అనాలి (Joy at rest is peace) మోక్షేచ్ఛ కలిగిన ప్రతి జీవికి తప్పనిసరిగా ఈ శాంతి స్థితి ఉండి తీరాలి. ఈ స్థితి లేనివాడు, రానివాడు నిరంతరం ఘర్షణలోను, ఆతృత, ఆవేదనలోను ఉంటాడు. ఇటువంటి శాంతికి కూడా అతీతంగా ఉండే పరమ ఉత్కృష్టమైన ఒక అనుభూతికి సంబంధించిన స్థితిలో అమ్మవారు ఉంటుంది. సహస్రార చక్రంలోని బిందు స్థానంలో మనకుండలినీ శక్తి అయ్యవారితో కలసి ఉన్నపుడు మనకీ అనుభూతి దక్కుతుంది తప్ప, ఇతర సమయాల్లో ఉండదు. ఇది నిరతిశయ జ్ఞాన స్వరూపము.

శాంతికి అతీతమైన ఒక దివ్య కళాస్వరూపము – అని ఈ నామానికి అర్థం.

## 854. గంభీరా

· మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గంభీరాయైనమః' అని చెప్పాలి.

గంభీరా = గంభీరముగా ఉండునది.

'నిండుతనం' గంభీరానికి అవసరమైన లక్షణం. ఈ నిండుతనం – ఐశ్వర్యం, జ్ఞానము, బలము, వీర్యము మొదలగు వాటితో కూడి నదైతే అది పూర్తిగా అమ్మవారికి సంబంధించిన విషయమవౌతుంది. ఎంత అన్వేషించుకుంటూ, పరిశోధించుకుంటూ పోయినా – ఎన్ని తెలుసుకుంటున్నా – ఇంకా ఎన్నో రహస్యాలు ఉంటూనే ఉంటాయి. ఈ సృష్టిలో తెలిసిన దాని కన్నా తెలియ వలసిందే ఎక్కువ (What is not revealed in this world is more than what is revealed). ఒడ్డున ఉండి సముద్రాన్ని చూస్తే అలలు మాత్రమే కనబడతాయి. కాని, లోపలకు వెళ్తున్న కొద్దీ ఎన్నో క్రొత్త క్రొత్త విషయాలు, ఎప్పుడూ చూడనివి, విననివి గూడా తెలుస్తాయి. తెలిసిన వాటి కన్నా తెలియనివి ఎన్నో ఉంటాయి. ఇలాంటి లక్షణాలున్నది కాబట్టే సముద్రాన్ని గంభీరంగా ఉందంటారు. అలాగే 'చోటు' కూడా ఏమీ తెలియనట్లు అమాయకంగా ఉన్నా ఎన్నో విషయాలు ఈ చోటులో ఉంటాయి. అంటే – నిండుతనం, విషయపులోతులు ఉన్న చోట గంభీరత ఉంటుంది. అమ్మవారికి – సముద్రంలాగాను, చోటులాగాను – ఈ లక్షణాలు ఉండబట్టే 'గంభీరా' అనే నామం వచ్చింది. ఈ చోటు గోళం(Space Globe) లో ఎంత లోతుకు వెళ్ళినా అమ్మవారే ( గురుత్వాకర్షణ కలిగి) ఉంటుంది.

ఇన్ని లక్షణాలున్నా మన ఊహలకు, వాక్కులకు, చివరకు మనస్సుకు కూడా గోచరించేది కాదు. ఎంతో ధ్యాన నిష్ఠతో ఉంటే గాని అమ్మవారు ద్యోతకం కాదు.

నిండుతనం, విషయపులోతులతో ( సముద్రంలాగా) గంభీరంగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 855. గగనాంతఃస్థా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గగనాంతఃస్థాయైనమః' అని చెప్పాలి.

గగనాంతః = ఆకాశమునందు, స్థా = ఉండునది.

సముద్ర గాంభీర్యంతో పోల్చబడి గతనామంలో - చోటు గోళంలోని 'లోతు లక్షణం గలిగినది'గా అమ్మవారు చెప్పబడితే - ప్రస్తుత నామంలో ఆకాశ ఔన్నత్యంతో పోల్చబడి ఎంత ఎత్తుకైనా వెళ్ళగలుగు సూక్ష్మ తమమైన వికిరణాత్మక లక్షణం (Radiating Characterstic) గలిగినదిగా చెప్పబడుతుంది. అంటే - గత నామంలో అమ్మవారి స్థూల గంభీర లక్షణాన్ని (Gravitating Principle), ఈ నామంలో అమ్మవారి సూక్ష్మ వికిరణ లక్షణాన్ని చెప్పడం జరిగిందన్నమాట ! ఈ రెండు లక్షణాలు కలదే అమ్మవారు. ఈ 'గగనం' 'పూర్ణ' మైంది. దీన్నే పురాణాల్లో 'అదితి' 'మూలప్రకృతి' అన్నారు. దీనినుండే సృష్టియావత్తూ వస్తుంది. ఈ చోటు గోళంలో ఎంత ఎత్తుకు వెళ్ళినా అమ్మవారే దర్శనమిస్తుంది. గగనం అంత విశాలమైంది మరొకటి లేదు. అమ్మవారు గూడా అంతే !

(ఉన్నతత్వంలోను, విశాలత్వంలోను, సూక్ష్మత్వంలోను అమ్మవారు) ఆకాశమునందు వలె అన్నిటి కన్నా మిన్నగా ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 856. గర్వితా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గర్వితాయైనమః' అని చెప్పాలి.

గర్వితా = గర్వము చెందినది.

రాగము, క్రోధము - ఇవి అమ్మవారి ఆయుధాలను సూచించే లక్షణాలు. రాగం - పాశానికి, క్రోధం - అంకుశానికి అని చెప్పుకున్నాం. అలాగే గర్వం, - ఏకచ్ఛత్రాధిపత్యాన్ని, రాజసాహంకారాన్ని సూచిస్తుంది. అమ్మవారి గర్వం పరవశత్వాన్ని

సూచిస్తుంది' 'పర - వశము' అయితే - అంటే, పరమేశ్వర వశంలో ఉన్న అమ్మవారు - గర్వం పొందినదౌవుతుంది.

ఈ బ్రహ్మాండంలో లోతుగా ఉన్న కేంద్రం నుండి, ఉపరితలంలో ఉన్నతంగా ఉన్న ఆకాశం దాకా గర్వంతో ఆనంద పరవశత్వంతో డోలనాలు చేసే చైతన్య స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 857. గానలోలుపా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గానలోలుపాయైనమః' అని చెప్పాలి.

గాన = గానమునందు, లోలుపా = ప్రీతిగానిమగ్నమైనది..

అమ్మవారు 'సామగానప్రియా' అని రాబోయే నామంలో వస్తుంది. 'వేదానాంసామవేదోఽస్మి' అని గీతలో భగవానుడు చెబుతాడు. కాబట్టి, ఇద్దరికీ సామవేద గానం అంటే చాలా ఇష్టం అన్నమాట! దీనిని బట్టి జీవుడు కూడా సామగానలోలుడై - 'పర - వశుడై', అంటే - పరమునందు లీనమై (Lower consciousness submiting to Higher consciousness) నిరతిశయపరవశత్వాన్ని, అంటే - ఆనందాన్ని పొందుతాడు.

ఇంద్రియాలతో ఆనందించే గానం - (Mercurian Music) అన్నిటి కన్న అధమ మైన సంగీతం. మనస్సుతో ఆనందించేది(Venetian Music) మధ్యమం. మనస్సు లీనమై పరవశత్వంతో ఆనందాన్ని అనుభవింపచేసేదే(Neptunian Music) అసలైన సంగీత గానం. నిరంతర సాధన, క్రమశిక్షణ ఉంటేగాని మనస్సు కూడా లీనమయ్యే ఈ ఉత్తమ గంధర్వగానం రాదు.

'ప్రాణః సామవేదః' అన్నారు. సామవేదంలో లయ మవడమంటే ప్రాణ శక్తిలో లయమవడమే ! ప్రాణానికి గుండెకు ఇలాంటి సంబంధం ఉండబట్టే గుండె కొట్టుకోడంలో ఒక లయ (ఆవర్తన లేదా (Periodicity) ఉంది. ఒకేరకంగా కొట్టుకుంటున్నా ఈ లయలో విసుగు ఉండదు, విలోలత్వమే ఉంటుంది.

సంగీతం – ఆరోహణ, అవరోహణ, స్వరాలననుసరించి రాగతాళ లయబద్ధంగా ఉంటుంది. ఇంతకు ముందు వచ్చిన 'గగనాంతఃస్థా' నామంలో ఉన్నతమైన ఈ 'ఆరోహణ' విషయం, 'గంభీరస్థా' నామంలో లోతైన ఈ అవరోహణ విషయం ఉత్తమ గానానికి సంబంధించిన లక్షణాలుగా ముందే సూచింపబడ్డాయి.

గానంలో పరవశత్వం అనేది పతాకస్థాయిలో ఉన్నపుడు – అందరూ 'పర–వశు' లౌతారు. అంటే – భగవంతునిలో లీనమౌతారు. అంతటి శక్తి ఈ గానానికి ఉంటుంది కాబట్టి – అమ్మవారు 'గానలోలుపా'.

గానము నందు ప్రీతిగా నిమగ్నమైనది' అని ఈ నామానికి అర్థం.

## 858. కల్హారహితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కల్పనారహితాయై నమః' అని చెప్పాలి.

కల్పనా = కల్పనలు, రహితా = లేనిది.

కల్పింవబడేవి కల్పనలు. తమంత తాము వచ్చేవి సంకల్పములు. మనం సంకల్పిస్తే పనులు కావచ్చు, కాకపోవచ్చు. లోపల నుండి అమ్మవారి సంకల్పంగా వస్తే పని దిగ్విజయంగా ఔతుంది. (Man Proposes God disposes) వికల్పాలు ఒకటి కాకపోతే ఇంకోటి (Alternatives) అనే లక్షణం కలవి. మనం చేసే వాటిలో సంకల్పాలకన్నా ఈ వికల్పాలు ఎక్కువ ఉంటాయి. ఇటువంటి వికల్పాలు మనలో మనం జరుపుతున్నంత వరకు అమ్మవారు మనలో సంకల్పంగా దిగిరాదు. మనం కల్పనలు మానితే – ఆవిడ మనలో సంకల్పంగా దిగివస్తుంది.

(చాలా మంది ముహూర్తాల కోసం, సలహాల కోసం, జ్యోతిష్కుని దగ్గరకు వెళ్తారు. వాళ్లకు మనస్సులో కొన్ని ముహూర్తాలు, వాళ్ళ చెయ్యాలనుకునే పనులు ఉంటాయి. జ్యోతిష్కుడు అడక్కుండానే ముందు వారు చెబుతారు. ఇక అలాంటప్పుడు జ్యోతిష్కుడు చెయ్యాల్సింది ఏమీ ఉండదు. కాని, నిజాయితీగా జ్యోతిష్కుని సలహా తీసుకోదలచిన వారు తమ నిర్ణయాలు చెప్పి నిర్బంధ పెట్టరు.

మనం చెయ్యాల్సిన పనులు మనం చేస్తూ ఉంటే మన ద్వారా తర్వాత చెయ్యవలసిన పనులు సంకల్ప రూపంలో ఉండి అమ్మవారు చేయిస్తుంది. ఆవిడ సంకల్పాలకు అనుగుణంగా మనం చేసేవే కల్పలోకంలో విధ్యుక్త ధర్మాలు అవుతాయి.)

ఆత్మేశ్వరిగా అమ్మవారికి – దృశ్యగుణాలకు, భౌతికానికి సంబంధించిన కల్పనలు ఉండవు. అందుకని అమ్మవారు 'కల్పనారహితా'.

కల్పనలు – లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 859. కాష్ఠా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాష్ఠాయై నమః' అని చెప్పాలి.

కాష్ఠా = ఒక ప్రమాణము.

'కాలం' (Time) నిండా అమ్మవారే! అలాగే చోటు (Space) నిండా అమ్మవారే! అలాగే, కాలాన్ని గాని, చోటును (ప్రదేశాన్ని) గాని కొలవడానికి మూల ప్రమాణం 'కాష్ఠ' కాబట్టి ఈ కాష్ఠ అనేది – దేశ కాలాత్మకంగా ఉండే అమ్మవారి యొక్క 'ఒక చిన్న ప్రమాణం' ఔతుంది. జీతాన్ని – ఇన్ని రూపాయలు అని చెప్పినపుడు, రూపాయి ఎలాంటిదో విశ్వం నిండా నిండి ఉన్న అమ్మవారి గురించి చెప్పేటప్పుడు 'కాష్ఠా' అనేది కూడా అలాంటిదే అని అర్థం చేసుకోవాలి.

అయ్యవారు (గగనం) లాంటివాడైతే, అమ్మవారు దిక్కు(Direction) లాంటిది. గగనాత్మకుడైన అయ్యవారిని ప్రత్యేకంగా 'భీముడు' అనేపేరుతో పిలుస్తారు. అలాగే దిక్స్వరూపిణి అయిన అమ్మవారిని 'కాష్ఠా' అని పిలుస్తారు.

1) కాలముల ప్రమాణ స్వరూపము.

2) ప్రదేశ మూలప్రమాణ స్వరూపము – అని ఈ నామానికి అర్థాలు.

## 860. అకాంతా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అకాంతాయైనమః' అని చెప్పాలి.

'కాంతా' అనేది 329వ నామంగా ఇంతకు పూర్వం వచ్చింది. (ద్వితీయభాగంలో) ప్రస్తుతం కూడా 'కాంతా' అన్నట్లుగానే చెప్పుకుంటే - నామం పునరుక్తం అవుతుంది. అందుకని - 'కాష్ఠా + అకాంతా' అని ఇంత కు ముందు నామం అయిన 'కాష్ఠా'తో సవర్ణదీర్ఘసంధిగా గుర్తించి, ఈ నామాన్ని ఇప్పుడు 'అకాంతా' అనే విధంగా చెప్పుకోడం జరుగుతోంది.

'అకము' అంటే - బాధ (Pain), నిరాశ (Misery), పాపము (sin), దుఃఖము (Worry) అనే అర్థాలున్నాయి. ఇన్ని రకాల అర్థాల పరంగానూ ఈ నామాన్ని వివరించుకుంటే - (తన భక్తులకు) బాధను, నిరాశను, పాపమును, దుఃఖమును - అంతము చేయునది.- అనగా, పోగొట్టునది - అని ఈ నామానికి అర్థం.

## 861. కాంతార్ధవిగ్రహా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాంతార్ధ విగ్రహాయైనమః' అని చెప్పాలి.

కాంత = భర్తయొక్క, అర్ధ = సగము, విగ్రహా = శరీరముగా ఉన్నది.

శివుని కోసం తపస్సు చేసి శివుని శరీరంలో సగమైన - వామభాగాన్ని పొందిన అమ్మవారిని సూచించే నామం ఇది. వాస్తవానికి - అర్ధనారీశ్వరునిలో అటు, ఇటు ఉన్నవాడు అయ్యవారే అయినా, భౌతిక విగ్రహం మాత్రం అమ్మవారే ! 'క + అంత = కాంత' అని విడదీస్తే - క - 'క కారము'ను, 'అంత - 'అంతము'ను సూచిస్తాయి. ఈ రెండునూ గలది అని అర్థం. వరరుచి ఇచ్చిన అక్షర సంఖ్యా పరిజ్ఞానం ప్రకారం 'క' అంటే - 1, అంత - అంటే '0'. ఈ సంకేతాలను బట్టి - '1, 0లు కలసి ఉన్న విగ్రహముగా ఉన్నది' - అని ఈ నామానికి అర్థం వస్తుంది. వీటిలో '1' అయ్యవారైతే '0' అమ్మవారిని

సూచిస్తుంది. అంటే– అవి వరుసగా ఆత్మకారకుడైన తండ్రిని, దేహకారకురాలైన తల్లిని సూచిస్తాయన్నమాట! ( ఒకటి, ప్రక్కన సున్నాలు పెట్టుకుంటూ పోతే క్రొత్త క్రొత్త దేహాలతో జన్మపరం పరలు తరతరాలుగా వస్తాయి – అని సూచిస్తుంది.)

'కాంత' అంటే అందమైనది లేదా 'ఆకర్షణీయమైనది' అని అర్థం. ఈ అర్థాన్ని తీసుకుంటే – 'అందానికి లేదా ఆకర్షణకు అర్థాన్ని (అంటే ప్రయోజనాన్ని) సూచించే రూపము' – అని ఈ నామానికి మరో అర్థం వస్తుంది. మొత్తం మీద ఈ నామానికి ఈక్రింది అర్థాలు చెప్పవచ్చును.

1) భర్త శరీరములో సగభాగము పొందినది. లేదా సగభాగముగా ఉన్నది.

2) ఆత్మకారకుడైన తండ్రిని, దేహకారకురాలైన తల్లిని, కలిగి యున్న రూపము.

3) అందానికి లేదా – ఆకర్షణకు ప్రయోజనమును సూచించు రూపము.

## 862. కార్యకారణనిర్ముక్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కార్యకారణ నిర్ముక్తాయైనమః' అని చెప్పాలి.

కార్య = కార్యము చేత, కారణ = కారణము చేత, నిర్ముక్త = వదలిపెట్టబడినది.

మహత్తు, అహంకారం, అష్టప్రవృత్తులు, నామరూపాలతో ఉండే ఈ ప్రపంచాన్ని – 'కార్యము' అని, ఈ కార్యము దేని నుండి, దేని వలన వ్యక్తమౌతుందో దాన్ని – 'కారణమ' నీ అంటారు. కార్య, కారణాలు ఈ రెండూ విడిచి పెట్టబడిన నిర్వికార శుద్ధ చైతన్య స్వరూపమే అమ్మవారు.

'నతస్యకారణం చ విద్యతే' అన్న శ్రుతి వాక్యానికి అర్థమిదే. అంటే కార్యకారణములతో నిమిత్తము లేనిది.

కార్య కారణములచే విడిచి పెట్టబడినది – అని ఈ నామానికి అర్థం.

# 863. కామకేళీతరంగితా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామకేళీ తరంగితాయైనమః' అని చెప్పాలి.

కామ = కాముని, కేళీ = క్రీడా విశేషములచే, తరంగితా = పరంపరలుగా వచ్చు తరంగములవంటిది.

'కామకేళీ' అంటే వెంటనే 'మన్మథక్రీడ' అనే గుర్తుకు వస్తుంది. కాని 'కామ' అనే శబ్దానికి మన్మథుడే కాదు – 'కామేశ్వరుడు' లేదా శివుడనే అర్థం కూడా ఉంది. ఈ కామకేళి మూడు రకాలుగా ఉంటుంది 1) మహా కామం 2) సాంసారిక కామం 3) యోగ సంబంధమైన కామం.

మన్మథుడు పుట్టిన తరువాత స్త్రీ పురుష సంబంధమైన మన్మథ క్రీడ ఉంటుంది. కాని, మన్మథుడు పుట్టక పూర్వం ఒక కామం ఉంది. ఒంటరిగా ఉన్న శివుడికి – ఎంతోమందిగా అయి ప్రపంచంగా మారుదామనే కోరిక గలగడమే ఈ – 'మహాకామం'. (సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి – తైత్తిరీయం). ఈ కోరిక కలిగిన శివుణ్ణి, 'మహాకాముడ'ని, అలా కలిగిన కోరికను 'మహాకామం' అనీ, ఆ కోరికను అనుసరించి వ్యక్తమైన ఈ సృష్టి స్వరూపిణిని 'మహాకామేశ్వరి' అనీ అంటారు. ఈ మహాకామానికి సంబంధించిన 'కామకేళి' కూడా ప్రతి ప్రళయానంతరం సృష్టికి ఉన్ముఖంగా జరుగుతూనే ఉంటుంది. తరంగాలుగా జరిగే ఈ మహాకేళితో సంబంధము ఉన్న అమ్మవారిని 'మహాకేళీతరంగితా' అంటారు.

మన్మథుడు పుట్టిన తరువాత వచ్చింది సాంసారిక కామం. సృష్టికార్యాన్ని – సృష్టించబడిన జీవుల చేతనే కొనసాగబడేట్టు చెయ్యడానికి ఏర్పాటైన స్త్రీ పురుష సంబంధమైన కామకేళి కూడా – మొదటి సృష్టి జరిగినప్పటి నుండి ఇప్పటివరకు, మరి ఇంకా ముందు ముందు కూడా ఇలాగే కొన సాగుతూ ఉంటుంది. అంటే, ఈ కామకేళి కూడా తరంగాలవలె నిరంతరం జరుగుతూనే ఉంటుంది.

మన్మథుడు భస్మమైన తర్వాత, అంటే – కామం నశించిన తరువాత–మోక్షానికి నాంది జరుగుతుంది. 'మూలాధారం వద్ద ఉండే కుండలినీ శక్తి సుషుమ్నా మార్గంలో

షట్చక్ర భేదనంచేసుకుంటూ చిట్ట చివరకు సహస్రారంలో ఒంటరిగా ఏకాంతంగా ఉండి శక్తుడైన శివునితో లయమై పోవడం' - అనే యోగసిద్ధి (జీవేశ్వర సర్వేశ్వర ఐక్యం) గూడా కామకేళి క్రిందకే వస్తుంది. యోగసిద్ధికి సంబంధించిన ఈ కామకేళి కూడా నిరంతరం యోగము ఉన్నంతవరకు జరుగుతూనే ఉంటుంది.

నిరంతరము అలలు వచ్చే విధంగా జరిగే పైన తెల్పిన మూడు రకాల కామకేళిలోను కామేశ్వరునితో సహకరిస్తూ తరంగంలాగా వర్తించే అమ్మవారిని 'కామకేళీతరంగితా' అంటారు.

## 864. కనత్కనకతాటంకా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కనత్కనక తాటంకాయై నమః' అని చెప్పాలి.

కనత్ = ప్రకాశించు, కనక = బంగారు, తాటంకా = కర్ణాభరణములు గలిగినది.

'కనత్' అనే పదాన్ని వెలుగుకూ, శబ్దానికి గూడా సంబంధించిన విశేషణంగా చెప్పుకోవచ్చు. ఈ వెలుగు, శబ్దాలకు అవి నా భావ సంబంధం ఉంటుంది.

ఒక వైపు శబ్దపరంగా సోహం నుండి ఓంకారం, దాని నుండి అక్షరాలు, శబ్దాలు పుడుతూ ఉంటే - ఇంకోవైపు - వెలుగుపరంగా సూర్యోదయ కిరణాలు, అవి ఘనీభవించి గ్రహ, గోళ, తారకాదులు పుడుతూ ఉంటాయి.

అమ్మవారు నిత్య చైతన్య స్వరూపము. ఆవిడ ఆనందంలో కర్ణాభరణాలు కదులుతాయి - ఆ కదలికలవల్ల, 1) కమనీయమైన ధ్వనులు ప్రసారమౌతాయి. 2) మెరుపులలాగా రమణీయమైన వెలుగులు ప్రసరిస్తాయి. పైగా ఈ కర్ణాభరణాలు తాటంకాలు. ఇవి - సూర్య చంద్ర గోళ సంబంధమైనవి. (తాటంక యుగళీ భూత తపనోడుపమండలా) ఈ రెంటివల్ల - శబ్ద తరంగాలు, వెలుగు తరంగాలు, శ్రుతిలయ బద్ధంగా, ప్రసారమై ఆనంద క్రీడాత్మకంగా, గ్రహ తారకాదులతో - జగత్సృష్టి, జగత్పరిపాలనలు జరుగుతాయి.

ప్రకాశించు బంగారు కర్ణాభరణములు గలది - అని ఈ నామానికి అర్థం.

## 865. లీలావిగ్రహధారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లీలావిగ్రహధారిణ్యైనమః' అని చెప్పాలి.

లీలా = లీలార్థము, విగ్రహ = దేహమును, ధారిణీ = ధరించునది.

శాశ్వతమైన క్రీడా మైదానంలో, శాశ్వతమైన బాలుని యొక్క, శాశ్వతమైన క్రీడే – ఈ సృష్టి (The creation is an Eternal Game of an Eternal child on the Play ground of creation) అన్నారు. క్రీడనే – 'లీల' అని కూడా అనవచ్చును. ఈ క్రీడార్థము ధరించిన రూపాన్ని 'లీలావిగ్రహ రూపం' అంటారు.

మనకు మన దేహం – డ్రైవరుకు కారులాంటిది. దుమ్ము పడితే కారును తుడుచుకోవడం, ఆయిల్ అయిపోతే పోయించడం, సరిగా నడవక పోతే రిపేరు చేయించడం – మొదలైన వన్నీ డ్రైవరు బాధ్యతలే ! అలాగే – మనం కూడా మన దేహం విషయంలో అపరిశుభ్రంగా ఉంటే – స్నానం చెయ్యడం, ఆకలేస్తే – ఆహారాదులు స్వీకరించడం, ఆరోగ్యంలో తేడా వస్తే – ఔషధాలు సేవించడం – అన్నీ మనమే చేసుకోవాలి. అవతార మూర్తి దేహం యజమానికి కారు లాంటిది. ఆ దేహం విషయం ఆ అవతారమూర్తి ఏమీ చూసుకోనక్కర లేదు. అన్నీ సరిగ్గా ఉండి, అంతా సిద్ధం చేసి పెట్టబడి ఉంటుంది. ఆయనకు ఆ దేహంపై మనలాగా మమకారాలు, అభిమానాలు కూడా ఉండవు. అంటే దేహానికి అతుక్కోడు. దేహంలో ఇరుక్కోడు. అదంతా ఒక లీలగా, క్రీడగా, అవలీలగా ఉంటుంది ఆయనకు. ఇంత సృష్టిచేస్తున్నా అంతే ! పోషిస్తున్నా అంతే ! తనలోకి లీనం చేసుకున్నా అంతే ! అవతారమూర్తి అయిన అమ్మవారు ఈ కర్తృత్వాన్ని లీలాప్రాయంగానే, క్రీడా ప్రాయంగానే – అవలీలాప్రాయంగానే నిర్వహిస్తుంది. ఇలా నిర్వహించడానికి ఆవిడ ధరించే రూపంగూడా లీలాప్రాయంగానే ఉంటుంది. అటువంటి అమ్మవారిని 'లీలావిగ్రహధారిణీ' అంటారు.

అసలు ఈ 'సృష్టి ఎందుకు జరగాలి ? ఎందుకు చెయ్యాలి ? అని అడిగితే – నేనుగా చెయ్యడం లేదు – నా ద్వారా జరుగుతోంది' – అని అంటాడు అవతారమూర్తి. ఇది నిజమే ! ఎందుకంటే – ఒంటరిగా ఏమీ చెయ్యకుండా కూర్చోమంటే – అలా ఏమీ

చెయ్యకుండా కూర్చున్నప్పుడు కూడా మన మనస్సులో ఏవేవో ఆలోచనలు వస్తాయి, గుండె కొట్టుకుంటుంది, ఊపిరితిత్తుల ద్వారా శ్వాసప్రక్రియ జరుగుతుంది – 'ఇవేమీ చెయ్యవద్దన్నాం గదా' అంటే – అప్పుడు మనం ఏం చెబుతాము ? ఏమో ! నేనేమీ చెయ్యటం లేదు. చెయ్యమనలేదు కూడా ! నా ద్వారా, నా ప్రమేయం లేకుండా అవన్నీ జరుగుతున్నాయి – అనే కదా మనం అనేది. కాబట్టి, సరిగ్గా అవతారమూర్తి గూడా అలాగే అంటాడు.

'నేను చెయ్యడం లేదు, నా ద్వారా జరుగుతోంది' – ఈ రెంటికీ సమన్వయం కుదిరినపుడు – 'నైష్కర్మ్యం సిద్ధిస్తుంది.' సమ్యక్ దృష్టి ఏర్పడుతుంది. 'అనుదర్శనం' లభిస్తుంది. అప్పుడే ఈ సృష్టి – భగవంతునికి ఒక లీల అని, అవసరమైతే ఆయన ధరించే దేహము కూడా లీలార్థమేననీ – తెలుస్తుంది. అలాగే, అమ్మవారి విషయంలో కూడా!

లీలార్థమై దేహమును ధరించునది – అని ఈ నామానికి అర్థం.

## 866. అజా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు అజాయై నమః' అని చెప్పాలి.

అజా = పుట్టుక లేనిది.

పుట్టటం అనేది జనన మరణాలు ఉన్న వాటికి ఉంటుంది. ఎప్పుడూ ఉండే అమ్మవారికి పుట్టుక పూర్వం, పుట్టినప్పుడు, పోయిన తర్వాత – అనే స్థితులు ఉండవు. అంటే – అమ్మవారు ఆద్యంతాలు లేని ఆత్మస్వరూపిణి. అంతేకాదు – పుట్టడం, పెరగడం, ఉండటం, మార్పుచెందడం, కృశించడం, నశించడం – వంటి 'షడ్వికారాలు' – అమ్మవారికి ఉండవు. ఈ వికారాల్లో మొట్టమొదటిదైన 'పుట్టడం' ఉంటే – మిగిలిన ఐదు వికారాలు అనుసరించి ఉంటాయి. అసలు పుట్టడం అనేదే లేనపుడు – మిగిలిన ఐదు వికారాలకు అవకాశమే లేదు గదా !

పుట్టుక లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 867. క్షయ వినిర్ముక్తా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షయ వినిర్ముక్తాయై నమః' అని చెప్పాలి.

క్షయ = క్షీణించుట అను దాని నుండి, వినుర్ముక్తా = విడిచి పెట్టబడినది.

ఇంతకు ముందు వచ్చిన నామంలో అమ్మవారు పుట్టుక లేనిదని చెప్పబడింది. అసలు పుట్టుక అనేది ఉంటే – ఆ పైన బ్రతకడం, పెరగడం, కృశించడం, నశించడం మొదలైనవి ఉంటాయి. ఈ నామంలో చెప్పిన 'క్షయ' అంటే 'క్షీణించడం', దీనితో పాటు నశించడం (మృత్యువు) గూడా అమ్మవారికి ఉండదని మళ్ళీ వేరుగా చెప్పనక్కరలేదు.

'క్షీణించడం' అను దాని నుండి విడిచి పెట్టబడినది – అనగా క్షీణించుటలేనిది- అని ఈ నామానికి అర్థం.

## 868. ముగ్ధా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముగ్ధాయై నమః' అని చెప్పాలి.

ముగ్ధా = మనోహరమైన అమాయకత్వముతో మోహింపచేయబడునది.

ఈ నామంలోని 'ముగ్ధా' తర్వాత వెంటనే వచ్చే 'క్షిప్రప్రసాదినీ' నామంలోని 'క్షి' అనే అక్షరాన్ని కలిపి తొందరలో 'ముగ్ధాక్షి' అనే నామంగాను, 'ప్రసాదినీ' అనే మరో నామంగాను విడివిడిగా చెప్పేవారుండవచ్చు కాని, అలా చెప్పడం తప్పు. 'ముగ్ధా', క్షిప్రప్రసాదినీ – అనే విడదీయాలి.

కొన్ని ప్రత్యేక లక్షణాలున్న కన్యను 'ముగ్ధా' అంటారు. తరుణ వయస్సు వచ్చి, మనోజ్ఞంగా, మనోహరంగా అందమైన రూపం ఉండి, ఇంకా మన్మథ వికారాలు పూర్తిగా విప్పారని మనోభావాలు ఉండి, రాగద్వేషాలు లేని పిల్లల అమాయకత్వం ఉండి, చూడంగానే ప్రసన్నంగా, ప్రశాంతంగా, పరిమిత వాక్ సంభాషణాదులు చేసే లక్షణాలు

ఉండాలి. ఇన్ని లక్షణాలూ కూడా బలుక్కుని, ఏ కన్యలో ఉంటాయో ఆ కన్యను 'ముగ్ధా' అంటారు. (An young girl attractive by her youthful simplicity; pretty, child like nature; but not yet acquainted with love). అమ్మవారు ఈ చెప్పిన లక్షణాలు కలిగిన పదహారేళ్ళ తరుణి లాగా ఉంటుందిట. అంటే రాబోయే సృష్టి అనే పువ్వుకు ముందు ఉండే మొగ్గ వంటి దన్నమాట! (Potential bud of the Flower of Creation).

సంపూర్ణంగా విచ్చుకోడానికి అన్ని అవకాశాలను, ఇముడ్చుకుని ఉన్నదాన్ని 'ముగ్ధ' అంటారు. 'దుహ్ – దోహ – దుగ్ధ' ఎలా అయ్యాయో్యా సరిగ్గా అలాగే – 'ముహ్ – మోహ – ముగ్ధ' అయింది. 'ముగ్ధ' అంటే మోహింపచేయబడునది – అని అర్థం. (Past Particple)

(మనోహరమైన అమాయకత్వంతో) మోహింప చేయబడునది – అని ఈ నామానికి అర్థం.

## 869. క్షిప్రప్రసాదినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్షిప్రప్రసాదిన్యై నమః' అని చెప్పాలి.

క్షిప్ర = శీఘ్రముగా (వెనువెంటనే), ప్రసాదినీ = ప్రసన్నమగునది.

అమ్మవారి దగ్గర ఒక చక్కని గుణం ఉంది. ఆ లక్షణం మిగతా దేవతలతో ఉండకపోవచ్చును. అదేమిటంటే – మిగతాదేవతారాధన వలన వెంటనే వారు ప్రసన్నం కాకపోవచ్చు. కాని – అమ్మవారిని 'అమ్మా' అని పిలిచిన వెనువెంటనే ఆ జన్మలోనే ప్రసన్నమౌతుంది. పిల్లవాడు బాధతో 'అమ్మా' అని పిలిచినా, ముందు పరుగు పరుగున వచ్చేది అమ్మే! అలాగే మన పట్ల జగజ్జనని గూడా వ్యవహరిస్తుంది. ఆర్తితో తలిస్తే ప్రీతితో ఎదురుగా నిలుస్తుంది. అమ్మవారు – మాట్లాడే అద్దం లాంటిది. 'నువ్వు నన్ను చూడు' అంటే 'నువ్వు నన్ను చూడు' అంటుంది. 'నువ్వు నన్ను విడువకు' అంటే – 'నువ్వు నన్నువిడువకు' – అంటుంది.

'శీఘ్రముగా ప్రసన్నమగునది (Instantaneous presence giving nature) - అని ఈ నామార్థం.

## 870. అంతర్ముఖ సమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అంతర్ముఖసమారాధ్యాయై నమః' అని చెప్పాలి.

అంతర్ముఖ = అంతర్ముఖముగా, సమారాధ్యా = చక్కగా ఆరాధింపబడునది.

ఆరాధనలు రెండు రకాలు 1) అంతర్ముఖం, 2) బహిర్ముఖం. ఈ రెండు రకాల ఆరాధనల గురించి ఈ నామంలోను, రాబోయే నామంలోను చెప్పబడుతుంది.

ఏ రకమైన ఆరాధన కైనా ముందు చిత్తశుద్ధి ఉండాలి. అందులో అంతర్ముఖారాధనకు తప్పనిసరిగా ఉండాలి. ఈ అంతర్ముఖ ఆరాధనలో భగవంతుడు ఎక్కడైనా ఉంటాడు. తనలోనే ఉన్నాడు గూడా – అనే భావనలు ప్రాధాన్యం వహిస్తాయి.

'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' – అన్న గీతావాక్యం.,

'అహం బ్రహ్మాస్మి' – అన్న మహావాక్యం,

దేహోదేవాలయః ప్రోక్తో జీవోదేవస్సనాతనః – అన్న మహాన్యాస వాక్యం

అంతర్ముఖ ధ్యానంలో ప్రాధాన్యం వహిస్తాయి. బాహ్య ప్రపంచం మీద, దేహం మీద ధ్యాస నశించాలి. తనలోని ఆత్మకు – ఆరాధించే దేవతకు సమక్యైత భావించి, సత్త్వగుణ ప్రధానంగా, అత్యంత శ్రద్ధతో – నిష్ఠ కలిగిన బుద్ధితో మనలోనే ఆత్మ స్వరూపంగా ఉన్న అమ్మవారిని ఆరాధించడమే అంతర్ముఖ సమారాధనము. సాధారణంగా బాహ్యంగా జరిపే షోడశోపచార పూజలో వచ్చే అంశాలన్నీ ఈ అంతర్ముఖ ఆరాధనలోనూ ఉంటాయి. కాని, అవన్నీ ఆధ్యాత్మిక భావనతో తనలోనే ఆత్మేశ్వరిని ధ్యానిస్తూ, తనకు సంబంధించిన సుగుణ గణ భావనలతో, షట్చక్ర యుక్త నాడీమండలాన్ని సమన్వయ పరచుకుంటూ ఉద్వేగరహితంగా, అత్యంత ప్రశాంతంగా జరిపే ఆరాధనగానే ఉంటుంది.

(ఈ అంతర్ముఖ సమారాధనలో షోడశోపచార పూజ ఎలా ఉంటుందో తైత్తిరీయోపనిషత్తు గ్రంథాన్ని మా గురుదేవులకు అంకితమిస్తూ నేను వ్రాసిన ఈ క్రింది పద్యం చదువుకుంటే తెలుస్తుంది.

సీ. దర్శింపగా గోరు ధ్యాన చిత్తమ్ముతో
నాయూర్తి నావాహనముగ నిచ్చి,
హృదయ సింహాసనమ్మెదుట సిద్ధము చేసి
పరవశాశ్రువులర్ఘ్య పాద్యమిచ్చి
స్వచ్ఛమానస సరోవర జలమ్ములయందు
స్నానమ్ము చేయించి మేను తుడిచి
భావనాసూత్రాల బంగారు జలతారు
పట్టువస్త్రమ్ముల కట్టనిచ్చి
ఆపాదమస్తమ్ము నరసినేచూచెడి
తీరునామముగాను తీర్చిదిద్ది
నీతినే యజ్ఞోపవీతమ్ముగానిచ్చి
నా కీర్తి రేఖల నగల నిచ్చి
సంస్కార వాసనా సౌమ్య ధూపమ్మిచ్చి
జ్ఞాన దీపారాధనమ్ము నిచ్చి
మధురానుభవ జన్మ మమతాన్నమును బెట్టి
ముక్తసంగఫలతాంబూలమిచ్చి

తే. గీ. అంతరోత్తేజ కర్పూరహారతిచ్చి
పూర్ణ సంస్కార ధీమంత్రపుష్పమిచ్చి
కృష్ణమాచార్యు నర్చించి తృప్తిగాను
అంకితమ్మోదు తైత్తిరీయమ్ము తోడ

వివరణ కర్త - జి.ఎల్.ఎన్. శాస్త్రి)

ఇదే విధంగా కుండలినీ యోగపరంగా అన్నిటికీ సమన్వయం ఉంటే – ఆ ఆరాధన అంతర్ముఖ సమారాధనఔతుంది.

చిత్తవృత్తిని 'అమ్మవారి వైపు మళ్లించి ఆరాధించడమే అంతర్ముఖారాధన.

ఈ ఆరాధనలో అమ్మవారు ఎక్కడో ఉందని వెళ్ళవలసిన పని లేకుండా, – లేకపోతే వెళ్ళలేక పోయామనే బాధలేకుండా, పూజకు అవసరమయే ద్రవ్యాలు లేవే అనీ, చక్కగా

ముందే సమకూర్చుకోలేదే అనీ, మనం చేసే పూజ అందరూ చూస్తున్నారో లేదో అనే ధ్యాస - ఇవేమీ ఉండవు. పరమ ప్రశాంతంగా, నిశ్చలంగా, సత్త్వగుణ ప్రధానంగా జరుగుతుంది. అమ్మవారికి ఈ రకమైన ఆరాధన చాలా ఇష్టం. అందుచేతనే వ్యాసులవారు 'అంతర్ముఖసమారాధ్యా' అన్న ఈ నామంలో 'సమారాధ్యా' (చక్కగా హాయిగా ఆరాధింపబడేది) అని మనకు సూచన ప్రాయంగా తెలియ జేసారు. శివానందలహరిలో - ఆదిశంకరులు - మొదట్లోనే వచ్చే 'గభీరేకాసారే...,' 'నరత్వం దేవత్వం....,' 'గుహాయాం గేహేవా...,' 'వటుర్వాగేహీవా ...,' మొదలైన శ్లోకాల్లో - ఈ అంతర్ముఖ సమారాధన గురించి చెబుతారు. ఒక విధంగా చెప్పాలంటే రుద్రాభిషేకంలోని మహన్యాసమంతా 'అంతర్ముఖ సమారాధన' మే ఔతుంది.

'అంతర్ముఖంగా చక్కగా ఆరాధింపబడునది' - అని ఈ నామానికి అర్థం.

## 871. బహిర్ముఖసుదుర్లభా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బహిర్ముఖసుదుర్లభాయైనమః' అని చెప్పాలి.

బహిర్ముఖ = బహిర్ముఖమైన అన్వేషణతో సాగే ఆరాధనతో, సుదుర్లభా = లెస్సగా వశము కానిది.

ఆరాధనకు ఒక లక్ష్యము అవసరమని ప్రారంభించి - ఆ లక్ష్యాన్ని తెలుసుకోడం కోసం బాహ్య విషయాభిముఖమైన ఇంద్రియాలతో అన్వేషణ సాగిస్తూ, విషయ వాంఛలతో సతమతమై, చివరకు ప్రాథమిక లక్ష్యాన్నే మరచిపోయే విధంగా జరిపే బహిర్ముఖులైన ఆరాధకులకు అమ్మవారు వశమవడం దుర్లభమైన విషయం - అని ఈ నామం చెబుతుంది. బహిర్ముఖులైన లౌకిక విషయ లోలురకు అమ్మవారు లభించదు.

తన లోనే ఆత్మేశ్వరి ఉండగా ఎక్కడో అమ్మవారు ఉందని అన్ని చోట్లకు అన్వేషిస్తూ వెళ్ళేవారికి శ్రమ ఎక్కువగా ఉంటుంది.

ఏ విధమైన ఆరాధనకైనా క్రమశిక్షణ, శ్రద్ధ, భక్తి ముఖ్యం. ఇవి ఉన్నవారికే సామర్థ్యం, చిత్కళ (ఆనందానుభూతి) దక్కుతాయి. కాని, సాధారణంగా ఎక్కువమంది

క్రమశిక్షణ దగ్గరే దిగబడిపోతారు. దిగబడి పోకుండా నిలబడినవారు ఏదోవిధంగా లక్ష్యాన్ని సాధిస్తారు. ఈ లక్ష్యసిద్ధి అంతర్ముఖులకు సులువుగా ఉంటుంది. బహిర్ముఖులకు – అవరోధాలు ఆటంకాలు, పతనాలు ఎదురై లక్ష్య సిద్ధి దూరమవడమే కాదు, దుర్లభమౌతుంది కూడా ! అని ఈ నామం ద్వారా వ్యాసుల వారు హెచ్చరిస్తున్నారు.

బహిర్ముఖులకు కడు దుర్లభమైనది – అని ఈనామానికి అర్థం.

## 872. త్రయీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రయ్యైనమః' అని చెప్పాలి.

త్రయీ = మూడింటిరూపము.

ఋగ్వేద, సామవేద, యజుర్వేద త్రయాన్ని సరళంగా 'త్రయీ' అంటారు. 'త్రయీ' అంటే – 'మూడింటికి సంబంధించినది' ని సూటి అర్థమైనా సాధారణంగా ఆ మూడింటిని ఋక్సామయజుర్వేద త్రయానికే అన్వయిస్తారు.

సామవేదం శ్వాసకు సంబంధించినది. ఋగ్వేదం కంఠనాదానికి, కంఠం నుండి వెలువడే వాక్యానికి దాని అర్థానికి సంబంధించినది. వేదాల సమన్వయంతో ఉండే అధర్వణవేదం దేహానికి సంబంధించినది. ఈ విధంగా ఈ వేదాలు మనతో సంబంధమును కలిగి ఉన్నాయి. అంటే – దేహానికి కారణమైన ఆత్మేశ్వరి – ఋక్సామయజుర్వేద సమన్వయమైనదని ఈ విభజన తెలుపుతోంది. ఈ విషయం దేవీ పురాణంలో కూడా

ఋగ్యజుస్సామభాగేన సాంగవేద గతాయతః
త్రయీతికథ్యతే లోకే దృష్టాదృష్ట ప్రసాదినీ

– అని చెప్పబడుతుంది. (ఋగ్వేద, సామవేద, యజుర్వేద రూపంలో ఉండే దేవి ఆధ్యాత్మిక వాఙ్మయ గ్రంథాల్లో 'త్రయీ' అని చెప్పబడింది' అని పై శ్లోకార్థం).

ఈ మూడు వేదాల ప్రారంభాక్షరాలు మరో ముఖ్యమైన విషయాన్ని సూచిస్తాయి. సామవేదం 'అ' కారంతో ప్రారంభవౌతుంది. ఋగ్వేదం కూడా 'అ' కారంతో

ప్రారంభమౌతుంది. ఇంక యజుర్వేదం 'ఇ' కారంతో ప్రారంభమౌతుంది. అంటే - ఈ మూడు వేదాల ప్రారంభ అక్షరాల కలయిక 'అ + అ + ఇ' అవుతుంది. చివరి అక్షరాల కలయిక 'అ + ఇ = ఏ' అవుతుంది. (గుణసంధి) అప్పుడు మొదటి అక్షరం 'అ'తో ఈ 'ఏ' కలిసినపుడు వృద్ధి సంధివలన 'ఐ' ఔతుంది. మూడు వేదాలు సూచించే మూడు అక్షరాల మధ్య ఈ విధమైన సంధి సూత్ర ఫలితాలను బట్టి ఏర్పడే 'ఐ' అక్షరాన్ని మంత్రశాస్త్రంలో 'వాగ్భవబీజం' అంటారు. ఈ వాగ్భవ బీజం - జ్ఞాన స్వరూపిణి, వాగ్దేవి స్వరూపిణీ, అయిన అమ్మవారిని సూచిస్తుంది కాబట్టి అమ్మవారు 'త్రయీ' అయింది.

'త్రయీ' అంటే మూడు వేదాల సమన్వయ స్వరూపిణి గానే కాకుండా - గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్ని - నామాలతో సూచించే త్రేతాగ్నుల సమన్వయ స్వరూపిణి అని, అలాగే భూః, భువః, సువః అనే త్రివ్యాహృతుల సమన్వయ స్వరూపిణి అని - సోమసూర్యాగ్నుల సమన్వయ స్వరూపమనీ గూడా గ్రహించవచ్చును. కాని, 'త్రయీ' అనే పదం సాధారణంగా ఋక్సామయజుర్వేదాలకే ఉపయోగిస్తారు.

ఋక్సామయజుర్వేదాల సమన్వయ స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 873. త్రివర్గనిలయా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రివర్గనిలయాయైనమః' అని చెప్పాలి.

త్రివర్గ = మూడింటి వర్గమును, నిలయా = నిలయముగా గలది.

'త్రయీ' అనే పదం చేత మూడు వేదాలను సూచించినట్లే 'త్రివర్గం' అనే పదాన్ని పురుషార్థాల్లోని ధర్మార్థ కామ వర్గాన్ని సూచించడానికి ఉపయోగిస్తారు.

అయితే - 'మోక్షంతో కలిసి పురుషార్థాలు నాలుగు కదా ! అని అనుమానం రావచ్చును. పురుషార్థాలు నాలుగు అయినా ఆ నాల్గింటిని సాధించడానికి నాలుగు ప్రయత్నాలు అక్కరలేదు. ధర్మార్థ కామాల సమన్వయం తిన్నగా సాధింపబడితే నాల్గవది అయిన 'మోక్షం' దానంతటదే వస్తుంది. వాటిసమన్వయం తిన్నగా సాధింపబడకపోతే

మోక్షం రాదు. అందుచేత త్రివర్గాలంటే పురుషార్థాల్లోని మొదటి మూడు అయిన ధర్మార్థ కామాలుగా చెప్పుకుంటేచాలు. ఈ ధర్మార్థ కామ మోక్షాల గురించి 'పురుషార్థప్రదా' అన్న 291వ నామంలోను, మొదటి మూడు పురుషార్థా వర్గాల గురించి ఈ భాగంలోనే 'తివర్గదాత్రీ' అన్న 760వ నామ వివరణలోను పూర్తిగాచెప్పబడింది. కాబట్టి, ఆ వివరణలు మళ్ళీ ఇప్పుడు ఒకసారి చదువుకుంటే బాగా అర్థమవుతుంది.

ఇక త్రివర్గమంటే పురుషార్థ త్రయం కాకుండా కాలపరంగా - భూతభవిష్యదర్వర్తమానాలు, గుణపరంగా - సత్త్వరజస్తమోగుణాలు, లోకపరంగా - భూర్భువస్సువర్లోకాలు, ప్రణవాక్షరపరంగా - అ, ఉ, మ అక్షర వర్గంగాను గూడా చెప్పుకోవచ్చును.

పైన తెల్పిన మూడు మూడుగా వర్గంగా ఉన్న వాటి యందు తన స్థానము గలది అగుటవలన అమ్మవారు 'త్రివర్గనిలయా'.

ధర్మార్థ కామములు మొదలగు త్రివర్గము నందు ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 874. త్రిస్థా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిస్థాయైనమః' అని చెప్పాలి.

త్రిస్థా = మూడింటిగా ఉండునది.

అమ్మవారిని రేఖాగణితాత్మకంగా (Geometrical)గా సంకేతించాలంటే త్రిభుజాన్ని (Triangle) ఎన్నుకోవాలి. అమ్మవారికి సంబంధించిన శ్రీ చక్రంలో గాని మరి ఏ ఇతర స్త్రీ దేవతా చక్రాలలో గాని ప్రధానంగా ఉండేవి త్రిభుజాలే! ఈ త్రిభుజాల సంఖ్యలోను వాటి అమరికల్లోను తేడా ఉంటుందేమో తప్ప అన్నిటిలోను త్రిభుజాలు ఉంటాయి. త్రిభుజంగా అమ్మవారిని సూచించడంలో ఒక ప్రత్యేకత ఉంది. అమ్మవారికి సంబంధించినవి, అమ్మవారిపై ఆధారపడినవి - అన్నీ మూడు మూడు వర్గంగానే ఉంటాయి. ఉదా: త్రిలోకాలు, త్రిగుణాలు, త్రేతాగ్నులు, త్రినాడులు, త్రివేదాలు,

త్రిమూర్తులు, త్రిస్థానములు (తార, మధ్యమ, మంద్రలు) అవస్థాత్రయం, పురుషార్థత్రయము, కాలత్రయము, ఇలా మూడుగా నున్న వాటిని మూడు శీర్షాలతో సూచించడానికి త్రిభుజం చాలా అనువుగా ఉంటుంది. - అందుకని అమ్మవారిని సూచించడానికి త్రిభుజాన్ని యంత్రంగా(Glyph) ఎన్నుకున్నారు.

త్రిగుణ త్రికాలాల రూపంలో ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 875. త్రిపురమాలినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిపురమాలిన్యైనమః' అని చెప్పాలి.

శరీరానికి 'పురం' అనేది సంకేతపదం. 'దేహి ఉండేది' అనే అర్థంలో శరీరాన్ని 'దేహం' అంటారు. అలాగే, 'పురుషుడు ఉండేది' అనే అర్థంలో ఈ శరీరాన్నే 'పురం' అని గూడా అంటారు. (వేదాంతంలో 'పురుషుడు' - అంటే 'పురమునందు, అనగా - ఈ దేహమునందు ఉండుటకు ఇష్టపడువాడు' అంటే - 'జీవుడు' అనే అర్థం గాని 'మొగవాడు' (Male) అని అర్థంకాదు).

మనకు కనబడే శరీరం పైకి ఒకటిగానే కనబడుతున్నా ప్రతి జీవికి మూడు రకాల శరీరాలుంటాయి. వీటినే - స్థూలశరీరం, సూక్ష్మశరీరం, కారణ శరీరం అంటారు. వీటినే 'త్రిపురాల'ని కూడా అంటారు. ఈ మూడు శరీరాల ద్వారా తెలుపబడే వాళ్ళే వరుసగా- క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు.

ఈ మూడు పురములందు వర్తించునది - అని ఈ నామానికి అర్థం.

పైన తెల్పిన మూడు పురాలను మూడు పువ్వులుగా ఊహిస్తే ఆ మూడు పువ్వుల మాలగా ఈ త్రిపురాల వర్గాన్ని ఊహించవచ్చు. (మాలను - పుష్పమాలగా - తీసుకోడం వేదార్థ కవిసమయం).

వికాసం, సృష్టి, గర్భధారణ, ఆహ్లాదనం - వీటికి సంకేతం - పుష్పం. 'మాలిని' పదం ఈ పుష్పాల మాలను సూచిస్తుంది. ఈ పుష్పమాలలనే కిరణమాలలు లేదా, రశ్మిమాలలు అంటారు. నిరంతరానందస్థితిలో ఉండగల ప్రజ్ఞగల వారు ఈ 'రశ్మిమాలా' మంత్రాలు చేస్తారు.

వీలైనంతవరకు నిరంతరానాందస్థితిలో మనలను ఉండనీయకుండా మందేహాది రాక్షసులు ప్రయత్నిస్తారు. మనకు ఇంగితజ్ఞానం(Commonsense) పనిచెయ్యకుండా పనిచేసేవాళ్ళే మందేహాదిరాక్షసులు. జ్ఞాన ప్రకాశానికి అడ్డువచ్చే అజ్ఞానతిమిరాలే ఈ మందేహాది రాక్షసులు. కాని, సూర్య మండల మధ్యవర్తినిగా ఉండే 'రశ్మిమాలా మహాదేవి' వాళ్ళ ఆటలు సాగనీయకుండా చేసి, మనలను నిరంతరానందస్థితిలో ఉంచుతుంది. (ఇంతకుముందు వచ్చిన 'భైరవీ', 'భగమాలినీ', 'మార్తాండభైరవీ' మొదలైన నామాలన్నీ... ఈ రశ్మిమాలా మహాదేవికి సంబంధించినవే !) అయితే, ఎన్ని సదుపాయాలు, సౌకర్యాలు ఉన్నా - మనం ఆనందంగా ఉండాలని అనుకోకపోతే మనం నిరంతరానందస్థితిలో ఉండలేము. (Unless we want to be happy, we cannot be happy in spite of all amenities and coveniences).

అజ్ఞాన తిమిరాన్ని పటాపంచలు చేసే రశ్మిమాలా మహాదేవి రూపంలో ఉన్న అమ్మవారిని 'త్రిపురమాలిని' అనవచ్చును. శ్రీ చక్రంలోని అంతర్దశార చక్రానికి అధిష్ఠానదేవతా రూపంలో ఉన్నది గూడా ఈ అమ్మవారే !

1) పురత్రయమునందు వర్తించునది.

2) రశ్మిమాలా మహాదేవి రూపముగా ఉన్నది.

3) శ్రీ చక్రంలోని అంతర్దశార చక్రాధిదేవతా రూపము.

4) శ్రీ విద్యాపంచదశాక్షరీ మంత్ర త్రికూట స్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 876. నిరామయా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిరామయాయైనమః' అని చెప్పాలి.

నిరామయా = ఏవిధమైన వ్యాధియు లేనిది.

'ఆమయము' అంటే 'వ్యాధి' అని అర్థం. వ్యాధులున్నవారు గదిలో ఉన్నా గదికేమీ వ్యాధిరాదు. ఆత్మకు సంబంధించిన దేహానికి వ్యాధులుంటాయిగాని - ఆత్మకు వ్యాధులుండవు. అమ్మవారు ఆత్మస్వరూపిణి కాబట్టి - 'నిరామయా'.

వ్యాధులకు విరుగుడు 'మంత్రాలు' ఉంటాయి. ఆయామంత్రాలతో వ్యాధులను పోగొట్టవచ్చును. పార్శ్వపునొప్పికి - ప్రస్తుతనామ సంబంధమైన మంత్రం ఒకటుంది. ఆ మంత్రం ఏమిటంటే -

'ముటిత ముటిత లా ముటిత స్వాహా - ఆమయధ్వంస పటలమ్' - సూర్యోదయకాలంలో ఈ పార్శ్వపు నొప్పి ఉన్నవారి తలపై మొట్టికాయ మొట్టి చెప్పాలి ఈ మంత్రం. అలాగే - సన్నిపాత జ్వరం (Typhoid)కి ఒక ఔషధం ఈక్రింది శ్లోకంలో చెప్పారు.

కిరాతార్జున యోర్యుద్ధ మాయాకిటి విదారకం
పంచపాండవ వృత్తాంతం సన్నిపాతహరం శుభం -

పై శ్లోకంలో ఔషధం ఎలా తయారు చెయ్యాలో సంకేత భాషలో చెప్పబడింది. సంకేతాలను (Code) విడదీసుకుంటే (Decode) అసలు పేర్లు తెలిసి మందు ఎలా తయారు చెయ్యాలో తెలుస్తుంది.

కిరాత = నేలవేము, అర్జున = మద్ది, యుద్ధ (రెంటినీ కలిపి) దంచడం; మాయా = శొంఠి, కిటి = నేలతాడి, విదారకమ్ = నేలగుమ్మడి, పంచపాండవ = తెల్లగా ఉండే పూలు గలిగిన చెట్లు లేక మొక్కలు లేక పాదులు - అవే 1) వేప 2) నేలవేము 3) కటకరోహిణి 4) చేదుపొట్ల 5) చేదుదొండ(Coculus Indicus) దీన్నే కాకిదొండ అని కూడా అంటారు.

వీటిని అన్నిటినీ కలిపి దంచితే వచ్చే చూర్ణం సన్నిపాత జ్వరానికి(Typhoid) చక్కని ఔషధంలా పనిచేస్తుంది. ఇంట్లో దొంగలు పడకుండా ఉండేందుకు, ప్రతి రోజూ మంచి భోజనం లభించేందుకు ఇలాగే - కొన్ని మంత్రాలు చెప్పబడ్డాయి. అయితే ఇవి అవసరమైన వారికి అవసరమైన సమయంలో చెప్పాలి.

(అయితే నాస్తిక, పాషండ, మలసహిత మతులకు ఈ మంత్రాలు చెప్పకూడదు. చెప్పినా పనిచెయ్యవు అని మా గురుదేవులు చెప్పారు).

ఏ విధమైన వ్యాధులు లేనిది - అని ఈ నామానికి అర్థం.

## 877. నిరాలంబా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిరాలంబాయైనమః' అని చెప్పాలి.

నిరాలంబా = ఆలంబనము లేనిది.

అన్నిటికీ ఆధారమైన వారే నిరాలంబులు కాగలరు. అమ్మవారు అన్నిటికీ ఆధారం కాబట్టే తనకు వేరే ఆలంబన లేదు. 'తనకు ఎవరైనా రక్షణ ఉంటే బాగుండును' అని కోరనివాడిని 'నిరాలంబుడు' అనాలి. 'నాకెవరు ఆసరా ?' అని – అనిపించేది ఈ మానవజాతికే గాని మిగిలిన జాతులకు లేదు. భగవంతుడే వాటికి ఆసరా. ఇన్సూరెన్సులు, గ్రాట్యూటీలు, పెన్షన్‌లు, ఎఫ్‌డీలు, షేర్లు ఇవన్నీ గూడా ఇతర జాతులకు లేవు. మానవ జాతికి తప్ప అని గుర్తుకు వస్తే మనం ఎంత ఆలంబులమో అర్థమౌతుంది.

వేరే ఏ విధమైన ఆలంబనలు లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 878. స్వాత్మారామా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వాత్మారామాయైనమః' అని చెప్పాలి.

స్వ + ఆత్మా + రామా – స్వాత్మారామా = సర్వజీవుల ఆత్మలయందు విహరించునది.

1) తన ఆత్మయందు తను ఆనందించి విహరించునది.

2) తనయందు, సర్వజీవుల యందు విహరించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 879. సుధాసృతిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరింఛేటప్పుడు 'సుధాసృత్యైనమః' అని చెప్పాలి.

సుధా = అమృతమును, స్రుతిః = స్రవించునది.

యోగసాధనా ప్రక్రియలో కుండలినీ శక్తి అనే అమ్మవారు సుషుమ్నా మార్గాన్ని అనుసరించి, షట్చక్రాలను ప్రచోదన చేసి బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంథులను విభేదన చేసి చిట్టచివరకు సహస్రార కమలం చేరుతుంది. ఈ సహస్రార కమల కర్ణిక పూర్తిగా చంద్రమండలమే ! ఈ చంద్రమండలం అత్యంత శీతలంగా ఘనస్థితిలో ఉంటుంది. సహజంగా అగ్నితత్త్వమైన కుండలినీ శక్తి అనే అమ్మవారు ఘన స్థితిలో శీతలంగా ఉండే చంద్రమండలాన్ని చేరంగానే ఆ ఘన స్థితి కరిగి ద్రవస్థితి పొందుతుంది. అలా ద్రవస్థితిలోకి వచ్చిన చంద్రుని వెన్నెలనే 'అమృతం' అంటారు. ఇలా అమృతత్వాన్ని పొందుతుంది కాబట్టే – దీన్ని 'సుధాసింధువు' (సుధాసాగరం) అన్నారు. సహస్రారంలో చేరిన అమ్మవారి పాదస్పర్శ వల్లనే ఇవన్నీ జరిగేది.

అమ్మవారి పాదస్పర్శ వలన ద్రవించిన అమృతం – సహస్రారం నుండి ధారాపాతంగా వర్షింబడుతుంది. ఈ అమృత వర్షాన్నే 'సుధాసారా' అంటారు. ఇలా సుధావర్షాన్ని కురిపించే అమ్మవారికి 'సుధాస్రుతిః' అనే పేరు వచ్చింది. ధారాపాతంగా స్రవింపబడే ఈ సుధా ధారలతో సుషుమ్నా మార్గం, దాంట్లోని షట్చక్రాలు, గ్రంథులు, సమస్త నాడీమండలం – తడుపబడతాయి. ఈ విషయాన్నే సౌందర్యలహరిలో ఆదిశంకరులు 'సుధాధారాసారైః చరణ యుగళాంతర్విగళితైః ... ''కుహరిణి'' అనే 10వశ్లోకంలో వర్ణించారు. అమృత స్రవంతి నుండి షట్చక్రాలు గ్రహించే కిరణాల సంఖ్యలను గూడా 'క్షితౌషట్పంచాశత్... తవ పాదాంబుజయుగమ్' అనే శ్లోకంలో తెలియపరచారు.

అమ్మవారి అగ్నితత్త్వం, చంద్రుని శీతలత్వం కలవగా వచ్చిన అమృతం చేత తడపబడిన శరీరం అంతటికీ ఒక సంతులనత(Balance) చేకూరి ఆరోగ్యవంతంగా ఉంటుంది. ఈ రెంటికీ మధ్య నిష్పత్తిలో(Proportion) లో తేడా వచ్చినపుడే లేదా రెంటికీ మధ్య సామరస్యం, సమన్వయం చెడినపుడు – ఆరోగ్యంలో మార్పులు వచ్చి వ్యాధులకు దారి తీస్తుంది. ఈ విధంగా జీవనమంతా అమ్మవారి చైతన్య అనుగ్రహం మీద ఆధారపడే ఉందని, సమస్తము అమ్మవారే నని జ్ఞానదృష్టి చేత గ్రహించి, తదనుగుణంగా నడుచుకునేవారే జీవన్ముక్తులు.

ఈ నామంలోని 'సుధా' పదానికి చక్కగా ధరించినది అని అర్థం. దీని పూర్తి వివరణ సౌందర్యలహరిలోని 'సుధాసింధోర్మధ్యే' అన్న శ్లోకానికి నేను వ్రాసిన వివరణ చదివితే తెలుస్తుంది. ('సుధాసాగర మధ్యస్థా' నామ వివరణలో గూడా కొన్ని విషయాలు వివరింపబడినవి).

'అమృతమును స్రవించునది' అని ఈ నామానికి అర్థం.

## ౮౮౦. సంసార పంకనిర్మగ్న సముద్ధరణ పండితా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంసార పంక నిర్మగ్న సముద్ధరణ పండితాయై నమః' అని చెప్పాలి.

సంసార = సంసారమనెడి, పంక = బురదలో, నిమగ్న = పూర్తిగా మునిగిన వారిని, సముద్ధరణ = చక్కగా ఉద్ధరించడములో, పండితా = సామర్థ్యము గలది.

'సమ్యక్ సరణమ్ – సంసారం అంటే – 'ఆగకుండా సాగునది' అని అర్థం. సంసారంలో పడితే మనకు తెలియకుండానే దాంట్లోకి లాగబడి దిగబడిపోతాం. (తేనెను గ్రోలడానికి తేనెలో పడిన ఈగ, చీమల లాగా సంసారంలో ఇరుక్కుపోతారు). అందుకే సంసారాన్ని సాధారణంగా సముద్రంతో పోలుస్తారు. (సంసారం, సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత ! జాగ్రత !) సంసార సాగరంలో కూరుకుపోయిన వారు ఉద్ధరింపబడాలంటే అమ్మవారే శరణ్యం. అని కూర్మ పురాణంలో కూడా –

'యేమనాగపి శర్వాణీం స్మరంతి శరణార్థినః

దుస్తరాపారసంసార సాగరే న పతంతితే.

(అమ్మవారికి శరణాగతి చెందినవారు దుస్తరమైన సంసారసాగరంలో పడరు – అని ఈ శ్లోకార్థం) అని చెప్పబడింది. ప్రస్తుత నామంలో కూడా అదే విషయంచెప్పబడింది. కాకపోతే సంసారాన్ని సాగరంతో పోల్చడం బదులు 'బురద' తో పోల్చారు. అంతే తేడా! చిక్కటి బురదలోను, ఊబిలోను దిగబడిపోయినవారు ఒక కాలు ఎత్తి బయటపడడానికి ప్రయత్నిస్తే – రెండవ కాలు క్రిందకు తన్నిపెట్టడం వల్ల మరింత దిగబడతారు. పోనీ రెండవ కాలుపైకి లేపి ప్రయత్నిస్తే – మొదటి కాలు నేలపై మరింత దిగబడుతుంది.

ఈవిధంగా ఒకదాని తరువాత ఒకటి దిగబడుతూనే ఉంటుంది. దీనికి విముక్తి ఉండదు. బయట నుండి ఎవరైనా హెలికాప్టర్ లేదా క్రేన్ లాంటి సాధనం ఉపయోగించి బయటకు లాగాల్సిందే! ఇలాంటి సాధనలేమీ అక్కరలేకుండానే అమ్మవారిని స్మరించి శరణాగతి చెందితే - గజేంద్రుణ్ణి శ్రీ మహావిష్ణువు రక్షించినట్లు, సముద్రంలో దిగబడిపోతున్న భూమిని తన కోరతో ఆదివరాహమూర్తి పైకి ఉద్ధరించినట్లు- అమ్మవారు వారిని ఎంతో సామర్థ్యంతో ఉద్ధరిస్తుంది' - అని ఈ నామం చెబుతుంది.

సౌందర్యలహరిలో ఆదిశంకరులు 'అవిద్యానమంత స్తిమిర మిహిర ద్వీపనగరీ' - అన్న శ్లోకంలో 'జన్మ జలధౌ నిమగ్నానాం మురరిపు వరాహస్య భవతి' - అని ఇదే విషయాన్ని చెప్పారు. 'సంసార సముద్రంలో దిగబడిన వారిని ఉద్ధరించడంలో - అమ్మవారు ఆదివరాహ దంష్ట్ర వంటిది' అనడంలో ఆదిశంకరులు 'వరాహ' పదం వేశారు. ఈ వరాహ పద ఔచిత్యం ఏమిటో తెలియాలంటే 'విశుక్రప్రాణహరణ వారాహీ వీర్యనందితా' అన్న 76వ నామ వివరణ చదవండి. అయితే.

మనం ఏం చేస్తే బొందలో పడతామో తెలియ చెప్పడానికి మనకు ఇబ్బందులు, కష్టనష్టాలు వస్తాయి గాని – మనపై పగతో వాటిని ప్రకృతికి కల్పించినవి కావు' అని మాత్రం తెలుసుకోవాలి.

సంసార మనే బురదలో పూర్తిగా దిగబడిపోయిన వారిని చక్కగా ఉద్ధరించడంలో సామర్థ్యము కలది – అని ఈ నామానికి అర్థం.

## 881. యజ్ఞప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యజ్ఞప్రియాయైనమః' అని చెప్పాలి.

పదిమందికీ ఉపయోగపడే పనిని 'యజ్ఞం' అంటారు. ఇంట్లో నలుగురికీ ఉపయోగపడే అన్నాన్ని వండడం అనే పాక యజ్ఞం నుండి – మంచి మాటలతో నలుగురి బ్రతుకులను బాగుచేసే వాచిక యజ్ఞం, ఊళ్ళో అంటువ్యాధులు ప్రబల కుండా చేసే క్రతువులు; అతివృష్టి నుండి, అనావృష్టి నుండి కాపాడబడి దేశం సుభిక్షమవటం కోసం

చేసే క్రతువులు; దేశ సౌభాగ్యం కోసం, ప్రపంచ శాంతి కోసం చేసే మహత్కార్యాలన్నీ యజ్ఞాల క్రిందకే వస్తాయి. ఈ ప్రక్రియల్లో పరోపకారానికే ప్రాధాన్యం ఉంటుంది. ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మవారు ఇలాంటి వాటిని ఎన్నో ఈ ప్రపంచంలో ఏర్పాటు చేసింది. వాటిలోనే వృక్షాలు – పువ్వులు, కాయలు, పళ్ళు, ఇవ్వడం; వర్షాకాలంలో మేఘాలు వర్షించడం; వేసవికాలంలో ఎండలు; నియమబద్ధమైన గ్రహచలనాలు – ఇవన్నీ సృష్టి జీవుల మీద గల ప్రేమతోనే అనురాగవల్లి అయిన అమ్మవారు ఏర్పాటు చేసింది. ఇవన్నీ ఆమె దృష్టిలో యజ్ఞాలే ! లోకోపకార లక్ష్యం కలిగిన ఇలాంటి యజ్ఞాలంటే అమ్మవారికి చాలా ఇష్టం. అందుకని అమ్మవారు 'యజ్ఞప్రియా'.

దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మయజ్ఞాలు ఏకాహాలు, సప్తాహాలు, చండీయాగాలు, రుద్రయాగాదుల దగ్గఱ నుండి సత్రయాగాల దాకా ఎన్నో రకాల పరిమితులలో ఈ యజ్ఞాలుంటాయి. ఇవన్నీ అమ్మవారికి చాలా ఇష్టమైనవే !

ఒకవేళ ఎవ్వరైనా తిక్కగా 'ఇవన్నీ ఎందుకు జరగాలి ? అని ప్రశ్నిస్తే 'ఇవన్నీ ఎందుకు జరక్కూడదు ?' అని ఎదురు ప్రశ్నవేస్తుంది అమ్మవారు. అంతేకాదు 'నేనేం చెయ్యాలో నాకు సంబంధించినది కాని నువ్వు సలహాలు చెప్పడం, సూచనలు చెయ్యడం అవసరం లేదు – అని అంటుంది కూడా ! ఆవిడకు సలహాలివ్వాలంటే ఆవిడ చేసిన సృష్టికి పూర్వమే మనం ఉండాలి. అది కుదరదు కాబట్టి – సలహాలివ్వడం అవివేకమేఔతుంది.

మంచి పనులయందు ఇష్టము కలిగినది – అని ఈ నామానికి అర్థం.

## 882. యజ్ఞకర్త్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యజ్ఞకర్త్ర్యై నమః అని చెప్పాలి.

యజ్ఞాలు చెయ్యమనడం తేలికే – ఆ యజ్ఞాలు అంటే ఇష్టపడటం తేలికే – కాని యజ్ఞాలు నిర్వహించడం చాలా కష్టం. కాని, అమ్మవారు క్రిందటి నామంలో చెప్పినట్లు ఈ సృష్టి విధానంలోనే ఎన్నో యజ్ఞతుల్య మైన ప్రక్రియలను ఇమిడ్చింది. అందుకని అమ్మవారు 'యజ్ఞప్రియా' ఒకటే కాకుండా 'యజ్ఞకర్త్రీ' కూడా !

ఈ యజ్ఞాలు చెయ్యాలంటే గృహస్థులే చెయ్యాలి. ఆ గృహస్థుల్లో కూడా భార్య ఉన్నవారే చెయ్యాలి. అలా భార్యభర్తలు కూర్చుని చేసిన యజ్ఞంలో భర్త రూపంలో ఉన్న గృహస్థును 'సోమయాజి' అని, భార్య రూపంలో ఉన్న గృహిణిని 'సోమిదేవమ్మ' అనీ అంటారు. ఈ ఇద్దరూ - ఆ యజ్ఞం పరిపూర్తి అయ్యేవరకు పరమేశ్వర, పరమేశ్వరీ సమానులు. ఆ విధంగా సోమిదేవమ్మ రూపంలో ఉండే పరమేశ్వరిని 'యజ్ఞకర్త్రీ' అంటారు.

యజ్ఞములను నిర్వహించునది లేదా యజ్ఞ కర్తృత్వమును వహించునది - అని ఈ నామానికి అర్థం.

## 883. యజమానస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యజమానస్వరూపిణ్యైనమః' అని చెప్పాలి.

యజమాన = యజ్ఞము చేయు వాని, స్వరూపిణీ = స్వరూపముగా ఉన్నది.

ఏ పని చేయడానికి అయినా ముందు సంకల్పం కలుగుతుంది. అలాగే యజ్ఞం చేయబోయే ముందు గృహస్థుకు ఆ యజ్ఞం చేద్దామన్న సంకల్పం కలుగుతుంది. ఈ విధమైన సంకల్పం కలగడానికి ప్రేరణ అమ్మవారే! ఇలా యజమాని బుద్ధిలో యజ్ఞం జరగాలి అనే సంకల్పము యొక్క రూపంలో ఉండి, యజమాని చేత యజ్ఞకర్తృత్వాన్ని వహింప చేయడం కోసం యజమాని రూపంలో ఉన్న అమ్మవారిని - యజమాన స్వరూపిణీ - అంటారు.

యజ్ఞదీక్ష తీసుకున్న యజమాని పరమేశ్వరుని అష్టమూర్తులలో 'సోమయాజి' అనే ఎనిమిదవ మూర్తిగా పరిగణింపబడతాడు. సోమయాజి రూపంలో ఉండి యజ్ఞాన్ని నిర్వహిస్తుంది కాబట్టి అమ్మవారు 'యజమానస్వరూపిణీ'.

యజ్ఞమును నిర్వహించు యజమాని రూపంలో ఉన్నది - అని ఈ నామానికి అర్థం.

## 884. ధర్మాధారా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధర్మాధారాయైనమః' అని చెప్పాలి.

ధర్మ = ధర్మమునకు, ఆధార = ఆధారభూతమైనది.

'ధర్మాలు' – అంటే దాన ధర్మాల పదాలలోని ధర్మాలే అవాలని లేదు. ధర్మాలంటే లక్షణాలు, స్వభావాలు అని కూడా అర్థం ఉంది. ద్రవ్య ధర్మాలు (Properties of matter, space etc) గూడా ధర్మాలలోకే వస్తాయి.

ప్రపంచంలోని అన్ని రకాల జీవులకు, పదార్థాలకు వాటి వాటి ధర్మాలు (స్వభావాలు) వాటి వాటికి ఉంటాయి. ఒకదాని లక్షణం ఇంకోదానికి ఉండదు. 'పొట్ల' స్వభావం – 'బీర'కు ఉండదు; 'ఉప్పు' స్వభావం – 'పంచదార'కు ఉండదు; 'పులి' స్వభావం 'ఆవు'కు ఉండదు; 'నీటి' స్వభావం – 'పాదరసా'నికి ఉండదు. ఇలా వేటి వేటి స్వభావం వాటి వాటికే ఉండటానికి ఆధారం – అమ్మవారి ఆజ్ఞాలే కాబట్టి, అన్ని ధర్మాలకు ఆధారమైంది అమ్మవారు.

ఒకవేళ ఎవరి వల్లనైనా ధర్మం దెబ్బ కొట్టబడితే – అలా దెబ్బ కొట్టబడిన ధర్మమే దెబ్బ కొట్టిన వాడిని చంపుతుంది అని (ధర్మఏవహతోహన్తి) ధర్మశాస్త్రం చెబుతుంది. ధర్మాచారం అలక్షణాల్వాన్ని నశింప చేస్తుంది.

ధర్మాన్ని ఎందుకు ఆచరిస్తున్నావు అంటే – 1) ధర్మాన్ని ఆచరిస్తే అది నన్ను రక్షిస్తుంది కాబట్టి, అని కాని,

2) ధర్మాన్ని నేను ఆచరించి ఇతరులను ఇబ్బంది పెట్టకుండా ఉంటే – ఆ ఇతరులు కూడా ధర్మాన్ని ఆచరించి నన్ను ఇబ్బంది పెట్టరు కాబట్టి – అని కాని –

3) ధర్మాన్ని ఆచరించకపోతే నన్ను శిక్షిస్తారు కాబట్టి, జరిమానా వేస్తారు కాబట్టి – అని కాని సమాధానాలు కాకూడదు. ధర్మాన్ని ఎందుకు ఆచరిస్తున్నావు అంటే – 'అల్లా ఆచరించడం ధర్మం కాబట్టి' – అన్నదే సమాధానం కావాలి. ఈ ధర్మాచరణకు ప్రేరణ ఆధారం, ప్రమాణం – అమ్మవారి సృష్టిలో తిరుగులేకుండా ఉండే ద్రవ్య ధర్మాలు,

ఋతు ధర్మాలు, జీవ ధర్మాలే అవాలి. లేదా శ్రుతులలో, స్మృతులలో చెప్పినవే ఆధారంగాను, ప్రమాణంగాను ఉండాలి.

ధర్మాలకు ఆధారమైనది – అని ఈ నామానికి అర్థం.

## 885. ధనాధ్యక్షా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధనాధ్యక్షాయై నమః' అని చెప్పాలి.

ధన = ధనమునకు, అధ్యక్షా = అధికారిణి.

ధర్మం – పరలోకంతో ముడిపడి ఉండి పుణ్యాలకు సంబంధించినది అయితే, ధనం – ఇహలోక సౌఖ్యాలకు సంబంధించినది. అయితే – ధనం అంటే నోట్లకట్టలు కాదు. ఈ నోట్లకట్టలను 'కరెన్సీ' అంటారు. శ్రీ సూక్త ఫలశ్రుతిలో ధనమంటే – 'ధనమగ్నిర్ధనం వాయుః, ధనం సూర్యోధనం వసుః... అని చెప్పబడుతుంది. ఈ లెక్కని ప్రాణాధారం, జీవనాధారం అయినవే 'ధనం' క్రిందకు వస్తాయి కాని – నోట్ల కట్టలు, లోహపు బిళ్ళలు కాదు.

ఏవి లేకపోతే నోట్ల కట్టలున్నా ప్రయోజనం లేదో, ఏవి ఉంటే నోట్ల కట్టలు లేకపోయినా ప్రయోజనం ఉందో దాన్ని వాస్తవానికి 'ధనం' లేదా 'సంపద' అనాలి. ఈ విధమైన ధనానికి అమ్మవారు అధికారిణి – పంపిణీదారిణి.

ఇప్పుడు మనం నోట్లకట్టలు అని అర్థం చెప్పుకునే ధనానికి అర్థం – 'పూర్వం మనం పడ్డ శ్రమకు చిహ్నం అని మాత్రమే గాని అంతకంటె విలువైన అర్థం లేదు. ఈ విధమైన నోట్ల కట్టల్ని శ్రమపడకుండా కూడా సంపాదించే మార్గాలు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. కాని, సంపద కావాలంటే శ్రమపడాల్సిందే! కాబట్టి, ధనం అంటే సంపద కాని, నోట్ల కట్టలు కాదు. ఈ విధమైన ధనానికే అమ్మవారు అధ్యక్షురాలు.

ధనమునకు (సంపదకు) అధ్యక్షురాలు – అని ఈ నామానికి అర్థం.

## 886. ధనధాన్యవివర్ధినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధనధాన్యవివర్ధిన్యైనమః' అని చెప్పాలి.

ధన = ధనమును, ధాన్య = ధాన్యమును, వివర్ధినీ = విశేషంగా వర్ధిల్లచేయునది.

ప్రాణాధారాలైన గాలి, నీరు, అగ్ని; దేహాధారాలైన పాడి, పంట వసతులను - ధనధాన్యాదులంటారు. విశ్వకళ్యాణానికి ఇవి వర్ధిల్లితే చాలు. అందుకని - అమ్మవారు ఈ ధనధాన్యాదులను వర్ధిల్లచేస్తుంది.

ధనధాన్యాదులను వర్ధిల్ల చేయునది - అని ఈ నామానికి అర్థం.

'ధర్మాధారా', 'ధనాధ్యక్షా', 'ధనధాన్యవివర్ధినీ' నామాలలో - పరలోకంతో ముడిపడి ఉండే పుణ్యాన్ని, ఇహలోకంతో ముడిపడి ఉండే ధనాన్ని, మన దేహంతో ముడిపడి ఉండే ధాన్యాన్ని అమ్మవారు వర్ధిల్ల చేస్తుందని సమన్వయం చేసుకోవాలి.

## 887. విప్రప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విప్రప్రియాయైనమః' అని చెప్పాలి.

విప్ర = విశేషమైన ప్రజ్ఞ గలిగి, వేద విహితకర్మలు చేయువారియందు, ప్రియా = ప్రీతిగలది.

రాజకీయపరమైన మాలవాడు ఎలా అయితే హరిజనుడు కాడో - అలాగే యజ్ఞోపవీతం ఉన్నవాడల్లా ఎలా అయితే ద్విజుడు కాడో - అలాగే - వేదపాఠాలు వల్లించేవాడల్లా బ్రాహ్మణుడు కాడు.

ఉపదేశం పొంది సంస్కరింపబడినవాడే ద్విజుడు. బ్రహ్మజ్ఞానం కలిగినవాడే బ్రాహ్మణుడు. అలాగే - వేదాలు చదివి విశేష ప్రజ్ఞను పొంది వేద విహిత కర్మలు చేసే వాడే విప్రుడు. ఇటువంటి విప్రులంటేనే అమ్మవారికి ఇష్టం.

'విశేషమైన ప్రజ్ఞకలిగి వేద విహిత కర్మలు ఆచరించే వారియందు ప్రీతికలది' అని ఈ నామానికి అర్థం.

## 888. విప్రరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విప్రరూపాయై నమః' అని చెప్పాలి.

విప్ర = విప్రుల, రూపా = రూపముగా ఉన్నది.

శ్లో. జన్మనా జాయతే శూద్రః సంస్కారాత్ ద్విజ ఉచ్యతే

వేదపాఠీ భవేద్విప్రః బ్రహ్మజ్ఞానీచ బ్రాహ్మణః

అన్న శ్లోకాన్ని బట్టి – పుట్టడంతోటి ప్రతి వ్యక్తీ శూద్రుడే ! ఉపదేశం పొంది సంస్కరింపబడితే– ద్విజుడౌతాడు. వేదపఠనం వలన విప్రుడౌతాడు. బ్రహ్మజ్ఞానం కలిగిన వాడు – బ్రాహ్మణుడౌతాడు. అంటే – ఈ అర్హతలు సాధన వల్ల వచ్చేవి గాని – జన్మ వల్ల, కులం వల్ల వచ్చేవి కావు.

పైన తెలిపినట్లుగా వేదాలు చదివి, అర్థాన్ని గ్రహించి, విశేష ప్రజ్ఞను పొంది, వేదవిహిత కర్మలు చేసే విప్రుల రూపంలో ఉండేది అమ్మవారే అని ఈ నామం తెలుపుతుంది.

స్వర్గలోకంలో దేవతలెలాంటివారో – భూలోకంలో విప్రుల లాంటి వాళ్ళు. అందుకనే వేదవేత్తలైన విప్రులను 'భూసురులు' లేదా 'భూదేవతలు' అంటారు. ఈ విప్రులంటే అమ్మవారికి ఇష్టం. వీరి రూపంగా ఉండే అమ్మవారు వేద విద్యను విస్తరిల్ల చేస్తుంది.

వేదవేత్తలైన విప్రుల రూపముగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 889. విశ్వభ్రమణ కారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వభ్రమణకారిణ్యై నమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వము యొక్క, భ్రమణ = భ్రమణమునకు, కారిణీ = కారణమైనది.

ఒక కణంలో గాని, వస్తువులో గాని, వ్యక్తిలో గాని చలనం అనేది ప్రధానంగా మూడు రకాలుగా ఉండటానికి అవకాశం ఉంది – అని 1) స్థానాంతర చలనం

(Translatory motion) 2) భ్రమణ చలనం, (Rotary motion) 3) స్పందనాత్మక చలనము (Vibratory motion) ఈ ప్రస్తుత నామంలో విశ్వం యొక్క భ్రమణ చలనం గురించి చెప్పబడుతోంది.

భ్రమణ చలనంలో ఒక ఆవర్తన లక్షణం (Periodicity) ఉంటుంది. స్టాండు వేసి సైకిల్ వెనుక చక్రం త్రిప్పితే – ఆ చక్రం తిరిగే చలనాన్ని భ్రమణ చలనం అంటారు. ఫ్యాను తిరగడం కూడా ఇలాంటిదే! సృష్టిలో ఈ భ్రమణ చలనం చాలా వాటిల్లో ఉంది. గ్రహాలు తమ చుట్టూ తాము తిరగడం భ్రమణ చలనమైతే, సూర్యుని చుట్టూ తిరగడం పరిభ్రమణ చలనమౌతుంది. భూమికి ఉన్న ఇటువంటి గమనం వల్లనే సూర్యోదయ సూర్యాస్తమయాలు, రేయింబవళ్ళు, ఋతువులు – దీనికి చంద్రభ్రమణ చలనం కూడా తోడైతే శుక్ల పక్ష కృష్ణపక్షాలు, చంద్రకళలు, తత్ఫలితంగా తిథులు పూర్ణిమా, అమావాస్యలు, మాసాలు, సంవత్సరాలు, అయనాలు, యుగాలు, మన్వంతరాలు, కల్పాలు ఏర్పాటౌతాయి. ఇవన్నీ 'భ్రమణ చలనం' అనే లక్షణం మీదే ఆధారపడి ఏర్పాటౌతాయి. అయితే – ఇన్ని విధాలుగా ఇన్నిటితో నిండి ఉండే విశ్వం ఇలా భ్రమణ చలనంతో ఉండటానికి కారకులెవరు ? అని ప్రశ్నవేసుకుంటే – తప్పకుండా ఒక చైతన్యశక్తి వీటిన్నిటికీ కారణమై నడిపిస్తూ ఉండాలని నమ్మవలసి వస్తుంది 'We can not believe' (మేం నమ్మలేం) అని ఎవరైనా ఆంగ్లంలో కోప్పడితే - 'Wait until you believe' ( నమ్మేంతవరకు నిరీక్షించు) అనే సమాధానం చెప్పుకోవాల్సి ఉంటుంది.

విశ్వభ్రమణానికి కారణమైన అమ్మవారు వ్యక్తుల మనస్సులను, చిత్తాలను కూడా భ్రమింప చేయకలదు. అవసరాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి ఈ భ్రమణ లక్షణాన్ని అన్ని రకాలుగాను, అన్ని విషయాల్లోను అమ్మవారు వినియోగించి విశ్వాన్ని తిన్నగా నడుపుతుంది. ఈ సృష్టిలో ఎన్నో లక్షణాలు, విలక్షణాలు ఉన్నా అవన్నీ విశ్వ కళ్యాణానికి అవసరమయే విధంగానే ఉంటాయి. అది అమ్మవారి విశ్వ నిర్వహణలోని ప్రత్యేకత.

'ఈశ్వర స్సర్వ భూతానం హృద్దేశే అర్జున తిష్ఠతి', భ్రామయన్సర్వ భూతాని యంత్రారూఢానిమాయయా' – అని గీతలో కూడా ఈ భ్రమణ చలనం గురించి చెప్పబడింది.

విశ్వము యొక్క భ్రమణమునకు కారణమైనది – అని ఈ నామానికి అర్థం.

## 890. విశ్వగ్రాసా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వగ్రాసాయైనమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వమంతటిని, గ్రాసా = తనలోనికి గ్రహించునది.

'గ్రస్' అంటే మ్రింగుట(To swallow) అని అర్థం. మ్రింగడానికి తినడానికి తేడా ఉంది. మ్రింగటం అంటే – వస్తువును గాని, పదార్థాన్ని గాని ఉన్నదాన్ని ఉన్నట్లు లోపలకు గ్రహించడం. 'నములుతూ అనుభూతి పొందుతూ గ్రహించడాన్ని' తినడం అనాలి. ఈ ప్రక్రియలో రుచితో సంబంధము ఉంటుంది. పిల్లి ఎలుకను తినడం ఇలాంటి కోవలోకే వస్తుంది. ఇంగ్లీషు మందు బిళ్ళ వేసుకోవాల్సి వచ్చినపుడు మనం మ్రింగుతాం. ఈ ప్రక్రియలో రుచితో సంబంధం ఉండదు. బత్తాయి, కమలాల వంటి పళ్ళు తింటున్నపుడు వాటిలోని గింజలు ఒక్కొక్కసారి గొంతులోంచి జారి కడుపులోకి పోతాయి అవి ఒక్కొక్కపుడు చెక్కు చెదరకుండా విసర్జింపబడుతూ ఉంటాయి గూడా ! అంటే ఈ గ్రసించబడే దానికి మార్పు ఉండదు. అలాగే మహా ప్రళయకాలంలో ఈ మొత్తం విశ్వాన్ని అమ్మవారు కాళీరూపంలో ఒక మందు బిళ్ళలాగా, బీజప్రాయంగా మ్రింగేస్తుంది. అలా మ్రింగిన అమ్మవారి కడుపులో బీజప్రాయంగా చతుర్దశ భువనాలతో ఉన్న మొత్తం విశ్వం చెక్కు చెదరకుండా ఉండి, మళ్ళి సృష్టి ప్రారంభంలో బయటకు వ్యక్తమౌతుంది. ఇలా విశ్వాన్నంతను తనలోకి గ్రసించు అమ్మవారి నామాన్ని 'విశ్వగ్రాసా' అన్నారు. (మహాప్రళయకాలమునందు) విశ్వమును తనలోనికి గ్రహించునది – అని ఈనామానికి అర్థం.

## 891. విద్రుమాభా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విద్రుమాభాయైనమః' అని చెప్పాలి.

విద్రుమ = పగడము యొక్క, ఆభా = ప్రకాశము కలది.

'విద్రుమాభా' అంటే – పగడం వలె ప్రకాశించునది. అని చెప్పడం తప్పు, పగడం యొక్క రంగులో ప్రకాశించునది అన్నది సరియైన అర్థం.

సూర్యుడు ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క రంగులో ఉంటాడు. ఈ విషయం రుద్ర నమకంలో 'అసౌయస్తామ్రో అరుణ ఉతబభ్రుఃసుమంగలః' అని చెప్పబడుతుంది.

నలుపురంగులోకి పోకముందు, అంటే – అస్తమయ సూర్యుని రంగు తామ్రవర్ణంలో ఉంటుంది. నలుపురంగులోంచి బయటకొచ్చే ముందు – అంటే ఉదయసూర్యుని రంగు అరుణవర్ణంలో ఉంటుంది. ప్రస్తుత నామం 'విద్రుమాభా' లోని విద్రుమ, అంటే – పగడం – తామ్రవర్ణంలో ఉంటుంది. అంటే – అస్తమయ సూర్యుని రంగులో ఉంటుంది. 'అమ్మవారు ఈ రంగులో కూడా ప్రకాశిస్తూ ఉంటుంది – అని ఈ నామం చెబుతుంది. అయితే ఏ సమయంలో ఈ రంగులో ప్రకాశిస్తుందో 'విద్రుమాభా' అనడంలోనే చెప్పబడింది. (విద్రుమం తామ్రవర్ణంలో ఉంటుంది. ఈ తామ్రవర్ణం అస్తమయకాలాన్ని సూచిస్తుంది అని ముందే చెప్పబడింది గదా!)

ఇంతకు ముందు నామం అయిన 'విశ్వగ్రాసా' లో ప్రళయకాలంలోని అమ్మవారికి సంబంధించిన ఒక లక్షణం చెప్పబడింది. ప్రస్తుత నామంలో కూడా అదే కాలానికి అంటే పగలు రాత్రిలోకి లీనము కాబోయే సూర్యాస్తమయ కాలం సూచించే ప్రళయ ప్రారంభ కాలానికి సంబంధించిన అమ్మవారి రంగు గురించి చెప్పబడింది. ఇదే ఈ నామాల వరుసలోని సంబంధం, ఔచిత్యం.

పగడపు రంగు కాంతితో ప్రకాశించునది – అని ఈ నామానికి అర్థం.

## 892. వైష్ణవీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వైష్ణవ్యై నమః' అని చెప్పాలి.

వైష్ణవీ = విష్ణు సంబంధమైన స్త్రీ రూపము.

1) విష్ణు సంబంధమైన స్త్రీ రూపము అంటే – మోహినీ రూపము.

2) విష్ణుశక్తి అయిన లక్ష్మీ స్వరూపురాలు.

3) 'స్థితికారిణి' అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 893. విష్ణురూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విష్ణురూపిణ్యైనమః' అని చెప్పాలి.

విష్ణు = విష్ణు లక్షణములు గల, రూపిణీ = రూపముగలది.

విష్ణువు యొక్క లక్షణాలు -

1) సర్వవ్యాపకత్వం

2) స్థితికారకత్వం - అంటే, పోషకకారకత్వం.

3) శివునికి భార్య అవడం

4) శివుణ్ణి అర్చించడం

పైన చెప్పిన నాలుగు లక్షణాలు అమ్మవారిలోను ఉన్నాయి. విష్ణువు యొక్క ఈ లక్షణాలను రూపంగా కలిగినది కాబట్టి అమ్మవారు 'విష్ణురూపిణీ!'

బ్రహ్మాండ పురాణంలో ఆదిశక్తి గుఱించి విష్ణుమూర్తి -

'ఆద్యాశక్తిః మహేశస్య చతుర్ధా భిన్న విగ్రహా

భోగే భవానీరూపా, సా దుర్గారూపాచ సంగరే,

'కోపేచకాళికారూపా, పుంరూపాచ మదాత్మకా -

అని చెప్పినట్లు ఉంది. (మహేశ్వరుని ఆదిశక్తి - భోగరూపమున భవాని గాను, యుద్ధరంగంలో దుర్గాదేవిగాను, కోపంలో కాళికాదేవిగాను, పురుషరూపంలో నా స్వరూపంగాను ఇలా నాలుగు విధాలుగా అయింది - అని దీని అర్థం). ఈశ్వరుని ఆదిశక్తే - పురుష రూపంలో ఉన్న విష్ణుమూర్తిగా ఉంటుందని ఈ శ్లోకాన్ని బట్టి నిర్ధారణ అవుతోంది.

విష్ణువు లక్షణములను రూపముగా కలిగినది - అని ఈనామానికి అర్థం.

## 894. అయోనిః

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అయోనయేనమః' అని చెప్పాలి.

అయోనిః = ఉత్పత్తిస్థానము లేనిది.

సాధారణంగా దేనికైనా భౌతికంగా వ్యక్తరూపంలో ఉండటానికి - జన్మకారణము, లేదా - ఉత్పత్తి స్థానం ఒకటి ఉండాలి. దాన్నే 'యోని' అంటారు. ఉత్పత్తిస్థానం లేకుండా ఏదీ భౌతిక ప్రపంచంలో ఉండదు. మనుష్యులకు తల్లిదండ్రులే జన్మకారణం. మాతృగర్భమే ఉత్పత్తిస్థానం. మరి 'అమ్మవారికి అలాంటి జన్మకారణం ఏది? ఎవరి వల్ల అమ్మవారు పుట్టింది' అన్నదానికి సమాధానం లేదు. ఈ విశ్వం మొత్తానికి అమ్మవారే ఉత్పత్తి స్థానం అయినపుడు ఇంక అమ్మవారికి వేరే ఉత్పత్తిస్థానం ఎక్కడ ఉంటుంది? అందుచేత అమ్మవారు 'అయోని'ః.

'తనకొక ఉత్పత్తి స్థానము ('పుట్టుక స్థానము') లేనిది' - అని ఈ నామానికి అర్థం.

## 895. యోనినిలయా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోనినిలయాయైనమః' అని చెప్పాలి.

యోని = ఉత్పత్తి స్థానమునకు, నిలయా = నిలయమైనది.

ఇంతకు ముందు నామంలోనే ఈ నామం యొక్క భావం కూడా తెలుపబడింది. ఈ సమస్త విశ్వం అమ్మవారి నుండే వ్యక్తమైంది. అని 'సృష్టికర్త్రీ' 'వియదాదిజగత్ప్రసూః', 'విశ్వగర్భ' విశ్వధారిణీ' - మొదలైన నామాలు తెలుపుతాయి.

తనకు వేరే ఉత్పత్తి స్థానం లేదు గాని తానే అన్నిటికీ ఉత్పత్తి స్థానం. ఈ రెండు నామాలు ఒక దానితో ఒకటి సంబంధం కలిగి, అమ్మవారి తత్త్వాన్ని నిర్ధారించి(Con-firm) చెబుతాయి.

శ్రీ చక్రంలోని కేంద్రం వద్ద శివశక్త్యైక్యరూపిణిగా సూచించిన బిందుస్థానమే ఈ 'యోనినిలయా' అన్న నామం తెలిపే ఉత్పత్తిస్థానం.

'సమస్త విశ్వానికి ఉత్పత్తిస్థానము' అని ఈనామానికి అర్థం.

## 896. కూటస్థా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కూటస్థాయైనమః' అని చెప్పాలి.

కూట = చెక్కు చెదరకుండా (ఇనుపదాగలి వలె ఎల్లకాలము) ఒకే విధముగా, స్థా = ఉండునది.

ప్రపంచంలోని మిగిలిన వాటికి ఎన్నో మార్పులు, చేర్పులు, కూర్పులు జరగవచ్చు. ఆకారాలు, పరిమాణాలు, నామాలు, రూపాలు మారవచ్చుకాని అటు వంటి మార్పులు పొందే సర్వము న ందు ఏ మార్పు చెందకుండా ఉండేదే అమ్మవారు.

చోటులో ఇల్లుకట్టినా ఇంట్లోని గదులలో పరిమితమైన చోటుకు ఏమి మార్పు ఉండదు. గోడలు బ్రద్దలై, ఇల్లు కూలినా ఆ గదుల్లోని చోటుకు మాత్రం ఏమీ అవదు. చెక్కు చెదరకుండా ఇల్లు కట్టక పూర్వం ఎలా ఉందో ఇల్లుకూలిన తర్వాత గూడా అలాగే ఉంటుంది.

ప్రతి వ్యక్తిలోను పైన చెప్పిన గదిలో చోటు లాగానే ఉండి – ఆ వ్యక్తి చేసే ప్రతి పనిని గమనిస్తూ వాటితో ఏమీ సంబంధం లేకుండా, ఆ పనులన్నీ సాక్షీ మాత్రంగా గమనిస్తూ, నిర్వికారంగా ఉంటూ, ఆ వ్యక్తి దేహం చాలించినా తను మాత్రం చెక్కు చెదరకుండా అతని అంతరంగంలోని ఆత్మగా ఉన్న అమ్మవారిని 'కూటస్థా' అంటారు. ఇలా ఉండగలగడం మనకు చిత్రంగానే అనిపిస్తుంది. అందువల్లనే అలా ఉండగలగడాన్ని ఒక 'మాయ' క్రింద పరిగణిస్తారు. ఈ మాయాలక్షణంతో అంతరంగాల్లో ఉండే అమ్మవారిని 'కూటస్థా' అనవచ్చును.

అమ్మవారి పంచదశాక్షరీ మంత్రం మూడు కూటములుగా ఉంటుంది కాబట్టి, అమ్మవారు 'కూటస్థా'. ఈ 'కూటస్థా' లక్షణం గురించి గీతలో 'కూటస్థో౽క్షర ఉచ్యతే' – 'కూటస్థ మచల ధ్రువమ్' అని చెప్పబడింది.

చెక్కు చెదరని ఇనుప దాగలి వలె ఎల్లకాలము ఒకే విధముగా (ఆత్మతత్త్వముగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 897. కులరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులరూపిణ్యైనమః' అని చెప్పాలి.

కుల = కులము యొక్క, రూపిణీ = రూపముగా ఉన్నది.

'కుల' అనే పదం రెంటిని సూచిస్తుంది. 1) వంశము 2) కులపథము.

ప్రతి అరటి చెట్టూ – ముందు 'పిలక'లాగా పైకి వస్తుంది. ఇలాంటి పిలకలు ఎన్నో భూమి నుండి బయటకు పొడుచుకు వస్తాయి. ఈ పిలకలన్నీ రావడానికి భూమిలోపల ఆ అరటి తాలూకు 'మూలకందం' ఉంటుంది. ఈ మూలకందం రాబోయే అరటి పిలకకు ఎలా ఉంటుందో – అలాగే, పుట్టే ప్రతి వ్యక్తికి, ఆ వ్యక్తి తాలూకు వంశానికి 'మూలకందం' ఉంటుంది. ఈ 'మూలకందం' రూపంలో ఉండి, ఆ వంశాన్ని తరతరాలుగా అభివృద్ధి పథంలో నడిపేది సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారే ! ఈ విధమైన వంశపురోగమనంలో ఒక వైపు నుండి పితృయాన మార్గంలో శరీరాలు కల్పించబడుతూ, భౌతికమైన వంశాభివృద్ధి జరుగుతూ ఉంటుంది. ఇంకోవైపు దేవయాన మార్గంలో జ్ఞానపరమైన వంశము కొనసాగుతూ ఉంటుంది. ఈ రెంటికీ కూడా అమ్మవారే కారణం కాబట్టి, అమ్మవారు 'కులరూపిణీ'.

ప్రతి వ్యక్తిలోని వెన్నెముక వెంబడి ఉండే సుషుమ్నా మార్గాన్ని 'కులపథం' అంటారు. మూలాధారంలో ఈ మార్గానికి మూలకందం ఉంటుంది. దీన్నే 'కులకుండం' అంటారు. ఈ కులపథాన్ని అనుసరించే కుండలినీ శక్తి అనే అమ్మవారు షట్చక్ర భేదనము చేసుకుంటూ, చిట్టచివరకు సహస్రారంలోని శివునిలో లీనమై, ఆ జీవునికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఈ కులపథ రూపంలో జీవుల్ని తరింపచేసే అమ్మవారిని 'కులరూపిణీ' అంటారు.

1) పితృయాన మార్గంలోను, దేవయాన మార్గంలోను వంశాన్ని పురోగమన అభివృద్ధి దిశలో నడిపించు శక్తి స్వరూపిణి.

2) కులపథాన్ని అనుసరించి జీవులకు ముక్తిని ప్రసాదించు శక్తి స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు.

## 898. వీరగోష్ఠీప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వీరగోష్ఠీ ప్రియాయై నమః' అని చెప్పాలి.

వీర = వీరుల యొక్క, గోష్ఠీ= సంభాషణల యందు, ప్రియా = ప్రీతికలది.

'వీరులు' అనే పదానికి చాలా అర్థాలు ఉన్నాయి. పూర్వం రోజుల్లో రాత్రిపూట గ్రామం యొక్క రక్షణ కోసం కొందరిని నియమించేవారు. వాళ్ళు రెండు రకాలుగా ఉంటారు. 1) భైరవులు 2) భద్రులు, కేకలు, కూతలు పెట్టి విషయ ప్రసారానికి దోహదపడే వారిని 'భైరవులు' అంటారు. అంటే – వీళ్ళు గ్రామవీధుల్లో చరిస్తూ గ్రామ రక్షణకు తోడ్పడేవారు(Mobile vigilant staff or knights). ఒక్కొక్కచోట స్థిరంగా గ్రామరక్షణ విషయం చూసే వారిని (Stable staff) 'భద్రులు' అంటారు. ఈ ఇద్దరినీ 'వీరభైరవులు' 'వీరభద్రులు' అని, లేదా – సరళంగా 'వీరులు' అనీ పిలుస్తారు.

ఈ వీరులనే 'పోతురాజులు' అని గూడా అంటారు. ఈ 'వీరులు', లేదా – పోతురాజులు రాత్రిపూట గ్రామరక్షణ గురించి మాట్లాడుకోడానికి చేరే ప్రదేశాలు సాధారణంగా ఊరిపొలిమేరల్లో ఉంటాయి. ఆ పొలిమేరల్లోనే 'పొలిమేరమ్మ' లేదా 'పోలేరమ్మ' మొదలైన పేర్లతో ఉండే అమ్మవారికి మందిరాలు ఉంటాయి. ఈ మందిరాల ప్రాంగణంలోనే వాళ్ళు గ్రామం గురించి సంభాషించుకుంటూ ఉంటారు. ఈ వీరభద్రులు, వీరభైరవులు అనే వీరులు మాట్లాడుకునే మాటలను గ్రామదేవత అయిన అమ్మవారు విని – 'మన వాళ్ళు గ్రామరక్షణ విషయంలో జాగ్రత్త గానే మసలు కుంటున్నారు' – అని సంతోషిస్తుంది. ఈ వీరులు ( గ్రామ రక్షకులు) చేసే గోష్ఠియందు ప్రీతి కలగిన అమ్మవారిని 'వీరగోష్ఠీప్రియా' అంటారు.

వీరభద్రులు, వీర భైరవులు చేరిన చోట పోలేరమ్మ మందిరాలు ఉండడం – 'వీరు లెక్కడ చేరతారో అక్కడ శక్తి ఉంటుంది' అనే విషయాన్ని నిర్ధారణ చేస్తుంది. (గోవులు చేరే చోటును 'గోష్ఠి' అంటారు. యజ్ఞయాగాది – క్రతువుల్ని గోవులు త్రొక్కిన, మసలిన ప్రదేశాల్లో చేసే వాళ్ళు).

మనలో గూడా మనం పరధ్యానంగా ఉన్నప్పుడు మన ప్రమేయం లేకుండానే మనకు రక్షణ విషయం చూసే కొన్ని శక్తులు మనలో ఉంటాయి. ఎదుటి వాడు రాయి విసిరితే తప్పుకోడాలు, కనురెప్పలు, మూత పడడాలు మొదలైన వన్నీ ఈ శక్తుల వల్లనే! వీటిని ఆంగ్లంలో Instincts, Reflexes అని గాని, Subconscious Reflexes అని గాని అంటారు. వాస్తవానికి వీటిని Supra Conscious Reflexes అనాలి. Auto healing centres అని ఆధునిక విజ్ఞాన శాస్త్రం (Modem Science) ఇప్పుడిప్పుడే వీటి గురించి తెలుసుకుంటోంది.

'మహాభైరవ పూజితా' అన్న 231వ నామంలోను, 'భైరవీ' అన్న 276వ నామ వివరణలోను పైన చెప్పిన విషయాలు విపులంగా ఉన్నాయి. ఆ వివరణలు కూడా చదువుకుంటే ప్రస్తుత నామ వివరణ పరిపూర్ణమౌతుంది. (మన భారతదేశంలో మతపరంగా ఉండే ఇటువంటి విషయాల్లో ఎంతటి మహత్తరమైన విజ్ఞాన విషయాలున్నాయో అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి).

1) భండాసురాది రాక్షసులను చంపినప్పటి వీరగాథలను, ఆ గాథలను గురించి చెప్పే సహస్ర నామాది స్తోత్రాలను వినుటలో ప్రీతి చెందునది.

2) ఉపాసక శ్రేష్ఠుల యొక్క బ్రహ్మ విద్యాపర సంభాషణలు వినుట యందు ప్రీతి గలది. (''వీరులు'' అంటే బ్రహ్మవిద్యాపరులు అనే అర్థంలో)

3) గ్రామ రక్షకులుగా పనిచేయు వీరుల సంభాషణలను గ్రామదేవతగా వినుటలో ప్రీతి కలది.

4) మన రక్షణకై మనలో అజ్ఞాత శక్తులుగా పనిచేయు భైరవాది రక్షణ స్వయం ప్రేరక సహాయక శక్తుల పని తీరులు వినుటలో ప్రీతి కలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 899. వీరా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వీరాయై నమః' అని చెప్పాలి.

వీరా = వీరత్వము కలది.

'వీరః' పదం యొక్క స్త్రీ రూపమే 'వీరా' అని అర్థం గాని 'వీరుని భార్య' అని కాదు.

1) అనితర సాధ్యమైన భండాసుర మహిషాసురాదుల సంహారాలు ఎన్నో చేసిన వీర పరాక్రమ సంపన్నురాలు.

2) శ్రీ విద్యా ఉపాసక శ్రేష్ఠులు అనే వీరుల రూపంలో ఉండునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 900. నైష్కర్మ్యా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నైష్కర్మ్యయై నమః' అని చెప్పాలి.

నైష్కర్మ్యా = క్రియా కర్తృత్వము లేనిది.

మనం ఊరికే కదలకుండా ఒక చోట కూర్చున్నా; మనం ఏదన్నా చేద్దామని సంకల్పించకపోయినా, మన కర్తృత్వము మన ప్రమేయము లేకుండానే - మన మనస్సులో ఆలోచనలు వస్తూ ఉంటాయి, గుండె కొట్టుకుంటూ ఉంటుంది, ఊపిరితిత్తుల ద్వారా శ్వాసప్రక్రియ నిర్వహింపబడుతూ ఉంటుంది. ఇలా మనలోనే మన ప్రమేయం మన కర్తృత్వం లేకుండా, మన సంకల్పం లేకుండా ఎలా ఈ పనులన్నీ జరుగుతున్నాయో - అలాగే సృష్టికి సంబంధించిన సమస్తమైన క్రియా కలాపాలు అమ్మవారి ద్వారానే జరిగినా వాటి కర్తృత్వం అమ్మవారికి లేదు. లీలాప్రాయంగా అవన్నీ తిన్నగా అమ్మవారి ద్వారా జరిగిపోతాయే తప్ప వాటికి అమ్మవారు అంటుకోదు, అవి అమ్మవారికి అంటవు.

ప్రతిజీవి – తన గతజన్మ తాలూకు పాప పుణ్య ఫలాల లబ్దమే, భవిష్యజ్జన్మ కారకమే (Every one is a product of his past and maker of his future. It is true even in the case of cycle of births and deaths) కాబట్టి, సృష్టిలో కర్మలన్నీ జన్మపరంపరల ద్వారా వచ్చే పాప పుణ్య ఫలితాలను బట్టి జరిగిపోతాయి.(Karma is a chain action which follows a continuity and sequence).

క్రియా చరణం గాని, కర్మఫల, పాపపుణ్యాల సంగం కాని అమ్మవారికి లేదు. కాబట్టి – అమ్మవారు 'నైష్కర్మ్య'.

ఏ విధమైన క్రియా కర్తృత్వము లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 901. నాదరూపిణీ

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నాదరూపిణ్యై నమః' అని చెప్పాలి.

నాద = నాదము యొక్క, రూపిణీ = రూపముగా ఉన్నది.

మనలో కనబడకుండా, వినబడకుండా ఉండే చోటు నుండి – వినబడేట్టుగా బయటకు శబ్ద రూపంలో వ్యక్తం చెయ్యడానికి వాహికగా(Vehicle) ఉపయోగపడే దాన్ని 'నాదము' అంటారు. ఈ నాదము యొక్క నేపథ్యం(Back ground) మీదే అన్ని రకాల ధ్వనులు, అక్షరాలు, మాటలు, వాక్యాలు ఉచ్చరింపబడి వ్యక్తమౌతాయి.

విద్యుత్ మీదనే ఆధారపడి ఫ్యాను తిరగడం, రేడియో పలకడం బల్బు వెలగడం లాంటివి జరుగుతాయి. వీటన్నిటికీ విద్యుత్తు ఎలాంటిదో – ఉచ్చరించబడే అన్ని రకాల శబ్దాలకు నాదం అలాంటిది. శబ్దాలకు, ధ్వనులకు వెనుక ఉన్న నాదం యొక్క రూపంగా అమ్మవారు ఉంటుందని – ఈ నామం చెబుతుంది. అంటే – నాదం మీదనే అన్ని రకాల ధ్వనులు అధ్యారోపణం(Super Impose) చెయ్యబడతాయన్న మాట ! అంటే – అక్షర రూప శబ్దాలకు నాదం – 'పూర్వ రూపం' ఔతుందన్నమాట ! ఒక విధంగా చెప్పుకోవాలంటే ఈ నాదం – పాడే పాటకు శ్రుతిలాంటిది. వేదమంతా నాదమయమే! అందుకే వేదాలను శ్రుతులు అన్నారు.

మనలో లోపల ఉండే నాదవేదము మనలో నాలుగు రకాలుగా వర్తిస్తుంది. ఒకటి - శ్వాస; రెండు - కంఠనాదం; వాక్యం దాని అర్థం; మూడు - మనస్సు; నాలుగు - దేహం. ఈ నాలుగూ వరుసగా సామవేదం, ఋగ్వేదం, యజుర్వేదం, అధర్వణ వేదం - అని పెద్దల చేత సంకేతించబడినాయి. వీనికి సంబంధించిన గ్రంథాలను ఆ ఋషులే పలికి ఉండటం వలన ఆ గ్రంథాలను కూడా 'వేదాలు' అంటారు.

సోఽహంలో ఉన్న 'శ్వాస' ప్రాణానికి ఆధారం కాబట్టి, శ్వాసకు సామవేదం సంకేతం కాబట్టి 'ప్రాణఃసామవేదః' అన్నారు అంటే 'ప్రాణమే సామవేదం' అని అర్థం. వాక్కుకు - ఋగ్వేదం సంకేతం కాబట్టి 'వాగేవఋక్ ' అన్నారు. అంటే - 'వాక్కే ఋగ్వేదం' అని అర్థం.

యజ్ఞానికి సంకల్పం అవసరం. ఈ సంకల్పం మనస్సుకు సంబంధించినది. ఈ సంకల్పాన్ని బట్టే ఉచ్చరించబోయేవాక్యవివరాలు ఉంటాయి. అలాగే - ఈ సంకల్పాన్ని బట్టే చేయబోయే యజ్ఞ వివరాలు ఉంటాయి. అందుకని - 'మనోయజుర్వేద' అన్నారు. అంటే - మనస్సు 'యజుర్వేదమ' ని అర్థం.

'ర' కారం మీద ఆధారపడేదే 'రవం' లేదా 'రావం'. 'సామం' సూచించే 'శ్వాస'- 'రావం' మీద పనిచేస్తే - అది 'నాదం' అవుతుంది - ఋగ్వేదం సూచించే వాక్కు నాదం మీద ఆధారపడి - వ్యక్తమౌతుంది. ఈ విధంగా సామం నుండి ఋక్ సాధింపబడుతుంది.

మనము, మనచే ఉచ్చరించబడబోయే మాట - ఇవి రెండూ వరుసగా మొదట్లో 'తొడిమ' 'పిందె' లాగా ఉంటాయి. ఆత్మజ్ఞానం, బ్రహ్మజ్ఞానం, శాస్త్ర జ్ఞానం, పెరిగే కొలదీ - పటంలో సూచించినట్లు 'మనం' అనే తొడిమ చిన్నదై - 'పిందె' అనే వాఙ్మయం పెరిగి పెద్దకాయలాగా ఔతుంది. (పటం 1, 2లను చూడండి.)



పటం - 1



పటం - 2

అంటే – మనం మన వాక్కుకు ఉపాధి లాంటి వాళ్ళమౌతాము. నాదంలో వివిధరకాలైన ఉచ్చారణ వ్యత్యాసాలు ఉంటే – అవే వివిధ కళలౌతాయి.

ఈవిధంగా నాదరూపంలో మననుండి వ్యక్తమయే అమ్మవారి నామాన్ని 'నాదరూపిణీ' అన్నారు.

అవ్యక్తంగా ఉన్న వాగ్దేవిని మొట్టమొదట బయటకు వ్యక్తపరచేది నాదం కాబట్టి, ఈ నాదమే విశ్వమంతా ఆవరించి – అందరి శ్రవణేంద్రియాల చేత గ్రహింపబడుతోంది. ఈ విధంగా బ్రహ్మాండమంతా ఆవరింపబడే నాదాన్ని 'వేదం' అంటారు. ఈ నాదవేద స్వరూపమే అమ్మవారు.

ప్రణవంలోని 'అ' కార 'ఉ' కార 'మ' కార రూపాలే త్రిమూర్తులు. అయితే – ఈ మూడక్షరాలను సమీకరించుకుని ముందుకు విస్తరిల్లే నాదరూపమే అమ్మవారు అని కూడా సమన్వయం చేసుకోవాలి.

నాదము యొక్క రూపముగా ఉన్నది – అని ఈ నామానికి అర్థం.

## ౯౦౨. విజ్ఞాన కలనా

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విజ్ఞానకలనాయై నమః' అని చెప్పాలి.

విజ్ఞాన = విజ్ఞానమును, కలనా = కలిగియున్నది.

అమ్మవారు నాద స్వరూపిణి అయితే – ఆ నాదంలో సమస్త బ్రహ్మాండ విజ్ఞానం, బ్రహ్మజ్ఞానం కలిసే ఉంటాయి. అలా విజ్ఞానంతో కూడిన నాదరూపాన్ని 'విజ్ఞాన కలనా' అనే నామంతో సంకేతిస్తారు.

'పాట' – నాదం అయితే – పాడేవాడు, సాహిత్యం, మనస్సు ఇవన్నీ పాట తాలూకు విజ్ఞానం అవుతుంది. ఈ రెండూ కలసి ఉన్న అమ్మవారి నామమే 'విజ్ఞానకలనా'.

అన్నిటిలోను, అందరిలోను ఉండే ఏకత్వాన్ని నాదం సూచిస్తే – వారిలోని వైవిధ్యాన్ని తెలియచేస్తుంది – విజ్ఞానం. అందుకే 'నాదం' – 'యోగం' (Synthesis) లాంటిది. విజ్ఞానం – 'విశ్లేషణ' (Analysis) లాంటిది.

ఇలా వైవిధ్యంగా ఉండే వాటిని కలిపే స్వభావం, లక్షణం కల వాటిలో కాలాన్ని ప్రప్రథమంగా చెప్పుకోవాలి. అందుకే 'కాలఃకలయుతామహం' అని గీతాచార్యుడు చెప్పాడు. 'కలనము చేయు వారిలో కలనము నేను' అని దీని అర్థం.

కలనం చేయడంలో మొట్ట మొదట వచ్చే కదలిక 'కాలము', తర్వాత వచ్చేది 'గుణం'. అంటే – ఈ రెండూ ప్రకృతి నుండే వెలువడుతాయి, ప్రకృతిలోకే లీనమౌతాయి.

ఉదా: వెరు వేరు కాలాల్లో వేరు వేరు గుణాలుగల పదార్థాలన్నీ ప్రకృతిలోంచి వ్యక్తమైతే – వివిధ గుణాల పదార్థాలన్నీ ప్రళయంలో ఒకే సమయంలో, ఒకే తత్త్వంగా – ప్రకృతిలో లీనమై పోతాయి. ఈ ప్రక్రియలో ముందు 'కాలం' తర్వాత 'గుణాలు' కలనం చెందడం జరుగుతోంది కదా!

విజ్ఞానమును కలిగి యున్నది – అని ఈ నామానికి అర్థం.

## 903. కల్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కల్యాయైనమః' అని చెప్పాలి.

కల్యా = కలిగి యుండుటను స్వరూపముగా గలది.

నిద్రస్థితిలో మనలో అన్ని విషయాలు, విజ్ఞానము – ఉండనట్లే ఉంటాయి. కాని, మెలకువ వచ్చే సమయంలో అన్నీ మళ్ళీ ఒక్కొక్కటే గుర్తుకు వస్తాయి. ఇలాంటి మెలకువలు జీవితంలో చాలాసార్లు వస్తాయి. మెలకువలు రాక పూర్వం గాని, నిద్రస్థితిలో గాని ఉన్నపుడు కూడా అన్ని విషయాలు మనలో కలిసి ఉంటాయని మనకు తెలియదు. బ్రహ్మాండ పరిధిలో ఇలా జరిగితే 'కలనము'. వ్యక్తిగత పరిధిలో జరిగితే 'కల్యా'.

ఈ మెలకువ వచ్చే స్థితిలో అన్నిటినీ గుర్తు చేసుకుంటుంటే రావు. వాటంతట అవే గుర్తు పెట్టుకుని వస్తాయి. (మెలకువ వస్తున్నపుడు – మనపేరు, మన అడ్రసు, మన పిల్లల పేర్లు మొదలైనవి మనం గుర్తుకు తెచ్చుకుంటుంటే రావడం లేదు, వాటంతట అవే గుర్తుకు వస్తున్నాయి గదా!) అయితే – పూర్తి మెలకువ స్థితిలో గుర్తురావడమన్నా సృష్టి జరగడమన్నా ఒక్కటే! ఈ రెంటి మధ్య కాల వ్యత్యాసం ఉండదు.

గుర్తుంచుకోడం లాంటి స్థితి నుండి గుర్తుకు రావడం స్థితిలోకి మనిషి ఎదగాలి. ఆ స్థితిలో ఉన్న వ్యక్తిలో పనిచేసే అమ్మవారి పేరు 'కల్యా' అని అనవచ్చును.

('కలిత' అంటే కూడి ఉన్న అన్న అర్థాన్ని ఇక్కడ గుర్తుచేసుకోవాలి.)

కలిగి యుండుటను స్వరూపముగా గలది – అని ఈ నామానికి అర్థం.

## 904. విదగ్ధా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విదగ్ధాయై నమః' అని చెప్పాలి.

విదగ్ధా = నైపుణ్యము కలది.

వైదగ్ధ్యము – అంటే 'కౌశలము' – నేర్పరితనము, నైపుణ్యము, చాతుర్యము – అని అర్థాలు.

ఏ పని చేసినా, ఏది మాట్లాడినా, ఎవరికి ఆజ్ఞలు జారీచేసినా అమ్మవారి యొక్క కీలక లక్షణం 'నైపుణ్యం'. అసలు ఈ నైపుణ్యం లేనివారు యోగానికి అనర్హులు. ఎందుకంటే 'యోగము' అంటేనే 'కర్మలు చేయడంలో నైపుణ్యం' – అని గీతలో 'యోగః కర్మసుకౌశలమ్' అని శ్రీకృష్ణుడు చెబుతాడు. ఈ కుశలత్వం ఉన్నవాళ్ళు ఎవ్వరినీ నొప్పించకుండా, తాను నలిగిపోకుండా విధ్యుక్త ధర్మాలను నిర్వర్తిస్తారు. కార్యాలను నిర్వహిస్తారు. ఈ సమస్త సృష్టి కార్యాన్ని అంత చక్కగా నిర్వహించగలుగుతోందంటే అదంతా అమ్మవారి కౌశలమే తప్ప వేరే ఇంకేదీ కాదు.

'విదగ్ధం' అంటే విశేషముగా దగ్ధము చేయుట' అని అసలు అర్థం. సృష్టిలో జరిగే కొన్ని విశిష్ట కార్యాల్లో దగ్ధం చేసే ప్రక్రియకు ఒక ప్రత్యేకత ఉంది. ఈ దగ్ధ ప్రక్రియలో ఏవి ఎక్కడకు చేరాలో అక్కడకు చేరతాయి. కాలాగ్నిలో కూడా ఇలాగే పంచభూతాలు ఏవి ఎక్కడకు వెళ్ళి చేరాలో అక్కడక్కడకు అవి చేరిపోతాయి. ఏ విధమైన దహన ప్రక్రియలో అయినా అలాగే జరుగుతుంది. అందుచేతనే హిందువులు మరణానంతరం దేహాన్ని దహనం చెయ్యాలన్నారు. ఖననం కంటే దహనం చెయ్యడమే అన్ని విధాల మంచిది అని శాస్త్రజ్ఞులు కూడా ఒప్పుకున్న సత్యం.

జ్యోతిష్మతీ విద్యలలో 'విదగ్ధా' అనేది కూడా ఒక విద్య. 'అస్తిత్వము' అంటే ఘనంగా, దృఢంగా దేహంతో ఉండడం అనే కాకుండా – అస్తిత్వము అంటే – 'ఒక వెలుగు' అని తెలిసే వరకూ ఈ జ్యోతిష్మతీ విద్యరాదు. అస్తిత్వము అంటే వెలుగు అని నమ్మడం, అర్థం కావడం మాత్రమే కాదు – అస్తిత్వమంటే 'వెలుగు' అని తెలియాలి. ఈ నామాన్ని 'విదగ్ధాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే మనలో కౌశలం పెరగడమే కాదు – కలగా పులగంగా ఉన్న భావాలు, అభిప్రాయాలు వేటికవి విడివిడిగా అయి భావ సంక్లిష్టత, అర్థ సందిగ్ధత తగ్గుతాయి కూడా!

విశిష్టమైన నైపుణ్యము కలది – అని ఈ నామానికి అర్థం.

## 905. బైందవాసనా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బైందవాసనాయై నమః' అని చెప్పాలి.

బైందవాసనా = బిందువును ఆసనముగా గలది.

బ్రహ్మాండాన్ని ఒక గోళంతో పోలిస్తే – ఆ గోళం యొక్క కేంద్రంగా అమ్మవారిని సూచించవచ్చు. ఆ విధంగా సూచింపబడే అమ్మవారు బైందవాసనా.

మన శరీరంలో ముఖ్యంగా రెండు కేంద్రాలున్నాయి. 1) హృదయకేంద్రము 2) మనో మండల కేంద్రము. జీవన వ్యాపారం తిన్నగా నడవడానికి కారణభూతమైన హృదయంలోని దహరాకాశ కేంద్రాన్ని అమ్మవారి బైందవస్థానంగా గుర్తించవచ్చును. లేదా, సహస్రారంలోని చంద్రమండల కేంద్రాన్ని 'బిందువు' అనవచ్చును. అలాగే – శ్రీ చక్రంలోని కేంద్ర బిందువును కూడా 'బైందవము' అంటారు.

ఏ చిత్రం గీయాలన్నా, ఏది వ్రాయాలన్నా – కాగితం మీద లేఖినతో ముందు పెట్టే బిందువుతో అవి ప్రారంభమౌతాయి. సృష్టిచక్రానికి కూడా అలాగే ప్రారంభ బిందువును ఊహిస్తే – ఆ బిందువును అమ్మవారి ఆసనంగా ఊహించాలి. అక్కడ ఉండే అమ్మవారిని – 'బైందవాసనా' అనాలి. ఏ బొమ్మ వేసినా, గీతగీసినా, అక్షరాలు వ్రాసినా అవన్నీ క్రమబద్ధమైన పద్ధతిలో ఉండే బిందువుల సమీకృతమే. కాబట్టి, ఈ విశ్వములోని సర్వమునందు ఇటువంటి బిందువులుగా నిండి ఉన్న అమ్మవారిని 'బైందవాసనా' అన్నారు.

దేనికైనా ప్రారంభముగాను, అన్నింటికీ గమ్యస్థానం గాను ఉండే ఒకే ఒక స్థానాన్ని సూచించే బిందువును అమ్మవారు ఆసనంగా కలిగి ఉంటుంది.

1) బిందువును ఆసనముగా కలిగినది.

2) సహస్రార బిందువును ఆసనముగా గలది.

3) శ్రీచక్ర కేంద్రమును ఆసనముగా గలది.

4) బ్రహ్మాండ కేంద్రమును ఆసనముగా కలది.

5) దేనికైనా ప్రారంభమును, అంతమును సూచించు ఏకైక బిందువును ఆసనముగా కలది.

6) బిందువులతో నిండి ఉండే విశ్వములోని బిందువులను ఆసనముగా గలది.

7) ఆలోచనవైపు దృష్టి మరలిన వెంటనే మనస్సులో ప్రేరణ జరుగు బిందువు వద్ద ఉండునది – అని ఈ నామానికి అర్థాలు.

## 906. తత్త్వాధికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తత్త్వాధికాయై నమః' అని చెప్పాలి.

తత్త్వ = తత్త్వమును, అధికా = మించి యుండునది.

తత్త్వములుగా చెప్పబడు వానికి అతీతంగాను, అధికంగాను ఉండేది అమ్మవారే! అంటే – అమ్మవారి యందు ఈ తత్త్వాలన్నీ చెల్లుతాయి గాని – అమ్మవారు ఈ తత్త్వాలకు పరిమితమై, వీటిలో ఇరుక్కోదు. వీటికి అతీతంగా ఉంటుంది.

''తత్'' పదం – 'అది' లేదా 'బ్రహ్మ' అనే అర్థాన్ని, 'త్వాం' లోని 'త్వా' అనే పదం ''నువ్వు'' అనే అర్థాన్ని సూచిస్తాయని చెప్పుకుంటే – ఈ అర్థాలను బట్టి 'తత్త్వాధికా' అంటే – ఇటు 'నీ' నుండి, అటు 'బ్రహ్మ' లేదా – 'బ్రహ్మాండం' పర్యంతము అధికమైంది అనే అర్థాన్ని ఈ నామం సూచిస్తుంది.

'తత్త్వమ్' అంటే – స్వభావం, లేదా లక్షణం లేదా తెలుగులో చెప్పుకోవాలంటే 'దానితనము' (Thatness). దేవత్వము, మనుష్యత్వము అన్న పదాలు ఎలా అయితే 'దేవతా స్వభావం' 'మనుష్య స్వభావం' అన్న అర్థాలు సూచిస్తాయో, – అలాగే – తత్త్వము అంటే – 'తత్ (బ్రహ్మ) యొక్క స్వభావము అనే అర్థాన్నిసూచిస్తుంది. 'తత్ – అంటే–

బ్రహ్మ లేదా దైవము కాబట్టి – 'తత్త్వం' అంటే బ్రహ్మయొక్క, లేదా – దైవము యొక్క స్వభావము, లేదా – లక్షణము అనే అర్థంలో – 'తత్త్వాధికా' అంటే – బ్రహ్మలక్షణానికి అతీతంగా, అధికంగా అంతర్యామిని లక్షణంగా పై నుండేది' అనే అర్థం వస్తుంది.

'తత్త్వమ్' అంటే – 'దానితనము' (Thatness) అని చెప్పుకున్నాం. దీని అర్థం ఏమిటంటే – గ్లాసులోని గోదావరి నీళ్ళు 'తత్త్వం' అయితే – బయటనదిలోని గోదావరి నీళ్ళు 'తత్త్వాధికా' ఔతుంది – అని రెంటిలోను సారతః ఉన్నది గోదావరి నీళ్ళే' . అయినా – ఒకదాని లక్షణం 'పరిమితం' అయితే – రెండవదానిది 'అపరిమితం' ఔతుంది.

ప్రపంచంలోని పదార్థాల తత్త్వాలలాగానే పరిమితమై ఉంటే – ప్రళయంలో ఆ పదార్థాలతో పాటు అమ్మవారు కూడా కాలవశమై, లీనమై పోయి ఉండాల్సి వచ్చేది. అమ్మవారు అలాటిదేమీ లేకుండా ఆ పదార్థాలన్నిటినీ తనలో లీనం చేసుకుని, సృష్టికి ఉన్ముఖమైనపుడు అన్నిటినీ మళ్ళీ వ్యక్తం చేసేది కాబట్టి, అమ్మవారు – వాటికి, వాటి తత్త్వాలకు అతీతంగా ఉండేదే అవుతుంది.

'పాదోస్యవిశ్వాభూతాని' అన్న పురుషసూక్త ప్రకారం – ఈ కనపడే విశ్వమంతా అసలు తత్త్వంలో నాల్గవ వంతే కాబట్టి 'అసలు తత్త్వమైన ఈ అమ్మవారు ఈ విశ్వతత్త్వానికి అధికంగాను, అతీతంగాను ఉంటుంది' అని గూడా ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

1) మననుండి బ్రహ్మదాకావిస్తరించి యున్న బ్రహ్మాండమును మించిన లక్షణము కలది.

2) బ్రహ్మతత్త్వానికి అతీతంగా విశ్వంలో సర్వాంతర్యామినిగా ఉండునది.

3) అపరిమిత లక్షణాన్ని కలిగినది.

4) తనలోనికి లీనం కాబడి, తన నుండి వ్యక్తం కాబడే బ్రహ్మాండాని కన్నా అధికంగాను, అతీతంగాను ఉండేది – అని ఈ నామానికి అర్థాలు.

## 907. తత్త్వమయీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తత్త్వమయ్యైనమః' అని చెప్పాలి.

తత్త్వమయీ = తత్త్వమయమైన స్వరూపము గలది.

ఏ వస్తువైనా, వ్యక్తి అయినా, పదార్థమైనా, 'బ్రహ్మతత్త్వం', చేతనే నిండి ఉంటుంది. కాని, మనం ఆవస్తువునుగాని, వ్యక్తిని గాని పదార్థాన్ని గాని వేరే వేరే పేర్లతో పిలుస్తాము. ఉదా: 'గాజుదిమ్మ' అంటున్నపుడు 'దిమ్మ' అనేది మన బుద్ధిలో ఉన్నది గాని, నిజానికి దాంట్లో ఉన్నది 'గాజు' తప్ప ఇతరం ఏమీ లేదు కదా ! అలాగే 'ఇత్తడి బిందె' అంటున్నపుడు మన బుద్ధిలో ఉన్నది 'బిందె' కాని – అక్కడ ఉన్నది 'ఇత్తడి' తప్ప ఇతరం ఏముంది ? కాబట్టి – ఇలా అన్నిటిలోను వాటి వాటి తత్త్వాలుగా నిండి ఉన్న అమ్మవారిని 'తత్వమయీ' అంటారు.

అయితే – ఇలా చెప్పడం తర్కం ఔతుంది కదా' ఆ తర్కం అవసరమా?' అని సందేహం రావచ్చు.

ఎందుకోసం తర్కం నేర్చుకోవాలో అది ముఖ్యంగాని తర్కం కాదు. ప్రతిశాస్త్రం వడ్లగింజలాంటిది. అయితే – మనక్కావలసింది బియ్యపుగింజ. పొట్టు, చిట్టు, తవుడుల చేతనే రక్షింపబడే బియ్యపు గింజను – వాటిని తప్పించి దక్కించుకోవాలి. అలాగే అసలు తత్త్వం అర్థం కావాలంటే శాస్త్రాలలో నిబద్ధమై ఉన్న పారిభాషిక పదాలు తప్పిస్తే గాని అసలు తత్త్వం గోచరం కాదు. అంటే – ఈ పారిభాషిక పదాలు, శాస్త్రాలు తత్త్వాన్ని అర్థంచేసుకోడానికి ఉపకరిస్తాయి తప్పితే – అవి మాత్రం అసలు తత్త్వం క్రిందకు రావు.

దేనికైనా మనం పెట్టిన పేరును తప్పిస్తే – ఆ మిగిలిన దాంట్లో మనం పిల్చే వస్తువు ఉంటుంది. దాన్ని 'మయీ' అంటారు.

'బట్ట', 'కుండ' – ఇవి వికారార్థాలు. అయితే 'ప్రత్తి', 'మట్టి' అన్నవి వాటి ప్రాచుర్యార్థాలు ఔతాయి. ('మయట్ వికార ప్రాచుర్యార్థే' – అన్న పాణిని సూత్రప్రకారం).

'తత్త్వం దేనితో చెయ్యబడిందో – అది అమ్మవారు' అని ఈ నామానికి అర్థం. దీన్ని ఆంగ్లంలో 'God consciousness is filled with God Nature' అనవచ్చు.

అంటే - 'ప్రాచుర్యార్థమైన అమ్మవారు వికారార్థముగా వస్తు తత్త్వము నందు నిండి ఉన్నది' - అని అర్థం.

తత్త్వము నందు నిండి ఉన్నది - అని ఈ నామానికి అర్థం.

## ౯౦౮. తత్త్వమర్థ స్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తత్త్వమర్థస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

తత్ = తత్పదార్థం యొక్క, త్వం = త్వం పదార్థము యొక్క, ( ) = అర్థాలు సూచించే పరబ్రహ్మ యొక్క, స్వరూపిణి = స్వరూపముగా గలది.

'తత్', 'త్వమ్' ఈ పదాలు దేన్ని లక్ష్యంగా అర్థాలను కలిగి ఉన్నాయో - దాని యొక్క స్వరూపమే అమ్మవారు' అని ఒక అర్థం. అంటే 'తత్త్వం సూచించే అర్థం యొక్క, స్వరూపం గూడా అమ్మవారే!' అని అర్థం.

ఏదైనా ఒక వస్తువుని చూచి - ఒక్కొక్క చోట ఉన్నవారు ఒక్కొక్కరకంగా పిలిస్తే - ఆ వస్తువుకు ఆ పేరు అలా పలికిన 'పదం' ద్వారా ఏర్పడుతుంది. అలా ఏర్పడ్డం గూడా భగవన్నిర్ణయమే! లేకపోతే 'అలాగే ఎందుకు పిలిచి ఉండాలి? ఇంకొక విధంగా ఎందుకు పిలిచి ఉండలేదు?' అన్న దానికి సమాధానం లేదు గదా!

ఒకళ్ళతో ఒకడు మాట్లాడుతున్నపుడు వాస్తవానికి అలా మాట్లడేవాడే నిజమైన 'వాక్కు'. ఆ 'వాక్కు' ఆ మాట్లాడేవాని 'తత్త్వా'న్ని సూచిస్తుంది. అలాగే - ఒక వస్తువును మొట్ట మొదట చూడగానే ఇలా పిలుద్దాము అని స్ఫురించిందే ఆ వస్తువును సూచించడానికి 'పదం' అవుతుంది. ఆ పదం యొక్క 'అర్థమే' అసలు వస్తువు యొక్క 'తత్త్వం' అవుతుంది. ఈ విధంగా 'వాక్కు', 'అర్థం' - ఈ రెండూ కలిసే అసలు తత్త్వాన్ని నిర్దేశిస్తున్నాయి కాబట్టి, 'అర్థం' - అసలు తత్త్వంలో సగం భాగమేఔతుంది. ఇలా అసలు తత్త్వంలో సగం భాగంగా ఉన్న అర్థము యొక్క స్వరూపమే అమ్మవారు' అని ఇంకో అర్థం దీన్ని బట్టే - 'వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే - జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ'' - అని కాళిదాసు అయ్యవారిని, అమ్మవారిని - వరుసగా వాక్కు, అర్థాలతో పోల్చి - 'పితరౌ' అనే ఒకే పదంలో ఇమిడ్చాడు.

ఎవరైనా అసలు తత్త్వాన్ని గురించి ఏదైనా పదాలతో ప్రతిపాదిస్తే - సృష్టిమొత్తంలో అలా ప్రతిపాదించినవాడు ఎన్నోవంతో - వాడు ప్రతిపాదించినది గూడా అసలు తత్త్వంలో అన్నోవంతు ఔతుంది - అని గూడా గమనించాలి.

'ఇక సత్యాన్ని తెలుసుకోడానికి చేసే ప్రయత్నం అవసరం లేదు సత్యం గురించి పూర్తిగా అయిపోయినట్లే' అని ఉండదు. సత్యాన్వేషణ నిరంతరం జరుగుతూ ఉండాల్సిందే! 'Truth will be extracted and exhausted until there is no necessity for further extraction of truth' అని ఎప్పుడూ ఉండదు. అలా అయితే - విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధి ఎప్పుడో ఆగిపోయి ఉండేది.

1) 'తత్', 'త్వమ్' పదాల అర్థాల యొక్క స్వరూపం.

2) అసలు తత్త్వంలో సగభాగంగా ఉన్న 'అర్థము యొక్క స్వరూపము' అని ఈ నామానికి అర్థాలు.

## 909. సామగానప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సామగానప్రియాయైనమః' అని చెప్పాలి.

సామగాన = సామగానమునందు, ప్రియా = ప్రీతిగలది.

'ప్రాణస్సామవేదః' - అన్నదాన్ని బట్టి - సామవేదం ప్రాణం లాంటిది. ఈ ప్రాణం శ్వాసమీద ఆధారపడి ఉంటుంది. ఈ శ్వాసలోని ఉచ్ఛ్వాసంలో - 'సో', నిశ్వాసంలో 'హం' ఉంటాయి. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మక శ్వాసలో 'సోహం' అనే గానమే సామవేదం. ఇది ప్రతి జీవిలోనూ నిరంతరం జరుగుతూ ఉంటుంది. ఈ సామగానం ఆ జీవి ప్రమేయంతో జరిగేది కాదు. జీవుల పట్ల - వెనుక ఉన్న అమ్మవారి అనుగ్రహం వల్ల, అనురాగం వల్ల - సామవేదం సూచించే ఈ 'సామగానం' జరుగుతోంది; కాబట్టి - అమ్మవారు 'సామగానప్రియా'.

సామగానము నందు ప్రీతి కలది - అని ఈ నామానికి అర్థం.

## 910. సౌమ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సౌమ్యాయైనమః' అని చెప్పాలి.

సౌమ్యా = సుమ సమానమైన లక్షణము గలది – అని అర్థం.

'సౌమ్యా' అనే పదం 'సోమ' సంబంధమైనదిగా గూడా చెప్పుకోవచ్చును.

'సుమసమానము' అనే లక్షణాన్ని 'నాగరిక' లక్షణంగా చెప్పుకోకూడదు. హృదయానికి, ఆత్మకు సంబంధించిన లక్షణం – 'నాగరిక' పదంలో ఉండాలనే నియమం లేదు. కాని, అలా ఉంటేనే సౌమ్యగుణం అవుతుంది.

'సోమ' అనే శబ్దం సౌమ్యానికి మూలకారణంగా చెప్పుకోవాలి. ప్రజననం(Re-productive Faculty) అనేది అటు చంద్రునిలోను ఇటు పుష్పంలోను కూడా ఉంటుంది. అంతేకాదు. 'మృదుత్వం' 'చూడాలనిపించడం', 'ఆనందింపచెయ్యడం' – ఈ మూడు గుణాలు 'సోమ' 'సుమా' (పుష్ప)లకు ఉంటాయి. ఈ చంద్రుని లక్షణం గల ఔషధాలే- (వీటికి అమావాస్య, పౌర్ణమి పర్వదినాలతో సంబంధం ఉంటుంది). 'సోమలత', 'సోమకందం' 'సోమపానం' – ఈ మూడూ మనలో ఇడానాడికి సంబంధించిన చంద్ర లక్షణం కలిగి ఉంటాయి. కుండలినీ శక్తి అయిన అమ్మవారు ఈ చంద్రాత్మక లక్షణం గూడా కలది కాబట్టి అమ్మవారు 'సౌమ్యా'.

సోమేశ్వరుడైన శివుని స్వరూపం గాబట్టి 'సౌమ్యా' అని కూడా అర్థం చెప్పవచ్చును.

1) సుమ సంబంధమైనది.

2) సోమ సంబంధమైనది.

3) సోమేశ్వర స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చు.

## 911. సదాశివకుటుంబినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదాశివకుటుంబిన్యై నమః' అని చెప్పాలి.

సదా = సదాశివుని, కుటుంబినీ = కుటుంబమునకు చెందినది. మనకు కనబడే సూర్యుడు ఎలా అయితే ఎప్పుడూ గ్రహ ఉపగ్రహాలతో ఒక కుటుంబముగా చుట్టుముట్టి ఉంటాడో, అలాగే – ఈ సూర్యునికి కారణభూతమైన సూర్యమండల మధ్యవర్తి అయిన ఆధ్యాత్మిక సూర్యుడు ఎప్పుడూ – గాయత్రి, సావిత్రి, సరస్వతీ దేవతలతో ఒక కుటుంబముగా చుట్టుముట్టి ఉంటాడు. అలాగే – పరబ్రహ్మను సూచించే పంచబ్రహ్మల్లోని చివరి వాడైన సదాశివుడు గూడా ఎప్పుడూ – రాజరాజేశ్వరీ దేవితో శుద్ధవిద్యా, శ్యామలాదేవి, అశ్వారూఢాదేవి – మొదలైన విద్యాధిదేవతలతో ఒక కుటుంబం లాగా కలసి ఉంటాడు. ఆ సదాశివుని ఇల్లాలుగా ఆ కుటుంబానికి చెందినదే అవడం వలన – అమ్మవారు 'సదాశివకుటుంబినీ'.

పత్నిగా సదాశివుని కుటుంబానికి చెందినది – అని ఈ నామానికి అర్థం.

## 912. సవ్యాపసవ్య మార్గస్థా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సవ్యాపసవ్యమార్గస్థాయై నమః' అని చెప్పాలి.

సవ్య = దక్షిణాచార, అపసవ్య = వామాచార, మార్గస్థా= పద్ధతులలో (సేవింపబడుతూ) ఉండునది.

అమ్మవారి ఆరాధనా పద్ధతులు ముఖ్యంగా రెండు రకాలుగా ఉంటాయి. 1) సవ్యమార్గము, సమయాచార, దక్షిణాచారాలు దీని క్రిందకే వస్తాయి. 2) అపసవ్య మార్గము. కౌలాచార వామాచారాలు దీని క్రిందకే వస్తాయి. సవ్యమార్గం వేద సమ్మతమైంది. సత్త్వగుణ ప్రధానమైనది. అపసవ్య మార్గం వేద సమ్మతము కానిది, రజోగుణ, తమోగుణ ప్రధానమైనది. అయినప్పటికీ అమ్మవారి ఆరాధన ఈ రెండు మార్గాలలోను జరుగుతూనే ఉంది. వారి వారి యోగ్యతలను బట్టి, సంస్కారాలను బట్టి, శ్రద్ధా భక్తులను బట్టి, అమ్మవారు ఇలా రెండు రకాలుగా ఆరాధించే వారికి గూడా అనుగ్రహాన్ని వర్షిస్తుంది. ఈ రెండు రకాల ఆరాధనలలో కూడా ప్రధానదేవతగా ఉండేది కాబట్టి అమ్మవారు. 'సవ్యాపసవ్యమార్గస్థా'.

'దక్షిణాచార, వామాచార పద్ధతుల ఆరాధనలలో ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 913. సర్వాపద్వినివారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వాపద్వినివారిణ్యై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్నివిధములైన, ఆపత్ = విపత్తులను, కష్టనష్టాలను, వినివారిణీ = పూర్తిగా నివారించునది.

ఆపదలు, కష్టనష్టాలు విశ్వ ప్రణాళికలో భాగాలే ! మనం ఎలా బొందలో పడతామో తెలియ చెప్పడానికే ఈ కష్టాలు, నష్టాలు వస్తాయి గాని – మన మీద అమ్మవారికి కోపం, శత్రుభావం ఉండి కాదు. మితిమీరి తింటే ఏమౌతుందో తెలియచెప్పడానికి కడుపునొప్పి అజీర్ణవ్యాధులు మొదలైనవి వస్తాయి. ఉన్న ఆదాయాన్ని మించి అప్పులు చేసి ఖర్చులు చేస్తే ఏం జరుగుతుందో తెలియపరచడానికి అవమానాలు, జైలుశిక్షలు మొదలైనవి వస్తాయి. మనస్సు, ఇంద్రియాలు కోరినవన్నీ కోరినట్లుగా వివేకరహితంగా తీర్చుకుంటే ఏమౌతుందో తెలియచెప్పడానికి ఆధి వ్యాధులు వస్తాయి. తగిన జాగ్రత్తలు తీసుకోకుండా ప్రయాణాదులు చేస్తే ఏమౌతుందో తెలియ చెప్పడం కోసం ఇబ్బందులు వస్తాయి. అంతే ! అయితే, అనుభవపూర్వకంగా ఈ సంగతి మనం గ్రహించుకునేట్లుగా చేసి అమ్మవారు మనలను వాటి బారి నుండి మనంతకు మనమే రక్షింపబడేట్టుగా చేస్తుంది.

అన్నిరకాల కష్టనష్టాలను తాపత్రయాదులను విశిష్టరీతిలో మిక్కుటముగా నివారించునది – అని ఈ నామానికి అర్థం.

## 914. స్వస్థా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వస్థాయైనమః' అని చెప్పాలి.

స్వస్థా = స్వస్వరూపమున చెక్కు చెదరక ఉండునది.

త్రిగుణాలతో పూర్తిగా ముడిపడి ఉండే సాధారణ జీవులందరికీ మార్పులు, చేర్పులు, కూర్పులు. ఆరోగ్యపరంగా వస్తూ ఉంటాయి. తత్ఫలితంగా ఒడుదుడుకులతో జీవితాన్ని గడపవలసి వస్తూ ఉంటుంది. ధైర్య స్థైర్యాలు కోల్పోవలసి వస్తూ ఉంటుంది. త్రిగుణాలకు అతీతంగా ఉండే అమ్మవారికి అటువంటి ఇబ్బందులు ఉండవు. 'స్వ' స్థితి చెడదు. తన్ను తాను తెలిసినది. తనపై తనకు ఆధిపత్యం కలిగినది అవడం వలన ఈ 'స్వస్థితి' చెక్కు చెదరదు.

మనం కూడా గొప్పగా కనబడే విషయాల మీద కన్న ఉపయోగకరమైన విషయాల మీద ఆసక్తిని పెంచుకోవాలి. (We must be cared for useful things but not for great things) చెడునుండి మంచికి, అపరిపూర్ణత్వం నుండి పరిపూర్ణత్వానికి, అజ్ఞానస్థితి నుండి వివేక స్థితికి మారితేనే – ఈ స్వస్థితి మనక్కూడా దక్కుతుంది. అమ్మవారికి ఈ స్వస్థత సహజ సిద్ధమైనది.

మనస్సు స్వస్థితి యందు ఉండాలంటే – సత్సాంగత్యము, సద్గోష్ఠి, సద్గ్రంథ పఠనం బాగా దోహదపడతాయి. అయితే – అవకాశాలకోసం చూసే దురాశాపరులకు ఈ స్వస్థితి రావడం కష్టం.For those who have greedy temperament towards opportunities this state can not be achieved).

స్వస్థితి, స్వరాజ్యం, స్వర్గం, ఇవన్నీ ఒకే స్థితిని గూర్చి చెప్పే మాటలే! 'సువర్గము' అంటే 'మంచి వర్గము' – అంటే – బంధు మిత్ర పుత్ర కళత్రాదుల వర్గం చక్కనిదిగా కలవాడు స్వర్గంలో ఉన్నట్లే! స్వస్థుడు గూడా అయినట్లే! రకరకాల మనస్తత్వాలు గల ఎంతమంది మధ్య ఉన్నా తను ఏ మాత్రం వారి ప్రభావానికి లోను కాకుండా తనయందు తాను ఉండేవాడు స్వస్థితిలో ఉంటాడు. బాహ్యమైనవి ఏవీ ఆ స్వస్థితిని మార్చలేవు. బావినీళ్ళు, కాలవనీళ్ళు, సముద్రజలాలు – ఇలా ఎన్ని రకాలుగా ఉన్నా వాటన్నిటిలోను ఉండే '$H_2O$' తన తత్త్వాన్ని కోల్పోదు. తాను తాను గానే వాటిల్లో వేటినీ అంటకుండానే ఉంటుంది. అలాగే – స్వస్థుడు కూడా!

ఈ స్వస్థ వృత్తాన్ని గురించి చెప్పేవి నిజమైన శాస్త్రాలు. మిగతావి ఒక విధంగా నిరర్థకమే!

స్వస్వరూపమువలె చెక్కు చెదరక ఉండునది – అని ఈ నామానికి అర్థం.

# 915. స్వభావమధురా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వభావమధురాయై నమః' అని చెప్పాలి.

స్వభావ = స్వభావము, మధురా = తియ్యనైనది లేదా ఆహ్లాదము గొలుపునది.

'స్వ' భావం ఎవరిది వారికి మధురంగానే ఉండవచ్చు, లేదా ఉందని అనిపించవచ్చు. కాని, ఇతరులకు అలా అనిపించినపుడే ఆ స్వభావం మధురమైంది అవుతుంది. అన్ని రకాలుగాను అందరినీ ఆహ్లాదపరచేట్టుగా ఉన్నపుడే ఈ స్వభావం మధురంగా ఉన్నట్లు లెక్కగాని - ఏదో ఒక్క విషయంలో కాదు. అమ్మవారి మాటలు, మార్గాలు నడతలు, చేతలు, చూపులు, రూపురేఖలు అన్నీ మధురంగానే ఉంటాయి. వీటిల్లో వేటిల్లోను చికాకును, చిరాకును, కలిగించే అంశం ఏదీ ఉండదు. బొమ్మగా ఉన్నప్పుడు ఉంటే ఉండవచ్చు గాని - బంగారానికి ఏడుపు, దిగులులాంటివి ఉండవు. అమ్మవారు స్వచ్ఛమైన బంగారం లాగా మధురమైన స్వభావం కలది. ఈ మధురత్వం పొందడానికి దేన్ని స్పృశించాలో దాన్ని కాక - డబ్బునో, పదవినో, అధికారాన్నో, స్పృశిస్తారు. సాధారణంగా ఇలా చెయ్యడం - దురద ఉన్నచోట కాక వేరొక చోట గోకడం లాంటిది. దీన్నే ఆంగ్లంలో 'paralleloxysm అంటారు

'సూర్యోదయం' చిత్రం గీస్తే - ఆ గీసిన చిత్రం 'పౌరుషేయం' అవుతుంది. అసలు సూర్యోదయం 'అపౌరుషేయం' అవుతుంది. ఇది సహజమైంది. మధుర స్వభావం కూడా అలాగే సహజ సిద్ధంగా ఉంటుంది.

(ప్రకృతిలో ఏ నమూనాను చూసి సూర్యోదయం అవుతోంది. అందుకే అది అపౌరుషేయం. అటువంటి సూర్యోదయాన్ని చూసి చిత్రకారుడు చిత్రంగీస్తే - అది పౌరుషేయం అవుతుంది. అలాగే అమ్మవారి స్వభావ మాధుర్యం 'అపౌరుషేయం'. ఆ మాధుర్యాన్ని మనం అనుసరిస్తే మన మాధుర్యం - 'పౌరుషేయం' అవుతుంది.)

వ్యాపారస్థుని కూడా ఆ మధుర స్వభావం ఉన్నట్లనిపిస్తుంది, కాని - అది స్వార్థపూరిత ఉద్దేశ్యంతో(Motive) కలసి ఉంటుంది. అమ్మవారికి గాని, నిజమైన యోగికి గాని - మధుర స్వభావం ఆ Motive లేకుండా ఉంటుంది.

'స్వభావ మధురాయై నమః' అని ఈ నామాన్ని సంపుటి చేసి జపిస్తే మన స్వభావం గూడా ఎప్పటికైనా అలా మధురంగా మారవచ్చు.

మధురమైన లేదా ఆహ్లాదకరమైన స్వభావము కలది – అని ఈ నామానికి అర్థం.

## 916. ధీరా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధీరాయై నమః అని చెప్పాలి.

ధీరా = ధీరురాలు.

ఏది లేకపోతే మిగతావి అన్నీ ఉన్నా లాభం లేదో అది 'ధీ'. ఈ ధీర లక్షణం లోపల నుండి వచ్చేది కాని బయట నుండి వచ్చేది కాదు. విత్తనంలోంచి పెరిగే చెట్టులాగా ఉండాలి గాని బయట నుండి గాలి ఊదితే పెరిగే రబ్బరు బూర(Balloon) లాగా ఈ ధీర లక్షణం ఉండకూడదు. ఉంటే – చెట్టులా వృద్ధి చెందదు బ్రద్దలవుతుంది.

ధీ శక్తి గాని, ధైర్యం గాని – స్థైరం గాని అంతరంలో ఉండి బాహ్యంగా వ్యక్తమౌతాయి. మనలో అవి అలా వ్యక్తమవుతున్నపుడు మనలో పనిచేసే అమ్మవారే 'ధీరా'. పరమహంసలకు ఈ ధీర గుణం ఉంటుంది.

ధీరురాలు – అని ఈ నామానికి అర్థం.

## 917. ధీరసమర్చితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధీరసమర్చితాయై నమః' అని చెప్పాలి.

ధీర = ధీ శక్తి గలవారిచే, సమ్యక్ = చక్కగా, అర్చితా = అర్చింపబడునది.

స్థిరత్వమును సాధించగల ధీశక్తిని, ధైర్య గుణములను కలవారిని 'ధీరు' లంటారు. ఏ విషయంలో అయినా సమగ్రమైన జ్ఞానాన్ని ధీరులు దృఢమైన శ్రద్ధాసక్తులతో సాధిస్తారు. అందుచేత వాళ్ళు దర్శించిన వన్నీ సంపూర్ణ సత్యాలు ఔతాయి. అటువంటి ధీరులచేత సరి అయిన విధానంలో అమ్మవారు అర్చింపబడుతుంది కాబట్టి 'ధీర సమర్చితా'.

'ధీరులచే చక్కగా అర్చింపబడునది – అని ఈ నామానికి అర్థం.

## 918. చైతన్యార్ఘ్య సమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చైతన్యార్ఘ్య సమారాధ్యాయై నమః' అని చెప్పాలి.

చైతన్య = చైతన్యవంతమైన, అర్ఘ్య = అర్ఘ్యపాద్య కుసుమాలచే, సమారాధ్యా =- చక్కగా ఆరాధింపబడునది.

అర్ఘ్యము, పాద్యము, పువ్వులు మొదలైనవి షోడశోపచార పూజలో వచ్చే కొన్ని అంశాలు. ధర్మాలన్నీ గుణాలుగా మారిన వ్యక్తుల చేత వీటి వినియోగం జరిగినపుడు ఈ అంశాలు చైతన్యవంతమౌతాయి. అటువంటి 'చైతన్యవంతుల చేత చేయబడే అర్ఘ్య పాద్యాదిషోడశోపచారాదులతో అమ్మవారు చక్కగా ఆరాధింపబడుతుంది' అని ఒక అర్థం. ఎందుకంటే – చైతన్యరహితంగా ఉండే – మానవనిర్మిత శిల్ప విగ్రహాదుల కంటె ఈశ్వర నిర్మిత ప్రాణికోటి స్వరూపాలు చైతన్య విగ్రహాలు గదా !

'చిత్' సంబంధమైనదే చైతన్యము. కాబట్టి జ్ఞాన మార్గంలో చక్కగా అర్చింపబడేది అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

1) చైతన్య వంతుల చేత చక్కగా ఆరాధింపబడునది.

2) జ్ఞాన మార్గములో అంతర్ముఖముగా చక్కగా ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 919. చైతన్యకుసుమ ప్రియా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చైతన్యకుసుమ ప్రియాయై నమః' అని చెప్పాలి.

చైతన్య = చైతన్యవంతమైన, కుసుమ = పుష్పము లందు, ప్రియా = ప్రీతికలది.

పువ్వులతో పూజ చేస్తే ఎవరికైనా ప్రీతికరంగా ఉంటుంది. ఇది సాధారణ విషయం. ఆ పువ్వుల్లో అందము, ఆకర్షణ, సువాసన, వికాసనము, మృదుత్వము, మాధుర్యము ఉంటాయి. నిత్యచైతన్యం ఉండదు. పై లక్షణాలకు చైతన్యం కూడా కలిసి ఉన్న పుష్పాలైతే మరింత ప్రీతికరంగా ఉంటాయి కదా! మరి చైతన్యము కలిగిన

పుష్పాలేవి ? హృదయాన్ని పద్మంతో పోలుస్తారు లేదా మనస్సును కూడా పుష్పంతో పోలుస్తారు. అప్పుడు ఆ హృత్పద్మానికి గాని, మనః పుష్పానికి గానిపై లక్షణాలతో పాటు చైతన్యం కూడా ఉంటుంది. భక్తుల యొక్క ఇటువంటి చైతన్య కుసుమాలంటే అమ్మవారికి చాలా ప్రీతికరంగా ఉంటుంది.

చైతన్య వంతమైన హృదయ పద్మ, మనః పుష్పముల యందు ప్రీతి కలది అని ఒక అర్థం.

పైనచెప్పిన హృదయము, మనస్సులను కాక ఇంకొక ఎనిమిది పుష్పాలను కూడా చైతన్య కుసుమాలుగా చెబుతారు. అవి 1) అహింస 2) ఇంద్రియ నిగ్రహం 3) క్షమ 4) కరుణ 5) వివేకం 6) తపస్సు 7) సత్యం 8) ధ్యానం ఈ ఎనిమిది చైతన్య పుష్పాలతో పూజ చేస్తే అమ్మవారికి ఇష్టం.

1) హృత్పద్మ, మనః పుష్పాల యందు ప్రీతి కలది.

2) అహింసాది అష్టచైతన్య పుష్పాలయందు ప్రీతికలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 920. సదోదితా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదోదితాయై నమః' అని చెప్పాలి.

సదా = ఎల్లప్పుడు, ఉదితా = ఉదయించే ఉండునది.

భక్తుడు గాని, ఉపాసకుడు గాని అమ్మవారిని స్మరించిన తక్షణం లోనే అమ్మ అతని హృదయంలో స్ఫురిస్తుంది. ఎవరైనా సరే, ఎప్పుడైనా సరే, ఎక్కడైనా సరే స్మరించడం జరగవచ్చు. అలా స్మరింపబడినపుడల్లా అమ్మవారు వెనువెంటనే వారిలో స్ఫురిస్తుంది కాబట్టి అమ్మవారు 'సదోదితా'.

సూర్యోదయంగానీ, మిట్టమధ్యాహ్నం గాని మనకు జరిగిన వేళల్లోనే అన్ని చోట్లా అందరికీ కూడా జరుగుతాయనుకోడం పొరపాటే ! ప్రతి క్షణం లోనూ ఈ భూమ్మీద

ఉన్న ఏదో ఒక ప్రదేశంలో ఉన్నవారికి సూర్యోదయం కాని మిట్టమధ్యాహ్నం గాని జరుగుతూనే ఉంటాయి. అన్న సంగతి గ్రహించాలి.

(రహస్య క్రతువుల్లో గురుశిష్యులకు ఈ క్రింది విధమైన సంభాషణ జరుగుతుంది.

గురు : నీకు ఈ క్రతువిద్య ఎప్పుడు ఉపదేశింపబడింది ?

శిష్య : మిట్టమధ్యాహ్నం ( ఆ ఉపదేశింపబడిన సమయం ఎప్పుడైనా సరే అలాగే చెబుతారు. ఎందుకంటే భూగోళం మీద మిట్టమధ్యాహ్నం ఎక్కడో అక్కడ ఎప్పుడూ జరుగుతుంది. కాబట్టి – అలాగే సూర్యోదయం కూడా !)

బ్రహ్మ పదాన్ని పొందిన స్థితిని గూడా మిట్టమధ్యాహ్నంతో– (జ్యోతిశ్శాస్త్రంలో దశమస్థానంతో) సంకేతిస్తారు. ఖనిజ లవణస్థితిని – చతుర్థ భావంతోను, వృక్షస్థితిని – సప్తమ స్థానంతోను, జంతుస్థితిని – లగ్నభావంతోను, మానవస్థితిని – దశమస్థానంతోను – జ్యోతిశ్శాస్త్రంలో సమన్వయ పరుస్తారు. ఈ దశమ స్థానానికి సంబంధించిన జాతి కాబట్టి బ్రహ్మ పదం మానవ జాతిలోకి వచ్చిన జీవులకే ఉంటుంది. ఈ మానవులు తలచిన వెంటనే అమ్మవారు వారి భావనలలో ఉదయిస్తుంది.

1) ఎవరు ఎప్పుడు ఎక్కడ తలచినా వారి భావనలో ఉదయించునది.

2) ఎల్లప్పుడూ ఉదయించే స్థితిలో ఉండునది.

3) ఎప్పుడూ భక్తుల హృదయాల్లో వెలుగుచుండునది.

## 921. సదాతుష్టా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదాతుష్టాయై నమః' అని చెప్పాలి.

సదా = ఎల్లప్పుడూ, తుష్టా = సంతృప్తిని కలిగి యుండునది.

తీరని కోరికలున్న వారికి జీవితం సంతృప్తికరంగా ఉండదు. ఏదో లోటుగానే ఉంటుంది. ఏ విధమైన కోరికలు లేని వారికి ఏ లోటూ కనబడదు. వారు నిత్యానంద

స్వరూపులు. అటువంటి వారిలో ఆవిధమైన సంతుష్టి రూపంలో ఉండే అమ్మవారిని 'సదాతుష్టా' అంటారు.

ఎల్లపుడూ సంతృప్తిని కలిగి యుండునది – అని ఈ నామానికి అర్థం.

## 922. తరుణాదిత్యపాటలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తరుణాదిత్యపాటలాయై నమః' అని చెప్పాలి.

తరుణ + ఆదిత్య = తరుణాదిత్య = యౌవన సూర్యుని వలె, పాటలా = పాటల వర్ణముతో ప్రకాశించునది.

అదితి సుతుడే ఆదిత్యుడు. సూర్యగోళం తయారుకాక మునుపు ఆకాశాన్ని అదితితో సంకేతిస్తారు.

సృష్టి జరగడానికి పూర్వం ఉన్నది మనకు సాపేక్షకంగా(Relative) 'తమస్సు' అనిపిస్తుంది కాని – వాస్తవానికి అదే అసలైన (Absolute) వెలుగు. ఈ నిరపేక్షకమైన స్థితికి చెందిన అదితికి పుట్టినవాడే మనం చూసే సూర్యుడు. మనం ఉన్నట్లు తెలిసే సమయంలోని రంగు – 'తరుణాదిత్యపాటల వర్ణం'. ఇది యౌవనసూర్యుని కాంతి రంగు.

అమ్మవారు హృదయాంతర్వర్తి. హృదయ నివాసి. ఈ హృదయం రంగు – ఎఱుపు + తెలుపు కలసిన పాటల వర్ణంలో (గులాబీరంగు) లో ఉంటుంది. అందుకే హృదయానికి సంబంధించిన ప్రేమకు చిహ్నమైన పుష్పం 'గులాబీ' (Rose is for Love). ఈ హృదయానికి అధిపతి సూర్యుడు లేదా ఆదిత్యుడు. మంచి తరుణ వయస్సులో ఉన్న ఆదిత్యుని యొక్క ఈ పాటలవర్ణం అంటే అమ్మవారికి ఇష్టం.

సూర్యోదయ సమయంలోని సూర్యకాంతి రంగు – అరుణవర్ణం.

సూర్యాస్తమయ సమయంలో సూర్యకాంతి రంగు – తామ్రవర్ణం.

ఇలా వివిధ స్థితులలో ఉండే సూర్యునికి వివిధమైన వర్ణాలుంటాయి. అమ్మవారు కూడా 'సర్వవర్ణోపశోభితా' (529వ నామం) కాబట్టి, వివిధ వర్ణాలతో ఉండే సూర్యుని

కాంతితో పోల్చబడుతుంది. ప్రస్తుత నామంలో యౌవన సూర్యుని పాటల వర్ణంతో పోల్చబడింది.

యౌవన సూర్యుని పాటల వర్ణ శోభతో ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 923. దక్షిణాదక్షిణారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దక్షిణాదక్షిణారాధ్యాయై నమః' అని చెప్పాలి.

దక్షిణా = దక్షత గల పండితులచేతను, అదక్షిణా = పామరులచేతను కూడా ఆరాధింపబడునది.

'దక్షిణ' శబ్దానికి యజ్ఞయాగాది క్రతువుల నిర్వహణ అనంతరం ఋత్విక్‌లకు (ఆ క్రతువుల అనంతరం) సక్రమంగా నిర్వహించి నందుకుగాను గౌరవభావంతో, కృతజ్ఞతా పూర్వకంగా – తాంబూలంలో పెట్టి ఇచ్చే సొమ్మును 'దక్షిణ' అంటారు. ఈ దక్షిణను స్వీకరించిన వారి ముఖంలోని సంతృప్తిని బట్టి యజమానికి యజ్ఞఫలందక్కుతుంది. ఈ దక్షిణ సమర్పణతో గాని యజ్ఞయాగాది క్రతువులు పూర్తి అయినట్లు కాదు. ఇటు ఋత్విక్కులకు సంతృప్తిని, అటు యజమానికి యజ్ఞఫలాన్ని కలుగచేయడానికి కారణమైన ఈ 'దక్షిణ'ను అమ్మవారి స్వరూపంగా భావిస్తారు.

సమయాచారులతో పాటు దక్షిణాచారులు కూడా అమ్మవారిని తమ దైన సత్త్వగుణ పద్ధతిలో ఆరాధిస్తారు. ఈ విధంగా దక్షిణ రూపంలోను దక్షిణాచార పద్ధతిలోను ఆరాధింపబడునది – అని ఒక అర్థం.

'దక్షిణ' అంటే కుడివైపు – 'అదక్షిణా' అంటే ఎడమవైపు, దక్షిణంగా అంటే కుడివైపుగా ఉండే పింగళానాడితోను – అదక్షిణంగా అంటే ఎడమవైపుగా ఉండే ఇడానాడితోను సంబంధాన్ని కలిగి, మన వెన్నెముక అనే యోగదండంతో వర్తించే కుండలినీ శక్తి అనే అమ్మవారుగా ఆరాధింపబడునది – అని మరొక అర్థం.

డబ్బు ఉన్నవారు – డబ్బులేని వారు; పాండిత్యం ఉన్నవారు – పాండిత్యం లేనివారు – వాళ్ళ స్తోమత, పాండిత్యాలతో సంబంధం లేకుండా అందరూ అమ్మవారిని ఆరాధిస్తారు. ఆ విధంగా పండిత పామరులచే ఆరాధింపబడునది – అని ఇంకో అర్థం.

1) పండిత పామరులచే కూడా ఆరాధింపబడునది.

2) దక్షిణ స్వరూపముగా ఉండి సమయ, దక్షిణాచారులచే ఆరాధింపబడునది.

3) ఇడా, పింగళానాడీ సంబంధిత కుండలినీ శక్తిగా ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థం.

## 924. దరస్మేరముఖాంబుజా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దరస్మేరముఖాంబుజాయై నమః' అని చెప్పాలి.

దర = పరిమితమైన, స్మేర = నవ్వుగల, ముఖాంబుజా = ముఖమనెడి పద్మము కలది.

అంబుజం అంటే పద్మం. పూర్తిగా విచ్చుకోకపూర్వం మొగ్గదశలో ఉన్న పద్మం ఒక రకమైన అందాన్ని కలిగి ఉంటుంది. పూర్తిగా విచ్చుకున్న తర్వాత ఇంకోరకమైన అందాన్ని కలిగి ఉంటుంది. ఈ రెండు స్థితులకు మధ్యలోని విరిసీ విరియని పద్మంలో మరొక రకమైన అందము, ఆకర్షణ ఉంటాయి.

పూర్తిగా తెలియని విషయాల మీద – 'వైముఖ్యం', పూర్తిగా తెలిసిన విషయాలమీద – నిర్లక్ష్యం' సాధారణంగా ఉంటాయి. తెలిసీ తెలియనట్లు, తొంగి తొంగిచూస్తున్నట్లుండే విధంగా ఉండేవి – విషయం కొంత ద్యోతకమై మిగిలిన విషయం కూడా తెలుసుకోవాలనే కుతూహలాన్ని, ఆసక్తిని రేకెత్తించే విధంగా ఉంటాయి. (మాస్టర్ సి.వి.వి. గారు ఇచ్చే మంత్రాలు కూడా ఇలాగే ముక్తసరి మాటలలో – వీటిలో ఏముందో పూర్తిగా తెలసుకోవాలనే ఆసక్తిని రేకెత్తించేట్లుగా – ఉంటాయి.)

అసలు ఎప్పుడూ నవ్వకుండా బిగుసుకుపోయినట్లుండే ముఖం గర్వాన్ని, కలివిడి లేనితనాన్ని, నిర్లక్ష్యాన్ని సూచిస్తుంది. పూర్తిగా 32 పళ్ళు కనబడే విధంగా నవ్వుతో ఉండే ముఖం 'దంత పిష్ట ప్రకటనకు' (Tooth Paste Advertisement) పనికి వచ్చేలాగ ఉంటుంది. ఈ రెంటికీ మధ్యగా చిరుదరహాసంతో ఉండే ముఖం ఎక్కువ ఆకర్షణను, సంస్కృతిని, ఉత్తమ సభ్యతను సూచిస్తుంది.

అమ్మవారి ముఖం ఇటువంటి దరహాసంతోనే ఉంటుంది. అందుకని అమ్మవారి ఈ దరహాస ముఖాన్ని పద్మంతో పోల్చి 'దరస్మేర ముఖాంబుజా' అన్నారు వ్యాసులవారు. (ఈ నామంలోని 'దరస్మేర' విశేషణం అమ్మవారి ముఖానికే గాని పద్మానికి కాదు).

జిజ్ఞాసువులు ఈ నామంతో అమ్మవారిని ధ్యానించాలి.

చిరుదరహాసం గల ముఖ పద్మము కలది – అని ఈ నామానికి అర్థం.

## 925. కౌలినీ కేవలా

ఆఱు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కౌలినీ కేవలాయై నమః' అని చెప్పాలి.

కౌలినీ కేవలా = కేవలము కౌలజ్ఞాన స్వరూపిణి.

కులసంబంధమైన దాన్ని 'కౌలము' అంటారు. శివశక్తులకు సంబంధించినదే ఈ కౌలము – అని ఈ క్రింది శ్లోకం వివరిస్తుంది.

శ్లో. కులంశక్తిరితి ప్రోక్త మకులం శివ ఉచ్యతే
కులేకులశ్చ సంబంధః కౌలమిత్యభిధీయతే –

'కులం' అంటే – 'శక్తి' అని 'అకులం' అంటే – 'శివుడ' ని, ఈ కులాకుల సంబంధాన్నే 'కౌలమ' నీ అంటారు' – అని పై శ్లోకార్థం. దీన్ని బట్టి శివశక్తి సామరస్య సంబంధాన్ని 'కౌలము' గా తెలుసుకోవాలి. అలాగే పిండాండంలో కూడా మూలాధారాన్ని – 'కులమ' ని – సహస్రారాన్ని 'అకులం' అనీ – ఈ రెండూ వరుసగా 'శక్తి – శివులకు' స్థానములని తెలుసుకోవాలి. కేవలము ఈ రెంటికీ సంబంధించిన కౌలజ్ఞాన స్వరూపిణిగా అమ్మవారు ఉంటుందని ఈ నామం సూచిస్తుంది.

కేవలము కౌలజ్ఞాన స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 926. అనర్ఘ్య కైవల్య పదదాయినీ

పదకొండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనర్ఘ్య కైవల్య పదదాయిన్యై నమః' అని చెప్పాలి.

అనర్ఘ్య = నిరుపమానమగు, కైవల్యపద = పరమపదము లేదా మోక్షస్థానమును, దాయినీ = ఇచ్చునది.

ఏ జీవి అయినా జన్మ జన్మల పరంపరానుభవం ద్వారా చిట్ట చివరకు కాంక్షించేది 'మోక్షమే' ఏ దేవత అయినా జీవులకు ప్రసాదించే నిరుపమానమైన వరం 'మోక్షమే' ! ఇది పరమానంద ప్రదమైన స్థితి రూపము. ఈ విధంగా కోరబడే వారి చేత, ప్రసాదించబడే వారి చేత కూడా ఉత్కృష్టమైనదిగా గుర్తింపబడింది మోక్షం. దీన్నే 'కైవల్యం' అంటారు. ఇతరముల మీద దృష్టిగాని, ధ్యాసగాని, ఆశగాని లేకుండా జీవి చిట్టచివరకు ఎక్కడకు చేరాలనుకుంటాడో, ఎవరిలో లీనమై పోవాలనుకుంటాడో – దాన్ని 'కైవల్యస్థితి' అంటారు. నిరుపమానమైన ఈ కైవల్య స్థితిని అందరు దేవతలూ ప్రసాదించలేరు. అమ్మవారు తన భక్తులకు ఇటువంటి మోక్ష సామ్రాజ్యాన్ని ప్రసాదిస్తుంది.

నిరుపమానమైన కైవల్యమును ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థం.

## 927. స్తోత్రప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్తోత్రప్రియాయైనమః' అని చెప్పాలి.

స్తోత్ర = స్తోత్రమునందు, ప్రియా = ప్రీతి కలది.

'స్తోత్రం' అంటే స్తుతి. పరమేశ్వరపరమైన స్తుతి వేదాల్లో ఉంటుంది. ప్రత్యేకించి గానం చేసుకోడానికి వీలుగా సామవేదంలో ఉంటుంది. అందువల్ల ఈ సామవేదగానం అంటే అమ్మవారికి ఇష్టం అని ఈ నామానికి అర్థం.

స్తోత్రం అంటే – ప్రస్తుతం మనకు ఎవర్ని గురించి చెప్పుకుంటున్నామో ఆ లలితాదేవికి సంబంధించిన స్తోత్రం. ఈ స్తోత్రం అంటే ఆవిడకు చాలా ఇష్టం. ఎందుకంటే ఈ స్తోత్రంలో ఉండేదంతా బ్రహ్మజ్ఞాన, ఆత్మజ్ఞాన, యోగ శాస్త్రజ్ఞాన విషయాలే కాబట్టి. ఈ స్తోత్ర జ్ఞానంతోనే తన బిడ్డలైన జీవులు మోక్షప్రాప్తికి అర్హులౌతారు కాబట్టి.

1) సామగానమునందు ప్రీతి కలది.

2) శ్రీ లలితా సహస్ర నామాది స్తోత్ర పారాయణము నందు ప్రీతి కలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 928. స్తుతిమతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్తుతిమత్యై నమః' అని చెప్పాలి.

స్తుతిమతీ = స్తుతింపతగినది.

మనకు వాక్సంపద ఉన్నా అవతలి వారి వద్ద విషయం ఏమీ లేకపోతే ఏం చెప్పాలో తెలియక సతమత మవాల్సి వస్తుంది. లేకపోతే ఉన్నవీ లేనివీ కల్పించి, అతిశయోక్తులతో, పొగడ్తలతో ముంచెత్తాలి. అమ్మవారి విషయంలో అలాంటి అవసరం రాదు. అందంలో అయినా, జ్ఞానంలో అయినా, ప్రవర్తనలో అయినా, పరాక్రమంలో అయినా, వాక్సంపదలో అయినా, భక్తులకు కావలసినవి ఇచ్చి - వారిని ఆదుకోవడంలో అయినా - అమ్మవారిని మించిన దైవం మరొకరు లేరు. అందుకని అన్ని విధాలా స్తుతి పాత్రమైనది.

స్తుతి పాత్రమైన సుగుణ సంపత్తి కలది - అని ఈ నామానికి అర్థం.

## 929. శ్రుతి సంస్తుత వైభవా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రుతిసంస్తుత వైభవాయై నమః' అని చెప్పాలి.

శ్రుతి = వేదములచేత, సంస్తుత = చక్కగా స్తుతింపబడునట్టి, వైభవ = వైభవము కలది.

వాఙ్మయంలో అత్యుత్తమ స్థానంలో ఉండేవి వేదాలు. అటువంటి వేదాలలో అంతా అమ్మవారి సర్వతోముఖ వైభవం గురించే ఉంటుంది.

యో వేదాదౌ స్వరః ప్రోక్తో
వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య
యః పరస్స మహేశ్వరః (తైత్తిరీయ - నారాయణమ్).

''వేదాల్లోను, వేదాంతాలైన ఉపనిషత్తుల్లోను ప్రతిపాదింపబడినది, ప్రకృతి నిండా విస్తరించి ఉన్నది ఏదైతే ఉందో అదంతా మహేశ్వర సంబంధమైనదే'' - అని ఈ మంత్రార్థం.

మహేశ్వరునికి ఇంతటి వైభవం మహేశ్వరి వలననే కదా వచ్చేది. కాబట్టి, వేదాల్లోను వేదాంతాల్లోను ఉన్న స్తుతుల వెనుక ఉన్న వైభవమంతా అమ్మవారికే చెల్లుతుంది.

వేద, వేదాంతాల్లో స్తుతింపబడిన వైభవం కలది - అని ఈ నామానికి అర్థం.

## 930. మనస్వినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మనస్విన్యై నమః' అని చెప్పాలి.

సాధారణంగా మనం మనస్సు యొక్క ఆధీనంలో ఉంటాం. అంటే - 'మనస్సు మనల్ని కలిగి ఉంటుందని చెప్పుకోవచ్చు. కాని, తమ యందు మనస్సును కలిగి యుండే వాళ్ళు కొందరుంటారు. అంటే - వీళ్ళ ఆధీనంలో మనస్సు ఉంటుందన్నమాట! ఇలాంటి 'పురుషుణ్ణి - 'మనస్వి' అని - స్త్రీ అయితే - 'మనస్వినీ' అనీ అంటారు. అంటే - 'మనస్వి' అనే పుంలింగ శబ్దానికి 'మనస్వినీ' అనేది స్త్రీ లింగ శబ్దమౌతుందన్న మాట!

శరీరానికి కావలసినవి ఎప్పుడూ కూడా వాటంతట అని అవసరాన్ని బట్టి వస్తాయి. కాని, మనస్సు యొక్క ఆధీనంలో ఉండే సాధారణ మానవులు వీటిని పొందడానికి తాపత్రయంతో నానాహైరాణాపడి పోతూ ఉంటారు. ఎంత శ్రద్ధ తీసుకున్నా రానవసరం లేనివి రావని, రావలసినవే వస్తాయని తెలుసుకునే స్థితికి వీళ్ళు ఎదగాలి సాధనలో.

మనవల్ల జరగవలసిన, అప్పటికి అవసరమైన, పనులవెంట తాముంటే వారిక్కావలసినవి వాటంతట అవే ఏర్పడతాయి అనే స్థాయికి ఎదిగి, కర్మ జ్ఞాన మార్గాల

సమన్వయంగా జీవితాన్ని కొనసాగించే వారే 'మనస్వినులు. వీళ్ల ఆధీనంలో మనస్సు ఉంటుంది కాబట్టి - తాపత్రయాలకు, ప్రలోభాలకు, ఆవేదనలకు, ఆతృతలకు, ఆదుర్దాలకు - వీళ్ళు గురికారు. మనస్సెప్పుడూ - స్వచ్ఛంగా Clean slate లాగా ఉంటుంది. మనో వికారాలుండవు. ఈ విధమైన లక్షణాలున్న వారిలో అమ్మవారి కళ ఉన్నట్లు గుర్తించాలి. ఈ లక్షణాల తాలూకు అమ్మవారి నామమే 'మనస్వినీ'.

మనిషి - మంత్రి (Minister) గాను, మనస్సు - కార్యదర్శి (Secretary) గాను, అనుకుంటే - మనస్విగా ఉండేవాళ్ళు - కార్యదర్శి (C/o మంత్రిగారు లాంటివాళ్ళు. మనస్వికాని వాళ్ళందరూ - మంత్రిగారుc/o కార్యదర్శి లాంటివాళ్ళు.

స్వాధీనమైన మనస్సు కలిగినది - అని ఈ నామానికి అర్థం.

## 931. మానవతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మానవత్యై నమః' అని చెప్పాలి.

మానవతీ = మాననీయురాలు.

తనను గురించి తనకు మంచి అభిప్రాయం కలగడానికి వీలుగా ఉండే ప్రవర్తన గలిగిన వారే మానవతులు - మాననీయులు. తనను గురించి ఇతరుల అభిప్రాయాలు - సందర్భాన్ని బట్టి, అవసరాన్ని బట్టి మారుతూ ఉంటాయి. కాని, తనను గురించి తనకు కలిగే అభిప్రాయాలు అలా మారడానికి అవకాశం లేదు. అలా సందర్భాన్ని బట్టి కనుక మార్చేసే గుణం ఉంటే - అది మన లౌక్యాన్ని సూచిస్తుంది. లౌక్యం ఉన్నవాళ్ళు వ్యవహారవేత్తలు అవుతారు గాని మానవతులు - మాననీయులు కారు.

అమ్మవారి దగ్గర లౌక్యం ఉండదు. మధురమైన మమత, అవ్యాజమైన వాత్సల్యానురాగాలు, కారుణ్యంతో కూడిన సౌజన్యము ఉంటాయి. అందుకే అమ్మవారు తన దృష్టిలోను, ఇతరుల దృష్టిలోను కూడా మాననీయురాలే !

'మానవతీ' - అనే మాటను 'మాన-వతీ'గా విడదీస్తే 'మాన' - అంటే 'మానములు' లేదా 'కొలతలు' అనే అర్థంలో 'మానవతీ' అంటే 'కొలతలు కలది' అనే

అర్థం వస్తుంది. కొలతలు అవ్యక్తంలో ఉంటే వాటి నుండి వ్యక్తంలోకి కొలతల్ని సృష్టించుకుంటాము. ఇలా మొట్టమొదటి కొలత నుండి కొలతలు వచ్చాయి. ఆ మొట్ట మొదటి కొలత అమ్మవారు అని ఈ నామం సూచిస్తుంది.

God has measured with 'Measure' and numbered with 'Number' అని గూడా చెబుతారు. ఇలా చెప్పిన దాంట్లో 'Measurer' 'Number' అన్న మాటల రూపంలో మొట్ట మొదటగా ఉన్నది అమ్మవారు.

1) మాననీయురాలు.

2) కొలతలు కలది.

3) కొలతలకు మొదటి కొలత, సంఖ్యలకు మొదటి సంఖ్య - అని ఈ నామానికి అర్థాలు.

## 932. మహేశీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహేశ్యై నమః' అని చెప్పాలి.

మహా + ఈశీ = మహేశీ = మహత్వమునకు ప్రభ్వి లేదా అధినాథురాలు.

'మహేశుడు' అన్న పుంలింగ వాచకానికి 'మహేశీ' అనేది స్త్రీ లింగవాచకము అవుతుంది.

దేశ కాలాలు రెండూ తన చేతుల్లో ఉన్న వారెవరైనా ఉంటే వాళ్ళకు ఈశత్వం ఉంటుంది. ఇది అణిమాది అష్టసిద్ధులలో ఏడవది.

'మన బిందె లోని నీళ్ళు' అని - అంటున్నపుడు మనం నాలుగోవంతు మాత్రమే తెలివి తక్కువగా చెప్పినట్లు అవుతుంది, 'మన చెఱువులోని నీళ్ళు' - అని అంటున్నపుడు మూడోవంతు, 'మన కాలువలో నీళ్ళు' - అన్నపుడు సగం, 'మన గోదావరి లోని నీళ్ళు' - అంటున్నపుడు 2/3 వంతు, 'మన నీళ్ళు' - అంటున్నపుడు పూర్తిగాను తెలివి తక్కువగా చెబుతున్నట్లే నని తెలుసుకోవాలి. మనకంటె ముందు ఎప్పటి నుంచో ప్రపంచంలో ఉండి,

మన తర్వాత గూడా ఉండే ఆ నీళ్ళమీద మన ఆధిపత్యం ఏమిటి ? 'మన' నీళ్ళు అనడంలో ఆ నీటిపై మన అధికారం ఏమిటి ? కాని ప్రపంచంలోని అన్ని రకాల నీటిలోను తను ఉంటూ, వాటిలో తన ఆధిపత్యం చెల్లేవాడే 'ఈశుడు'. నీళ్ళ విషయంలో లాగానే ప్రపంచంలోని అన్ని పదార్థాల్లోను, అందరిలోను, అన్నిటిలోను తను ఉండి, తన ఆధిపత్యం చెల్లేవాడు మహేశుడౌతాడు. (మహా + ఈశుడు).

మంచుతో చేయబడిన ఒక గ్లాసులో మంచు గడ్డవేస్తే - ఆ గ్లాసు, మంచుగడ్డ రెండూ కరగి కలసిపోయినపుడు - ఎందులో ఏది ఉన్నది ?ః' - అన్న ప్రశ్న - మన తర్కం ఎంత డొక్కుదో చెబుతుంది. అలా ఉన్న వాడే - 'మహేశుడూ - ఈ ప్రపంచమూ ! అంటే, ఇద్దరికీ తేడా లేదు. ఇలా ఉన్న వారి విషయంలోనే - చేద్దామనుకోడానికి చెయ్యడానికి తేడా ఉండదు. ఈ సృష్టిమొత్తం చేద్దామనుకోడానికి, చెయ్యడానికి తేడా లేని వాడన్నమాట! మహేశునికి ఇటువంటి మహదవకాశం కలిగించింది 'మహేశీ' అయిన అమ్మవారే !

1) దేశకాలాలు రెండూ తన చేతులలో ఉన్నది.

2) ఈ మహాప్రపంచంలోని అన్నిటి యందు, అందరియందూ ఉంటూ - అన్నిటపైన, అందరిపైన ఆధిపత్యం కలిగినది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 933. మంగళాకృతిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మంగళాకృత్యై నమః' అని చెప్పాలి.

మంగళా = మంగళత్వము, ఆకృతిః = ఆకారంగా గలది.

దేనివల్ల అయితే ఈ యావత్ సృష్టితిన్నగా జరుగుతోందో దాన్ని 'మంగళత్వం' గా తెలుసుకోవాలి.

'శం', 'శివ', 'శుభ', 'మంగళ' - ఇవన్నీ ఒకే అర్థాన్ని సూచించే పదాలు. మనకు అశుభం అనిపించిన దాంట్లో కూడా అమ్మవారిని ధ్యానం చేస్తే అది కూడా శుభంగానే

మన తర్వాత గూడా ఉండే ఆ నీళ్ళమీద మన ఆధిపత్యం ఏమిటి ? 'మన' నీళ్ళు అనడంలో ఆ నీటిపై మన అధికారం ఏమిటి ? కాని ప్రపంచంలోని అన్ని రకాల నీటిలోను తను ఉంటూ, వాటిలో తన ఆధిపత్యం చెల్లేవాడే 'ఈశుడు'. నీళ్ళ విషయంలో లాగానే ప్రపంచంలోని అన్ని పదార్థాల్లోను, అందరిలోను, అన్నిటిలోను తను ఉండి, తన ఆధిపత్యం చెల్లేవాడు మహేశుడౌతాడు. (మహా + ఈశుడు).

మంచుతో చేయబడిన ఒక గ్లాసులో మంచు గడ్డవేస్తే - ఆ గ్లాసు, మంచుగడ్డ రెండూ కరగి కలసిపోయినపుడు - ఎందులో ఏది ఉన్నది ?ః' - అన్న ప్రశ్న - మన తర్కం ఎంత డొక్కుదో చెబుతుంది. అలా ఉన్న వాడే - 'మహేశుడూ - ఈ ప్రపంచమూ ! అంటే, ఇద్దరికీ తేడా లేదు. ఇలా ఉన్న వారి విషయంలోనే - చేద్దామనుకోడానికి చెయ్యడానికి తేడా ఉండదు. ఈ సృష్టిమొత్తం చేద్దామనుకోడానికి, చెయ్యడానికి తేడా లేని వాడన్నమాట! మహేశునికి ఇటువంటి మహదవకాశం కలిగించింది 'మహేశీ' అయిన అమ్మవారే !

1) దేశకాలాలు రెండూ తన చేతులలో ఉన్నది.

2) ఈ మహాప్రపంచంలోని అన్నిటి యందు, అందరియందూ ఉంటూ - అన్నిటపైన, అందరిపైన ఆధిపత్యం కలిగినది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 933. మంగళాకృతిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మంగళాకృత్యై నమః' అని చెప్పాలి.

మంగళా = మంగళత్వము, ఆకృతిః = ఆకారంగా గలది.

దేనివల్ల అయితే ఈ యావత్ సృష్టితిన్నగా జరుగుతోందో దాన్ని 'మంగళత్వం' గా తెలుసుకోవాలి.

'శం', 'శివ', 'శుభ', 'మంగళ' - ఇవన్నీ ఒకే అర్థాన్ని సూచించే పదాలు. మనకు అశుభం అనిపించిన దాంట్లో కూడా అమ్మవారిని ధ్యానం చేస్తే అది కూడా శుభంగానే

# 934. విశ్వమాతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వమాత్రే నమః' అని చెప్పాలి.

విశ్వ = ప్రపంచమునకు, మాతా = తల్లి.

గర్భంలో ఇంకొకరు ఉండటానికి స్త్రీకి మాత్రమే అవకాశం ఉంది. అలాగే - ఈ విశ్వమంతా తనలో లీనమవడానికి అమ్మవారికి అవకాశం ఉంది.

సౌరకుటుంబం వ్యక్తమవడానికి కావలసినంత 'గర్భం - చోటు లేదా ఆకాశం'లో ఉంటుంది కదా! అలా ఆకాశ గర్భంలోంచి సౌరకుటుంబం పుట్టినట్లే - విశ్వం అమ్మవారి గర్భంలోంచి పుడుతుంది. అటువంటి విశ్వాన్ని గర్భంలో ధరించేది కాబట్టి, అమ్మవారు 'విశ్వమాతా'.

ఎవ్వరికీ తెలియకుండా ఒకటి జరిగినా, పుట్టినా - అది జరిగినట్లు, పుట్టినట్లు తెలియగలిగింది ఆవిడ కొక్కదానికే! పుట్టినటువంటి వాణ్ణి గర్భంలో తల్లి కొలిచినట్లు - విశ్వాన్ని తనలో కొలిచేది కాబట్టి అమ్మవారు 'విశ్వమాతా'.

('విత్తనంబు మఱ్ఱి వృక్షమ్మునకు ఎంత? - మఱ్ఱి విత్తనం ఎంత ఉంటుంది - తోటకూర విత్తనానికన్న చిన్నగా ఉంటుంది. అయినా ఆ విత్తనంలోంచి మహా వృక్షం రావడం లేదూ!).

'విశ్' అంటే ప్రవేశము అని అర్థం. ఈ అర్థాన్ని బట్టి ఎల్లాంటి దానికైనా చివరకు ఈ విశ్వానికైనా తనలో ప్రవేశం కలగనిచ్చి, కొలిచేది గాబట్టి - అమ్మవారు 'విశ్వమాతా'.

'వి + శ్వ + మాతా' అనే విధంగా ఈ నామాన్ని విడదీస్తే ఇంకో అర్థం వస్తుంది. 'వి' అంటే - వివిధత్వము గల, లేదా విశిష్టత్వము గల, శ్వ = రాబోవు, మాతా = కొలతలు గలది లేదా లక్షణాలు కలది లేదా విషయములు గలది - అనే అర్థం వస్తుంది. అంటే 'విశిష్టమైన సృష్టి గలది' అని అర్థం.

1) విశ్వాన్ని గర్భంగా ధరించినది.

2) విశ్వాన్ని తనలో కొలుచునది.

3) విశ్వానికి తనలో ప్రవేశము కలగనిచ్చి, కొలిచేది.

4) వివిధత్వము గల లేదా విశిష్టత్వము గల రాబోవు కొలతలు లేదా క్షణములు లేదా విషయములు గల సృష్టి గలది – అని ఈ నామానికి అర్థం.

## 935. జగద్ధాత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జగద్ధాత్ర్యై నమః' అని చెప్పాలి.

జగత్ = జగత్తును, ధాత్రీ = ధరించి భరించునది, అనగా పోషించునది. 'ధాతా' అనే పుంలింగ శబ్దానికి – 'ధాత్రీ' అనేది స్త్రీ లింగ రూపం.

మనకు భూమి ఏంచేస్తోందో – జగత్తుకు అమ్మవారు అదే చేస్తుంది. తల్లి పిల్లలకి పాలిచ్చి పెంచి పోషిస్తుంది. (వేరే ఒకరు పాలిస్తే గాని లేదా డబ్బా పాలిచ్చి పోషించడం గాని కాకుండా తల్లే పాలిచ్చి పెంచే రోజుల్లో ఈ స్తోత్రం వ్రాయబడింది). అలాగే ఈ జగత్తు నంతను అమ్మవారు సాకుతుంది.

'భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ' – అని చెప్పబడే దుర్గాసూక్తంలో ఇదే విషయం చెప్పబడుతుంది.

జగత్తును సాకునది – అని ఈ నామానికి అర్థం.

## 936. విశాలాక్షీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశాలాక్ష్యై నమః' అని చెప్పాలి.

విశాల = విశాలమైన, అక్షీ = కన్నులు గలది.

అమ్మవారి దృష్టి విశాలమైనది. 'దృష్టి' అనే మాట భౌతికమైన కళ్ళకే పరిమితం కాదు. అమ్మవారి కళ్ళు ఎలాగూ విశాలమైనవే! కళ్ళే కాకుండా 'దృష్టి' అనే మాట 'చూపులకు', 'అవగాహనకు' 'ఇముడ్చు కోగలగడానికి' గూడా చెల్లుతుంది.

పరమాణువు, బ్రహ్మాండం ఈ రెండు కూడా కనబడగల దృష్టి అమ్మవారిది. అంటే - 'హద్దులు లేనటువంటి చూపులు కలది' అని అర్థం. (ఈ విషయాన్ని ఆదిశంకరులు సౌందర్యలహరిలో 'దృశా ద్రాఘీయస్యా... అన్న శ్లోకంలో చెబుతారు). ఇలాంటి పరావరదృష్టి ఉన్నపుడే సాధకునికి హృదయ గ్రంథులు ఛేదింపబడి, సంశయ మోక్షం కలిగి, కర్మబంధాలు అంటని స్థితి వస్తుందని –

'భిద్యతే హృదయ గ్రంథిః

ఛిద్యంతే సర్వ సంశయాః

క్షీయంతే చాస్య కర్మాణి

తస్మిన్ దృష్టే పరావరే – అన్న శ్లోకంలో చెప్పబడింది.

అలాగే, అమ్మవారు ఇటు సృష్టి స్థితినీ చూడకలదు. అటు ప్రళయ స్థితినీ చూడగలదు. ఇలా రెంటినీ చూడగలది అమ్మవారే తప్ప ఇంకెవరూ ఉండరు. అందుకని అమ్మవారు విశాలాక్షి. త్రికాల దృష్టికూడా కలిగినది కాబట్టి అమ్మవారు విశాలాక్షి,

1) విశాలమైన కన్నులు గలది.

2) అత్యంత సూక్ష్మ పరిమాణము కలదానిని, అత్యధిక పరిమాణము కలదానిని గూడా చూడగలది.

3) సృష్టి ప్రళయాలను రెంటినీ చూడగలది.

4) భూత భవిష్యద్వర్తమాన కాల దృష్టి కలిగినది – అని ఈ నామానికి అర్థాలు.

## 937. విరాగిణీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విరాగిణ్యై నమః' అని చెప్పాలి.

'విరాగి' పదానికి స్త్రీ లింగ పదం – 'విరాగిణీ'.

వైరాగ్యం రావాలి రావాలి అంటే రాదు. ఎందుకంటే రావాలి రావాలి అంటున్నపుడు – రావాలనే కోరిక ఉన్నట్లే కదా! కోరికలు ఉన్నంత కాలం రాగం ఉన్నట్లే! రాగం ఉంటే వైరాగ్యం రాదు. కాబట్టి – వైరాగ్యం మనం కోరుకుంటే వచ్చేదికాదు.

వైరాగ్యం అనే పేరుతో ఒక్కొక్క దాన్ని వదిలి వెయ్యడం కాదు చెయ్యవలసింది. అలా వదిలేసేవి అనవసరం అని తెలియడం వైరాగ్యం. చిత్తవృత్తి పూర్తిగా నిరోధింపబడితే కాని ఇది తెలియదు. వాస్తవానికి అప్పుడే మనలో వైరాగ్యం సిద్ధిస్తుంది. ఇంత సృష్టి చేసినా తనకు అంటకుండా చేసింది, దేంట్లోనూ దిగబడకుండాను చేసింది, ఏదీ కావాలనుకునీ చేయలేదు – కాబట్టి అమ్మవారు 'విరాగిణీ'.

రాగము లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 938. ప్రగల్భా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రగల్భాయై నమః' అని చెప్పాలి.

ప్రగల్భా = ప్రతిభ గలది.

ఏ కాస్త పనైనా ఓ అరగంట కాలమే మనం చేసినా – ఆరు గంటలు ఆ పనిని గురించి, మన నైపుణ్యాన్ని గురించి – గొప్పగా చెప్పుకుంటాం. వినేవారు లేకపోతే వారి దగ్గరకు వెళ్ళి చెప్పేవారు కూడా ఉన్నారు. గోరంతలు కొండంతలు చేసి చెప్పుకుంటారు. మరి మన్వంతరాలకు, కల్పాలకు సరిపోయే బ్రహ్మాండమైన విశిష్ట సృష్టిని చేసిన అమ్మవారు ఇంకెంత గొప్పగా చెప్పుకోవచ్చునో ? అయినా అమ్మవారు ఎక్కువేం మాట్లాడదు. కాని, మాట్లాడే కొలది మాటలు ఎంత ప్రతిభావంతంగా ఉంటాయో, ఎంత ప్రౌఢంగా ఉంటాయో చెప్పలేం. మళ్ళీ మాట్లాడితే బాగుండును వినవచ్చు అనిపించేట్లుగా అమ్మవారి మాటలుంటాయి. ఆ మాటల్లో దర్పము, ప్రాగల్భ్యము ఉంటాయి. ('సరస్వతీ దేవియే అమ్మవారి మాటల ముందు తన వీణానాదము గూడా సరితూగలేదని వీణ వాయించటం ఆపివేసింది'' – అని 'సౌందర్యలహరి' – 66వ శ్లోకంలో ఆదిశంకరులు చెబుతారు.)

దర్పముతో కూడిన ప్రతిభావంతమైన మాటలు గలది – అని ఈ నామానికి అర్థం.

## 939. పరమోదారా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమోదారాయై నమః' అని చెప్పాలి.

పరమ = ఉత్కృష్టమైన, ఉదారా = ఔదార్యము కలది.

అమ్మవారిది ఇచ్చే గుణమేగాని పుచ్చుకునే గుణంకాదు. ఇంత మంది జీవుల్ని పోషించడానికి ఎన్ని రకాలుగా వారిని ఆవిడ ఆదుకుంటుందో ఆలోచిస్తే అమ్మవారి ఔదార్య గుణం అర్థమవుతుంది.

పరమ + ఉత్ + ఆరా = 'పరమోదారా' అన్న విధంగా విడదీస్తే - 'ఉత్తమోత్తమమైన, లేదా – పరమైన ఊర్ధ్వ దిశగాలాగే కిరణాలు గలిగినది' అనే అర్థం వస్తుంది. అంటే – ఉపాసకులకు సాధనలో కుండలినీ శక్తిని ఊర్ధ్వ దిశగా చరింపచేసేది అని ఇంకో అర్థం.

1) ఉత్కృష్టమైన ఔదార్య గుణం కలది.

2) యోగసాధకుల ఉపాసనలో ఉత్తమోత్తమమైన ఊర్ధ్వదిశగా వారి కుండలినీ శక్తిని చరింప చేయునది.

## 940. పరామోదా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరామోదాయై నమః' అని చెప్పాలి.

పరా + ఆమోదా = పరమానంద స్వరూపిణి.

ఇంద్రియాలు, మనస్సు పట్టే దాకా ఉండేది మోదము (సంతోషం). ఆ పైన కూడా ఉండేది ఆమోదము.

సాధారణంగా అందరూ కొద్దో గొప్పో మంచి జరిగినప్పుడు, మంచిని చూస్తున్నప్పుడు సంతోషిస్తారు. ప్రపంచంలో మొత్తం సంతోషం ఎంత ఉంటుందో

దాంట్లోంచి కొంత అప్పు తెచ్చుకున్నట్లు ఉంటుంది – ఇలా మనం పొందే సంతోషం – అంటే – మొత్తం సంతోషాన్ని మనలో ఎవరూ ఒక్కసారిగా పొందలేరు. వేరు వేరు చోట్ల వారందరూ వేర్వేరు కాలాల్లో పొందే సంతోషాలన్నిటినీ కలుపుకున్నా – ఈ మొత్తం సంతోషానికి చాలదేమో! కాని, అమ్మవారు పొందే సంతోషం ఎంతటిదంటే – ప్రపంచంలో మొత్తం సంతోషం ఎంత ఉంటే అంతటిది. అంతటి సంతోషాన్ని పొందగల అమ్మవారి నామం – 'పరామోదా' అసలు ఆ 'పరామోదా' స్వరూపమే అమ్మవారు.

'ఆమోదము' అంటే సంతోషమనే కాక 'పరిమళము' అనే అర్థం కూడా ఉంది. పరిసరాల్లో ఉన్నటువంటి గాలితో కొని రాబడేదే ఈ పరిమళం. ప్రపంచంలో ఉండే పరిమళ మంతా అమ్మవారి సాన్నిధ్యంలో వ్యక్తమై ఉంటుందని ఈ 'పరామోద' నామం సూచిస్తుంది.

పువ్వులో తేనె ఉన్నట్లు మన ప్రజ్ఞలో ఈ పరామోదం ఉంటుంది. ఈ తేనె బొట్టువల్ల తొడిమకు – పువ్వుకు పట్టు ఉంటుంది. జీవుడికి మరోజన్మ కూడా తప్పనిసరి అయితే – వ్యాధి, జరా, మృత్యువులు ఈ పట్టును తెంపేస్తాయి. అలా కాక సంస్కారం కనక భక్తిపరంగా ఉంటే – ఈ రకమైన పరామోదంలో గట్టిపట్టు ఉంటుంది. ప్రహ్లాదునికి ఈ పరామోద స్థితి భక్తివల్లనే దక్కింది. అందుకే పరమాత్మ అయిన శ్రీహరితో తన సంబంధం తెగ లేదు.

'నేను బ్రతకడ మెందుక'ని ఎవరైనా వాదిస్తే – 'నాచావు గురించిన చర్చ మీకెందుకు?' అనే దాని అర్థం. పుష్పంలో తేనె బొట్టు లాగానే మనలో అంశగాను ఉన్న – 'పరామోదం' అనే 'బ్రతుకుపై తీపి' – అలా అట్టే పెడుతుంది.

తనంతట తాను ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చి, ప్రమాదం నుంచి బయటపడి – 'నన్ను ఎందుకు బ్రతికించావు భగవంతుడా?' అంటాడు. నిజానికి తానే కదా బ్రతకాలని ఈదుకుంటూ బయటకు వచ్చింది. ఇది కూడా పుష్పంలోని తేనె బొట్టు లాంటి మనలోని పరామోదం అంశం తాలూకు ఆశే! స్త్రీలకు ఈ ఆశ మగవారి కంటె కొంచెం ఎక్కువగా ఉంటుంది.

1) ఇంద్రియాల యొక్క, మనస్సు యొక్క పరిధులు దాటిన ఆనందరూపం.

2) ప్రపంచంలోని మొత్తం ఆనందం యొక్క రూపం.

3) ప్రపంచంలోని మొత్తం పరిమళం యొక్క స్వరూపం.

4) ప్రతి జీవిలోను పుష్పంలోని తేనె బొట్టులా బ్రతుకుపై ఆశను, తీపిని కలుగచేసే ఆనందరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 941. మనోమయీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మనోమయ్యై నమః' అని చెప్పాలి.

మనో మయీ = మనస్సు స్థానంగా గలది.

మననం చెయ్యగలిగేది మనలో 'మనస్సే'! దేన్ని గురించి ఆలోచన వస్తే అది మనస్సును నింపుతుంది. పరమాణువు నుండి బ్రహ్మాండం దాకా ఇమడగల కళ్ళను కలిగినది మాత్రమే కాదు, అమ్మవారు పరమాణువు లోను, బ్రహ్మాండములోను కూడా ఇమడగల అష్ట సిద్ధులు గలది గూడా!

అటు సూక్ష్మమైన ఆకాశతత్త్వానికి, ఇటు స్థూలమైన పదార్థ తత్త్వానికి మధ్య ఉండే ద్వారం లాంటిది మనస్సు. అందుకని అమ్మవారు సూక్ష్మ స్థితిలో ఉన్నా, స్థూలమైన రూపంలో ఉన్నా కూడా మనస్సు నింపుకోగలదు కాబట్టి అమ్మవారు 'మనోమయీ'.

శుద్ధ బ్రహ్మమునకు మనస్సే స్థానం అని చెబుతారు కాబట్టి – అమ్మవారు – 'మనోమయీ' అని కూడా చెప్పవచ్చును. మన మనస్సు ఏ ఆకారం కోరుకుంటుందో ఆ ఆకారంలోనే, ఆ రూపంలోనే వ్యక్తం కాగల అమ్మవారు పొందే రూపం మన మనస్సును బట్టే ఉంటుంది కాబట్టి – అమ్మవారు 'మనోమయీ'.

'సూక్ష్మము – స్థూలము; అతిస్వల్పము – అత్యధికము; మొదలగు జంటలలోని రెంటినీ తనయందు ఇముడ్చుకొనగల లేదా అనుసంధానము చేయగల మనస్సును స్థానముగా గలది లేదా స్వరూపముగా గలది' – అని ఈ నామానికి అర్థం.

## 942. వ్యోమకేశీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వ్యోమకేశ్యై నమః' అని చెప్పాలి.

వ్యోమ = ఆకాశమును, కేశీ = కేశములుగా ఉన్నది. ఒక సందర్భంలో అమ్మవారి కేశాలు ఆకాశం వైపుకు ఎగసినట్లుగా ఉంటాయి. మహా ప్రళయ కాలంలో మహాకాళీ అవతారంగా ఉన్నపుడు ఆ కేశాలు అలాగే ఆకాశం వైపు ఎగసి ఉంటాయి. ఈ కాళీ అవతారం చీకటికి సంబంధించినది. మళ్ళీ పునః సృష్టి జరగాలంటే చీకటిలోంచి కిరణాలు రావాలి. వెలుగులోంచి వచ్చే కిరణాలు మనకు తెలుసు - అవి తెల్లగా ఉంటాయి. మెరుస్తూ ఉంటాయి. కాని చీకటి నుంచి వచ్చే కిరణాలు మనకు కనబడే కిరణాల్లాగా ఉండవు. చీకటి లోంచి వస్తాయి కాబట్టి అవి చీకటి రంగు అంటే నల్లగానే ఉంటాయి. అయితే మనం చూడలేనంత మాత్రాన ఇలాంటి కిరణాలు ఉండవనుకోకూడదు. ఇలా చీకటిలోంచి వచ్చే కిరణాలే కాళీ అమ్మవారి కేశాలుగా ఊహించుకోవాలి. అప్పుడు 'వ్యోమకేశీ' అన్న అమ్మవారి యొక్క నామం అవగాహనఔతుంది. వ్యోమకేశుని శక్తి అవడం వలన అమ్మవారు 'వ్యోమకేశీ'.

1) ప్రళయస్థితిలో ఆకాశము మీదికి ఎగసిన కేశములుకలది.

2) ఆకాశమును కేశములుగా గలది.

3) చీకటి లోంచి వచ్చే కిరణముల వంటి నల్లని కేశములు గలది.

4) వ్యోమకేశుని శక్తి - అని ఈనామానికి అర్థాలు చెప్పవచ్చు.

## 943. విమానస్థా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విమానస్థాయై నమః' అని చెప్పాలి.

విమాన = విమానము నందు, స్థా = ఉండునది.

సాధారణంగా ఎత్తులో చరించే దాన్ని విమానంగా చెప్పుకుంటాము. ఈ నామంలో 'స్థా' అని ఉంది కాబట్టి 'ఎత్తులో ఉండేది' అని చెప్పుకోవాలి. 'సుమేరు మధ్య శృంగస్థా' అన్న నామంలో చెప్పబడినట్లు – మేరుపర్వత ఉత్తర శిఖరం వద్ద, పాలపుంత (Milky way) ఉత్తర కొనవద్ద, శ్రీ చక్రంలో బిందువు వద్ద, మనలోని సహస్రార కమలంలోను – ఉండునది. అని ఈ నామానికి అర్థాలు వస్తాయి.

వి – అంటే విశేషమైన, మాన = మానములు, స్థా = గలది. అని ఈ నామాన్ని విడదీసి చెప్పుకుంటే, 'విశేషమైన మానములు గలది' – అనే అర్థం వస్తుంది. అంటే – మనలోని, సృష్టిలోని వివిధ నమూనాలకు కొలతలు గలది అని అర్థం.

దోసెడు ఇసుక రేణువులు తెస్తే దాంట్లోని ఇసుక రేణువుల సంఖ్య పరిమితమా? అపరిమితమా ? అంటే లెక్కించగలిగే వాడికి పరిమితమే ! లేకపోతే అపరిమితం అనిపిస్తుంది. మనం లెక్కించలేక పోవచ్చు గాని పరిమితమే! అలాగే సూర్యలోకంలోని లెక్కలు కూడా పరిమితమైనవే ! పరమాణులోకానికి, సూర్యలోకానికి నమూనా (Model) ఒకటే గాని 'పన్నా' (Scale) తేడాగా ఉంటుంది. వాస్తవానికి రెంటికీ మధ్య ఇటువంటి సమన్వయము, సామ్యము ఉన్నదని భావించినపుడే శాస్త్రజ్ఞులు పరమాణు నమూనాను కనిపెట్ట గలిగారు. ఇటువంటి నమూనాల విశిష్టమైన కొలతలే 'విమానము'లు.

గ్రహాలు, దేవతలు మొదలైన వారిని 'విమానస్థులు' లేదా 'వైమానికు'లు అంటారు. రాశి చక్రాన్ని పూర్తిగా ఒకసారి చుట్టి రావడానికి చంద్రునికి 1నెల పడితే, సూర్యునికి – 1 సంవత్సరము, బృహస్పతికి – 12 సంవత్సరములు, శనికి 30 సంవత్సరములు పడతాయి. అన్ని గ్రహాల ఈ భ్రమణ కాలాల క.సా.గు.(L.C.M) 60. ఈ 60 సంఖ్యే ప్రభవ, విభవాది తెలుగు సంవత్సరాల సంఖ్యను గూడా సూచిస్తుంది. చంద్రుడు ఒక రాశిలో రెండున్నర రోజులుంటే – శని ఒక రాశిలో రెండున్నర సంవత్సరాలుంటాడు. ఇలా ఏక సూత్రత మీద ఆధారపడ్డ విషయాలే అయినా రెంటికీ 'పన్నా'(Scale)లో తేడా ఉంటుంది తప్పితే – నమూనాలు ఒకటే ! పరమాణువుకు సంబంధించిన కొలతలకు, భూమికి సూర్యునికి సంబంధించిన కాలాలకు, మన శ్వాసకాలానికి, యుగ, మన్వంతర, కల్పకాలాలకు గూడా మధ్య ఇదే విధంగా ఏక సూత్రత ఉంటుంది. స్థలా భావం చేత

అన్నీ వ్రాయటం లేదు - వివరణకర్త) పరమాణువు దగ్గఱ నుండి బ్రహ్మాండం దాకా, పాతాళ లోకం నుంచి సత్యలోకం దాకా ఉండే ఇటువంటి వ్యూహాలన్నీ తిన్నగా నడవడానికి కారణంగా వెనుక ఉన్న శక్తి రూపంలో ఉండే అమ్మవారినే 'విమానస్థా' అంటారు. శ్రీమాతా అనే నామంలోనే 'తనను ఆశ్రయించుకున్న మానములు (కొలతలు) కలది అని ఈ అర్థం దాదాపుగా ఉంది.

చోటులో Tapeను పట్టితే – చోటు పొడవు రాదు. Tape పొడవేవస్తుంది. అలాగే అమ్మవారికి కొలతలు వేసినా అంతే ! మనలో కూడా విశిష్టమైన కొలతలు ఉంటాయి కాబట్టి, మన శరీరాన్ని కూడా 'విమానం' అని కూడా అంటారు. నిర్విశేషంగా మానములతో నిండిన ఈ శరీరాన్ని తయారు చేస్తే - దాన్ని 'నిర్ + మానము' = నిర్మాణము' అంటారు. అలాగే ఎటువంటి దైనా ఇలా చేయబడితే దాన్నీ 'నిర్మాణమే' అంటారు.

1) విశేషమైన మానములు గలది.

2) అన్ని కక్ష్యల (Planes) లోను, అన్ని పరిమాణాల (Scales)లోను జరిగే నమూనా వ్యూహాలకు వెనుక ఉన్న శక్తి.

3) విశిష్టమైన కొలతలు గల శరీరంగా ఉండునది. – అని ఈ నామానికి అర్థాలు.

## 944. వజ్రిణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వజ్రిణ్యై నమః' అని చెప్పాలి.

వజ్రిణీ = వజ్రమును ఆయుధముగా ధరించునది.

'వజ్రి' అంటే వజ్రము కలవాడు. ఇది పుంలింగ శబ్దమయితే 'వజ్రిణీ' దానికి స్త్రీలింగ శబ్దం అవుతుంది.

వజ్రాయుధాన్ని ఇంద్రుడు ధరిస్తాడు. కాబట్టి, ఇంద్రునికి 'వజ్రి' అనే పేరు వచ్చింది. వజ్రి సంబంధమైనది – 'వజ్రిణీ' ఔతుంది. (ఇంద్రుడు ఇంద్రాణీ అయినట్లు

అన్నమాట!) ఈ నామం ఇంద్రపత్ని అయిన శచీ దేవికి చెల్లుతుంది. స్వర్గలక్ష్మి అయిన శచీదేవి రూపంలో ఉండేది కూడా అమ్మవారేనని ఈ నామం సూచిస్తుంది. (ఈ ఇంద్ర వజ్ర సంబంధాన్ని తెలిపే – 'వజ్రస్య భర్తా, వృత్రస్య హన్తా, లోకత్రయేశా, పురందరాయ' అనే శ్లోకం కూడా ఉంది. రుద్రుడు గూడా వజ్రాయుధాన్ని ధరిస్తాడని వేదాలు వర్ణిస్తాయి.)

'వజ్రము' అనేది వాక్కుకు సంబంధించిన ఒక యంత్రం. మనలో, అంటే – పిండాండంలో విశుద్ధి చక్రానికి అధిష్ఠాన దేవత 'వజ్రేశ్వరీ' అనే ఒక అతి రహస్య శక్తి (ఈ అతి రహస్య శక్తి శ్రీచక్రంలోని అష్టమావరణం అయిన త్రిభుజంలో ఉంటుంది). విశుద్ధి చక్రం ద్వారానే సర్వవాఙ్మయం వ్యక్తం కావాలి కాబట్టి – ఈ వజ్రేశ్వరికి వాక్కుకు సంబంధము ఉంటుంది. అందుకే 'వాగ్వైవజ్రః' అంటారు. ప్రస్తుత నామం అయిన 'వజ్రీ' గూడా ఈ వజ్రమనే యంత్రానికి సంబంధించినదిగా గ్రహించవచ్చును. ఈ వజ్రానికి సంబంధించిన యంత్రం ద్వితీయ భాగంలోని 'వజ్రేశ్వరీ' నామ వివరణలో ఇవ్వబడింది. పాఠకుల సౌకర్యార్థం మళ్లీ ఇక్కడ ఇవ్వబడుతోంది.



ఈ వజ్రయంత్రానికి సంబంధించిన మంత్రం ఈ క్రింద ఇవ్వబడింది. 'జ్రీం' అనేది వజ్రానికి బీజాక్షరం.

మం. ''చతుర్భిస్సకం నవతించ నామభిః
చక్రం న వృత్తం వ్యతీం రవీవపత్
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః
యువాకుమారః ప్రత్యేత్యాహవమ్''

ఈ మంత్రం జమదగ్ని చేత ప్రసాదించబడింది. సుదర్శన, సుబ్రహ్మణ్య, వజ్రాలకు గూడా ఈ మంత్రం వర్తిస్తుంది. ఐతరేయ బ్రాహ్మణంలో సుబ్రహ్మణ్య మంత్రానికి చక్కని

వ్యాఖ్యానం కూడా ఉంది. 'ప్రత్యంగిరా' 'ఉగ్రకృత్యా' మొదలైన మంత్రాలు గూడా ఇంతటి శక్తి కలిగినవే! శత్రువులు నశించాలి అని సంకల్పించి, ఇటువంటి ప్రత్యంగిరా మంత్రాలు జపిస్తే – అలా ఈ మంత్రాన్ని స్మరించేవాడు కూడా పోవచ్చు. ఎందుకంటే – స్మరించేవాడు కూడా లోకంలో ఒకళ్ళకు శత్రువు అవచ్చు కాబట్టి. అందుకని వివేకాన్ని ఉపయోగించి గాని ఈ మంత్రాల్ని ఉచ్చరించగూడదు.

(ఈ మంత్రాలన్నీ మిఠాయి దుకాణం లాంటివి. దుకాణంలో చుట్టూ అన్నీ మిఠాయిలే, సందేహం లేదు, తినవచ్చు. కాని అవసరమా ? అంటే – 'అవసరం లేదు' అనేదే సమాధానం. అందుకే మిఠాయి కొట్లో కూర్చున్నవాడు వాటిని తినడు. బయట నుండి వాటిని చూసి ఉబలాటపడేవాడు వాటి వద్దకు ఎగబడతాడు. అలాగే – అన్ని మంత్రాల మీదా వ్యామోహం కొందరికి ఉంటుంది గూడా!) ద్వితీయ భాగంలోని 468వ నామం అయిన 'వజ్రేశ్వరీ' నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి).

1) వజ్రమును ఆయుధముగా గలది.

2) స్వర్గలక్ష్మి అయిన శచీదేవి రూపంలో ఉండునది.

3) వజ్ర సంకేతమైన వాగ్దేవి – అని ఈ నామానికి అర్థాలు.

## 945. వామకేశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వామకేశ్వర్యై నమః' అని చెప్పాలి.

వామకేశ్వరీ = వామకేశ్వరుని భార్య.

సమస్తాన్ని సృష్టించేవాడు ఒక ఆకారం దాల్చి పరిమితత్వాన్ని పొందితే – అలా పొందిన వాణ్ణి 'వామదేవుడు' అంటారు. లేదా వామభాగంలో దేవిని కలిగినవాణ్ణి 'వామదేవుడు' అనవచ్చు. లేదా (తనయందు) స్త్రీని కలిగినపుడు – అని కూడా చెప్పవచ్చు. వామదేవునికి సంబంధించినవాడే వామకేశ్వరుడు కూడా! ఈ వామకేశ్వరుని శక్తి 'వామకేశ్వరి' ఔతుంది.

'వామకు' లనే వారు దేవతలలో ఒక గణం. వీరు అమ్మవారిని ఆరాధిస్తారు. కాబట్టి 'వామకులకు అమ్మవారు - ప్రభ్వీ లేదా ఈశ్వరి' అయింది.

1) వామకేశ్వరుని శక్తి.

2) దేవతలలో ఒక గణమైన వామకులకు ప్రభ్వీ - అని ఈ నామానికి అర్థాలు.

## 946. పంచయజ్ఞప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంజయజ్ఞప్రియాయై నమః' అని చెప్పాలి.

పంచ = ఐదు, యజ్ఞ = యజ్ఞముల ఆచరణ యందు, ప్రియా = ప్రీతి కలది.

శ్రద్ధా భక్తులతో నలుగురికీ ఉపయోగపడేట్టు చేసే ఆరాధనా విశేషాన్ని 'యజ్ఞం' (An utilitarian act of working with Devotion) అంటారు. ప్రతి గృహస్థు ఐదురకాలైన యజ్ఞాలను ప్రతిరోజూ నిర్వహించాలని చెబుతారు. అవి 1) బ్రహ్మయజ్ఞం 2) పితృయజ్ఞం 3) దేవయజ్ఞం 4) భూతయజ్ఞం 5) మనుష్య యజ్ఞం - వీటినే పంచ మహాయజ్ఞాలని అంటారు. ఈ పంచ మహాయజ్ఞాల వివరణ ఈ క్రింది శ్లోకం తెలియపరుస్తుంది.

శ్లో. అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తుతర్పణమ్,
హోమోదైవో బలిర్భౌతో, నృయజ్ఞోఽతిథి పూజనమ్.

1) ప్రతిరోజూ వేద శాస్త్రాలు చదవడం, చదివించడం - బ్రహ్మయజ్ఞం. దీని వల్ల బ్రహ్మ ప్రీతి చెందుతాడు. తత్ఫలితంగా విద్యాభివృద్ధి, శాస్త్రాభివృద్ధి జరిగి అవగాహన పెరుగుతుంది.

2) పితృదేవతలకు తర్పణ విధులు నిర్వహించడం - పితృయజ్ఞం. దీని వల్ల పితృదేవతలు తృప్తిచెందుతారు. తత్ఫలితంగా ఉత్తమ సంతానం, వంశాభివృద్ధి ఉంటుంది.

3) హోమాలు చెయ్యడం దేవయజ్ఞం. దీనివల్ల దేవతలు పరితృప్తి చెందుతారు. తత్ఫలితంగా సకాల వర్షాలు, శీతోష్ణాలు కలిగి పాడి, పంటలు, సస్యవృద్ధి ఉంటుంది.

4) గృహ వాతావరణంలోను, దేవాలయ ప్రాంగణంలోను ఉండే జీవరాశులకు బలులు (వీటినే పంచ బలులు అంటారు. వీటిని గురించి 677వ నామం అయిన 'బలిప్రియా' నామంలో వివరించబడింది. 'బలి' అంటే ఏదైనా 'నివేదన ద్రవ్యం' అని అర్థం గాని, చంపడం అని అర్థం కాదు.) వీటివల్ల మన చుట్టూ ఉండే జీవరాశులు పరితృప్తి చెందుతాయి. తత్ఫలితంగా భూతదయ పెంపొందింపబడటం, పంటలు నష్టం కాకుండా ఉండటం జరుగుతుంది.

5) అతిథిపూజ చెయ్యడం మనుష్యయజ్ఞం అవుతుంది. దీనివల్ల సాక్షాత్తు విష్ణుమూర్తే సంతోషించి ప్రసన్నుడౌతాడు. ('అభ్యాగతః స్వయం విష్ణుః' అన్నారు కాబట్టి). తత్ఫలితంగా సర్వ ప్రదేశాల్లోను సర్వుల చేత ఆదరింపబడటం జరుగుతుంది.

పంచ మహాయజ్ఞాల ఆచరణ యందు ప్రీతి కలది - అని ఈ నామానికి అర్థం.

## 947. పంచ ప్రేత మంచాధిశాయినీ

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచప్రేత మంచాధిశాయిన్యై నమః' అని చెప్పాలి.

పంచ = పంచ, ప్రేత = ప్రేతలకు సంబంధించిన, మంచ = మంచము నందు, అధిశాయినీ = అధి వసించి ఆసీనురాలై ఉండునది.

'ప్ర + ఈత = ప్రేత' - అంటే చక్కగా వెళ్ళిపోయినవి. పంచభూతాలనే 'పంచప్రేతా' అంటారు. ఖనిజ లవణ పదార్థాల్లోకి ఈ పంచభూతాలు వెళ్ళి పోయినపుడు అవి అచేతనాలే అవుతాయి. వీటిలో ప్రజ్ఞ 'ప్రేతము' ఔతుంది. మన వెన్నెముక వెంబడి సుషుమ్నా మార్గంలో ఉండే బ్రహ్మ గ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి ఈశ్వరస్థానము (లలాటానికి బ్రహ్మరంధ్రానికి మధ్య ఉండే స్థానం) ఈ నాలుగు స్థానాలను నాలుగు కోళ్ళు, ఈ కోళ్ల మధ్య ఉండే) మంచం మీద తల్పంగాను శ్రీ విద్యలో సంకేతిస్తారు. వీరినే పంచ బ్రహ్మలంటారు. శక్తిరహితులైనపుడు ఈ పంచబ్రహ్మలు వారి వారి కృత్యాలను నిర్వహించలేరు. అందుకని వారిని 'ప్రేత'లని అంటారు. ఈ ఐదుగురిచే రూపొందింపబడిన మంచం మీద అమ్మవారు ఆసీనురాలై ఉంటుంది. అంటే -

సహస్రారంలో బిందువు వద్ద ఉంటుంది. అని అర్థం. ఈ పంచ బ్రహ్మస్థానాలకు పైన ఆశీనురాలై ఉండడం వలన అమ్మవారిని 'పంచప్రేతాసనాసీనా' అన్నారు.

పంచప్రేతములను అధివసించి, వాటిపై ఆసీనురాలై ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 948. పంచమీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచమ్యై నమః' అని చెప్పాలి.

పంచమీ = అష్టమాతృకలలో ఐదవది అయిన వారాహీదేవి స్వరూపురాలిని 'పంచమీ' అంటారు. అలాగే పంచభూతాల్లో ఐదవది అయిన ఆకాశ స్వరూపము పంచ బ్రహ్మలలో సదాశివుని రూపము, పంచకోశాల్లో ఆనందమయ కోశ దేవతా స్వరూపము ఈవిడే! ఈ దేవత - జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యావస్థలకు పైన తురీయాతీత స్థితిలో ఉంటుంది. ఉపాసనలో సాధకుని కుండలినీ శక్తి సుషుమ్నా మార్గం ద్వారా ఊర్ధ్వగతిలో సహస్రారాన్ని చేరినపుడు - సహస్రారంలోని చంద్రమండలంలో ఘనీభవ స్థితిలో ఉన్న వెన్నెల కరుగుతుంది. అలా కరిగిన వెన్నెలనే అమృతం అంటారు. ఈ సుధాస్రుతి మళ్ళీ సుషుమ్నా మార్గంవెంబడి ఆజ్ఞా, విశుద్ధి, అనాహత, మణిపూర, స్వాధిష్ఠాన మూలాధార చక్రాలను, సమస్త నాడీ మండలాన్నీ తడుపుతుంది.

సహస్రారంలో కుండలినీ శక్తి అనే అమ్మవారు అయ్యవారితో కలసి ఉన్నస్థితిని 'మనస్సు - ఆత్మ' ఏకాంతంలో కలసి ఉన్న స్థితిగా సమన్వయుపరచుకోవాలి. ('సహస్రారేరమ్యే సహరహసి పత్యావిహరసే - సౌందర్యలహరి - 9.

సహస్రారం నుండి పంచమికి ప్రజ్ఞ అధోమార్గంలోదిగిన సమయంలో అమ్మవారు అనాహతంలో ఉంటుంది.

సహస్రారం నుండి మూలాధారం వరకు '7 చక్రాల మధ్య' '6 మధ్య భాగాలుంటాయి. ఈ 6 భాగాల మేర 15 తిథులు, అనుకుంటే - సహస్రారం నుండి అనాహతం చేరేప్పటికి సరిగ్గా పంచమి తిథి వస్తుంది. అలాగే సహస్రారం నుండి అనాహతం చేరేప్పటికి ప్రజ్ఞ వాగ్భవకూట ముఖపద్మాన్ని దాటి, కామరాజ కూట హృత్పద్మాన్ని

చేరుతుంది. ఆ స్థితిలోని అనాహతాన్ని 'హృత్పుండరీకం' అంటారు. ఈ హృత్పుండరీకంలోని 'దహరాకాశా' నికి ఈ పంచమీ మాతృక అయిన వారాహియే దేవత. ఈ వారాహీదేవత, పుండరీకాక్షుడయిన విష్ణుమూర్తి యొక్క వరాహావతారము – ఈ ఇద్దరూ వరాహ సంబంధమైన వారే అని వారి పేర్లు చూస్తేనే తెలుస్తుంది. 'వర + అహం' అని విడదీస్తే – ఈ వరాహం యొక్క ప్రాశస్త్యం తెలుస్తుంది. 'వర' అంటే 'శ్రేష్టమైన' అహం అంటే 'నేను'. మనమందరం 'సాధారణ నేను' లము. ఆ పరమాత్మ ఒక్కడే 'శ్రేష్టమైన నేను'. కాబట్టి వర + అహం అనే పేరుతో వీళ్ళు పిలువబడతారు. పైగా శ్రీవిద్యలో ఈ వారాహీదేవియే 'దండనాథ' అయిన అమ్మవారి సైన్యాధ్యక్షురాలు. 'దండం' అంటే యోగదండం, అంటే – వెన్నెముకే ! – కాబట్టి, ఈవిడ ఆధీనంలోనే ఉంటుంది – ఈ యోగం అంతా ! ఇటువంటి వారాహీదేవి స్వరూపురాలిగా అమ్మవారు ఈ 'పంచమీ' నామంతో పిలువబడుతుంది.

1) అష్టమాతృకలలో వారాహీదేవీ స్వరూపురాలు.

2) శ్రేష్ఠమైన నేను – అంటే పరమాత్మ స్వరూపురాలు – అని ఈ నామానికి అర్థాలు.

## 949. పంచభూతేశీ

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచభూతేశ్యై నమః' అని చెప్పాలి.

పంచభూత = పంచభూతములకు, ఈశీ = అధిష్ఠాత్రి.

పృథివ్యాపస్తేజోవాయురాకాశములనే – (నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశము) – పంచభూతాలంటారు. సమస్త ప్రపంచం ఈ పంచభూతాలతోనే నిండి ఉండి, పంచ భూతాలతోనే చేయబడింది. ఈ పంచభూతాలనే ఎన్నో రకాలుగా మేళవించి, వివిధ రకాల జీవులను వస్తువులను, పదార్థాలను అమ్మవారు సృష్టించింది. అంటే – పంచభూతాలు ఆవిడ చెప్పినట్లు వింటాయన్నమాట ! అందుకే అమ్మవారు పంచభూతాలకు అధికారిణి లేదా అధిష్ఠాత్రి.

పంచభూతాలకు ప్రభ్వి లేదా అధిష్ఠాత్రి – అని ఈ నామానికి అర్థం.

## 950. పంచసంఖ్యోపచారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచసంఖ్యోపచారిణ్యై నమః' అని చెప్పాలి.

పంచసంఖ్య = ఐదు, ఉపచారిణీ = ఉపచారములతో సేవింపబడునది. 'ఖ్యా' = అంటే చెప్పుట – 'సంఖ్యా' అంటే చక్కగా చెప్పుట. ఇది – 'బోధపడుట' అన్నదానికి సరియైన సమన్వయాత్మక పదం. అసలు 'సంఖ్య' అంటే – 'గుర్తింపు' – అని మొదటి అర్థం. ఈ అర్థాన్ని బట్టి 'సాంఖ్యము' అనే మాట వచ్చింది. 'సాంఖ్యము' – అంటే– 'తన్ను తాను గుర్తించడానికి, తన చుట్టూ రా ఉన్నవాటికి, తనకూ గల సమన్వయాన్ని సాధించుకోడానికి ఉపకరించే శాస్త్ర విభాగము' – అని అర్థం.

సంఖ్యాశాస్త్రం అన్ని శాస్త్రాల కంటే కచ్చితమైనది. నిర్దుష్టమైనది. కూడికలు, తీసివేతలు మొదలగునవి ఏ దేశంలో అయినా ఎక్కడైనా ఒకే లాగా వర్తించడానికి కారణం అవి మనం పుట్టుక పూర్వం నుండీ ఉండడమే! అందుకే ఈ శాస్త్రాన్ని 'దివ్యతర్కం' (Divine logic) అన్నాడు పైథాగరస్ మహాశయుడు.

మిగతా శాస్త్రాలన్నీ ఒక్కొక్కడికి ఒక్కొక్కలాగా తోస్తాయి. అందుకే ఎన్నో మతాలు, ఎన్నో వర్గాలు, శాస్త్రాలు, సిద్ధాంతాలు ఏర్పడ్డాయి. సంఖ్యాశాస్త్రంలో ఆ సందిగ్ధత లేదు.

వేదాలు Amounts లాంటివైతే మిగిలినశాస్త్రాలు Accounts లాంటివి. Accounts వేరు వేరుగా ఉన్నాAmounts ఒకటే! మిగతా వాటి కంటే వేరుగా గుర్తించబడడాన్ని కూడా 'ఖ్యా' అనే ఏకాక్షర పదానికి అర్థంగా చెప్పుకోవచ్చును. చక్కగా అలా గుర్తించబడటాన్ని 'సంఖ్యా' అంటారు.

అందుకే అలా ఒక దానికి ఒకటి వేరుగా, కచ్చితంగా, నిర్దుష్టంగా గుర్తింప బడతాయి కాబట్టి – అంకెలను 'సంఖ్యలు' అన్నారు.

'ఉపచారము' అంటే – దగ్గరగా అనుసరిస్తూ చరిస్తూ ఉండటం'. 'పంచ' సంఖ్య అంటే – 5 అనే సంఖ్య – అమ్మవారిని ఎల్లప్పుడూ అనుసరిస్తూ, చరిస్తూ ఉంటుంది.

పంచభూతాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు, పంచ కర్మేంద్రియాలు ఇలా 'పంచ' సంఖ్యాత్మకంగా ఈ సృష్టి ఉంటుంది కాబట్టే – దీన్ని 'ప్ర + పంచము' = 'ప్రపంచము' అన్నారు. ఈ విధంగా పంచ సంఖ్యాత్మకంగా సృష్టిలో చరిస్తూ ఉండే అమ్మవారు. 'పంచసంఖ్యోపచారిణీ'.

అమ్మవారిని చతుష్షష్టి ఉపచారాలతో కూడా ఆరాధించే విధానాలున్నాయి. షోడశోపచార పూజ, లేదా – కనీసం ఐదు ఉపచారాలతో కూడా పూజించే పద్ధతులు ఉన్నాయి. ఈ కనీస పంచ ఉపచారాలే – ' గంధం, పుష్పం ధూపం, దీపం, నైవేద్యం' – ఇలా కనీసం ఐదు ఉపచారాలతో ఆరాధింపబడే అమ్మవారిని 'పంచసంఖ్యోపచారిణీ' అన్నారు.

1) కనీసం పంచ ఉపచారాలతోనైనా పూజింపబడునది.

2) పంచభూత, పంచతన్మాత్రాది పంచసంఖ్యాత్మక లక్షణంగా సృష్టిలో చరించునది – అని ఈ నామానికి అర్థాలు.

## 951. శాశ్వతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాశ్వత్యై నమః' అని చెప్పాలి.

శాశ్వతీ = నిత్య నిరంతరమైనది.

'నిరంతరం' అంటే ఎప్పుడూ అని అర్థం కాదు. 'సందులేకుండా', అని అర్థం. (Without gap) ఎప్పుడూ విశ్వం నిండా సందులేకుండా ఉండేది. కాబట్టే – 'శాశ్వతగ్ం శివమచ్యుతమ్' – అని 'సత్యం, జ్ఞాన, మనంతం బ్రహ్మ' అనీ పరబ్రహ్మ తత్త్వాన్ని గూర్చి శ్రుతులు చెబుతాయి. అందుకే – పర బ్రహ్మ స్వరూపిణి అయిన అమ్మవారు 'శాశ్వతీ'.

సందులేకుండా ఎప్పుడూ విశ్వం నిండా నిండి ఉండేది – అని ఈ నామానికి అర్థం.

## 952. శాశ్వతైశ్వర్యా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాశ్వతైశ్వర్యాయై నమః' అని చెప్పాలి.

శాశ్వత = శాశ్వతమైన, ఐశ్వర్యా = ఐశ్వర్యము కలది.

దేన్ని మనం ధనం అనుకుంటున్నామో దాన్ని బట్టి మన విలువను లెక్కకడతారు – ధనమంటే నిజమైన అర్థం తెలిసినవారు. ఈశ్వర ఈశ్వరీ పదాల చేత పిలువబడే ఒకే ఒక తత్త్వం ఈ హృదయంలో ఉంది. ''ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా' – అని గీతలో చెప్పబడింది – ఆ తత్త్వం గురించే. సర్వంలోనూ ఉండి, సర్వాన్నీ కాల గమనంలో చక్రం త్రిప్పినట్లు త్రిప్పేది ఈ తత్త్వమే'. అదే 'అచలము' – 'ధ్రువము' – అయిన (ఆ చక్రంలోని) అక్షం (Axis). చక్రంలోని అన్ని బిందువులు తిరుగుతాయి కాని అక్షం తిరుగదు. అది – 'అచలమ్ధ్రువమ్'. అలా శాశ్వతంగా స్థిరంగా కదలకుండా ఉండే తత్త్వమే ఈశ్వరీ తత్త్వం. చెక్కు చెదరని ఈ ఈశ్వర లక్షణమే శాశ్వతమైన ఐశ్వర్యం.

ఈశ్వరీ ఈశ్వరులు పేర్లలో ఇద్దరైనా – శ్వాసగా (సోహం) ఇద్దరూ ఒకటే ! సృష్టి సమస్తంలో వారు దిగివచ్చి చేసే లీలలనే 'ఐశ్వర్యం' అంటారు. వాళ్ళ యొక్క పంచకృత్యాలు (సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలు) అన్నీ లీలాప్రాయంగానే జరుగుతాయి. వారికి అవి అవలీలాప్రాయంగానే ఉంటాయి.

'ఇందుగలడందులేడని – సందేహము వలదు చక్రి సర్వోపగతుండై

ఎందెందు వెదకి చూచిన – అందందేగలడు దానవాగ్రణి వింటే' –

అని – ప్రహ్లాదునిచే పై పద్యంలో చెప్పబడినది – శాశ్వతమైన సర్వాంతార్యామి లక్షణమే! (ఈ పద్యం హిరణ్యకశిపునకు నోట్లోంచి రాదు. ప్రహ్లాదునికి బుఱ్ఱలోంచి పోదు).

సూర్యుడు వెలగడమే కాదు, ఆ వెలుగు మనకు పనికి రావడం గూడా ఉంది. చంద్రుడు, నీళ్ళు, గాలి మొదలైన వాటి విషయంలో కూడా అదేవిధంగా అవి వాటి

లక్షణాలను కలిగి ఉండటమే కాదు, అవి ఇతరులకు పనికి రావడం గూడా ఉంటుంది. ఇలా పనికి రాగలగ జేయడం అనుగ్రహానికి సంబంధించినది. ఈ లక్షణాలు ఎవరి దగ్గరుంటే వారికి శాశ్వతమైన ఐశ్వర్యం ఉన్నట్లే లెక్క! మిగిలినవి ఎన్ని ఉన్నా అవి అన్నీ అశాశ్వతమైనవే!'

ఏది ఉంటే ఇంక ఇతరమైనవి కావాలని అనిపించదో అది నిజమైన ఐశ్వర్యం. ఈ అర్థంలో ఒక్క మోక్షం తప్పించి మిగిలినవన్నీ అశాశ్వతమైన ఐశ్వర్యాలే ఔతాయి! పైగా ఇది ఇతరుల చేత దొంగిలింపబడనిది కూడా! ఈశాశ్వతమైన మోక్షాన్ని ఇచ్చేది కాబట్టి అమ్మవారు శాశ్వతైశ్వర్యా.

1) జగత్తంతా ఎప్పుడూ నిండి ఉండగలిగే లక్షణాన్ని ఐశ్వర్యంగా గలది.

2) మోక్షమును ఐశ్వర్యంగా గలది.

3) శాశ్వతంగా ఉండగలగడమే ఐశ్వర్యంగా గలది.

4) భక్తులకు శాశ్వత ఐశ్వర్యమైనది - అని ఈ నామానికి అర్థాలు.

## 953. శర్మదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శర్మదాయై నమః' అని చెప్పాలి.

శర్మ = సుఖశాంతులను, దా = ఇచ్చునది.

'శం' అంటే - సుఖము, శాంతి - అని అర్థం. ప్రతి జీవికి నిజంగా కావలసినవి ఈరెండే! ఏవి లేకపోయినా ఈ రెండూ ఉంటే చాలు. అందుకే ఇవి మాకు కలుగచేయాలని దేవతలను 'శంనోమిత్రశ్శంవరుణః శన్నోభవత్వర్యమా, శంన ఇంద్రోబృహస్పతిః, శంనోవిష్ణురురుక్రమః .....'- అని ఈ శాంతి పాఠాన్ని చెబుతారు.

ఈ 'శం' కలవాడే - అంటే - ఎప్పుడూ సుఖంగాను, శాంతంగాను ఉండేవాడే- 'శర్మ'. అని పిలవబడటానికి అర్హుడు. (ఈ లక్షణం గలవారే నిజమైన బ్రాహ్మణులు. అందుకే సంధ్యావందనంలో బ్రాహ్మణులను తమ పేర్ల చివర 'శర్మ' అని చెప్పుకోమన్నారు).

మనయందున్న ఏ భావం వలన మన మనస్సులు, ఇంద్రియాలు శమింపబడతాయో దాన్ని – 'శం' 'శమ్', 'శర్మ' 'శమీ' 'శమము' అనే పేర్లతో పిలుస్తారు. ఇట్టి 'శర్మ'ను ప్రసాదిస్తుంది కాబట్టి అమ్మవారు 'శర్మదా'.

సుఖశాంతులను ప్రసాదించునది' – అని ఈ నామానికి అర్థం.

## 954. శంభుమోహినీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శంభుమోహిన్యై నమః' అని చెప్పలి.

శంభు = శివుని, మోహినీ = మోహింప చేయునది.

'శం – భు' అని 'శంభు' పదాన్ని విడదీస్తే 'శంభు' పదానికి 'శం'ను 'పుట్టించినవాడు' అని అర్థం వస్తుంది. అంటే – ఇంతకు ముందు నామంలో చెప్పుకున్న సుఖశాంతులను పుట్టించే వాడే శంభుడన్నమాట! అంటే – సుఖశాంతుల ఉత్పత్తి స్థానం శంభుడన్నమాట! చలించని ధృఢచిత్తుడైన శంభుని మోహింపచేసి, ఆయన వద్ద ఉండే సుఖశాంతులను భక్తులకు అందింపచేస్తుంది అమ్మవారు. మానవుల యొక్క లలిత కళాదులవంటి వాటిని ఆయనకు అందింప చేయించి, వారి మనస్సులను భగవంతునికి సమర్పణగావింపచేస్తుంది కాబట్టి – అమ్మవారు 'శంభుమోహినీ' అమ్మవారి మోహినీత్వమే లేకపోతే శివుని ద్వారా ఈ సృష్టివ్యక్తమయేది కాదు. అమృతం కొరకు చేసిన క్షీర సముద్ర మథన కాలంలో దేవదానవులను, అటు తర్వాత శివుణ్ణి – మోహింప చేసిన విష్ణుమూర్తి యొక్క జగన్మోహినీ రూపం అమ్మవారిదేనని గుర్తించుకోవాలి.

శివుణ్ణి మోహింప చేయునది – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చును.

## 955. ధరా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధరాయై నమః' అని చెప్పాలి.

ధరా = సకలమును ధరించునది.

బ్రహ్మాండంలో ఉన్న గ్రహతారకాదులన్నీ నిరంతరం గమనంలోనే ఉన్నా, అవన్నీ ఒక దానితో ఒకటి కొట్టుకోకుండా – వాటి గమన విధానాల్లోనే అవి ఉండేట్టుగా – వాటన్నిటినీ తన యోగ శక్తి చేత అమ్మవారు ఉంచుతుంది. ఇలా ఉంచగలిగే శక్తినే 'ధరించడం' అంటారు. ఇలా ధరించే గుణం ఉన్నది కాబట్టే – అమ్మవారిని 'భూమిర్దేనుర్ధరణీలోకధారిణీ' అన్నారు.

ఒక గ్లాసులో ఘన, ద్రవ, వాయు పదార్థాలను ఉంచితే అప్పుడు అట్టడగునకు హెచ్చు సాంద్రత గల ఘనపదార్థం, దానిపైన ద్రవ పదార్థం, దానిపైన వాయు పదార్థం ఉంటాయి. అంటే – మిగిలిన అన్ని స్థితులలోని పదార్థాలను – సాంద్రంగా, దృఢంగా ఉండే ఘనపదార్థం ధరిస్తోందన్న మాట! అలాగే – భూమి కూడా అన్నిటినీ ధరిస్తుంది. ఇలా ధరించేది కాబట్టి ఈ పృథివిని (భూమిని) 'ధరా' అన్నారు. ఇలా ధరించడానికి చాలా ఓర్పు కావాలి. అందుకే – క్షమయాపృథివీసమా' అని (క్షమాగుణంలో భూమితో సమానం అని దీని అర్థం). చెబుతారు.

ఒకప్పుడు విష్ణుమూర్తి ఆది వరాహమూర్తిగా తన కోరపై ఈ భూమిని ధరించి ఉద్ధరించాడు. అలా ధరింపబడింది కాబట్టి ఈ భూమికి 'ధరా' అనే పేరు వచ్చింది. ఈ భూమి కూడా అమ్మవారి స్వరూపమే కాబట్టి అమ్మవారిని కూడా 'ధరా' అన్నారు. (సౌందర్యలహరిలో గూడా ఈ విషయం 3వ శ్లోకంలో వస్తుంది).

1) సమస్తమును ధరించునది.

2) ఆది వరాహ కోరచే ధరింపబడిన 'ధరా' స్వరూపము – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 956. ధరసుతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధరసుతాయై నమః' అని చెప్పాలి.

ధరా = భూమి యొక్క, సుతా = కుమార్తె.

భూమిని ధరించేవి పర్వతాలు – (ధరాధరాలు, లేదా – మహీధరాలు) ఈ పర్వతాల్లో అత్యున్నతమైనది, అతి మహిమాన్వితమైనది – హిమవత్పర్వతం. ఈ హిమవత్పర్వత రాజపుత్రిక కాబట్టి – అమ్మవారు 'ధరసుతా'.

'ధరా' అంటే భూమి, 'ధరసుతా' – అంటే భూమి నుండి పుట్టే సమస్త ఔషధాలు మొదలగునవి. వీటి స్వరూపురాలుగా ఉంటుంది కాబట్టి – అమ్మవారు 'ధరసుతా'.

1) హిమవత్పర్వత రాజపుత్రిక.

2) సమస్త ఓషధీ స్వరూపురాలు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 957. ధన్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధన్యాయై నమః' అని చెప్పాలి.

ధన్యా = ధన్యురాలు.

ధనం కలవారు ధన్యులు. అయితే – ధనం అంటే సంపద అని అర్థం. అంతేగాని నోట్లకట్టలు కాదు. (ధనమగ్నిః ధనం వాయుః ధనం సూర్యోధనం వసుః.... అని శ్రీ సూక్త ఫలశ్రుతిలో చెప్పబడుతుంది.) వసువుల వల్లనే – 'సూక్ష్మమైన ఆత్మతత్త్వం – స్థూలమైన పదార్థతత్త్వంగా' మారుతుంది. కాబట్టి, మనం భూమిద్వారా పొందే పదార్థమయమైన సంపదకు ఈ వసువులే కారణం. ఈ వసువులను తన ధనంగా గలది అమ్మవారు. ఆమె సంకల్పిస్తే చాలు లోకాలు ఉన్నాయి, లేకపోతే లేవు. మరి ఇలాటి అమ్మవారు 'ధన్యురాలు' కాక ఏమిటి ?

మనస్సు కూడా ధన్యం కాదు. ఎందుకంటే – అది అనుకున్న దల్లా చెయ్యనూ లేదు – అయే వాటిని ఆపనూ లేదు. కాని, అమ్మవారు ఉందంటే – ఏదైనా ఉంది, లేదంటే – లేదు. కాబట్టి – ప్రపంచంలో ఎవరైనా ఇలాంటి వారు ఉన్నారంటే అది ఒక్క అమ్మవారే !

1) ధన్యురాలు.

2) తిరుగులేని సంకల్పము గలది – అని ఈ నామానికి అర్థాలు.

## 958. ధర్మిణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధర్మిణ్యై నమః' అని చెప్పాలి.

ధర్మిణీ = ధర్మములు గలది.

ధర్మాలను గుణాలుగా తీసుకురాగలిగేది అమ్మవారే! అంటే – 'ప్రకృతిలో ఉండే ధర్మాలను సత్యాలను – గుణాలుగా కలిగిన ప్రాణికోటిగా తీసుకురాగలిగేది అమ్మవారే' అని అర్థం. ఇద్దరు వ్యక్తులు మాట్లాడు కుంటున్నపుడు – వాళ్ళ గుణాలే మాట్లాడుకుంటున్నట్లు లెక్క. అంతేగాని వాళ్ళ ఇంద్రియాలు – తదితర అవయవాలతో కూడినదేహాలు కాదు. ధర్మాలు సాధ్యస్థితి (Potential State)లో ఉంటాయి. ఇవి ఎముకల ప్రోగులాంటివి. గుణాలు సిద్ధస్థితి (Manifested state)లో ఉంటాయి. ఇవి రక్తమాంసాల్లాంటివి. ధర్మాలను తనయందు కలిగి, వ్యక్తుల ద్వారా గుణాలుగా వ్యక్తం చేయగలిగినది కాబట్టి – అమ్మవారు 'ధర్మిణీ'.

1) ధర్మము గలది.

2) ధర్మములు ఆచరింపచేయునది – అని ఈ నామానికి అర్థాలు.

## 959. ధర్మవర్ధినీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధర్మవర్ధిన్యై నమః' అని చెప్పాలి.

ధర్మ = ధర్మములను, వర్ధినీ = వర్ధిల్లచేయునది.

ఏ ప్రవర్తన మనకుఉంటే ఆ పరమధర్మము నందు మనం ఉంటామో ఆ ప్రవర్తనాత్మకమైన ధర్మాన్ని మనలో పెంపొందింప చేయునది కాబట్టి – అమ్మవారు 'ధర్మవర్ధినీ'.

చదరంగంలో ఒక ఎత్తు వేస్తున్నపుడు ఆ ఎత్తు మొత్తం ఆటనంతటనీ ఎలా

నిర్ణయిస్తుందో. అలాగే – సామూహికమైన మార్పు వ్యక్తిపరమైన మార్పులపై ఆధారపడి ఉంటుంది. ఇది కుటుంబ పరంగాను, సమాజ పరంగాను, దేశపరంగాను – చిట్టచివరకు విశ్వపరంగా కూడా విస్తరింపబడే సత్యం. అందుకని అమ్మవారు ఈ విషయంలో చాలా బాధ్యతపడి – తన సృష్టిలోని జీవులు వీలైనంతవరకూ ధర్మంప్రకారమే జీవనాన్ని గడిపేట్టుగా జాగ్రత్త పడుతుంది. ఒకవేళ వారు తప్పుడు త్రోవలు త్రొక్కితే తత్ఫలితంగా వచ్చే సన్నివేశాలు, సంఘటనల ద్వారా వారికి తెలియ చెప్పి – ధర్మోన్ముఖులుగా వారు మారేటట్లు తీర్చిదిద్దే శిక్షణనిస్తుంది. ప్రతివారు ఎదుటివారికి ప్రేమగొలిపే విధంగా మాట్లాడుతూ, వారికి హితమైనవి, శ్రేయోదాయకమైనవి చేస్తూ ఉంటే – ధర్మాచరణ జరిగినట్లే! ధర్మాన్ని వర్ధిల్ల చేసినట్లే! ఈ విధంగా మన ద్వారా ధర్మవర్తనం, ధర్మవర్ధనం జరిగేట్లు చేసేది కాబట్టి అమ్మవారు 'ధర్మవర్ధనీ'.

ధర్మములను వర్ధిల్ల చేయునది – అని ఈ నామానికి అర్థం.

## 960. లోకాతీతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లోకాతీతాయై నమః' అని చెప్పాలి.

లోక = లోకములకు, అతీత = అతీతముగా ఉండునది.

'లోకం' అంటే 'ప్రపంచం' అని అర్థం కాదు. ప్రజ్ఞా కక్ష్యలను (Planes of Conciousness)'లోకాలు' అంటారు.

ఒకే ఉపాధ్యాయుడు చెప్పే ఒకే పాఠం వింటున్న విద్యార్థులందరూ కూడా ఎవరి ఆలోచనలలో వారు, ఎవరి ఆటలలో వారు గోప్యంగా ఉంటున్నపుడు – వాళ్ళందరూ ఒకే తరగతిలో ఉండి కూడా ఎవరి లోకాల్లో వారు ఉంటున్నట్లే లెక్క. (కొందరు పాఠంలోకంలో, మరి కొందరు నిన్న చూసిన సినిమా లోకంలో, మరికొందరు చుక్కల దాడి ఆటలోకంలో – ఇలా ఎవరిలోకాల్లో వాళ్ళు ఉన్నట్లు లెక్క). అంటే దీన్ని బట్టి 'లోకం' అంటే భౌతికమమైన ఒక ప్రదేశానికి పరిమితమైనది కాదని – ఇది కేవలం ప్రజ్ఞకు సంబంధించిన కక్ష్య అని అర్థమౌతోంది కదా! ఇటువంటి లోకాలన్నిటికీ అమ్మవారు అతీతురాలు. అంటే – మన ప్రజ్ఞా కక్ష్యలకు కూడా అందని స్థితిలో ఉండేది అమ్మవారు.

'బ్రహ్మాండంలో భూర్భువస్సువర్లోకాది ఊర్ధ్వ లోకాలకు, అతల వితలాది అధోలోకాలకు గూడా అతీతంగా ఉండేది' అని కూడా ఈ నామం అర్థంచేసుకోవచ్చు. ఇక పిండాండంలో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివలోకాల పైన మణిద్వీపము నందలి సుధాసింధువులోని చింతామణి గృహంలో సదాశివుని పర్యంకంపై దేవి ఉంటుంది కాబట్టి – 'అటు – బ్రహ్మాండపరిధిలోని, ఇటు పిండాండ పరిధిలోని – లోకాలన్నిటికీ అతీతంగా ఉంటుంది అమ్మవారు' అని అర్థం.

1) 'విగ్రహ లక్షణాలంటని బంగారు విగ్రహాల్లో బంగారం లాగ అమ్మవారు అన్ని లోకాల్లోను ఉంటూ గూడా, అన్ని లోకాలకు అంటకుండా అతీతంగా ఉండేది' అని ఈ నామానికి అర్థం.

2) మన ప్రజ్ఞా కక్ష్యలకు అందని స్థితిలో ఉండునది.

3) బ్రహ్మాండ పరిధిలోను, పిండాండ పరిధిలోను – లోకాలన్నిటికీ అతీతంగా ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 961. గుణాతీతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుణాతీతాయై నమః' అని చెప్పాలి.

గుణ = త్రిగుణములకు, అతీత = అతీతముగా ఉండునది.

'జగత్తంతా త్రిగుణ సమ్మిశ్రమే ! కాబట్టి అటువంటి జగత్తును సృష్టించిన అమ్మవారు కూడా త్రిగుణాలకు కట్టుబడి ఉండాలి కదా ! ఆ త్రిగుణాలు అంటకుండా అతీతంగా ఎలా ఉంటుంది ? – అని అనిపించవచ్చు. సినిమా అంతటినీ మనం చూసేది ఎదురుగా ఉన్న తెరమీదనే ! ఆ సినిమాలోని భక్తి గీతాలు, శృంగార సన్నివేశాలు, హత్యలు, దోపిడీలు, సన్మానాలు, సత్కారాలు, సంతాపాలు అన్నీ మనం తెరమీదనే చూస్తాము. వీటన్నిటి ప్రభావం వాటిని చూచే మనమీద ఉంటుందేమో కాని తెరకు ఇవేమీ ఉండదు. వీటన్నిటినీ తెరే మనకు చూపించినా – అవేమీ అంటకుండా – ఆ తెరవీటికి అతీతంగానే

ఉంటుంది. అలాగే త్రిగుణ సమ్మిశ్రమైన ఈ సృష్టిని తానే సృష్టించినా ఈ త్రిగుణాలకు అతీతంగానే అమ్మవారు ఉంటుంది.

త్రిగుణములకు అతీతముగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 962. సర్వాతీతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వాతీతాయైనమః' అని చెప్పాలి.

సర్వ = సర్వమునకు, అతీతా = అతీతముగా ఉండునది అమ్మవారు.

లోకాతీతా – గుణాతీతా – అంటూ ఇలా ఒక్కొక్కదాని పరంగా 'అతీతంగా ఉండునది' – అతీతంగా ఉండునది' అని ఎన్నెన్ని విషయాల పరంగా చెప్పుకుంటూ వెళ్ళడం? అని – చివరకు ఒకే నామంలో అన్నిటినీ ఇమిడ్చే విధంగా 'సర్వాతీతా' అన్నారు వ్యాసులవారు (ఆయనకు మాత్రం అలా చెప్పుకుంటూ పోతే చదువుకునే వాళ్ళకు విసుగొస్తుందని తెలీదా ఏమిటి ?)

'మంచుగడ్డన్నా, నీళ్లన్నా, నీటియావిరి అన్నా తేడా లేదు' – అని అంటున్నపుడు మంచుగడ్డ అని, నీళ్ళు అని, నీటి ఆవిరి అనీ వేరే వేరే చెప్పడం దేనికి ? 'జగత్తు ఏం లేదండీ, నిజంగా చెప్పాలంటే అంతా పరబ్రహ్మే' అంటూ ఉంటారు. మరి అంతా పరబ్రహ్మే అయినపుడు ఈ 'అంతా' ఆ 'పరబ్రహ్మ' లను వేరు వేరుగా చెపుతున్నాం. అంటే – రెండూ వేరుగా ఉంటాయనే ఇలా చెపుతున్నామా ? రెండూ ఒకటేనా ? ఈ జబ్బు చివరి దాకా తెగదు, పోదు. మనం మనంగా మాత్రమే ఉన్నంత వరకూ ఈ రెండూ వేరుగానే అనిపిస్తాయి. కాని, మనం అమ్మవారిలో లీనమై పోతే ఈ వేరింటి కాపరాలు ఉండవు. సర్వము నందు మనం ఒక భాగమై, ఆ సర్వానికి అతీతంగా ఉంటాము. ఇంతకు ముందు నామంలో చెప్పిన సినిమా తెర – మనం చూసే సినిమాలోని ప్రతిసన్నివేశ చిత్రంలోనూ ఒక భాగమే అయినా – ఏ భాగము తనకు అంటదు. ఈ స్థితినే సర్వాతీత స్థితి అంటారు. అమ్మవారు అలాటిదని ఈ నామార్థంగా గ్రహించాలి.

'సర్వమునకు అతీతముగా ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 963. శమాత్మికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శమాత్మికాయై నమః' అని చెప్పాలి.

శమ = శమమును, ఆత్మికా = స్వరూపము గా గలది.

ఇంద్రియ నిగ్రహాన్ని 'శమం' అంటారు. ఇది ఉన్నవారికే 'శాంతి' ఉంటుంధి. యోగంలో సమాధి స్థితి రావాలంటే మొదటి మెట్టుగా ఇంద్రియాలు, మనస్సు మన యందు లీనమవడం జరగాలి. అటుపైన రెండవ మెట్టుగా ఆ ఇంద్రియాలు, మనస్సు మన యందు వర్తించాలి. అంటే – మనం చెప్పినట్టు వినాలి. ఇలా జరగడానికి చాలా అభ్యాసం అవసరం ఔతుంది. ఈ అభ్యాసం మీద శమించడం ఆధారపడి ఉంటుంది. మంచి చెడులను కూడా ఈ అభ్యాసం వల్లనే మనలో ఏర్పరచుకుంటాము.

సృష్టిలో కూడా 'ఇలా జరుగును' అని ఉంటుంది – అలా జరుగుతుంది. (Thus it was written - so it was ful filled). 'ఇలా జరుగును' లోని 'జరుగును' అన్న దానిలోనికి – ' ఇలా జరిగితే బాగుండును' అన్నది లీనమవ్వాలి. అపుడు మన ద్వారా అమ్మవారి సంకల్పం పనిచేసి మంచి పనులు జరగడం ప్రారంభమౌతాయి. ఇలా జరగడం కూడా అభ్యాసం వల్లనే సాధ్యం.

ఈ విధంగా అభ్యాసం వల్ల శమించడం జరిగితే 'శమాత్మిక' సిద్ధిస్తుంది. ఆత్మవంతునకు మనస్సు ఆత్మలాగా పనిచేస్తుంది (కాని, మనస్సు ఆత్మ కాదు). మనకు కావలసింది ఏదో ఉన్నట్లు అనిపించడమే నరకం. ఇది మనసుకు సంబంధించిన జాడ్యం. మనస్సు మనంగా మారినపుడు 'నిగ్రహం' సిద్ధిస్తుందే కాని, మనస్సు – మనం వేరు వేరుగా ఉన్నంతవరకు 'నిగ్రహం' సిద్ధించదు. ఈ నిగ్రహాన్ని కలిగించే వాడే 'శం' కరుడు. ఇది కలిగినపుడు ఉండే స్థితిని 'శివము' అంటారు. శరీరానికి కావలసినవి ఉండవచ్చు. అవి ఎలాగూ అవసరాన్ని బట్టి ఆయాసమయాల్లో ఏర్పాటౌతాయి. అయితే 'మనకు' కావలసినవి అంటూ ఉండని స్థితి మనకు రావాలి.

ఈ స్థితి 'ప్రయాణకాలం' లో గా మనకు వస్తే మనం అదృష్టవంతులమే ! ఈ

స్థితి సంన్యాసం పుచ్చుకుంటే వచ్చే స్థితి కాదు. సంన్యాసం పుచ్చుకోకపోయినా సాధనలో రావచ్చు. అంటే సంన్యాసం పుచ్చుకోడానికి – ముక్త సంగస్థితికి సంబంధం లేదన్నమాట! న్యాయానికి ఈ స్థితికి వచ్చినవాడు సన్యసిస్తే బావుంటుంది. లేకపోతే ఎబ్బెట్టుగా ఉంటుంది.

(గీతలో ప్రతిపాదించిన 'ప్రయాణకాలం' 'అంత్యకాలం' – వీటిని 'పోయేకాలం' అని అర్థం చెప్పుకుంటే 'యోగమంతా మరణానికి ప్రయత్నం'(Preparation for Death) అనే అనర్థానికి దారితీస్తుంది. తస్మాత్ జాగ్రత!)

మనలో ఎక్కడెక్కడ పట్లు ఉంటాయో అక్కడక్కడ తెగాలి. ఆ తెగడం జరిగేట్టు చూసేవాణ్ణి 'దైవ్యోభిషక్' అన్నారు నమకంలో, ఈయనే 'శంకరుడు' అంటే 'శం'ను కలిగించేవాడు.

'ఇవ్వడం' గాని 'పుచ్చుకోడం' గాని అనేవి ఉంటే – కోరుకోవలసింది ఒక్కటే – అదే 'శం'. ఇదొక్కటే కోరతగింది. దీంతో కోరికలు కోరడం ఇక ఉండదు. అంటే – కోరికలు కోరకుండా ఉండే గుణాన్ని ఈ 'శం' ప్రసాదిస్తుంది. – గీతాంజలిలో రవీంద్రుడు ' ఈ ప్రార్థన చేస్తున్నాము' అనే బంగారు సంకెళ్ళు మాకు లేకుండా చూడు ప్రభూ ! అని ప్రార్థిస్తాడు. ఈ ప్రార్థన భావమే ఈ 'శమాత్మికా' నామం యొక్క అర్థం. ఒక్క ముక్కలో చెప్పాలంటే – 'ఓం' తరువాత విలువైన ఏకాక్షర మంత్రం 'శం'.

శమమును ఆత్మ స్వరూపంగా కలిగినది – అని ఈ నామానికి అర్థం.

## 964. బంధూక కుసుమప్రఖ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బంధూకకుసుమప్రఖ్యాయై నమః' అని చెప్పాలి.

బంధూక కుసుమ = బంధూక పుష్పకాంతితో, ప్రఖ్యా = ప్రకాశించునది.

మందార పువ్వులాగానే ఎఱ్ఱగా ఉండే మంకెన పువ్వుకు 'బంధూక కుసుమం' అనే నామాంతరము గూడా ఉంది. సాధారణంగా ఈ పువ్వులు మన ఆంధ్ర ప్రాంతంలో

కంటే వంగదేశంలో విశేషంగా లభిస్తాయి. దీని పుష్పాలే కాదు, దీని వృక్షపు చెక్కలు కూడా బాగా ఎఱ్ఱగా ఉంటాయి. అమ్మవారు బయటకు తనకు తాను వెడలుతున్నపుడు ఈ మంకెన పుష్పంలాగా విచ్చుకుంటుంది. ('ప్రఖ్యా' అంటే 'ఉచ్చరించబడుట' అని గూడా అర్థం ఉంది. విచ్చుకోటం, సృజించటం కూడా ఉచ్చరింపబడటం లాంటివే కాబట్టి – 'కుసుమప్రఖ్యా' అని వాడబడింది).

మంకెన పుష్పపు కాంతితో ప్రకాశించునది – అని ఈ నామానికి అర్థం.

## 965. బాలా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బాలాయై నమః' అని చెప్పాలి.

బాలా = బాలారూపంలో ఉండునది.

బాలల రూపంలో అమ్మవారు ఉంటుందనే విషయాన్ని ఈ నామాన్ని బట్టి గ్రహించాలి. రెండు సంవత్సరాల నుండి పది సంవత్సరాల దాకా ఉండే బాలికలను 'బాలలు' అంటారు. వీరిలో తొమ్మిది సంవత్సరాల వయస్సు గల వారిని ప్రత్యేకంగా 'దుర్గా' అనే పేరుతో కూడా పిలుస్తారు. (నవవర్షాత్ భవేద్బాలా) ఈ నామం బాలకృష్ణునికి సంబందించినదిగా కూడా చెప్పుకోవచ్చు. ('లీలా వినోదినీ' అనే నామం దీని తర్వాత రాబోతోంది).

శబ్ద బ్రహ్మసృష్టి ఆవిర్భావానికి ముందుగా, అంటే – ప్రథమావతారంగా వ్యక్తమైన అమ్మవారే 'బాలా త్రిపురసుందరి'.

ఆకాశము, చోటు, కదలిక, కదలించునది – ఈ నాలుగు లీనమైన స్థితిని 'బాలా' అనే పేరుతో వ్యవహరిస్తారు. ఈ బాలా సూచితమైన దాన్ని ఆంగ్లంలో 'Intelligent Electricity' అని అనువాదం చేసుకున్నారు కొందరు. దీని యొక్క వివిధ రూపాలే 'ప్రాణం', 'విద్యుత్', 'అర్థమవడం', 'తెలివి' – మొదలైనవిగా చెబుతారు.

తొమ్మిది సంవత్సరముల వయస్సు కల బాలాదేవి మంత్రానికి కూడా 9 బీజాక్షరాలుంటాయి. ఆ తొమ్మిది బీజాక్షరాలను ఈ క్రింద తెలిపిన విధంగా యంత్ర

నిబద్ధం చేసి పూజిస్తే సరస్వతీ అనుగ్రహ ప్రాప్తి, సర్వ కళాభినివేశం, మంగళప్రదమైన మోక్షప్రాప్తి కూడా కలుగుతాయి.

మంత్రము - ఐం క్లీం సౌః
సౌః క్లీం ఐం
ఐం క్లీం సౌః

పై బీజాక్షరాలు చెప్పి - 'శ్రీ బాలా త్రిపుర సుందర్యై నమః' అని జపించాలి. (ప్రథమభాగంలోని 74వ నామ వివరణ కూడా ఇక్కడ చదువుకుంటే మరిన్ని విశేషాలు తెలుస్తాయి).

1) బాలల రూపంలోనుండునది.

2) బాల కృష్ణుని రూపంలో ఉండునది.

3) బాలాత్రిపురసుందరీ స్వరూపిణీ. - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 966. లీలావినోదినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లీలావినోదిన్యై నమః' అని చెప్పాలి.

లీల = లీలలయందు, వినోదినీ = వినోదించునది.

జగత్తులో జరిగేవన్నీ మనకు ఎలా అనిపించినా - అమ్మవారికి మాత్రం అవన్నీ లీలాప్రాయమే! క్రీడాప్రాయమే.

పిల్లలు ఆడుకునేటపుడు క్రింద పడుతూ ఉంటారు, దెబ్బలు తింటూ ఉంటారు. అయినా మళ్ళీ లేస్తూ ఉంటారు. కొట్టుకుంటారు. కలసిపోతూ ఉంటారు. ఈ పనులు వాళ్ళకు ఆటలే, లేదా - క్రీడలే గాని బాధ్యతలూ, బంధాలూ కాదు. బాలకృష్ణుడు కూడా ఎన్నో ఆటలు ఆడుకుంటూనే ఎన్నో పనులు చేసాడు అవన్నీ బాధ్యతలు కాదు 'లీలలు' అని చెప్పుకుంటాం. అలాగే - ప్రపంచంలో జరిగే పనులన్నీ అమ్మవారికి అలాంటి లీలలుగానే ఉంటాయి. అవి ఎలా జరిగినా వాటిని చూస్తూ ఆనందిస్తుంది.

ఒక్కొక్కప్పుడు మనం ఆశించింది జరగకపోతే మనకు ఖేదం కలుగుతుంది. అదే ఇంకొకరికి వారు ఆశించింది జరిగితే వారికి 'మోదం' కలగుతుంది. కాని, పై నుండి రెంటినీ చూసే అమ్మవారికి వినోదంగానే వుంటుందని ఒక సినీ కవి – 'ఒకరికి ఖేదం, ఒకరికి మోదం సకలము తెలిసిన నీకు వినోదం' – అన్నాడు. ( అంతిమంగా ఏం జరుగుతుందో మనకు తెలియదు(We don't know the ultimate fitness of things). మనం ఆశించింది జరిగితే ముందు ముందు ఇబ్బందుల్లో ఇరుక్కోవలసి వస్తుందని మనకు తెలియదు, ఆవిడకు తెలుసు. అందుకని మనకు జరక్కుండా ఉండటమే మంచిదని మనఖేదాన్ని చూసి – వినోదించింది. ఇంకొకరికి అది జరగడం మంచికే దారితీస్తుందని ఆవిడకు తెలుసు. అందుకని వారి మోదాన్ని చూసి గూడా వినోదించింది.)

సృష్టి, స్థితి, లయం, తిరోధాన, అనుగ్రహాలు అనే పంచకృత్యాలను నిర్వర్తిస్తున్నపుడు వాటిని లీలలుగానే వినోదిస్తుంది కాబట్టి, అమ్మవారు – 'లీలావినోదినీ'. పసిపిల్లవాడు పక్కలో పడుకుని కాళ్లు చేతులూ ఆడిస్తూ, కేరింతలు కొడుతూ ఆడుకుంటాడు. ఇలా ఒక ఆట ఆడుకోవాలని ఉద్దేశ్యం (Motive) గూడా ఉండదు. అలాగే ఉద్దేశ్యరహితంగా అవలీలా ప్రాయంగా జరిగే అమ్మవారి కదలికల వల్లే ఈ సమస్త సృష్టి ప్రక్రియ క్రీడా ప్రాయంగా జరిగిపోతుంది. ఇలాగే జీవితం లీలా వినోదంగా ఉండే వాళ్లలో బాలాదేవి పనిచేస్తుంది. మన నవ్వులో Intention ఉంటుంది. పిల్లవాని నవ్వులో లోపలి ఆనందానికి Intention ఉంటుంది. లోపలి ఆనందానికి నవ్వు Extension గా ఉండేవాళ్ళు దేనికీ నిస్పృహ చెందరు. దేనికీ బాధపడరు. పరిపూర్ణ ప్రాణశక్తి ప్రసారానికి తగిన అర్హత పొందిన వాహికలౌతారు. సాధారణంగా లౌక్యుల నవ్వు – లోపలి 'అవసరానికి' extension గా ఉంటుంది.

మనస్సు దుఃఖాక్రాంతమై ఉంటే – బాలకృష్ణుని లీలలు చదువుకున్నా, వింటున్నా ఆ దుఃఖం పోతుంది. దీన్ని విక్రియా ప్రతియోగం అంటారు. వికార పెడుతుంటే వక్క వేసుకున్నట్లన్న మాట!

1) లీల యందు వినోదించునది.

2) అన్ని కృత్యములను లీలాప్రాయంగా చేయుచు వినోదించునది – అని ఈ నామానికి అర్థం.

# 967. సుమంగళీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుమంగళ్యైనమః' అని చెప్పాలి.

సుమంగళీ = సౌభాగ్యవతి, లేదా – ముత్తైదువ, లేదా – పుణ్యస్త్రీ.

'సుమంగళీ' అనే పదం కేవలం భారతదేశ హైందవ జాతికి సంబంధించినది. (ఇంగ్లండు, స్విట్జర్లాండ్ లాంటి తెల్లజాతికి ఈ మాటను గురించి అవగాహన కలగడం కష్టం. మెక్సికో, ఆఫ్రికాలలోని కొన్ని నల్లజాతులలో కొంతవరకు దీనికి సంబంధించిన సంప్రదాయం, సంస్కృతి ఉన్నాయి.)

వివాహం అయి, భర్త బ్రతికి ఉన్న స్త్రీకి ఒక ప్రత్యేకమైన గుర్తింపు ఉంది మన భారతదేశంలో. అలా గుర్తింపబడటానికి గాను కొన్ని మంగళకరమైన చిహ్నాలు కూడా ఏర్పాటు చేశారు. వానిలో ప్రధానంగా ఐదు ఉన్నాయి. అవి 1) మంగళసూత్రం 2) పసుపు 3) కుంకుమ 4) గాజులు 5) కమ్మలు (చెవులకు పెట్టుకునే దుద్దులు మొదలైనవి) ఈ మంగళ చిహ్నాలున్న స్త్రీని 'సుమంగళీ' లేదా 'సువాసినీ' లేదా 'పుణ్యస్త్రీ' లేదా తెలుగులో 'ముత్తైదువ' అని పిలుస్తారు. ఈ మంగళకర చిహ్నాలను ధరించే అర్హత, అవకాశాలను కలిగి ఉండటం స్త్రీలకు అత్యధికమైన భాగ్యంగా పరిగణిస్తారు. అందుకే ఇవి స్త్రీల 'సౌభాగ్యం' అనీ, ఇవి ఉన్న స్త్రీలను 'సౌభాగ్యవతు' లనీ అంటారు. ఇటువంటి సౌభాగ్యవతులైన సుమంగళులందరి రూపంలోను ఉండేది – ఈ లక్షణాలను సంపూర్ణంగా ఉన్న అమ్మవారే!

విషం తిన్నా మృత్యువు లేని మృత్యుంజయుడైన శివుని ఇల్లాలు కాబట్టి – అమ్మవారు 'నిత్యసుమంగళి'. ఈ నిత్య సుమంగళిని స్మరిస్తే చాలు సర్వ దౌర్భాగ్యాలు నశిస్తాయి. మనం ఎప్పుడూ చెడ్డ పనులు చెయ్యకుండా మంచి పనులే మన చేత చెయ్యబడాలంటే ఈ 'నిత్యసుమంగళీ' దేవతను పూజించాలి. వివాహానికి ముందు ఈ 'సుమంగళీ' దేవతను కుంకుమతో పూజించే స్త్రీలకు సౌభాగ్యం వర్ధిల్లుతుంది.

1) సౌభాగ్యవతులైన స్త్రీల రూపంలో ఉండునది.

2) శ్రీ విద్యా మంత్ర దీక్షాపరుల రూపంలో ఉండునది.

3) విషం తిన్న భర్తకు కూడా మృత్యువు రాకుండా చేయగలిగిన నిత్య సౌభాగ్యవతి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 968. సుఖకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటపుడు 'సుఖకర్యై నమః' అని చెప్పాలి.

సుఖ = సుఖములను, కరీ = కలిగించునది.

దేన్ని పొందాలని మనం ఆస్తిపాస్తులను నోట్ల కట్టలను సంపాదించి పెంచుకోడానికి ప్రయత్నిస్తామో అటువంటి సుఖశాంతులను కలుగచేస్తుంది అమ్మవారు.

ఏ సుఖం పొందితే మిగిలిన సుఖాలమీద ధ్యాస కలగదో అటువంటి శాశ్వతమైన ముక్తిని కలుగ చేస్తుంది అమ్మవారు.

అసలైన సుఖశాంతులను అమూల్యమైన ముక్తిని కలుగచేయునది - అని ఈ నామానికి అర్థం.

## 969. సువేషాఢ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సువేషాఢ్యాయైనమః' అని చెప్పాలి.

సువేష= మంచి వస్త్రాభరణాది వేషధారణ కలిగిన, ఆఢ్యా = శ్రేష్ఠురాలు.

ధరించిన వస్త్రాలతోను, ఆభరణాలతోను, పుష్పమాలాది ప్రకృతి సిద్ధమైన అలంకారాదులతోను, గంధాది లేపనాలతోను, పరమ పావనమైన పాద పారాణితోను, మాంగళ్య చిహ్నాలతోను ఉండే అమ్మవారి వేషం, అమ్మవారి రూపం - పరమరమణీయంగా, నేత్రపర్వంగా, మనోజ్ఞంగా, మనోహరంగా, మహారీవిగా, మహోజ్జ్వలంగా ఉంటుంది కాబట్టి, అమ్మవారు 'సువేషాఢ్యా' అన్నారు వ్యాసులవారు. సౌమంగల్యం ఉన్నచోట ఇలా ఉండే అవకాశం ఉంటుంది.

చక్కని వస్త్రాభరణాది వేషధారణ కలిగిన శ్రేష్ఠురాలు - అని ఈనామానికి అర్థం.

# 970. సువాసినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సువాసిన్యై నమః' అని చెప్పాలి.

సువాసినీ = నిత్య సుమంగళి.

'చక్కని జీవితము', 'చక్కని వస్త్రము', 'చక్కని నివాసము' – ఈ మూడింటిని కలిగి ఉండే అవకాశం ఎంతో అదృష్టం ఉంటేగాని రాదు. సాధారణముగా ఈ మూడూ కలిగే అదృష్టం కేవలం భర్త ఉన్నప్పుడే స్త్రీలకు వస్తుంది. అందుకని భర్త ఉన్న స్త్రీలను 'సువాసినులు' అంటారు.

'పైన తెలిపిన – జీవితము – నివాసము – వస్త్రము –ఈ మూడూ డబ్బుంటే రావాయేమిటి ఆ మాత్రం' – అని అనిపించవచ్చు. అయితే పైన సూచించిన 'చక్కటి' అన్న విశేషణం 'గొప్ప' అనే అర్థంలో మాత్రం వాడబడలేదని మాత్రం ముందు తెలుసుకోవాలి. ఈ 'చక్కటి' విశేషణం యొక్క అర్థం – అన్యోన్యంగా ఉండే దంపతి (భార్యాభర్తలు)ని అడిగితే మాత్రమే తెలుస్తుంది కాని, నిఘంటువులు వెదికితే దొరికేది కాదు.

భర్త ఉన్నప్పటి కంటే భర్త లేనప్పుడే ఈ మూడూ బాగా ఏర్పాటయే వాళ్ళు కూడా ఉండవచ్చు. అలాంటివాళ్ళని అడిగినపుడు వాళ్ళు మనస్ఫూర్తిగా చెప్పే సమాధానాన్ని బట్టి వాళ్ళు పొందుతున్నవి ఎంత 'చక్కగా' (ఇంతకు పూర్వం చెప్పిన అర్థంలో) అవి వాళ్ళకు ఉన్నాయనిపిస్తున్నాయో తెలుస్తుంది.

ఈ మూడింటి ప్రాముఖ్యము, ఈ మూడింటి వలన పొందబడే ఆనందము – అమ్మవారికి తెలిసినంతగా ఇతరులకు తెలియదని – నమ్మకంగా చెప్పుకోవచ్చును. ఎందుకంటే అమ్మవారు, అయ్యవారు కలిసి ఒకే వ్యక్తి (అర్ధనారీశ్వరులు) కదా! ఇంక జీవితము, వస్త్రము, నివాసము ఈ మూడూ ఇద్దరికీ వేరు వేరుగా ఉండవు. ఇలా ఉన్న వాళ్ళు ఈ విశ్వంలో ఇంతవరకు ఎవరున్నారని ? అమ్మవారికి ఈ 'సువాసినీ' నామం యొక్క అర్థం అందరికన్నా ఎక్కువ చెల్లుతుంది అనడంలోని ఔచిత్యం ఇదే !

అమ్మవారి అయ్యవారి దాంపత్యాన్ని దృష్టిలో పెట్టుకునే వివాహ శుభకార్యంలో పెళ్ళి కాబోయే వధూవరులిద్దరికీ – ఒకే ఆసనం, (ఇద్దరూ కూర్చోడానికి వేరు వేరు పీటలు వెయ్యరు. పొడవైన ఒకే పీట వేస్తారు. దాన్నే 'పెళ్ళి పీట' అంటారు). ఒకే భోజన పాత్ర (ఇది వరకు రోజుల్లో ఒకే కంచం పెట్టేవాళ్ళు ప్రస్తుతం ఒకే విస్తరాకులో రెండు కంచాలు పెడుతున్నారు). 'మరి ఒకే వస్త్రం కట్టడం లేదు కదా' ? అని సందేహం రావచ్చు). ఇలా సందేహం రాకుండా ఉండేందుకే ఇద్దరూ కట్టుకున్న వస్త్రాల కొంగులను ఒకే వస్త్రం అనిపించడం కోసం ముడి (కొంగుముడి) వేస్తారు. ఇక 'శయ్య' విషయం వేరే చెప్పక్కరలేదు కదా !

ఈ విషయాలన్నిటినీ కలిపి నూతన వధూవరుల విషయంలో 'ఏకశయ్యాసనం వస్త్రమ్, ఏకపాత్రే చ భోజనమ్' అన్నారు.

నిత్య సుమంగళీ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 971. సువాసిన్యర్చన ప్రీతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సువాసిన్యర్చనప్రీతాయై నమః' అని చెప్పాలి.

సువాసినీ = సువాసినుల, అర్చన = పూజయందు, ప్రీతా – ప్రీతికలిగినది.

ఈ నామానికి రెండు విధాలుగా అర్థాలు చెప్పుకోవచ్చును. 1) 'సువాసిన్యర్చన' అంటే – సువాసినీ స్త్రీలకు జరిగే పూజ అనే భావంలో – సువాసినుల పట్ల గౌరవంగా, మర్యాదగా ప్రవర్తించడం, వారిని పవిత్ర వ్యక్తులుగా భావించడమూ అంటే అమ్మవారికి ఇష్టము – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి.

2) 'సువాసినీ స్త్రీలచే తాను అర్చింపబడటం అంటే అమ్మవారికి ప్రీతికరము'– అనే విధంగా ఇంకో అర్థము చెప్పవచ్చును. భక్తి శ్రద్ధలతో ఎవరు అర్చించినా అమ్మవారికి ఇష్టమే ! కాని సువాసినులు అర్చిస్తే మరింత ఇష్టం. ఎందుకంటే – 'తనలాంటివారి చేత తాను అర్చింపబడటం' – అనే అవకాశం సువాసినులు అర్చిస్తేనే వస్తుంది అమ్మవారికి. నిత్యము, మంగళకరమైన చిహ్నాలతోను, వస్త్రాభరణాదులతోను ఉండేది సువాసినులే

గాని ఇతరులు కాదు కాబట్టి – అమ్మవారు వీరి చేత పూజ చేయించుకోడంలో ఎక్కువ ఆనందాన్ని సంతృప్తిని పొందుతుంది.

భర్త అవసరాలేమిటో నిత్యమూ తెలిసినవారే 'సువాసినులు'. అలా తెలియని ముత్తైదువులు పెళ్ళయిన వారి క్రిందకు మాత్రమే వస్తారు.

పెళ్ళికాని కన్యలు ఈ నామాన్ని 'సువాసిన్యర్చిన ప్రీతాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే – అచిరకాలంలోనే వారికి వివాహమౌతుంది. ఈ నామం జపిస్తే ఇలా వివాహం త్వరగా అవుతుంది అనడంలో కొంత తర్కవిశ్లేషణ(Logical Analysis) ఉంది.

'సువాసినులు' తనను అర్చిస్తే అమ్మవారు చాలా ప్రీతి చెంది, ఆనందిస్తుంది' – అని గదా ఈ నామంలో చెప్పబడింది. కన్యలు అమ్మవారిని ఈ నామంతో జపించి ప్రార్థించినపుడు – 'అమ్మా! ఇప్పటివరకు ఎంతో మంది సువాసినులచేత అర్చింపబడుతూ ఆనందాన్ని పొందుతున్నావు. ఇప్పటివరకు నిన్ను అర్చించే సువాసినులతో నేను కూడా కలపబడి, నిన్ను అర్చించే సువాసినుల సంఖ్య పెరిగి, నీకు మరింత ఆనందం చేకూర్చే అవకాశం రావాలంటే – నన్ను గూడా వెంటనే సువాసినిగా చేసి, మరింత ఆనందాన్ని పొందు'– అనే అభ్యర్థన ఉంది. ఈ అభ్యర్థనలో అర్థించేవారి ఆర్తి కన్న అమ్మవారి బాధ్యతనీ, ఆవిడ మరింత ఆనందం పొందే అవకాశాన్నీ గుర్తు చేసే సూచన ఎక్కువ ఉంది. ఇది ఒక విధంగా నిర్బంధ పెట్టి అమ్మవారి అనుగ్రహాన్ని పొందే మార్గమే! అయినా – తన పెళ్ళి సంగతి చూడు' అని తల్లికి పిల్ల పరోక్షంగా సూచించడం ఈ నామంలో ఉందని చెప్పుకున్నామే గాని, పిల్ల గొంతెమ్మ కోరిక కోరిందని చెప్పుకోలేదు కాబట్టి, అమ్మవారు – ఈ అభ్యర్థనలో లౌక్యం ఉందని తెలిసినా పట్టించుకోదు. పైగా – పిల్ల తెలివితేటలకు సంతోషిస్తుందేమో గూడా!

1) సువాసినులు పూజింపబడుట ఇష్టపడునది.

2) సువాసినులచే అర్చింపబడుట ఇష్టపడునది.

3) చక్కని జీవితము కలవారు ఆ జీవితమే అమ్మవారుగా తెలుసుకుంటే ప్రీతి చెందునది.

4) భార్యా భర్తలిరువురూ ఒకరి కొకరు అన్యోన్యంగా ఉంటే – అట్టి వారి చేత పూజ చేయించుకొనుటకు ప్రీతి చెందునది – అని ఈ నామాలకు అర్థాలు చెప్పవచ్చును.

## 972. ఆశోభనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆ శోభనాయై నమః' అని చెప్పాలి.

ఆ శోభనా = పవిత్రతతో కూడిన లోకాతీతమైన సౌందర్యము కలది.

''(ఇంతకు ముందు నామం అయిన 'సువాసిన్యర్చన ప్రీతా' నామంలో చివర ఉన్న 'తా' ప్రస్తుత 'ఆశోభనా' నామంలో మొదటి ఉన్న 'ఆ' ఈ రెండు అక్షరాలు సవర్ణదీర్ఘ సంధి వలన 'సువాసిన్యర్చన ప్రీతా శోభనా' అని ఔతాయి. అప్పుడు మనకు ఈ రెండు నామాలు 1) 'సువాసిన్యర్చన ప్రీతా' 2) 'శోభనా' అనే విధంగా రెండు నామాలుగా అనిపిస్తాయి. ఇలా చెప్పుకున్నా తప్పులేదు. కాని, 'శోభనా' అనే నామం '462' వ నామంగా ఇంతకు పూర్వమే వచ్చింది. ఆ – 'శోభనా' నామానికి వివరణ ద్వితీయ భాగంలో ఇవ్వబడింది.)

ఇలా రెండు విధాలుగా ఈ నామాలు చెప్పుకున్నా – ఆ రెండు నామాల అర్థాలు దాదాపు ఒకటే అయినా – 'ఆశోభనా' అని ప్రస్తుతం చెప్పుకుంటే నామం పునరుక్తం (అంటే మళ్ళీ చెప్పబడటం) జరిగినట్లు అవదు. ఇలా ఈ నామం 'ఆశోభనా' గా చదువుకోవాలనే సూచనను తెల్పడానికి స్తోత్రంలో– 'సువాసిన్యర్చన ప్రీతా2__2శోభనాసులభాగతిః' అని సాధారణంగా వ్రాస్తారు.. ఇలా వ్రాసినపుడు ఈ రెండు నామాల మధ్య ఉన్న రెండు అవగ్రహాల గుర్తులు ఆ రెండు నామాల మధ్య 'ఆ' అనే అక్షరం వస్తుందని, రెండవ నామాన్ని ఆ 'ఆ' అక్షరంతో కలిపి 'ఆశోభనా' నామంగా చదువుకోవాలని సూచిస్తుంది. ఒకే గుర్తు పెడితే రెండవ నామం – 'అశోభనా' అయి 'శోభనా' అనే నామానికి పూర్తిగా వ్యతిరేకార్థం వచ్చి, అమ్మవారు 'కురూపి' 'అపవిత్రురాలు' అనే అర్థాలు చెప్పినట్లు ఔతుంది. తస్మాత్ జాగ్రత!).

'శుభ' శబ్దం నుండి 'శోభ' శబ్దం ఉత్పన్నమౌతుంది. ఈ రెండూ వరుసగా 'శుభత్వం' 'శోభనత్వం' ను తెలియచేస్తాయి. అందంగా ఉండడం, పవిత్రంగా ఉండే

సందర్భంలో వాడితే – 'ఆ' అందం అనే విశేషణం 'శోభ' లేదా 'శోభన' ఔతుంది. అంటే, తేలిగ్గా అర్థమయ్యేలాగా చెప్పుకోవాలంటే – 'అందము + పవిత్రము + స్వచ్ఛత = శోభనత్వము'. (అందానికి చైతన్యం తోడైతే' లావణ్యమౌతుందని ఇది వరకు 'మహాలావణ్య శేవధిః' అనే నామంలో వివరించుకున్నాము). అందం ఒకటే ఉండి పవిత్రత లేకపోతే వేశ్యలాగా వెకిలి వేషాలు వెయ్యడానికి ఆ అందం దారి తీయవచ్చు. అంటే - వేశ్యలాంటి అందం కాదు అనే అర్థం 'శోభనా' అనే పదం యొక్క అర్థంలో ఉంది.

మనలో ఉన్న అవలక్షణలాన్నీ పోయినపుడు – మనకు జరిగే అన్నిటినీ అమ్మవారు మనకు శోభిల్లే విధంగానే ఉండేట్లు చేస్తుంది. అంటే – మనకు అన్నీ గిట్లేట్లు గాను, నప్పేట్లు గాను, నచ్చేట్లుగాను చేస్తుందన్న మాట! అవతల వాటికి మనకు – ఉన్న సంబంధాన్ని బట్టీ, దృక్పథాన్ని బట్టి అవి మనకు శుభాశుభాలుగా భాసిస్తాయి. అంతే! మనం అనవసరంగా పెట్టుకున్న 'అశుభం' లో 'అ' తొలగిగితే మిగిలినదంతా 'శుభమే!'

'శోభనా' అన్నది పవిత్రతో కూడిన విశేషణం అయితే – 'ఆశోభనా'! అనే మాటను 'సకలలోకాతీతమైన పవిత్రమైన సౌందర్యం.' అనే విశేషాణార్థంగా చెప్పుకోవాలి. అంతే తేడా! అమ్మవారి రూపం – సౌందర్య వంతంగాను, భావాలు – స్వచ్ఛంగాను, సాన్నిధ్యం – పవిత్రంగాను ఉంటాయి. అందుకే, అమ్మవారు నిత్యం శోభాయమానంగానే ఉంటుంది.

1) పరమ పవిత్రమైన, స్వచ్ఛమైన, సకలలోకాతీతమైన సౌందర్యముతో విరాజిల్లునది – అని ఈ నామానికి అర్థం.

## 973. శుద్ధ మానసా

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శుద్ధమానసాయై నమః' అని చెప్పాలి.

శుద్ధ = పరిశుద్ధమైన, మానసా = మనస్సు గలది.

మనిషిలో ఏది పరిశుద్ధంగా ఉంటే మనిషి పరిశుద్ధంగా ఉంటాడు? అన్న ప్రశ్నకు సమాధానం 'మనస్సే' – అని సమాధానం చెప్పుకోవాల్సి ఉంటుంది. ఎందుకంటే –

దహరాకాశంలో ఉండే హృదయం ఎప్పుడూ - పాపరహితంగా, పరిశుద్ధంగానే ఉంటుంది. ఎటొచ్చీ అన్ని రకాల ఆలోచనలు, ఊహలు, వెకిలి వేషాలు ముందు మనస్సుకే వస్తాయి. మనస్సు పరిశుద్ధి కావాలంటే - పవిత్ర భావనలు, పవిత్ర వ్యక్తుల నామస్మరణ, జీవిత చరిత్రలు చదువుకోవాలి. ఇంతకు ముందు నామంలో చెప్పినట్లు పవిత్రత, స్వచ్ఛత, చక్కని చరిత్ర కలిగిన అమ్మవారి లాంటి వారి నామస్మరణ, స్తోత్రపారాయణ చేస్తే - అలా చేసే వారి మనస్సులను అమ్మవారు పరిశుద్ధంగా చేస్తుంది.

1) పరిశుద్ధమైన మనస్సు గలది.

2) పవిత్రుల చరిత్రలను, నామస్మరణలను చేయువారి మనస్సులను పరిశుద్ధముగా చేయునది - అని ఈనామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 974. బిందుతర్పణ సంతుష్టా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బిందుతర్పణసంతుష్టాయై నమః' అని చెప్పాలి

బిందు = శ్రీచక్రము నందలి బిందువు నందు, తర్పణ = తర్పణము చేయుటచే, సంతుష్టా = తృప్తి నొందునది.

శ్రీ చక్రంలోని నవావరణమే బిందువు. ఈ బిందువు శ్రీ చక్రానికి కేంద్రము. ఒక విధముగా చెప్పుకోవాలంటే ఇరుసు(Axis) లాంటిది. చక్రభ్రమణంలో ఉన్న దేనికైనా ఒక అక్షం ఉంటుంది. భ్రమణం చేసే వస్తువులో ఏ భాగమైతే కదలకుండా మిగతా భాగమంతా తిరగడానికి ఆధారం అవుతుందో - దాన్ని 'అక్షము' అంటారు. అంటే కదిలేదాంట్లో కదలకుండా ఉండేదే 'అక్షం' అన్నమాట ! కాలచక్రంలో విశ్వభ్రమణ కారకమైన అమ్మవారు కూడా తను మాత్రం నిలకడగా మార్పులేకుండా ప్రశాంతంగా ఉంటూ - అన్నిటినీ చరింపచేస్తుంది. శ్రీ చక్రంలోని బిందుస్థానమే అయ్యవారితో కలసి ఉండే అమ్మవారి నిలకడ స్థానాన్ని సూచిస్తుంది. ఈ బిందు స్థానం వద్ద తర్పణాలు, హవిస్సులు సమర్పిస్తే ఉత్సవ విగ్రహం దగ్గర కాకుండా ప్రశాంతంగా, స్థిరంగా, మార్పులేకుండా ఉండే మూలవిరాట్ విగ్రహం దగ్గర సమర్పించిన విధంగా ఉంటుందనే

భావన కలగాలి. అందుకే బిందువు వద్ద అర్పణ చేసిన తర్పణాలంటే అమ్మవారు సంతుష్టి చెందేది.

మనలో బ్రహ్మరంధ్ర స్థానం వద్ద ఉండే సహస్రారం లోని చంద్రమండలం వద్ద ఉన్న స్థానాన్నే 'బిందువు' అంటారు. మనకు మెలకువ వచ్చినపుడు ఎక్కడ దానికి ప్రారంభమో – దాన్ని 'బిందువు' అంటారు. మెలకువ రావడం అంటే 'నేను' అన్న పదానికి అర్థం తెలియడమే! ఏదైనా విషయం అర్థమవడమంటే – చిచ్ఛక్తి పనిచెయ్యడం ప్రారంభమవడమే ! చిచ్ఛక్తికి పాదుకలుగా 'విమర్శ' 'ప్రకాశ' బిందువులను సమన్వయపరచుకోవచ్చును. కాబట్టి – ఈ బిందువుల వద్ద తర్పణాలు, హవిస్సులు సమర్పిస్తే చిచ్ఛక్తికి పాద పూజ జరిగినట్లే! పాదుకాంత దీక్ష ఫలించినట్లే! అయితే ఇలా చేయగలగడం, ఈ స్థితికి రావడం కుండలినీయోగంలో ఎంతో సాధన ఉన్నవారికే సిద్ధిస్తుంది. అందుచేతనే ప్రస్తుత నామం – స్తోత్రంలో చివరకు చెప్పబడుతుంది. సాకారమైన జగత్తుకు సంకల్పమే ఈ బిందువు అని కూడా అర్థం చేసుకోవాలి.

అంతేకాదు - మనలో ఏదైనా అందాము అనిపించే నాదమూలస్థితి – ఈ బిందువే! మన వాక్కు మనలో ఇమిడి ఉన్న చోటు – ఈ బిందువే! తైత్తిరీయంలో చెప్పబడిన 'సేంద్రయోనిః' అనే మంత్రంలోని 'యోని' – ఈ బిందువే!

సౌందర్యలహరిలో ఆదిశంకరులు వ్రాసిన 'సుధాసింధోర్మధ్యే... శ్లోకఃంలోని సుధాసింధువు – ఈ బిందువే!

బ్రహ్మాండ పిండాండాలకు శ్రుతి (Tuning) కుదరాల్సింది ఈ బిందువు వద్దనే! మనస్సు ఆత్మలో లీనమయే చోటు ఈ బిందువే! దీన్నే జ్యోతిశ్శాస్త్రంలో రవి, చంద్రుల సమాగమస్థితిగా చెబుతారు. ( జీవుల యందు సూర్యకళ వర్తించదు. చంద్రకళే వర్తిస్తుంది. అందుకనే మనకు కళలు (Moods) ఎక్కువ.

రవిచంద్రుల సమాగమస్థితి అనే అమావాస్య నుండి పాడ్యమిని కనుగొనటమే బిందువికసన ప్రారంభం. ఎందుకంటే – అమావాస్య అనేది మనకు – దేవతలకు మధ్య వర్తించే ద్వారం లాంటిది కాబట్టి.

తెలుసుకునేవాడు తెలియ వలసిన దాంట్లోకి లీనమయేది ఈ బిందువు వద్దనే!

1) శ్రీ చక్రంలోని బిందువు నందు తర్పణ చేయుటచే సంతుష్టి నొందునది.

2) సహస్రారంలోని చంద్రమండల స్థానం వద్ద తర్పణ చేయుటచే సంతుష్టి నొందునది.

3) సాకారమైన జగత్తుకు సంకల్ప బిందువు వద్ద జరుగు తర్పణ, హవిస్సులకు సంతుష్టిచెందునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 975. పూర్వజా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పూర్వజాయై నమః' అని చెప్పాలి.

పూర్వజా = అన్నిటి కన్నా ముందు ఉండునది.

ఇంతకు ముందు నామంలో బిందువు గురించి చెప్పబడింది. ఆ బిందువు కంటె ముందు ఉండేది అమ్మవారు – అని ఈ ప్రస్తుత నామం సూచిస్తుంది. పెట్టబోయే 'చుక్కలాగ, కాబోయే 'వాక్యం' లాగా ఉండే అమ్మవారి నామాన్ని 'పూర్వజా' అంటారు. తైత్తిరీయంలో కూడా ''అహమస్మి ప్రథమజాఋుతాస్య, పూర్వం దేవేభ్యో అమృతస్యనా భాయి, యో మాదదాతి స ఇదేవమావాః'' అని చెప్పబడింది. (ఈ మంత్రాల అర్థం నాచే వ్రాయబడిన తైత్తిరీయోపనిషత్ వివరణలో వివరంగా తెలుపబడింది).

'అడిగినప్పుడల్లా అమ్మవారు ఉందన్నారు – బాగానే ఉంది. అడిగేవారు లేక ముందు కూడా ఉందా ?'' అని ఎవరైనా ప్రశ్నవేస్తే – 'ఉంది' అనేదే సమాధానం. అయితే – ఎలా ఉంది ? అని మళ్ళీ ప్రశ్నిస్తే 'ఎవరికి' ? అని అనాల్సి వస్తుంది. అప్పుడు ప్రశ్నవేసిన వాడు అయోమయంలో పడాల్సి వస్తుంది. కాబట్టి 'పూర్వజా' అని పిలువబడే సృష్టికర్త్రి అయిన అమ్మవారి విషయంలో అలా ప్రశ్నించడం అర్థం లేదని తెలుసుకోవాలి.

శ్రీ మద్భాగవతంలో శ్రీకృష్ణుని కన్నా ముందు పుట్టినట్లుగా చెప్పబడిన 'యోగమాయ' – ఈ 'పూర్వజా' నామాన్ని సూచిస్తుందని కూడా చెప్పుకోవచ్చును.

నిద్రపోతున్నపుడు, మెలకువరాక పూర్వం కూడా మనలో ఉన్న అమ్మవారి నామం 'పూర్వజా' అని చెప్పుకోవచ్చును.

విష్ణు పురాణంలో - మహా విష్ణువు, శివ పురాణంలో - సదాశివుడు, దేవీ భాగవతంలో - అమ్మవారు, వేదాంతంలో పరబ్రహ్మ - వీళ్ళు ఉండటమే గాని 'పుట్టడం' ఉండదు. వీళ్ళే 'పూర్వజాలు' అన్న మాటకు అర్హులు. వీళ్ళ కంటె ముందు పుట్టిన వారుండరు. ఉన్నవారే ఉంటారు.

1) బిందువు కన్న ముందు ఉన్నది.

2) కాబోయే వ్యక్తమును సూచించు అమ్మవారి నామము.

3) భాగవతంలో శ్రీ కృష్ణుని ముందుగా పుట్టినట్లు చెప్పబడిన యోగమాయ.

4) నిద్ర పోతున్నపుడు, మెలకువరాక పూర్వము గూడా మనలో ఉండునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 976. త్రిపురాంబికా

ఐదక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిపురాంబికాయై నమః' అని చెప్పాలి.

త్రిపుర = త్రిపురములచే సూచింపబడు వానికి, అంబికా = మూలమైన తల్లివంటిది.

త్రిపురాలుగా సూచింపబడేవి చాలా ఉన్నాయి. ముఖ్యంగా మనలోని స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలను త్రిపురాలంటారు. చిత్ బిందువు, ప్రకాశ బిందువు, విమర్శ బిందువులుగా వికసనం చెందే మూడింటికి - ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషులుగా ప్రతిపాదింపబడే మూటింకి, - ఉచ్చారణ జరగడానికి కావలసిన ప్రయత్నంలో ప్రారంభ ప్రేరణ జరిగే - 1) నాభి 2) హృదయం 3) విశుద్ధి - ఈ మూడింటికి గూడా మూలకారణమైన మాతృస్థానంగా ఉండే అమ్మవారిని 'త్రిపురాంబికా' అంటారు. నాభి, హృదయం, విశుద్ధి - ఈ మూడు పురాల్లోను ఉండే - భైరవులకు అధిదేవత అయిన అమ్మవారిని 'త్రిపురభైరవి' అంటారు. అలాగే - ఈ త్రిపురాల్లో సౌందర్యం స్థాపించబడితే

ఆ సౌందర్య మూర్తే 'త్రిపురసుందరి' అని పిలువబడుతుంది.

'త్రిపురములుగా సూచింపబడు వాటికి మూలమైన తల్లివంటిది' అని ఈ నామానికి అర్థం.

## 977. దశముద్రా సమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దశముద్రాసమారాధ్యాయై నమః' అని చెప్పాలి.

దశ = పది, ముద్రా = ముద్రలచేత, సమ్యక్ + ఆరాధ్యా - సమారాధ్యా = చక్కగా ఆరాధింపబడునది.

'ముదం ద్రావయతీతి - ముద్రా' అంటారు. - 'అనుభూతి కలిగినపుడు అప్రయత్నంగా మనలో గలిగే ఒక భంగిమను 'ముద్ర' అంటారు. ఉదా: ఒక గౌరవనీయమైన వ్యక్తిని చూడంగానే అప్రయత్నంగా మన అరచేతులు రెండూ దగ్గరౌతాయి. అదే నమస్కార 'ముద్ర' (సంపుటీ ముద్ర). లోపల ఏ ముద్ర వస్తే మనం తెలియకుండానే ఆ ముద్ర పడతామో అది అసలైన ముద్ర. అమ్మవారు బయటకు సృష్టిగా రాబోయే ముందు అయ్యవారికి ఒక 'ముద్ర' వస్తుంది అప్రయత్నంగా - అది - 'మహాముద్ర'.

ఇంకా ఇలా 'జ్ఞానముద్ర' (దీన్నే 'ఉపదేశముద్ర' 'చిన్ముద్ర' అని కూడా అంటారు) సంపుటీ ముద్ర అంజలి ఘటిస్తున్నట్లుండే ముద్ర ఇది). విరతముద్ర (పుస్తకం తెరచినట్లుండే ముద్ర). త్రిముఖము (దీన్నే యోనిముద్ర, త్రికోణముద్ర అంటారు. (రామకృష్ణ పరమహంస శరీరం వదులు తారనంగా క్రిందటి రోజున ఈ ముద్రతో వివేకానందునికి విశ్వరూప సందర్శనం గావించాడు). పంచముఖ ముద్ర (దూరంగా వేళ్లున్న అభయ ముద్ర) అధోముఖీ ముద్ర (దీన్నే స్వాగతముద్ర, లేదా - ప్రభాత ముద్ర అని గూడా అంటారు). సన్ముఖముద్ర (ఎడమచేత వరద, కుడిచేత అభయముద్రలు కలసి ఉంటాయి. ప్రలంబిక ముద్ర (ఒక చేతికి ఒక చెయ్యి లంబంగా అంటే పైగా ఉంచితే ఏర్పడే ముద్ర) ముష్టిక,

మత్స్య, కూర్మ, వరాహ, శకట, గ్రథిత, ఉన్ముఖ, విస్తృత, ద్విముఖ, చతుర్ముఖ, చివరకు మహాక్రాంతముద్ర (రామకృష్ణ పరమహంస చెయ్యి పైకెత్తిన ముద్ర) ఇలా ఎన్నో రకాల ముద్రలున్నాయి.

అయితే, శ్రీ విద్యకు సంబంధించిన ముద్రలు ప్రత్యేకంగా పది ఉన్నాయి. సర్వ సంక్షోభిణీ, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని, సర్వత్రిఖండా – ఈ ముద్రలు పదింటినీ – దశముద్రలంటారు. కుడిచేతి వ్రేళ్ళను శివతత్త్వంగా, ఎడమచేతి వ్రేళ్ళను శక్తి తత్త్వంగా మేళనంతో – శివశక్తి సామరస్య రహస్యార్థాలను, సృష్ట్యాది కృత్యాలపరంగా – ఎన్నిటినో ఇటువంటి ముద్రల రూపంలో అభినయించవచ్చు. అమ్మవారి సాన్నిధ్యంలో ఇటువంటి ముద్రలను ప్రదర్శిస్తూ ఆరాధిస్తే అమ్మవారికి చాలా ఇష్టమౌతుందిట. అందుచేత అమ్మవారు – 'దశముద్రాసమారాధ్యా!.

శ్రీవిద్యకు సంబంధించిన ప్రధానమైన దశముద్రలచే చక్కగా ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థం.

## 978. త్రిపురాశ్రీవశంకరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు – 'త్రిపురాశ్రీవశంకర్యై నమః' అని చెప్పాలి.

శ్రీ చక్రంలోని ఐదవ చక్రాన్ని అధిష్ఠించి ఉండే 'త్రిపురాశ్రీ' అనే దేవత ప్రసన్నమయేట్లు చేయగలది కాబట్టి, అమ్మవారు – త్రిపురా శ్రీవశంకరీ.

'త్రిపురాశ్రీ' అను దేవతను ప్రసన్నురాలుగా చేయునది – అని ఈ నామానికి అర్థం.

## 979. జ్ఞానముద్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్ఞానముద్రాయై నమః' అని చెప్పాలి.

జ్ఞానముద్రా = జ్ఞానముద్రా స్వరూపిణి.

ఇంతకు పూర్వమే ముద్రలకు సంబంధించిన నామంగా 'దశముద్రా సమారాధ్యా' అని ఒక నామం చెప్పబడింది. ఆ నామంలో చెప్పబడిన ముద్రలు ప్రత్యేకంగా శ్రీ విద్యకు సంబంధించిన ముద్రలు. ఇప్పుడు మళ్ళీ అమ్మవారికి 'జ్ఞానముద్రా' అనే నామం కూడా చెప్పబడిందంటే – అన్ని ముద్రలలోకి ప్రత్యేకమైనది, విశిష్టమైనది ఈ ముద్ర అని వేరే చెప్పాల్సిన పనిలేదు.

ఈ 'జ్ఞానముద్ర'నే 'చిన్ముద్ర' అని కూడా అంటారు. దక్షిణామూర్తి యువకరూపంలో కుడి అరచేతి వ్రేళ్ళతో ఈ ముద్రను ధరించి మౌనంగా ఉంటాడు. 'ఎదురుగా వృద్ధుల రూపంలో ఉన్న శిష్యులందరికీ ఈ చిన్ముద్రను చూస్తుండగానే వారి సందేహాలన్నీ పటాపంచలై, జ్ఞానవంతులౌతారు' అని ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

శ్లో. చిత్రం వటతరోర్మూలే శిష్యా వృద్ధాః గురోర్యువా
గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయా.

కుడిచేతి చూపుడు వ్రేలు కొనను బొటన వ్రేలి కొనకు తగిలించి, మిగిలిన మూడు వ్రేళ్ళను నిట్టనిలువుగా పైకి (అభయ ముద్రలోలాగా) ఉంచినప్పుడు ఏర్పడే ముద్రను 'చిన్ముద్ర' అంటారు. దీన్నే 'జ్ఞానముద్ర' అని కూడా అంటారు. ఈ ముద్రను తిలకిస్తున్నపుడు సందేహాలు నివృత్తి జరిగి, సర్వజ్ఞానం ద్యోతకమౌతుంది. అంతటి ప్రాముఖ్యం గల ముద్రకాబట్టి ప్రత్యేకంగా జ్ఞాన స్వరూపిణి అయి అమ్మవారు ఈ 'జ్ఞానముద్రా' స్వరూపిణిగా చెప్పబడింది. దేన్నైనా చూసినపుడు 'చాలా బాగుంది' లేదా 'చాలా బాగుంటుంద'ని చెప్పవలసి వచ్చినపుడు – నోటితో చెప్పకుండానే ఈ ముద్రను అభినయించటం గూడా మనం చూస్తూ ఉంటాం.

ఈ ముద్రలో ఒక 'పూర్ణత్వం' సూచన ఉంది. చూపుడు వ్రేలు బొటన వ్రేలు కొసలు కలిసినపుడు అవి రెండూ ఒక వృత్తాకారాన్ని ఏర్పరుస్తాయి. ఈ ఆకారం 'పూర్ణత్వా'నికి, పూర్ణానుస్వారానికి సంకేతం.

ఈ ముద్రలో బొటన వ్రేలు జీవుణ్ణి, చూపుడు వ్రేలు బ్రహ్మను సూచిస్తాయి కాబట్టి– ఆ రెంటి కలయిక 'జీవేశ్వర సర్వేశ్వర ఐక్యాన్ని' – 'అద్వైతస్థితి'ని 'కైవల్యాన్ని'

సూచిస్తుంది. కాబట్టి, దీన్ని మించిన ముద్రలేదు. అందుకే అమ్మవారికి ఈ ముద్ర అత్యంత ప్రీతి పాత్రము.

జ్ఞానముద్రాస్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 980. జ్ఞానగమ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్ఞానగమ్యాయై' అని చెప్పాలి.

జ్ఞాన = జ్ఞానముచే, గమ్యా = పొందబడునది.

అమ్మవారు జ్ఞానస్వరూపిణి కాబట్టి ఆమెను చేరాలన్నా, ఆవిడ సాన్నిధ్యం పొందాలన్నా ఆవిడలో లీనమవాలన్నా 'జ్ఞానమే' సరియైన మార్గం. మనం పొందవలసిన ధ్యేయాన్ని బట్టి మనం ఎంచుకోవాల్సిన మార్గం నిర్ణయింపబడుతుంది. అవతలి వ్యక్తి కీర్తి కాంక్ష కలిగిన వ్యక్తి అయితే - నాలుగు పొగడ్తలు మన దగ్గరుండాలి. అవతలి వ్యక్తి రాజకీయ నాయకుడైతే - మనదగ్గర కొంత రాజకీయం ఉంటే దాన్ని పెట్టుబడి పెట్టాలి. అవతలి వాడు సేవాకార్యక్రమాల్లో ఉండే వాడైతే - మనం కూడా కొంత సేవను పెట్టుబడి పెట్టాలి. ఇలా - గమ్యాన్ని బట్టి మార్గం ఉంటుంది. అమ్మవారు పూర్తిగా జ్ఞాన స్వరూపిణి. అందువలన ఆమెను చేరడానికి జ్ఞానమొక్కటే మార్గం. అందుకే 'జ్ఞానదేవతు కైవల్యమ్' (కేవలం జ్ఞానము చేత మాత్రమే తెలియదగునది, లేదా - పొందగలుగునది) అన్నారు.

జ్ఞానము చేత పొందగలుగనది - అని ఈ నామానికి అర్థం.

## 981. జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్ఞానజ్ఞేయ స్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

జ్ఞాన = జ్ఞానమును, జ్ఞేయం = జ్ఞానం చేత పొందబడుదానిని, స్వరూపిణీ = స్వరూపముగా గలది.

మనం చేరవలసిన గమ్యము, ఆ గమ్యాన్ని చేరడానికి అనుసరించాల్సిన మార్గము – ఈ రెండూ కూడా అమ్మవారేనని ఈ నామం చెబుతుంది.

పారలౌకికమైన విషయాలపై బుద్ధిని పెట్టి సత్యాన్వేషణకై తపిస్తే – ఆ తపన ఫలితంగా తత్త్వాన్ని అందుకుని 'తత్' శబ్ద వాచ్యునిలో లీనమౌతాము. సినిమా రంగం గురించి తెలుసుకోవాలంటే సినిమా రంగానికి సంబంధించిన పత్రికలు, పుస్తకాలు చదివి వాటిలో నిష్ణాతులైన వారిని కలుసుకుంటూ, అవగాహన పెంచుకోవాలి. అలాగే – మన ధ్యేయము (పొందవలసినది), జ్ఞేయము (తెలుసుకోవలసింది)నకు సంబంధించిన విషయాలు ఏ గ్రంథాల్లో, ఏ వ్యక్తుల వద్ద లభిస్తాయో, ఏ చర్చల వల్ల పొందుతామో – ఆ గ్రంథాలనే, ఆ వ్యక్తులనే కలుసుకుని, చర్చించుకుని, చదువుకోవాలి. ఈ గ్రంథాల ద్వారా, ఈ వ్యక్తుల ద్వారా, ఈ చర్చల వల్ల వచ్చే 'జ్ఞానము', 'ఈ జ్ఞానము ద్వారా పొందబడేది' (లేదా తెలియబడేది) ఈ రెండూ కూడా అమ్మవారి రూపమే అని ఈ నామం చెబుతోంది.

'ధారణ', 'ధ్యానము' ఏ విధంగా సమాధిలోకి దారితీస్తాయో అలాగే – జ్ఞానము – జ్ఞేయము గూడా ఆ రెంటి రూపంలో ఉన్న అమ్మవారి దగ్గఱకు దారితీస్తాయి.

జ్ఞానమును, జ్ఞేయమును – తన స్వరూపంగా కలిగినది – అని ఈ నామానికి అర్థం.

## 982. యోనిముద్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోనిముద్రాయై నమః' అని చెప్పాలి.

యోనిముద్రా = యోనిముద్రా స్వరూపిణి.

ఇంతకు పూర్వ నామంలో ముద్రల గురించి చెప్పబడింది. జ్ఞానముద్ర లాగానే 'యోనిముద్ర'కు గూడా కొంత ప్రత్యేకత ఉంది. ఈ ముద్రను 'త్రిముఖముద్ర' లేదా 'త్రికోణముద్ర' అని కూడా అంటారని 'దశముద్రా సమారాధ్యా' నామవివరణలో చెప్పబడింది. బొటన వ్రేళ్ళు రెండు ఒక దానిపై ఒకటి సరళరేఖ లాగా ఉంచి, రెండు చూపుడు వ్రేళ్ళను రెండు వైపులా ఏటవాలుగా ఉంచి పై కొనలు కలిపితే సమద్విబాహు

త్రిభుజ (Isocelles Triangle) ఆకారం వస్తుంది. ఈ ఆకారంలో ఉండే ముద్రను 'యోనిముద్ర' అంటారు. త్రికోణాలతో ఉండేది కాబట్టి 'త్రికోణముద్ర' అని, మూడు ముఖాలు ఉండేది కాబట్టి 'త్రిముఖ ముద్ర' అనీ గూడా అంటారు.

శ్రీ చక్రంలోని కేంద్ర బిందువు క్రమక్రమంగా వికసిస్తూ ప్రపంచం సృష్టిగా వ్యక్తమౌతున్నపుడు ఈ బిందువు ముందుగా ఈ 'యోనిముద్ర' లో సూచించిన ఆకారం పొందుతుంది. ఇక అటు పైన దాంట్లోంచే సమస్తము వ్యక్తమౌతుంది. సమస్తానికి ఉత్పత్తి స్థానం అవడం వల్లనే ఈ ముద్రను 'యోనిముద్ర' అన్నారు.

తైత్తిరీయంలో కూడా 'సేంద్రయోనిః' అని చెప్పబడింది. సహస్రారంలోని బిందువు చుట్టూ ఉండే ప్రదేశమే ఈ యోనిగా రూపొందుతుంది. ఇది ఏర్పడిన తరువాత దీనికి కారణభూతమైన బిందువు మాటుపడుతుంది. ఇటు 'బిందువు'కు అటు 'వ్యక్త ప్రపంచానికి మధ్య ద్వారం లాగా ఉంటుంది ఈ ముద్ర. 'పరా' సంబంధమైనదంతా దీనికి – ఆవలివైపు, 'అపరా' సంబంధమైన దంతా – ఈవలి వైపు ఉంటాయి. అంటే, ఒక విధంగా ఈ యోనిముద్ర మాయా స్వరూపంగా వర్తించే తెరలాంటిదన్నమాట!

సృష్టికి దారితీసే ఈ ముద్రకూడా ముద్రలలో ప్రధానమైంది. అమ్మవారు సృష్టి స్వరూపిణి కాబట్టి ఈ ముద్రకు ప్రాధాన్యం ఉంది. పురుషసూక్తంలో కూడా 'తస్యధీరాః పరిజానంతి యోనిమ్' అని చెప్పబడుతుంది. (ధీరులు మాత్రమే ఈ 'యోని' గురించి చక్కగా అవగాహన చేసుకుంటారు – అని ఈ మంత్రార్థం.)

యోనిముద్రా స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 983. త్రిఖండేశీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిఖండేశ్యై నమః' అని చెప్పాలి.

త్రిఖండ = మూడు భాగములు గానుండు వాటికి, ఈశీ = ప్రభ్వీగా ఉండునది.

అమ్మవారి పంచదశాక్షరీ మంత్రం – 1) 'కా'ది కూటము (క, ఏ, ఈ, ల, హ్రీం) 2) 'హా' ది కూటము (హ, స, క, హ, ల, హ్రీం) 3) సాదీకూటము (స, క,

ల, (హ్రీం) అని మూడు కూటములుగా ఉంటుంది. ఈ మూడు కూటాలానే మూడు ఖండాలుగా గూడా చెప్పవచ్చు. ఈ మూడు కూటాలనే వరుసగా 1) వాగ్భవకూటం 2) కామరాజకూటం3) శక్తికూటం – అని కూడా అంటారు. అయితే – ఈ విషయాల వివరణ 'త్రికూటా' అన్న 588వ నామ వివరణలో కూడా తెలుపబడింది.

సహస్రారం నుండి మూలాధారం దాకాఉండే అగ్నితత్త్వ సుషుమ్నా మార్గాన్ని – రాశి చక్రంలో అగ్నితత్వరాశులైన – మేష, సింహ, ధనుస్సులతో సమన్వయిస్తే – ఆ మూడు రాశులకు, ఆ మూడు రాశుల ప్రారంభాలైన – 'అశ్విని', 'మఘ', 'మూల' నక్షత్రాలు ఈ క్రింద చూపిన చిత్రంలో ఉన్నట్లుంటాయి.




పై చిత్రంలో A, B, C బిందువులు వరుసగా ఈ క్రింద తెలిపిన వాటిని సూచిస్తాయి.

A మేషరాశి ప్రారంభం – అశ్వినీ నక్షత్ర ప్రారంభం – సహస్రారం

B సింహరాశి ప్రారంభం – మఘా నక్షత్ర ప్రారంభం – అనాహతం

C ధనూరాశి ప్రారంభం – మూలా నక్షత్ర ప్రారంభం – మూలాధారం

ఈ విధంగ రాశులచేత, నక్షత్రాల చేత, చక్రాల చేత సూచింపబడే పై పటంలోని వృత్తం మూడు భాగాలుగా విభజింపబడినట్లు గూడా గుర్తించవచ్చును. సుషుమ్నా మార్గ సూచితమైన కుండలినీ శక్తి అనే అమ్మవారు ఈ మూడు విభాగాలుగా లేదా ఖండాలుగా ఉంటుందని కూడా చెప్పుకోవచ్చును. ఈ మూడు ఖండాలతో సమన్వయింపబడే సుషుమ్నకు అధిష్ఠాత్రి కాబట్టి అమ్మవారు 'త్రిఖండేశీ'. ఈ మూడు ఖండాలతో పైనచెప్పిన మూడు కూటాలను గూడా సమన్వయం చేసుకోవచ్చును.

1) 'మూడు ఖండములుగా, మూడు కూటములుగా నుండు – పంచదశాక్షరీ మంత్రమునకు, సుషుమ్నా మార్గానికి – అధిష్ఠాత్రి' అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చు.

## 984. త్రిగుణా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిగుణాయైనమః' అని చెప్పాలి.

త్రిగుణా = త్రిగుణముల సమన్వయ రూపము.

విశ్వం మొత్తాన్ని వామనావతారంలో విష్ణుమూర్తి తన మూడు పాదాలతో ఎలా కొలిచాడో, అలాగే అమ్మవారు విశ్వం మొత్తాన్ని మూడు గుణాల సమ్మిశ్రంగా సృష్టించింది. అవే – సత్వరజస్తమోగుణాలు. విశ్వంలోని జీవ వస్తు సామాగ్రిని దేన్ని తీసుకున్నా ఈ మూడు గుణాల సమ్మిశ్రంగానే ఉంటుంది – కాబట్టి అమ్మవారు ఈ మూడు గుణాల సమన్వయ స్వరూపంగా చెప్పబడింది.

మూడు గుణాల సమన్వయ స్వరూపము – అని ఈ నామానికి అర్థం.

## 985. అంబా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అంబాయై నమః' అని చెప్పాలి.

అంబా = మాతృస్వరూపిణి.

త్రిగుణాలకు, త్రిగుణ భూయిష్ఠమైన ఈ ప్రపంచానికి కూడా మూలకారణమైన తల్లివంటిది – అని ఈ నామానికి అర్థం.

## 986. త్రికోణగా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రికోణగాయై నమః' అని చెప్పాలి.

త్రికోణగా = త్రికోణ సమన్వయాత్మకముగా ఉండునది.

అమ్మవారి తత్త్వాన్ని వివరించాలంకటే ప్రధనాంగా 'త్రిభుజం' చాలా ఉపకరిస్తుంది. ఈ త్రిభుజంలో మూడు భుజాల ద్వారా గాని, మూడు కోణాల ద్వారా గాని త్రివర్గంగా ఉండే (అంటే మూడుగా ఉండే) 1) భూర్భువస్సువర్లోకాలను 2) త్రిమూర్తులను 3) త్రిగుణాలను, 4) త్రిలోకాలను 5) త్రినాడులను 6) త్రికూటాలను 7) త్రేతాగ్నులను 8) త్రిధాతువులను, 9) త్రిస్థితులను – చక్కగా సమన్వయం చేసి చెప్పవచ్చు. అందుకని అమ్మవారు 'త్రికోణగా'.

1) త్రిమూర్తి, త్రిగుణాదుల సమన్వయ స్వరూపిణీ.

2) మూల ప్రకృతిగాను, ఉత్పత్తి స్థానాన్ని సూచించే యోని ముద్రగాను ఉన్న జగజ్జనని – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 987. అనఘా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనఘాయై నమః' అని చెప్పాలి.

అనఘా = పాపము లేనిది.

'అఘము' అంటే పాపము. 'అనఘము' అంటే పాపము లేకపోవుట. పాడుపనులు, పాడు ఆలోచనలు ఉన్నవారికి పాపంఉంటుంది. పరమ పవిత్రమైన ఆలోచనలు కలిగి మంగళకరమైన మహత్కార్యలు చేసే వారిని పాపం ఎలా స్పృశిస్తుంది? అమ్మవారి సాన్నిధ్యంలో – పాపం ఉండటానికి భయపడుతుంది. అమ్మవారున్న చోట పాపం ప్రవేశించదు. స్పృశించదు – కాబట్టి – అమ్మవారు 'అనఘా'.

పాప స్పర్శ కూడ అంటనిది – అని ఈ నామానికి అర్థం.

## 988. అద్భుతచారిత్రా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అద్భుత చారిత్రాయై నమః' అని చెప్పాలి.

అద్భుత = అద్భుతమైన, చారిత్రా = చరిత్ర కలది.

'చరిత్ర' అంటే 'వర్తనము' అని అర్థం. ప్రవర్తన వలన ధర్మాలు ఆచరణలో గుణాలౌతాయి. విత్తనాల్లో వాసన, 'ధర్మ' రూపంలో ఉంటే – పువ్వుల్లో 'గుణ' రూపంలో ఉంటుంది. విత్తనంలో ఆ వాసనకు సంబంధించిన ధర్మం(Property) లేకపోతే – తర్వాత పువ్వులో వాసనరాదు. అల్లాగే – మంచి ప్రవర్తన మన దగ్గరుంటే మంచి చరిత్ర మనకుంటుంది (Good behaviour builds up good biography) .

ఏదైనా చస్తుందేమో అని చూచి కాలువెయ్యడం మంచిదే ! ఎందుకంటే ఒక్కొక్కప్పుడు నేలమీద చీమ బదులు తేలుకూడా ఉండవచ్చును. బుద్ధుడు, క్రీస్తు అలాగే చేస్తారు. అందుకే వారు భూదేవితో కలసి 'పోలేదు', కలసి ఉన్నారు. చరిత్రలో నిలిచి ఉన్నారు. బాల రామాయణంలో కూడా వాల్మీకి – 'చారిత్రేణ చకోయుక్తః – అంటే ప్రవర్తనచేత గొప్పవాడెవరు ? యుక్తుడెవరు ?' – అని నారదుణ్ణి అడిగితే – 'శ్రీరాముడు' అని నారదుడు చెబుతాడు. 'శ్రీరామోలలితాంబికా' కాబట్టి, ప్రస్తుతం అమ్మవారు కూడా దుష్టశిక్షణ, శిష్టరక్షణాది కృత్యాలచేత, పుణ్యవంతమైన పాత్రిప్రత్య, ప్రవర్తనల చేత అద్భుతమైన చరిత్ర కలిగినదైంది.

భండాసుర, మహిషాసురాది సంహారాలతో త్రిమూర్తులకు కూడా సాధ్యం కాని అసాధ్యమైన కార్యాలను సుసాధ్యంచేసి, అద్భుతమైన, అపూర్వమైన పేరు ప్రతిష్ఠలతో వన్నె కెక్కింది. కాబట్టి అమ్మవారు 'అద్భుతచారిత్రా'.

'అద్భుతమైన చరిత్ర, నడవడికి కలిగినది' – అని ఈ నామానికి అర్థం.

## 986. వాంఛితార్థ ప్రదాయినీ

ఎనిమిది అక్షరాలా నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వాంఛితార్థ ప్రదాయిన్యై నమః' అని చెప్పాలి.

వాంఛిత = కోర్కెలను, అర్థ = ప్రయోజనమును బట్టి, ప్రదాయినీ = తీర్చునది.

ఈ నామానికి చాలా జాగ్రత్తగా అర్థం చెప్పుకోవాలి. సర్వసాధారణంగా ఈ నామానికి 'భక్తుల కోర్కెలను తీర్చునది' – అని అర్థంచెబుతారు. ఈ అర్థాన్నే కలిగేట్టుగా నామం వ్రాయాలంటే 'వాంఛితప్రదాయినీ' అని వ్రాస్తే చాలు గదా!' – అని వారిని ప్రశ్నిస్తే

-' ఏం కాదు అలా వ్రాస్తే అనుష్టుప్ ఛందస్సులో పాదానికి రెండక్షరాలు తగ్గుతాయని 'వాంఛితార్థ ప్రదాయినీ' అని వ్రాశారు' - అని చెప్పేవారుండవచ్చు. కాని, అలా సమర్థించడానికి ప్రయత్నిస్తే - 'వ్యాసుడు - ఒక పాదాన్ని గూడా ఛందోబద్ధంగా సరిగ్గా వ్రాయలేడనే మనకున్న అజ్ఞానాన్ని బయట పెట్టుకున్నట్లే ఔతుంది కాని, వ్యాసుణ్ణి రక్షించి సమర్థించినట్లు అవదు. పోనీ - నామంలోని 'అర్థ' పదానికి - పురుషార్థాలని అర్థం చెప్పుకుంటే - ఈ పురుషార్థాలను - ఇంతకు పూర్వం అమ్మవారు చాలా నామాల్లో చాలా సార్లు ఇచ్చేదిగా చెప్పుకున్నాం. మళ్ళీ ఇంకోసారి చెప్పడం అంత సమంజసం కాదు.

ఈ నామంలోని 'వాంఛితా' నికి 'ప్రదాయినీ'కి మధ్య ఉన్న 'అర్థ' పదంలోనే ఉంది - వ్యాసుని రచనలోని సొగసుతనం, గడుసుతనం, గాంభీర్యము అంతా! 'అర్థము' అంటే - 'ప్రయోజనము' అని అర్థం. ఈ అర్థాన్ని కూడా కలిపి నామానికి అర్థం చెప్పుకుంటే 'కోర్కెల ప్రయోజనములను తీర్చునది' - అని గాని - లేదా - 'ప్రయోజనము లైన కోర్కెలను తీర్చునది' - అని గాని - లేదా - సూటిగా ఘాటుగా తెలుగులో చెప్పుకోవాలంటే - అర్థం పర్థం లేని గొంతెమ్మ కోర్కెలను కాకుండా అర్థవంతమైన - అంటే - సమంజసమైన, సమర్థతకు, అర్హతకు, తగిన కోర్కెలను కోరితే వాటిని తీర్చునది' - అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి. లేకపోతే - ప్రతివారూ ప్రధానమంత్రి అవాలనో, అమెరికా అధ్యక్షుడు కావాలనో కోర్కెలు వెలిబుచ్చుతారు. అప్పుడు అమ్మవారు వారి కోర్కెలను యథాతథంగా తీర్చాలంటే వీధికో ప్రధానమంత్రిని, ఊరికో అమెరికా అధ్యక్షుణ్ణి చెయ్యాల్సిన అవసరం రావచ్చును. నిజంగా కనుక అలా అవడానికి తగిన సమర్థత, అర్హత, అవకాశం వారికి ఉంటే - నోరెత్తి అమ్మవారిని అడగకపోయినా వారు అలా అవచ్చు - అది వేరే విషయం ( ఈ నామానికి తర్వాత రాబోయే నామంలో ఎలాగో ఈ విషయ ప్రసక్తి ఉంటుంది కూడా ! )

అర్థవంతమైన కోర్కెలు తీర్చునది, లేదా - కోర్కెల ప్రయోజనములను బట్టి తీర్చునది - అని ఈ నామానికి అర్థం.

## 990. అభ్యాసాతిశయజ్ఞాతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అభ్యాసాతిశయజ్ఞాతాయై నమః' అని చెప్పాలి.

అభ్యాసా = (మన) అభ్యాసమునను, అతిశయం = మించి, (అన్ని విషయములు) జ్ఞాతా = తెలిసినది.

పనులు చేసే వారిలోను, కోర్కెలు కోరే వారిలోను - వారి వారి అభ్యాసాని కంటె మించినటువంటి జ్ఞాతగా అమ్మవారు ఉంటుంది - అని ఈ నామానికి సరియైన అర్థం.

పనులు చెయ్యడానికి తగిన విధమైన కృషి లేకుండా - మనం కోరుకునే పనులకు ప్రతి ఫలాన్ని అధికంగా ఆశిస్తే - అంత మాత్రాన ఆ విషయం అమ్మవారికి తెలియదనుకోడం పొరపాటు' అంటున్నారు వ్యాసుల వారు ఈ నామంలో. అంటే - తక్కువ పనులు చేసి ఎక్కువ ప్రతిఫలాన్ని కోరడం; తక్కువ అర్హత, సమర్థత ఉండి, ఎక్కువ అర్హత, సామర్థ్యం కావలసిన వాటిని కోరడం లాంటివి చేస్తే - ఆ విషయాలు గ్రహించలేనంతటి తెలివి తక్కువది కాదు అమ్మవారు. మన ఇంగిత జ్ఞానాన్ని మన అభ్యాసపటిమను మించిన జ్ఞానం గలది అమ్మవారు. మనకు అర్థమయేలా చెప్పాలంటే - 'అనవసరంగా అమ్మవారినేదో పొగడ్తలతో, గమ్మత్తు మాటలతో మత్తు జల్లినట్లు చేసి ఆశించింది రాబట్టుకోడానికి ప్రయత్నం చేద్దామనుకుంటున్నారేమో - 'అల్లాంటి ఆటలు అమ్మవారి దగ్గఱ సాగవు సుమా' - అని వ్యాసులవారు ఈ నామం ద్వారా నిగూఢంగా చెబుతున్నారు. (దాన్ని మనం విపులీకరించి అర్థం చెప్పుకుంటున్నాం అంతే!)

'మనం అడిగేవాటిలో అడగకూడనివి తెలిసినది' అని గూడా తేలిక[illegible] ఈ నామానికి అర్థం చెప్పుకోడం ఇంకా సముచితంగాను, సందర్భ శుద్ధిగాను ఉంట[illegible]ది. 'అమ్మవారిని తెలుసుకుందాం అనే మన అభ్యాసం అతిశయించిన కొలదీ అ[illegible]గా అర్థమగునది - అని గూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

1) మన అభ్యాసమును మించిన జ్ఞానము కలది.

2) మనం అడిగే వాటిలో అడగకూడనివి తెలిసినది.

3) మన అభ్యాసము అధికమైన కొలదీ అధికముగా అర్థమగునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 991. షడధ్వాతీతరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'షడధ్వాతీతరూపిణ్యై నమః' అని చెప్పాలి.

షట్ = ఆరు, అధ్వ = మార్గములకు, అతీత = అతీతమైన, రూపిణీ = రూపము గలది. 'అధ్వము' అంటే 'మార్గము' అనే అర్థం అయినా, ప్రస్తుత సందర్భాన్ని బట్టి – కుండలినీ ప్రసార మార్గాన్ని నిర్దేశించే – 'చక్రాలు'గా అర్థం చెప్పుకోవాలి. దీన్ని బట్టి 'షడధ్వాలు' అంటే – 'షట్చక్రాలు' అనే అర్థం వస్తుంది. అప్పుడు 'షడధ్వాతీతరూపిణీ' అంటే – షట్చక్రాలకు అతీతంగా ఉండే రూపం గలది – అని అర్థం వస్తుంది.

'షట్చక్రోపరిసంస్థితా' అన్న 108వ నామం, ఈ నామం – దాదాపు ఒకే అర్థాన్ని సూచిస్తాయని చెప్పుకోవచ్చును.

'షట్' అంటే – ఆరు కాబట్టి పంచేంద్రియాలు + మనస్సు కలసి ఆరు అవుతాయి. ఈ పంచేంద్రియాలు, మనస్సే – మనల్ని తప్పుడు మార్గాలు పట్టించేవి. మనం ఈ తప్పుడు మార్గాల వలలో పడి పోతూ పతనమై పోతూ ఉంటాము. ఆ తప్పుడు మార్గాల వలలో పడకుండా తన భక్తులను అమ్మవారే కాపాడ గలిగేది. ఎందుకంటే – ఆవిడ వీటికి లోబడి ఉండక అతీతంగా ఉంటుంది కాబట్టి.

షట్చక్రాలు, పంచేంద్రియ మనస్సులనే కాకుండా వేరే ఆరింటిని కూడా 'షడధ్వములు' అంటారు. అవి 1) పదాధ్వము' (పదములకు సంబంధించినది) 2) భువనాధ్వము (లోకాలకు సంబంధించినది) 3) వర్ణాధ్వము (అక్షరాలకు సంబంధించినది. 4) తత్త్వాధ్వము (తత్త్వాలకు సంబంధించినది) 5) కళాధ్వము (కళలకు సంబంధించినది) 6) మంత్రాధ్వము (మంత్రములకు సంబంధించినది). అమ్మవారి రూపం ఈ ఆరు అధ్వాలకు అతీతంగా ఉంటుంది. వీటిలో భువనాధ్వము,

తత్త్వాధ్వము, కళాధ్వము ఈ మూడూ – ప్రకాశాంశం క్రిందకు వస్తాయి. ఇవి శివసంబంధమైనవి. మిగిలిన పదాధ్వ, వర్ణాధ్వ, మంత్రాధ్వాలు మూడూ విమర్శాంశం క్రిందకు వస్తాయి./ ఇవి శక్తి సంబంధమైనవి. (ఈ ఆరింటి ద్వారా చేసే విచారణ, ఉపాసనల వలన పరదేవతను పొందవచ్చు కాబట్టి – ఈ ఆరింటినీ 'షడధ్వాలు' అన్నారు.

1) ఆరు చక్రాలకు అతీతముగా ఉండునది.

2) మనస్సు, పంచేంద్రియాలు ప్రలోభపెట్టు మార్గాల నుండి తన భక్తులను రక్షించునది.

3) శివ భక్తులకు సంబంధించిన పద, వర్ణాది అధ్వాలకు అతీతముగా ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 992. అవ్యాజకరుణామూర్తిః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అవ్యాజకరుణామూర్త్యై నమః' అని చెప్పాలి.

అవ్యాజ = నెపము, లేదా – మిష లేని, కరుణా = దయయే, మూర్తిః = స్వరూపంగా గలది.

ఎవరిమీద అయినా కాస్త దయ చూపించాలన్నా గూడా 'అందువల్ల తనకేమి వస్తుంది' అని ఆలోచించే మనస్తత్వం గలవారికి – అంటే – ప్రతి పనినీ వ్యాపార దృష్టితో చూసే వారికి, చేసే వారికి – ఈ నామం అర్థమవడం కొంత ఇబ్బందిగానే ఉంటుంది.

ఒక ప్రయోజనం కోసం చెడ్డపని చేసే వారు – అలాగే ఒక ప్రయోజనం కోసం మంచి పనిచేసే వారు – ఈ రెండు రకాల వారు – ఆ ప్రయోజనానంతరం ఆ పనులను ఆపేస్తారు. ఈ రెండు రకాల వారిని 'వ్యాజదుర్బుద్ధులు' అంటారు. ఈ రెండు రకాల వాళ్లూ – పూర్తిగా వ్యాపార బుద్ధి గలిగిన వారే !

అకారణంగా చెడ్డపని చేసే వారిని, అకారణంగా మంచి పనిచేసే వారిని, 'అవ్యాజబుద్ధులు' అంటారు. ఈ రెండు రకాల వారు పనికి వస్తారు. వీరిలో మొదటిరకంవారు రెండో రకం వారిగా మారడానికి ఎప్పటికైనా అవకాశం ఉంటుంది.

మనం కూడా అవ్యాజకరుణ కలిగి ఉంటే – అమ్మవారు మనపట్ల ‘అవ్యాజకరుణ’ అవుతుంది. అంటే – కోరే ముందు కోరే అర్హత కలిగి ఉండాలి. (Deserve before you Desire) అని దీని అర్థం. ‘నిర్హేతుక జాయమాన కటాక్ష’ మంటారు – ఈ అవ్యాజపరునికటాక్షాన్ని. ‘వీరి (అవ్యాజకరుణామూర్తుల) ద్వారా సత్కార్యం జరిగింది అన్నది సత్యంకాదు. ఆ సత్కార్యం ద్వారా వీరు మరింత మెరుగుపడడం జరిగింద’ని అనడం ఎక్కువ సత్యం.

‘ప్రతివా ి ‘భూమ్మీద పడటంతోనే మొదటి శ్వాస నిచ్చిన దైవానికి ఏవిధంగా ప్రత్యుపకారం చేయగలం !’ అనేది గుర్తుండాలి. అలాగే – నిద్రపోతున్నపుడు, అతి ముఖ్యమైన పనిలో నిమగ్నమైనపుడు గూడా మనం మరచిపోయినా – మన మీద దయతో మన ద్వారా శ్వాస జరిగేట్టుగా చూసి, మనం జీవించేట్టుగా చూసే దైవానికి ఏ విధంగా కృతజ్ఞతలు చెప్పుకోగలం ? ఈ ఉదాహరణలు చాలవా అమ్మవారు ‘అవ్యాజకరుణామూర్తి’ అన్నదానికి !

బిడ్డల మీద తల్లికి ఏ కారణం వలన ప్రేమ, దయ ఉంటాయి ? అలాగే – మన పట్ల అమ్మవారికి – అవ్యాజకరుణ ఉంటుంది.

‘మిషలేని, లేదా – కారణం లేని, లేదా – ప్రతిఫలాపేక్షలేని దయాస్వరూపురాలు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 993. అజ్ఞానధ్వాంత దీపికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు ‘అజ్ఞానధ్వాంత దీపికాయై నమః’ అని చెప్పాలి.

అజ్ఞాన = అజ్ఞానము, లేదా – అవిద్య అనెడి, ధ్వాంత = గాఢాంధకారమునకు, దీపికా = దీపకళిక వంటిది.

అజ్ఞానమనే చీకటి ఎంత చిక్కగా ఉంటే – అంత చిన్న దీపం చాలు దాన్ని పోగొట్టడానికి. అందుకే అమ్మవారిని ‘దీపం’తో పోల్చి చెప్పకుండా ‘దీపికా’ (చిన్న దీపం) తో పోల్చి చెప్పారు.

ఒక తరగతిలో విద్యార్థులందరూ 20% మార్కులు గూడా రాని వారే ఉన్నపుడు ఆ తరగతిలో - 70% మార్కులు కూడా అక్కరలేదు, 50% మార్కులు తెచ్చుకున్న ఒక విద్యార్థి ఉన్నా చాలు ప్రశంసలు పొందడానికి, ప్రైజులు తెచ్చుకోడానికి. కృతయుగంలో ఎన్నో పూజలు, పుణ్యాలు చేస్తే గాని మోక్షం రానిది - పాపాల పుట్టగాను, పాషండుల గుట్టగాను ఉన్న కలియుగంలో - దైవ నామస్మరణ, కీర్తనం చేసినా చాలు మోక్షం వస్తుంది. అంటే - దుర్లక్షణం ఎంత ఎక్కువగా ఉంటే - సల్లక్షణం అంత చిన్నది ఉన్నా చాలు రాణించడానికి - అని అర్థం.

ఏది వస్తే మళ్ళీ తిరిగి అజ్ఞానంలో పడమో అదే 'జ్ఞానం'.

అజ్ఞానాంధకారాలను పటా పంచలు చేయగల జ్ఞాన జ్యోతి - అని ఈ నామానికి అర్థం.

## 994. ఆబాల గోపవిదితా

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆబాలగోపవిదితాయై నమః' అ చెప్పాలి.

ఆబాల = పిల్లల నుండి, గోప = గొల్లలదాకా, విదితా = తెలియబడునది.

'ఆబాల గోప' అంటే 'ఆబాల గోపాలం' అని ఒక అర్థం. అంటే - 'అందరి చేత తెలియబడునది - అందరికీ తెలియబడునది' అని అర్థం. ఎవరికి అయినా తల్లి తెలియకుండా ఉంటుందా ? పసిపిల్లవాడి దగ్గర నుండి పరమాత్మ వరకు తల్లిలేకుండా ఉండరు, తల్లిని స్మరించకుండా ఉండరు. కాబట్టి - అమ్మవారు - 'ఆబాలగోపవిదితా'.

కాలుష్యం (Pollute) చెందని స్వచ్ఛమైన మనస్సులకు - ప్రతీకలుగా ఈ నామంలో 'బాల' 'గోప' పదాలు వాడబడ్డాయి. అంటే, వీరివి - స్ఫటిక స్వచ్ఛత ఉండి, వ్యర్థ తర్కంచేత కాలుష్యం కాని మనస్సులన్నమాట! (The minds which are as transparent as crystal and not polluted by our dirty human logic) గోవు ఎంత సాధు స్వభావం కలిగి ఉంటుందో - సాధారణంగా గోవులను కాచే గొల్ల పిల్లలు కూడా అంత సాధువులుగా, అమాయకంగా ఉంటారని ప్రతీతి. అందుచేతనే వారిని 'వెఱ్ఱిగొల్లలు' అంటారు.

భాగవతంలోని గోపబాలకులు ఇలాంటి వారే! (అయితే – ఇది పూర్వం రోజులలో సంగతి. ఇప్పుడు అన్ని రకాల వారూ తెలివి మీరారు) పిల్లలు, గొల్లలు వంటి వారి స్వచ్ఛమైన మనస్సులచే తెలియబడునది – అని ఈ నామానికి ఇంకో అర్థం.

గో = అంటే – ఇంద్రియాలు, 'ప' అంటే – రక్షించేవారు – కాబట్టి 'గోప' అంటే ఇంద్రియాధిపతులు, అంటే – 'దేవతలు' అని కూడా అర్థం వస్తుంది. భూమి మీద ఉండేపసిపిల్లల దగ్గఱ నుండి పై లోకాల్లో ఉండే దేవతల దాకా అందరి చేత కూడా తెలియబడేది – అని ఇంకో అర్థం.

'బాలురు' అంటే – సనక, సనందన, సనత్కుమార, సనస్సుజాతు' లనే అర్థం చెప్పుకుంటే – బ్రహ్మ మానస పుత్రులు, బ్రహ్మవేత్తలు, స్వచ్ఛమైనపిల్లల మనస్సు కలవారు అయిన ఆ సనకాది కుమారుల చేతను, 'గో' అంటే గోళాలకు, 'ప' అంటే పతులైన – గోళాధిపతుల చేతను గూడా తెలియబడేది – అని ఇంకోఅర్థం.

1) ఆ బాల గోపాలము చేత తెలియబడునది.

2) భూమి మీద ఉండే పిల్లల చేత దగ్గఱ నుండి పై లోకాల్లో ఉండే దేవతల చేత దాకా తెలియబడునది.

3) సనక సనందనాది కుమారులచే, గోళాధిపతులచే తెలియబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 995. సర్వానుల్లంఘ్యశాసనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వానుల్లంఘ్యశాసనాయై నమః' అని చెప్పాలి.

సర్వ = అందరిచేతను, అనుల్లంఘ్య = దాటుటకు వీలు లేని, శాసనా = ఆజ్ఞలు కలది.

అమ్మవారి ఆజ్ఞలు, ఆవిడ ఏర్పాటు చేసిన విధి విధానాలు ఎవ్వరూ కూడా ఉల్లంఘించటానికి వీలు లేని విధంగా ఉంటాయి. అవతలి వారు త్రిమూర్తులైనా,

దేవతలైనా, దిక్పాలకులైనా, గ్రహాదులై - భయభక్తులతో ఆమె ఆజ్ఞలు పాటించి విధి నిర్వహణ సక్రమంగా, సమర్థవంతంగా చెయ్యవలసినదే! ఈ విషయమే తైత్తిరీయంలో ''భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతిసూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి'' - అని చెప్పబడింది. (తనకు విధించిన - 'గాలి వీచటం' అనే విధిని నిర్వహించకపోతే అమ్మవారు ఏం చేస్తుందో అని భయపడుతూ వళ్ళు దగ్గర పెట్టుకుని వాయుదేవుడు గాలి వీస్తాడుట' అలాగే సూర్యుడు తపింప చెయ్యడం, అగ్నిమండటం మొదలైన వన్నీ - అని ఈ మంత్రాలకు అర్థం) చివరకు ప్రపంచం లోని అన్ని పదార్థాలు కూడా అవి ఎలా ఉండాలని శాసించబడ్డాయో అలా ఉండాల్సిందే! పంచదార ఎప్పుడైనా తియ్యగా ఉండాల్సిందే! ఉప్పు ఉప్పగా ఉండాల్సిందే! అల్లం కారంగా ఉండాల్సిందే! ఇలా ఉండాలనే ఆ నిర్దేశాలు అమ్మవారి ఆజ్ఞలు. అని తిరుగులేనివి ఎవ్వరూ ఎదురు తిరిగి ధిక్కరించడానికి వీలులేనివి.

అందరికీ నచ్చేట్టుగా ఉంటాయా, నచ్చక పోయేట్లుగా ఉంటాయా అనే వాటితో సంబంధము లేకుండా అందరిపైనా అమ్మవారు విధించే శాసనాలు అవి. పొరపాట్లు, ఉపసంహరణలు, మార్పులు ఈ శాసనాల్లో ఉండవు. అంటే - మన ప్రమేయం లేకుండా, మన ఇష్టా ఇష్టాలతో సంబంధము లేకుండా మనలను అమ్మవారు శాసిస్తుందన్నమాట!

ఈ విషయాన్నే ఆదిశంకరులు సౌందర్యలహరిలో ''జగత్సూతేధాతా.......'' అనే శ్లోకంలో చెబుతారు.

'ఎవ్వరూ ఉల్లంఘించడానికి వీలులేని శాసనము' కలది - అని ఈ నామానికి అర్థం.

## 996. శ్రీ చక్రరాజనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీచక్రరాజనిలయాయై నమః' అని చెప్పాలి.

శ్రీచక్రము = శ్రీయుక్తమైన, మహిమాన్వితమైన, శ్రేష్ఠమైన శ్రీచక్రరాజమును, నిలయా = నివాసముగాగలది.

చాలా మంది దేవతలకు సంబంధించిన చక్రాలు, లేదా యంత్రాలు ఉంటాయి. అయితే ఈ చక్రాలన్నీటిలోకి శ్రీ చక్రం ఉత్తమోత్తమమైనది. మహిమాన్వితమైనది. శ్రేష్ఠమైనది. సృష్టి, ప్రళయ వ్యూహాలు రెంటినీ ఇముడ్చుకుని ఉండేది. అంటే – ఇతర చక్రవిశేషాలు కూడా ఈ చక్రంలో ఉండటానికి అవకాశం ఉందన్నమాట !

ఈ నామంలోని 'రాజ' అనే పదం కేవలం 'శ్రేష్ఠ' మనే అర్థాన్నే కాక 'చంద్రుడు' అనే అర్థాన్ని కూడా సూచిస్తుంది. అప్పుడు 'రాజయోగం' అంటే 'గొప్పయోగం' అనే అర్థమే కాకుండా 'చంద్రయోగం' అనే అర్థం వస్తుంది. 'చంద్రుడు' అంటే మనస్సు (చంద్రమామనసోజాతః) అని సంకేతార్థాన్ని గ్రహిస్తే 'చంద్రయోగం' అంటే 'మనస్సును ఆత్మలేదా – పరమాత్మతో యోగించునది – అని అర్థం వస్తుంది.

అలాగే 'శ్రీ' అంటే – మంగళకరమైన మార్గములలో, చక్ర = తిరుగాడు, రాజ = మనస్సును, నిలయా = నిలయం గా గలది – అని ఇంకో అర్థం వస్తుంది.

అంటే – ''మంగళకరంగా ఉండే మనస్సే 'సర్వమంగళ' అయిన అమ్మవారి నిలయం'' అనే అర్థాన్ని సూచిస్తుంది.

ఈ చక్ర వివరాలన్నీ 'చక్రరాజరథారూఢ....' అన్న 8వ నామ వివరణలో కొంత, ప్రథమ భాగ అనుబంధంలోని ఎక్కువ విపులంగాను తెలుపబడినాయి.

1) శ్రీయుక్తమైన, మహిమాన్వితమైన శ్రేష్ఠమైన చక్రరాజమును నివాసంగా గలిగినది.

2) మంగళకరముగా ఉండు మనస్సును నిలయంగా గలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 997. శ్రీమత్త్రిపుర సుందరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీమత్త్రిపురసుందర్యై నమః' అని చెప్పాలి.

శ్రీమత్ = శ్రీయుక్తమైన, త్రిపుర = త్రిపుర సమన్వితమైన, సుందరీ = సుందర స్వరూపిణి.

ఈ నామంలో అమ్మవారికి చెప్పబడిన విశేషణాలు చాలా ముఖ్యమైనవి. ఏవిధంగా చూసినా - ఎప్పుడు - ఎలా చూసినా మంగళకరంగాను, శుభప్రదంగాను, వైభవోపేతంగాను ఉండే లక్షణాలన్నీ, 'శ్రీమత్' విశేషణం సూచిస్తుంది.

త్రివిధములుగా ఉండే - త్రిగుణ, త్రిలోక, త్రిస్థాయి, త్రికాల, త్రిశరీర, త్రినాడి, త్రికూటా, త్రివర్గ, త్రివేదాది వర్గాలకు సంబంధించిన విషయాల సమన్వయాన్ని - 'త్రిపుర' విశేషణం సూచిస్తు, ది.

లోకాతీతమైన, ఆహ్లాదకరమైన, అనిర్వచనీయమైన, అపూర్వమైన - రూపవైభవాన్ని - 'సుందరీ' పదం సూచిస్తుంది.

ఇలా అత్యుత్కృష్టమైన విశేషణాలతో కూడా ఉండే అమ్మవారిని, ఆ అమ్మవారికి సంబంధించిన శ్రీవిద్యను సరియైన పద్ధతిలో ఉపాసించినవారి జన్మసార్థకమై, జీవితం శ్రీమంత మౌతుంది.

ఈ 'శ్రీమత్' 'త్రిపుర' 'సుందరీ' పదాల్లో - 'శ్రీమత్'శబ్దం - 'సత్యము'ను, 'త్రిపుర' శబ్దము - 'శివము'ను, 'సుందరీ' శబ్దం - 'సుందరము'ను గూడా సూత్రప్రాయంగా తెలియచేస్తాయి కాబట్టి - సత్య, శివ, సుందర లక్షణాలతో ఉండే అమ్మవారిగా ఈ నామాన్ని దర్శించి ఉపాసించవచ్చు. ఈ 'శ్రీమత్ త్రిపురసుందరీ'

నామస్మరణతోనే ఈ లలితా సహస్ర నామ వివరణ – నాలుగు భాగాల గ్రంథాలు ప్రారంభమయ్యాయి.

1) శ్రీ యుక్తమైన, త్రిపుర సంబంధమైన, సుందర స్వరూపిణి.

2) సత్యశివ సుందర సమన్విత స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు.

## 998. శ్రీ శివా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీ శివాయై నమః' అని చెప్పాలి.

శ్రీ = ఆశ్రయించుకొని ఉన్న, శివా = శివస్వరూపిణి.

'ప్రతివారు తమ పేరు ముందర 'శ్రీ' అని పెట్టుకుని సంతకం చెయ్యాలి' అనే సంప్రదాయం గూడా ఉంది. అయితే – ఇలా చెప్పితే ఈ 'శ్రీ' అనేది తమ గొప్పతనానికి, గౌరవానికి సంబంధించిన పదంగా ఉపయోగించారేమో నని మాత్రం అపార్థం చేసుకోకూడదు. 'శ్రీ' అన్నా 'శ్రీమత్' అన్నా ' ఆ సర్వాంతర్యామిని ఆశ్రయించుకుని ఉన్న' – అని అర్థం. నిజమేగా మరి! ప్రతి జీవి ఆ సర్వాంతర్యామిని ఆశ్రయించుకునేగా జీవించేది!

అలాగే – ఈ లలితాస్తోత్రంలో వచ్చే ప్రతి నామానికి గూడా 'శ్రీ' ముందు పెట్టుకుని – శ్రీమాతా, శ్రీ మహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరీ, శ్రీ చిదగ్నికుండసంభూతా.... శ్రీ లలితాంబికా – అనే విధంగా చదువుకోవడం కూడా ఒక పద్ధతే!

(విష్ణు సహస్ర నామంలో అయితే ప్రతి నామానికి చివరి 'అభిరక్షతు' అని చెప్పడం ఒక పద్ధతి. ఎందుకంటే – ఆ సహస్ర నామ స్తోత్రంలో అన్ని నామాలూ చెప్పిన తరువాత చిట్టచివరకు 'అభిరక్షతు' అనే క్రియాపదంతో స్తోత్రంపూర్తి అవుతుంది. ఈ 'అభిరక్షతు'

క్రియా పదాన్ని ప్రతి నామానికి చివర చేర్చి) – 'విశ్వమ్ అభిరక్షతు, విష్ణుః అభిరక్షతు, వషట్కారః అభిరక్షతు,.... వాసుదేవః అభివక్షతు' – అనే విధంగా చదువుకోడం కూడా ఒక పద్ధతి.)

ఈ లలితా సహస్ర నామస్తోత్రంలో నిండా 'మంత్రత్వం' ఉంది. అయితే – ఈ మంత్రత్వం శ్లోకాల్లో ఉన్నంతగా ప్రతి నామాన్నీ విడివిడిగా చేర్చి చెప్పడంలో ఉండకపోవచ్చు.

ఈ స్తోత్ర ప్రారంభంలోని నామం – 'శ్రీమాతా', స్తోత్రం చివర్లో వచ్చే నామం 'శ్రీశివా' – అంటే – మొదటి నామం 'మాత' కు సంబంధించిన దైతే – ఈ చివరి నామం 'శివ' కు సంబంధించినదిగా ఉంది. అంటే, జగత్తుకు – మాతా – పితురు' లైన వారి మధ్య ఈ స్తోత్రం ఇమడ్చ బడిందన్న మాట !

బయట ఉన్న 'ఆకాశ' స్వరూపుడైన పరమాత్మ దహరాకాశంలోంచి తొంగి చూస్తున్నట్లు ధ్యానం చెయ్యాలి ఈ స్తోత్రపారాయణలో !

అయ్యవారి నామం ( శివ) లో – అమ్మవారి నామం ( శివా) ఇమిడి ఉండదు గాని, అమ్మవారి నామమైన 'శివా' ( శివ + ఆ) లో అయ్యవారి నామమైన 'శివ' గూడా ఇమిడి ఉంటుంది. అలాగే – 'అజ్ఞానం' లో 'జ్ఞానం' ఇమిడి ఉంటుంది కాని – 'జ్ఞానం' లో 'అజ్ఞానం' ఇమిడి ఉండదు. అమ్మవారి భౌతిక స్వరూపం – అజ్ఞానానికి, శక్తి – జ్ఞానానికి సంబంధించినవి కాబట్టి – నామపరంగాను, రూపపరంగాను గూడా అమ్మవారిలో అయ్యవారుంటారు గాని, అయ్యవారిలో అమ్మవారుండదని ఈ విశ్లేషణ వివరిస్తుంది. ఇంకా విపులంగా చెప్పాలంటే –

ఎప్పుడైనా నామరూపాలు రెండూ అవిద్యకు, అజ్ఞానానికి సంబంధించినవేనని – అయితే ఈ ఇద్దరి 'నామాలు', 'రూపాలు' వేరు వేరుగా ఉన్నట్లనిపించినా 'తత్త్వతః' ఇద్దరూ ఒక్కటే అని గ్రహించాలి. అలా గ్రహించడమే నిజమైన జ్ఞానం.

శరీరాన్ని స్వీకరిస్తే 'సోహం' ఉంటుంది. ( శ్వాస ఉంటుంది కాబట్టి), శరీరాన్ని

త్యజిస్తే – 'ఓం' ఉంటుంది. ('స్' కార 'హ్' కార సూచిత ఉచ్ఛ్వాస, నిశ్వాసలు ఉండవు కాబట్టి) అంటే ఈ 'ఓం' కోసమే – శ్వాస, ఆ శ్వాసకోసమే – ఊపిరితిత్తులు, ఆ ఊపిరితిత్తుల కోసమే – గుండెకాయ, ఆ గుండెకాయ కోసమే – నాడులు, నరాలు, కండరాలు, ఎముకలు, అన్నం మొదలైన వాటితో చివరకు ఈ శరీరం. ఇదీ 'ఓం' నుండి శరీర సృష్టి క్రమం. 'ఓం' అనే 'శివుణ్ణి' ఆశ్రయించుకుని ఉన్న 'శ్రీం' అనే సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారి నామమే 'శ్రీ శివా'.

ఆశ్రయించుకుని ఉన్న శివస్వరూపిణి – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 999. శివశక్త్యైక్యరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివశక్త్యైక్య రూపిణ్యై నమః' అని చెప్పాలి.

శివ = శివుడు, శక్తి = శక్తి, ఐక్య = కలసి ఉన్న, రూపిణీ = స్వరూపమును కలిగినది.

'ఆత్మ – దేహము, లేదా – 'ప్రజ్ఞ – పదార్థము', లేదా – 'శివుడు – శక్తి' లేదా – 'కారణము – కార్యము' మొదలగు జంటలు కలసి ఉన్న రూపాన్ని సూచించే అమ్మవారి నామం 'శివశక్త్యైక్య రూపిణీ'.

ఈ ఐక్యరూపంలో ఏ భాగంలో ఏ భాగం ఎంత మేరకు కలసి ఉందో చెప్పడం కష్టం. ఈ భాగాలు చీకటి వెలుగుల లాంటివి. తలుపులు అన్నీ వేసి ఉన్నా, గది నిండా చీకటి ఉన్నదనుకోండి ఆ గదిలోని బల్బుకు బయట నుండి స్విచ్ వేయంగానే అది వెలిగినపుడు గదంతా వెలుగు నిండి ఉంటుంది. అయితే అప్పుడు –

1) గదిలో పూర్వం ఉన్న చీకటి అంతా మాయమై వెలుగు వచ్చిందా ?

2) గదిలో ఉన్న చీకటి, క్రొత్తగా వచ్చిన వెలుగూ రెండూ– కలసి ఉంటున్నాయా?

3) అయితే గదిలో ఎంత మేరకు చీకటి, ఎంత మేరకు వెలుగు - ఉన్నాయి ?

4) గదిలో ఉన్న చీకటే వెలుగుగా మారిందా ?

5) అసలు చీకటే వెలుగు, వెలుగే చీకటీనా !

పై ప్రశ్నలకు సరి అయిన సమాధానం చెప్పగలరా ? చెప్పడం కష్టం. వెలుగు చీకట్లనే భార్య భర్తలు ఒకరి నొకరు కౌగిలించుకొనుటలో బాగా నైపుణ్యం కలవారు. వారిద్దరూ కలసి ఉన్న ఆస్థితిలో ఎవరి శరీరభాగం ఎవరిలో ఎంతవరకు ఇమిడి పోయిందో చెప్పడం కష్టం. వాస్తవానికి అర్ధనారీశ్వర రూపం ఇలాంటిదే ! ఇద్దరి మధ్య సరిహద్దు రేఖను ఊహించగలిగే లాగా ఒకరి ప్రక్క ఒకరు ఉండరు.

అసలు వెలుగు వేరు చీకటి వేరు అని అనుకోడమే మన అజ్ఞానం. 'కంటితో దేనినైతే మనం చూడలేమో దానిని చీకటి' అనీ - 'చూడగలిగే దాన్ని వెలుగు' అనీ - చెప్పేది కేవలం సాపేక్షక వివరణమే ! ఈ రెంటిలో ఏది నిరపేక్షకమో(Absolute), ఏది సాపేక్షకమో (Relative) చెప్పడం కష్టం. సూర్యుడు గాని, చంద్రుడు గాని, నక్షత్రాలు గాని, అగ్ని గాని, దీపం కాని ఉంటేనే మన కంటికి వెలుగు ఉంటుంది. అంటే - ఇలా వెలుగును రప్పించే పైన చెప్పిన సూర్యుని లాంటివి ఉంటేనే చీకటిలోంచి వెలుగు వస్తుంది. అవి లేకపోయినా ఉండేది చీకటి కాబట్టి, ఒక విధంగా 'చీకటే' - వాస్తవానికి నిరపేక్షకము, 'వెలుగు' - సాపేక్షము ఔతాయి.

ఎప్పుడూ ఈ చీకటీ వెలుగులు కలసి ఉంటాయి. అవి ఏ నిష్పత్తిలో, ఏయే పాళ్ళలో కలసి ఉంటాయో ఆయా సందర్భాలను బట్టి అవే ఒక అవగాహనకు వస్తాయి. అలాంటి చీకటి వెలుగులకు ప్రతీకలే - శివశక్తులు. ఈ ఇద్దరి మధ్య ఉండే పరమ ఉత్కృష్ట మైన అవగాహన, సర్దుబాటు తత్త్వమే - వారిది దివ్య దాంపత్యం అని అనడానికి కారణం. ఇటువంటి దాంపత్యం సృష్టిలో మరెవ్వరికీ లేదు.

'శ్రీమాతా' నామం - తల్లిని సూచించేది, 'శ్రీశివా' నామం - తండ్రిని సూచించే శివునికి సంబంధించినది గాను అయితే - ఈ 'శివశక్త్యైక్యరూపిణీ' నామం - ఆ తల్లిదండ్రులిద్దరూ కలసి ఉన్న రూపాన్ని సూచించే నామంఔతుంది.

కుండలినీ శక్తి అనే అమ్మవారు సహస్రారంలోని శివునితో కలసి ఉన్న స్థితిని సూచించే ఈ నామం - కుండలినీ యోగానికి పరాకాష్ఠ స్థితి అయిన 'జీవన్ముక్తికి 'సంబంధించినదిగా అర్థం చేసుకోవాలి. ఈ స్థితిని ఆంగ్లంలో 'The state of matter as spirit and spirit as Matter– అంటారు.

ఈ శివశక్తుల సమైక్య రూపాన్ని సూచించే యంత్రమే - శ్రీ చక్రం. అని ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

చతుర్భిశ్శివ చక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః

శివశక్త్యాత్మికం జ్ఞేయం శ్రీ చక్రం శివయోర్వపుః

'నాలుగు శివచక్రాలు, ఐదుశక్తి చక్రాలు కలసి శివశక్త్యాత్మకంగా ఉండేదే శ్రీ చక్రం' - అని ఈ శ్లోకార్థం. ఈ శివశక్తులిద్దరినీ విడదీయలేమని, ఒకరు లేకుండా ఒకరు ఉండరని, ఈ ఇద్దరూ - 'చంద్రుడు, వెన్నెల' లాంటివారని - ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

నశివేన వినాదేవీ న దేవ్యాచ వినాశివ,

నానయో రంతరం కించిత్ చంద్ర చంద్రి కయోరివ.

ఎవరైనా భార్యాభర్తల మధ్య - ఎడబాటుగాని, అపార్థాలు వచ్చి విడిపోటంగాని, స్పర్థలు ఉన్నప్పుడు గాని, ఈ నామాన్ని సంపుటి చేసి 'శివశక్త్యైక్య రూపిణ్యై నమః' అని జపిస్తే - అచిరకాలంలోనే అన్నీ చక్కదిద్దబడి, ఆ ఇద్దరూ ఏకమౌతారు.

1) పంచభూతాలకు సంబంధించిన, ధూమవతీ, హ్లాద, భాస్వత్, స్పందన, వైభవ శక్తుల సమష్టి రూపముగా ఉండునది.

2) శివశక్తులు ఐక్యమై ఉన్న రూపముగా ఉండునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 1000. లలితాంబికా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లలితాంబికాయై నమః' అని చెప్పాలి.

లలితాంబికా = లలితాంబికా నామాన్వితమైన జగజ్జనని.

ఇంక చిట్ట చివరి ఈ వెయ్యవ నామంలో – ఇంతవరకు చెప్పిన 999 నామాలను బిరుదు నామాలుగా గలిగిన జగజ్జనని యొక్క అసలు నామం చెప్పబడుతోంది. ఆ నామమే 'లలితాంబికా'.

పంచ భూతాత్మకమైన సృష్టి అంతా నామరూపాత్మకము కాబట్టి, సృష్టికి మూలమైన జగనాత్మను కూడా ఒక నామంతోను, ఒక రూపంతోను వ్యక్తపరచబడటానికి గాను ఒక నామాన్ని, అందుకు సమంజసమైన ఒక రూపాన్ని ఋషులు దర్శించి ధ్రువపరచారు. ఆ నామమే 'లలితా', ఆ రూపమే మనం పూజించే 'లలితాదేవి' యొక్క దివ్యమంగళ విగ్రహం. ఈ లలితా దేవియే ప్రస్తుతం వెయ్యవనామంగా చెప్పబడుతున్న 'లలితాంబిక'.

'లోకానతీత్యలలితే లలితాతేన సోచ్యతే' అని పద్మ పురాణంలో 'లలిత' పదానికి నిర్వచనం చెప్పబడింది. 'సకలలోకాలను మించి ప్రకాశించే కోమల స్వరూపమే – లలిత' అని దీని అర్థం.

లోకాతీతమైన తేజస్సు, లాలిత్యము, మాధుర్యము, గాంభీర్యము, విలాసము, శోభ, స్థైర్యము, ఔదార్యము – అమ్మవారికి ఈ ఎనిమిది దివ్య గుణాలు ఉంటాయి. ఇవన్నీ 'లలిత' పదానికి అర్థాలే ! అందుకని అమ్మవారి పేరు 'లలిత'.

సంస్కృతంలోను 'మ తల్లికా' అనే పదం ఉంది. ఈ పదానికి శ్రేష్ఠమైన (A word used at the end of nouns to denote excellence or any hting best of its kind) అని తెలుపడానికి నామ వాచకాల చివర ఉపయోగిస్తారు. ఉదా: 'గోమతల్లికా' – అంటే

శ్రేష్ఠమైన గోవు' అని అర్థం. ఈ 'మతల్లికా' పదంలోని మొదట, చివర ఉన్న 'మ', 'కా', అక్షరాలకు మధ్యగా ఆ పదానికి ప్రాణపదంగా ఉన్న రెండక్షరాల పదమే 'తల్లి'. ఈ తల్లి అనే పదంలో ఒక 'త' కారం, ఒక 'లి' కారం, ఒక 'ల' కారం ఉన్నాయి. ఈ మూడూ తారుమారైతే 'లలిత' అనే పదం వస్తుంది. బహుశః 'మతల్లికా' లోని 'తల్లి' అనే పదం ఋషులకు ఈ 'లలిత' గా భాసించి ఉండవచ్చు. (కశ్యపః – పశ్యకః అన్నట్లన్నమాట!)

జన్మ నిచ్చే మాతృ స్వరూపిణి ని తెలుపడానికి తెలుగు భాషలో పైన వివరించిన 'తల్లి' అనే పదాన్నే తీసుకోడం మన తెలుగు వారి అదృష్టం. అంటే – జగజ్జనని నామం అయిన 'లలిత' మన తెలుగు భాషలో 'తల్లి' గా రూపాంతరం చెందింది అని గూడా మనం చెప్పుకోవచ్చు. దీనిని బట్టి – 'మిగిలిన వారి కంటె మన తెలుగువారికి లలితా దేవి మరింత దగ్గరైన తల్లి' అనవచ్చును.

'లలితా' అనే నామం కొంత మంది దేవతలకు గూడా ఉంది. అలాగే, 'అంబికా' అనే నామం కొంత మంది దేవతలకు, ధృతరాష్ట్రుని తల్లికి కూడా ఉంది. అయితే – లలితా + అంబికా = 'లలితాంబికా' అనే నామం ఎవ్వరికీ లేదు ఒక్క అమ్మవారికి తప్ప. ఈ లలితాంబికకు సంబంధించినవే ఇంతకు ముందు చెప్పిన నామాలన్నీ!

'లలితా నామన్వితమైన జగజ్జనని' – అని ఈ నామానికి అర్థం.

శ్రీ లలితా సహస్ర నామస్తోత్రంలోని వెయ్యి నామాలు ఈ లలితాంబికా నామంతో పూర్తవుతాయి. ఈ వెయ్యి నామాలు 182 1/2 శ్లోకాల్లోనే ఇమిడి ఉన్నాయి. ఇక చిట్ట చివరికి 183వ శ్లోకంలోని రెండవ సగభాగంలో ఉన్న 'ఏవం శ్రీలలితా దేవ్యానామ్నాం సాహస్రకం జగుః' అన్న 3, 4 పాదాల్లో అమ్మవారి నామాలేమీ లేవు. ఈ భాగం అర్థం ఏమిటంటే 'ఇంతవరకు చెప్పినవి శ్రీ లలితా దేవి యొక్క వెయ్యి నామాలు అగును' – అని అర్థం.)

ప్రథమ భాగంలో - మొదటి 200 నామాలకు వివరణ ఇవ్వబడింది. ద్వితీయ భాగంలో 201 వ నామం నుండి 474వ నామం వరకు వివరణ ఇవ్వబడింది. తృతీయభాగంలో 475వ నామం నుండి 749వ నామం దాకా వివరణ ఇవ్వబడింది. ప్రస్తుత చతుర్థ భాగంలో 750వ నామం నుండి 1000వ నామం దాకా వివరణ ఇవ్వబడింది. ఈ వివరణతో పాటు ఈ చతుర్థ భాగంలో చివరకు ఇచ్చిన అనుబంధంలో తెలిపిన విషయాలు కూడా చదువుకోవాలి.

ఈ విధంగా 'చతుర్బాహుసమన్వితా' అయిన శ్రీ లలితాదేవి' యొక్క సహస్ర నామాలకు 'చతుర్భాగ సమన్వితం'గా ఇవ్వబడిన 'శాస్త్రజ్ఞాన - ఆత్మజ్ఞాన' సమన్వయాత్మకమైన వివరణ పరిసమాప్తమైనది.

- వివరణకర్త.)

సర్వం శ్రీ లలితాదేవ్యార్పణమస్తు

# అనుబంధము

## పాకయజ్ఞములు

1) ఔపాసన2) స్థాలీపాకము 3) వైశ్వదేవము 4) అష్టకా 5) మాసిశ్రాద్ధము6) సర్పబలి 7) ఈశానబలి.

## హవిర్యాగములు

1) అగ్నిహోత్రములు 2) దర్శపూర్ణిమాసలు 3) అగ్రయణం 4) చాతుర్మాస్యలు 5) పిండ పితుర్యజ్ఞములు 6) నిరూఢపశుబంధము 7) సౌత్రామణి.

## సోమసంస్థలు

1) అగ్నిష్టోమము 2) అత్యగ్నిష్టోమము 3) ఉక్థ్య 3) అతిరాత్రము 5) అప్తోర్యామము 6) వాజపేయము 7) పుండరీకము.

## యజ్ఞ పురుష స్వరూపిణి

పాదములు – వేదములు, కోరలు – యజ్ఞరూపము, చెయ్యి – ఆహుతి, ముఖము – సమిధసంచయము, నాలుక – అగ్ని, రోమములు – ధర్మములు, శీర్షము – బ్రహ్మ, నేత్రములు, రేయింబవళ్ళు; శ్రుతి భూషణములు – వేదాంతములు; నోరు – స్రువము; ముక్కు – ఘృతము; కంఠధ్వని – సామనాదము; తనువు – సత్యధర్మాలు; చలనము – సత్కర్మలు; అంగలి, నఖములు – తపస్సు; మోకాలు – యజ్ఞపశువు; ప్రేగులు – ఉద్గార ప్రజనలింగము – హోమము; అవయవములు – ఫలములు; అంతరాత్మ – వాయువు; తొంటి – మంత్రములు; రక్తము – సోమరసం; భుజములు – వేదములు; వాసన – ఆహుతులు; వేగము – హవ్యకవ్యములు; పురోభాగం – హోమకుండము; పెదవులు – ఉపాకర్మ; గడ్డము – ప్రవర్గము; నాభి – వివిధ ఛందస్సులు; రీవి – గుహ్యోపనిషదాననము; నీడ – భార్య.

## విరాడ్రూప వివరములు

సత్యలోకము - శిరస్సు; సూర్యచంద్రాగ్నులు - నేత్రములు దిక్కులు - శ్రోత్రములు; వేదములు - వాక్కులు; వాయువు - ప్రాణము. సర్వాత్మకమగు అవ్యక్తము - హృదయము; పృథివి - జఘనము; భువర్లోకము - నాభి; నక్షత్రలోకము - వక్షస్థలము; మహర్లోకము - మెడ; జనోలోకము - ముఖము; తపోలోకము - లలాటము; ఇంద్రాది లోకపాలకులు - బాహువులు; అశ్వనీ దేవతలు - నాసికములు; అగ్ని - ముఖము; అహోరాత్రములు - కనురెప్పలు; బ్రహ్మలోకము - కనుబొమలు; జలము అందలి రసము దౌడలు - నాలుక; యమధర్మరాజు - కోరలు; నవ్వు - మాయ; లజ్జ - క్రీ గంటిచూపు; పై పెదవి - లజ్జ; అధరోష్టము - లోభము; పృష్టము - అధర్మమార్గము; ప్రజాపతి - లింగము; సముద్రములు - ఉదరము; పర్వతములు - ఎముకలు; నదులు - నరములు; వృక్షాదులు - రోమములు; మేఘములు - వస్త్రములు; చంద్రుడు - మానసము; హరి- విజ్ఞానము; రుద్రుడు - అంతః కరణము: కటి మొదలు పాదపర్యంతము - పాతాళలోకము; - ఇట్టి సమష్టి స్థూల రూపము విరాడ్రూపము.

## 84 లక్షల జీవరాశులు

మృగజాతులు - 30 లక్షలు; స్థావరములు - 20 లక్షలు; క్రిమిజాతులు - 11లక్షలు; పక్షి జాతులు - 10లక్షలు జలచర జాతులు - 9 లక్షలు; మనుష్యజాతులు - 4 లక్షలు మొత్తం 84 లక్షల జీవరాశులు.

## దేవీసప్తశతి - సతీవివరములు

ప్రథమ చరిత్రమునందు 1) కాళీ 2) తారా 3) ఛిన్నమస్తా 4) సుముఖీ 5) భువనేశ్వరీ 6) బాలా 7) కుబ్జాయను ఏడుగురు సతులను - మధ్యమ చరిత్రయందు 1) లక్ష్మి 2) లలిత 3) కాళీ 4) దుర్గా 5) గాయత్రీ 6) అరుంధతీ 7) సరస్వతీ - అను ఏడుగరు సతులును - మూడవ చరిత్రమున - 1) బ్రాహ్మి 2) మాహేశ్వరీ 3) కౌమారీ 4) వైష్ణవీ 5) వారాహీ 6) మాహేంద్రీ 7) చాముండా - అను ఏడుగురు సతులును - వీరందరి సమష్టిరూపులైన - నందా, శతాక్షీ, శాకంబరీ, భీమా, రక్తదంతికా, దుర్గా,

భ్రామరీ – అను ఏడుగురు సతులును చెప్పబడి యున్నారు. పరమేశ్వరి వీరందరి యొక్క సమష్టి రూపముగా ఉండే అమ్మవారి పేరు – సతీ.

## అమ్మవారి రూపములో ఉన్న విద్యలు

1) లోపాముద్ర విద్య 2) సౌభాగ్య విద్య 3) మహావిద్య 4) షోడశీవిద్య 5) తారావిద్య 6) శ్యామలావిద్య 7) శుద్ధవిద్య 8) హయారూఢ విద్య 9) మహోర్ధవిద్య 10) వారాహీవిద్య 11) బగళావిద్య 12) తురీయవిద్య 13) భువనేశీవిద్య 14) పరాశాంభవీ విద్య 15) తిరస్కరణీవిద్య 16) మిశ్రాంబావిద్య 17) కామకళావిద్య 18) అన్నపూర్ణావిద్యా 19) వాగ్వాదినీవిద్య 20) బాలావిద్య 21) నవదూతీవిద్య 22) హసంతీ విద్య – మొదలైనవి విద్యల రూపంలో ఉండే అమ్మవారిని 'సర్వవిద్యాస్వరూపిణి' లేదా 'బహురూపా' అని అంటారు.

## అకారాది 'క్ష' కారాంత కామరూపక్షేత్ర పీఠాదులు

కామరూపం, వారణాసి, నేపాలం, పౌండ్రవర్ధనం, పుర స్థిరం, కన్యాకుబ్జం, పూర్ణ శైలం, అర్బుదం, ఆమ్రాతకేశ్వరం, ఏకామ్రం, త్రిస్రోతము, కామకోటకం, కైలాసం, భృగునగరం, కేదారం, చంద్రపుష్కరం, శ్రీపీఠం, ఓంకారం, జాలంధ్రం, మాలవంతం, కులాంతకం, దేవికోటం, గోకర్ణం, మారుతేశ్వరం, అట్టహాసం, విరజం, రాజగేహం, మహాపథం, కోలాపురం, ఏలాపురం, కాలేశం, జయంతికా, ఉజ్జయినీ, చిత్రా, క్షీరకం, హస్తినాపురం, ఉడ్డేశము, ప్రయాగ, షష్ఠీ, మాయాపురీ, జలేశము, మలయం, శైలం, మేరువు, గిరివరం, మహేంద్రం, వామనం, హిరణ్యపురం, మహాలక్ష్మీపురం, ధ్యానం, ఛాయాఛత్రం.

## అష్టగుణ పుష్పములు చైతన్యపుష్పములు

1) అహింస, 2) ఇంద్రియనిగ్రహం 3) సర్వభూతదయ 4) క్షమ 5) శాంతి 6) తపస్సు 7) ధ్యానం 8) సత్యం.

## పంచ విధ యజ్ఞములు

1) దేవ 2) పితృ 3) బ్రహ్మ 4) భూత 5) మనుష్య - యజ్ఞములు. 1) అగ్నిహోత్రము 2) దర్శపూర్ణమాసము 3) చతుర్మాస్యము 4) పశు 5) సోమ - యాగములు.

1) ద్యురూపాగ్ని 2) పర్జన్యరూపాగ్ని 3) పృథివీరూపాగ్ని 4) పురుషరూపాగ్ని 5) స్త్రీ రూపాగ్ని యందును వ్రేల్చెడు యాగములు.

## వశిన్యాది వాగ్దేవతలు

1) వశినీదేవి 2) కామేశ్వరీదేవి 3) మోదినీదేవి 4) విమలాదేవి 5) అరుణాదేవి 6) జయినీదేవి 7) సర్వేశ్వరీ దేవి 8) కౌళినీదేవి.

ఓం

శ్రీమాత్రేనమః

# శ్రీ లలితా సహస్రనామావళి

(ఈ చతుర్థ భాగములోనివి)

## అకారాది నామ సంఖ్యాను క్రమణిక

ఈ చతుర్థ భాగములోనివి)